



శ్రీరస్తు.

# బ్రహ్మోత్తరఖండము

శ్రీధరమల్లె వేంకటరామకవికృతము.





చెన్నపురి:

రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
ప్రకటితము.

1922




శ్రీస్కాందపురాణాంతర్గతమగు నీబ్రహ్మోత్తరఖండంబున శివ మాహాత్మ్యము, శివమంత్రమాహాత్మ్యము, విభూతి,రుద్రాక్ష,సోమవార వ్రతరుద్రాధ్యాయాదుల మాహాత్మ్యములు వర్ణింపఁబడినవి. ఏతద్గ్రంథ కర్త శ్రీధరమల్లె వేంకటరామకవి. బడగలనాటి కర్ణాటకుఁడు. అయ్యనా ర్యుని పుత్త్రుఁడు. భారద్వాజసగోత్రుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు. ఈ గ్రంథము నీకవి జ్యోతి రామమంత్రి లక్ష్మీనారాయణమంత్రుల ప్రేరణ మున రచియించి యంబాపురమున నెలకొన్న పార్థివేశ్వరస్వామికిఁ గృతి గా సమర్పించెను. ఈయంబాపురము సిద్ధవటమునకుఁ బడమర నైదా ఱుమైళ్లదూరమున నున్నపొన్నవోలు సమీపమునఁ బినాకినీతీరమున నున్నదట ! ఈసిద్ధవటము కడపజిల్లాలోనిదిగదా! కృతికారయితలును బడ గలనాటికర్ణాటకులు పొన్నవోలు వాస్తవ్యులు నట !

ఈగ్రంథము శా. శ. 1737-వ సంవత్సరమునకు సరియైన యువ సంవత్సర కార్తికశుద్ధ పున్నమనాఁడు కృతి యీఁబడినట్లు గ్రంథాంత మునఁగల సీసపద్యమువలన స్పష్టమగుచున్నది.

ఈబ్రహ్మోత్తరఖండమును పట్టమెట్ట సోమనాథ సోమయాజి, ముత్తరాజు వేంకటకృష్ణకవి, ప్రాఁతకోట మల్లయకవి అను వీరు మువ్వ రును బద్యరూపముననే తెలిఁగించియున్నారు. అవి యముద్రితములు. వీని లోనెల్ల సోమనాథ సోమయాజిరచనము మిన్నయైనది. ఈవేంకటరామ కవి కవిత్వము పురాణశైలిని నాతికఠినముగను సరసముగను నున్నది. దీని పూర్వముద్రణము పెక్కు తప్పులతోను, లోపములతోను నిండి యుండినది. దాని నాంధ్రసాహిత్యపరిషత్తునంగల తాళపత్ర మాతృక లతో సరిచూచి లోపములు పూరించి కూడినంతవఱకుఁ దప్పులు దిద్ది

విషయము. ప్రుట.

వసంతఋతువర్ణనము ... ... 63

చిత్రరథుం డనుగంధర్వరాజు ధర్మగుప్తునకుఁ దనకూఁతు నిచ్చి వివాహం బొనర్చుట ... ... 65

ధర్మగుప్తమహారాజు తనశత్రు వైనదుర్మర్షణుని వధించి తనరాజ్యంబు మరలఁ గైకొనుట ... ... 66


## తృతీయాశ్వాసము.


సోమవారవ్రతప్రభావము ... ... 70

చిత్రవర్మమహారాజు చరిత్రము ... ... ,,

చిత్రవర్మ సీమంతినికి వివాహం బొనర్చుట ... ... 74

సీమంతినీపునర్వివాహఘట్టము ... ... 87

సుమేధ సోమవంతులచరిత్రము ... ... 92

ఆశ్వాసాంతము ... ... 103


## చతుర్థాశ్వాసము.


మందరుం డనుబ్రాహ్మణునిచరిత్ర ... ... 104

ఋషభయోగి మందరుం డనుబ్రాహ్మణుగృహంబునకు వచ్చుట ... 105

వజ్రబాహుండు తనజ్యేష్ఠభార్య యైనసుమతిని పుత్త్రిసహితంబుగా నరణ్యంబున విడుచుట ... ... 106

సుమతి దైవవశంబున బద్మాకరుం డనువైశ్యునిపట్టణంబుఁ జేరి యతనిచే మన్ననలఁ బొందుట ... ... 107

మృతుం డైనకుమారునిం గూర్చి సుమతి విలపించుట ... ... 108

ఋషభయోగి సుమతికిఁ దత్త్వోపదేశంబు చేయుట ... ... 109

ఋషభయోగీశుఁడు భద్రాయువునకు నష్టాదశపురాణ రహస్యంబు లుపదేశించుట ... ... 113

ఋషభయోగి భద్రాయువునకు శివకవచం బుపదేశంబు చేయుట ... 116

వజ్రబాహుని మగధదేశపురాజు జయించుట ... ... 119

భద్రాయువు మాగధుని జయించి తనతండ్రికి మరల రాజ్యము నిచ్చుట ... 121

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| సూర్యాస్తమయవర్ణనము | ... | ... | 124 |
| ఋషభయోగీశ్వరుండు చంద్రాంగదునియొద్దికిఁ జని భద్రాయువునకుఁ గూఁతునిచ్చి వివాహంబు సేయుమని యుపదేశించుట... | | ... | 125 |
| చంద్రాంగదమహారాజు భద్రాయువును శుభలేఖవ్రాసి పిలిపించుట | | ... | 126 |
| భద్రాయువు వివాహార్థమై నిషధపురమునకు వచ్చుట | ... | ... | 127 |
| భద్రాయువునకు వివాహం బొనర్చుట | ... | ... | ,, |
| చంద్రాంగదమహారాజు వజ్రబాహునకు భద్రాయుసుమతులవృత్తాంతం బెఱింగించి మరల నొప్పగించుట | ... | ... | 129 |
| భద్రాయువునకుఁ బట్టముగట్టుట | ... | ... | 133 |
| వసంతఋతువర్ణనము | ... | ... | 136 |
| భద్రాయువు భార్యతోఁగూడి వనవిహారంబు సల్పుట | ... | ... | ,, |
| కృత్రిమదంపతీకథనము | ... | ... | 138 |
| భద్రాయువునకు శ్రీసాంబమూర్తి ప్రత్యక్షం బగుట | ... | ... | 140 |
| ఆశ్వాసాంతము | ... | ... | 144 |

## పంచమాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| విభూతిమహాత్వము—వామదేవోపాఖ్యానము | ... | ... | 146 |
| వామదేవభక్షణాసక్తిచే బ్రహ్మరాక్షసుండు చనుదెంచుట | ... | ... | 147 |
| వామదేవమహామునియొక్క దేహస్పర్శనముచే బ్రహ్మరక్షస్సు తనరాక్షసభావము వదలి పూర్వజన్మజ్ఞానముచే స్తుతియించుట | ... | ... | ,, |
| వామదేవుండు బ్రహ్మరాక్షసునకు భస్మప్రభావంబు దెలుపుట | | ... | 149 |
| వామదేవమహాముని పాపవిముక్తుఁడగు బ్రహ్మరాక్షసునకు నితిహాసరూపంబున భస్మధారణవిక్రమం బెఱింగించుట | ... | ... | 150 |
| సాంబమూర్తి సనత్కుమారునకు భస్మప్రభావం బెఱింగించుట | | ... | 152 |
| సూతుండు శౌనకాదిఋషులకు భక్తిశ్రద్ధాస్వరూపంబుల నితిహాసరూపంబుగా నెఱింగించుట | ... | ... | 154 |
| చండపుంజసుమిత్రోపాఖ్యానము | ... | ... | 155 |
| ఉమామహేశ్వరవ్రతమునందు శారదోపాఖ్యానము | ... | ... | 158 |
| శారద దీర్ఘసుమంగలి యగుట | ... | ... | ,, |
| ఉమామహేశ్వరవ్రతక్రమము దెలుపుట | ... | ... | 159 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| శారదయొక్క పూర్వజన్మవృత్తాంతము దెలుపుట | ... | ... | 161 |
| రుద్రాక్షమహత్త్వము | ... | ... | 167 |
| పరాశరుండు భద్రసేనసభకు వచ్చుట | ... | ... | 168 |
| పరాశరుండు సుధర్మతారకులవృత్తాంతంబు దెలిపెడు కథ | ... | ... | ,, |
| కుక్కుటకథనము | ... | ... | 169 |
| వేశ్యావైశ్యసంవాదము | ... | ... | ,, |
| మనోరంజనికి సాంబమూర్తి ప్రత్యక్షం బగుట | ... | ... | 172 |
| పరాశరుండు భద్రసేనమహారాజునకు రుద్రాధ్యాయప్రభావం బెఱింగించుట | | | 173 |
| యముండు బ్రహ్మసభకుఁ బోవుట | ... | ... | 174 |
| భద్రసేనుసభకు నారదమహాముని వచ్చుట | ... | ... | 176 |
| వీరభద్రయమవివాదము | ... | ... | ,, |
| పురాణశ్రవణమాహాత్మ్యము | ... | ... | 177 |
| విదురవంశాళోపాఖ్యానము | ... | ... | 179 |

---

శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయ నమః

# బ్రహ్మోత్తరఖండము, పీఠిక.

---

## కృత్యవతరణిక.




గౌరీసతిఁగూడి హైమవిలసత్సింహాసనాసీనుఁడై
వాగర్థాంచిత రీతినుండి నిజలావణ్యప్రసంగంబులన్
రాగంబొప్ప వినోదమున్ సలిపి యార్యారత్నహారప్రభల్
దాఁ గప్పట్టినమాత్ర నాఁడిలు భద్రాత్మున్ శివుం గొల్చెదన్. 1

ఉ. ఆదియుగంబునందు మహిషాసురశుంభనిశుంభరక్తబీ
జాది సమస్త దుర్మదనిశాటవిదారణ మాచరించి బ్ర
హ్మాదులుగొల్వఁ దాండవము లాడిన శ్రీజగదంబ మాకు స
త్యాదరలీల నిచ్చు విజయంబుల శాశ్వతవైభవంబులన్. 2

ఉ. ఎప్పుడు ధర్మహాని యగు నీధరణీస్థలి నాక్షణంబునన్
దప్పక మాటిమాటి కవతారము లెత్తుచు సాధుకోటి మే
లొప్పఁగ నుద్ధరించి కుజనోద్ధతిమాన్పిన విష్ణుమూర్తి మా
యప్ప కృపాపయోనిధి నిరంతరసౌఖ్యము మాకు నిచ్చుతన్. 3

సీ. ఏసుందరాంగి పాలేటిరాచూలిన నమృతంబుతోఁగూడ నవతరించె
నేభామినికటాక్షమొసఁగిన నజరుద్ర మఘవుల కబ్బె సామ్రాజ్యపదవి
నేచకోరేక్షణ కేప్రొద్దు శ్రీవిష్ణువక్షస్స్థలంబు నివాసమయ్యె
నేదేవిభజనంబు హితమతిఁగావింపఁ జలియించి లేములు దొలఁగిపోవు

తే. శారదయు శంభురాణియు శక్రసతియు, నెజగస్నాతసఖ్యంబు నిచ్చగింతు
రట్టి విష్ణువధూటి భాగ్యముల పేటి, శ్రీమహాలక్ష్మి మమ్ము రక్షించుఁగాత. 4

చ. ప్రజలసృజించి వారల పురాకృతకర్మఫలానుభూతులన్
నిజముగ ఫాలదేశముల నెమ్మి లిఖింపఁగ నేర్పుగల్గు వా

రిజభవుఁ డష్టనేత్రుఁడు విరించి సురాసురమానిసన్నుతుం
డజుఁడు విభుండు మా కొసఁగు నాయువు శ్రేయము సర్వసిద్ధియున్. 5

ఉ. చక్కలరాయఁ డాదలను శోభిలఁ గేలను వీణెమీటుచున్
మక్కువ బుస్తకంబు జపమాలికయున్ ధరియించుతల్లికిన్
జక్కనియంచతేజగల సాధ్వికి నాశ్రిత కల్పవల్లికిన్
మ్రొక్కెద శారదాంబకు సమోఘకవిత్వ పటుత్వసిద్ధికిన్. 6

మ. కటనిష్యంద మదభ్రమద్భ్రమర సంఘక్షేపణవ్యాజ వి
స్ఫుట కించిచ్చలిత స్వకర్ణపవనప్రోక్షిప్త శైలోత్కరున్
బటుదంతాంచల ఖేలనోద్ధృతధరా భారైకసంప్రీణిత
స్ఫటిరాడాదివరాహకీర్తితబలున్ బ్రార్థింతు హేరంబునిన్. 7

క. సామజవదను గణేశ్వరుఁ, జామరకర్ణుని మహాత్ము శంకరతనయున్
వామనరూపు నుతించెద, నేమముగ మదీయకావ్య నిర్విఘ్నతకున్. 8

మ. శ్రుతిచోరుం డగుసోమకుం డనెడు రక్షోవీరునిం ద్రుంప రో
హిత రూపంబున వార్ధిఁ జొచ్చి యతనిన్ హింసించి యామ్నాయముల్
చతురత్వంబున బ్రహ్మకున్ మరలఁగా సంప్రీతితో నిచ్చి తాఁ
గృతకృత్యుం డగు దేవదేవుని హయగ్రీవున్ బ్రశంసించెదన్. 9

మ. ఉదయాస్తాచలసీమల న్నిలిచి యయ్యుష్ణాంశునిం జేరి నె
మ్మది నాచార్యునిఁగా వరించి సకలామ్నాయాదివిద్యార్థుఁడై
కదనక్షోణిని దైత్యవీరవరులన్ ఖండించి శ్రీరామకా
ర్యదయాళుం డగునాంజనేయునిఁ దగన్ బ్రార్థింతు నశ్రాంతమున్. 10

## పూర్వకవిస్తుతి.

గీ. వరుస వల్మీకసంభవ వ్యాస కాళిదాస భవభూతి బిల్హణ దండి మాఘ
భట్టబాణ మయూరాది భద్రయశులఁ, గావ్యదక్షుల గీర్వాణకవులఁ దలఁతు. 11

ఉ. నన్నయభట్టుఁ దిక్కనను నాచనసోముని భీమనాఖ్యునిం
బన్నగశాయిభక్తుఁ డగుబమ్మెరపోతన నల్లసాని పె
ద్దన్నను బాండురంగకవి ధన్యునిఁ బింగళిసూరనార్యునిన్
సన్నుతిఁజేతు నాంధ్రకవిసత్తములన్ సుకవిత్వసిద్ధికిన్. 12

క. మక్షికములు దుర్వ్రణముల, నీక్షించెడిభంగి తప్పు లెన్నుచునుండే
కుక్షింభరు లగుకుకవుల, నక్షములయినట్టివారి నాక్షేపింతున్. 13

వ. అని మదీయకులదేవతాప్రార్థనంబును నాంధ్ర గీర్వాణకవిరాజకీర్తనంబును

గుశవిధిశ్కారణంబునం గావించి యేనొక్క పురాతనపుణ్యచరిత్రంబు పద్య
కావ్యంబుగాఁ దెనుఁగునఁ రచియింపవలయునని మనంబున విచారించుచున్న సమ
యంబున. 14

## కవీశ్వరునకు శ్రీరామమూర్తి సాక్షాత్కరించుట.

సీ. బలభిన్మణిశ్యామ భాసురాంగముతోడఁ గమలవిశాలనేత్రములతోడ
ఆజానుదీర్ఘబాహాదండములతోడ శశిబింబసుందరాస్యంబుతోడఁ
గరయుగ్మకీలితశరచాపములతోడ నవరత్నమయభూషణములతోడ
హాటకమయదీప్తహరితాంశుకములతోడ రతిరాజకోటివిభ్రమముతోడఁ
తే. గామినీయుక్తవామభాగంబుతోడఁ, గలితకరుణాకటాక్షవీక్షణము లమర
మామకస్వప్నమునఁదోఁచెమానసీయుఁ, డొకమహాపురుషుండు శారోజ్జ్వలుండు.
వ. ఇట్లు మదీయభాగ్యదేవతయునుంబోలెఁ బ్రసన్నుండయి వెలుంగుచున్న యద్దివ్య
పురుషునిం గాంచి భయభక్తివినయసంభ్రమంబులు దోఁపం బులకీకృతశరీరుండనయి
యేను బ్రణామకృత్యంబు లాచరించి నిటలతలఘటితాంజలిపుటుండ నయియున్న
నన్నుం గరుణార్ద్రదృష్టిం జూచి యమ్మహాత్ముండు సర్వజ్ఞుండుగావున మన్మనోభి
ప్రాయం బెఱింగి యేను గరుణామృతసముద్రుండ నగురామభద్రుండ భవ
ద్వాంఛితంబు సఫలంబు సేయుటకు నీకుం బొడసూపితి నని పలికి మఱియు నిట్లని
యానతిచ్చె. 16
గీ. నీవు కృతి నొనరింపఁ బూనితివిగాన, దాని నేను సహాయతఁ దగ నొనర్తు
రమ్యతరముగ నాంధ్రగీర్వాణభాష,ణములరచియింపు మఖిలమానవులువొగడ. 17
క. శంకరుఁ డేనును నేనే, శంకరుఁడును గాన నీదు సమ్మతముగ ని
శ్శంకమతి నొకరిపేరిట, నంకితముగఁ గృతియొనర్పు మలరశుభంబుల్. 18
వ. అని యానతిచ్చి యమ్మహాత్ముండు తిరోధానంబునొందిన నేను బ్రభాతసమయంబున
మేల్కాంచి యాశుభస్వప్నంబు మదీయచేలాంచలస్థితం బయినమహాధనంబుగా
నిశ్చయించి మత్కావ్యంబునకు నెయ్యది సమకూరునోయని వితర్కించుచున్న సమ
యంబున. 19

## వంశానుక్రమణిక.

సీ. శ్రీదేవితోఁగూడి చెలఁగుచుండెడువాఁడు చుట్టుకైదువుఁ జేతఁ బట్టువాఁడు
బంగరువన్నె దుప్పటముగప్పెడువాఁడు పక్కిరాతేజిపై నెక్కువాఁడు
కాండజాతభవాండకాండ మేలెడువాఁడు నాద్యంతరహితుఁడై యలరువాఁడు
నీలంపుఁజాయలనెమ్మేనుగల్గువాఁ డిష్టకామ్యార్థంబు లిచ్చువాఁడు

తే. నారద వ్యాసశుక సనందనాది, మానిహృత్పద్మకర్ణికాసీనుఁ డగుచు
సకలజగముల క్షేమంబు నరయుచుండు, నార్తరక్షణుఁ డాదినారాయణుండు. 20

గీ. అట్టి శ్రీవిష్ణునాభియం దవతరించె, తామరసగర్భుఁ డతనిసంతతిఁ జనించె
వేదవేదాంతశాస్త్రార్థవేదియయిన, మునివరేణ్యుండు విష్ణువర్ధనుఁ డనంగ. 21

క. వెలయఁగ నమ్మునిసంతతి, నలఘుప్రాభవుఁడు వైష్ణవాచారుం డై
తలిశానప్ప జనించెను, కలియుగమునఁ జతురుపాయకార్యదక్షుం డై. 22

క. ఆతలిశానప్ప వశి, భూతానిలనందనుండు బుధనుతుఁడు మహా
భూతోచ్చాటనదక్షుఁడు, జ్యోతిఃకులాంభోధిపూర్ణసోముఁడు వెలయున్. 23

క. ఘనుఁ డామంత్రిశిఖామణి, యనుపమయశుఁ డొప్పె నాశ్వలాయనసూత్రుం
డన నాచార్యధురంధరుఁ, డన బడగల్నాటికన్నడాన్వయుఁ డనఁగన్. 24

క. ఆతలిశానప్పకు విను, లాతతసత్కీర్తిశాలి హరిచరణాంభో
జాతధ్యానపరుండగు, సీతారామప్రభుండు చెలువుఁడు పుట్టెన్. 25

శా. చేతోజాతజయంతసుందరుఁడు కాశీసేతుపర్యంత వి
ఖ్యాతప్రాభవకీర్తియుక్తుఁడు అసద్గాంభీర్యవారాశి ని
ర్ధూతాఘుండును విష్ణువర్ధనసగోత్రుం డాశ్రితత్రాణుఁడై
సీతారామఘనుండు పొల్చు జగతిన్ శ్రీమంతుఁడౌ నాజనుల్. 26

గీ. అతఁడు నిజపత్ని లైనలక్ష్మాంబయందు, సారిది గోవిందరాముని సుబ్బనార్యుఁ
గాంచె రఘుపతి జానకీకాంతయందు, మున్ను కుశలవధీరులఁ గన్నపగిది. 27

వ. అం దగ్రజుండు. 28

మ. నరసంఘంబునుతింపఁగాఁ బ్రబలె శ్రీనారాయణబ్రహ్మ స
ద్గురుకారుణ్యకటాక్షలబ్ధవిలసద్యోగానుసంధాన ని
ర్భర జాగ్రత్స్వప్నజామనస్కపరబ్రహ్మైక్యబోధామృతాం
బుధి తాదృశ్యచరాచరాత్మకుఁడు నై గోవిందరాముం డిలన్. 29

ఉ. మంత్రియుగంధరుండు శతమన్యుసమానవిభుండు లోభిదు
ర్మంత్రిగజాంకుశుండు రిపుమర్దనవిక్రమశాలి దేవతా
మంత్రిసమాననీతిగుణమాన్యుఁడు ధన్యుఁడు తారకస్ఫుర
న్మంత్రపరాయణుండు బుధమాన్యుఁడు సుబ్బనమంత్రి ధారుణిన్. 30

క. హరిభక్తియు గురుభక్తియుఁ, బరజనహితమార్దవంబు బంధుప్రియమున్
గరుణాపరతయుఁ గలిగిన, వరసుఁడు సుబ్బన్న సాటి సభ్యులుగలరే. 31

శా. ఆసుబ్బన్నయు సంగమేశ వరలింగా స్వామి పాదాబ్జసే
వాసంభావితభాగ్యవైభవుఁడు తత్త్వజ్ఞానవైరాగ్య మూ

ర్వ్యాసవ్యాసవసిష్ఠసన్నిభుఁడు భాస్వన్మంత్రతంత్రాగమా
భ్యాసప్రజ్ఞుఁడు పోల్చ వేంకటనృసింహామాత్యచంద్రుం డిలన్. 32

సీ. శ్రీమహనీయలక్ష్మీనృసింహపదాబ్జ మధుపాయమాన సన్మానసుండు
రమ్యగుణుండు భారద్వాజగోత్రుండు సలలితరాజాంశ సంభవుండు
ధర్మార్థకామామృతప్రాప్తచరితుండు విమలతేజుండు భూవిదితయశుఁడు
ప్రామాణికప్రజాపటలచింతామణి బంధుమండలకల్పపాదపంబు

తే. సరసరామాయణాన్వయజలధిచంద్రుఁ, డైనవేంకటరామన కాత్మజుండు
సారిది రాఘవనరసింహసోదరుండు, ధరణిఁ బొగడొందు వేంకటనరసఘనుఁడు. 33

తే. అతఁడు నిజసాధ్వి యైనలక్ష్మాంబయందుఁ
గాంచె నరసమ్మ యనఁగ వెంకమ్మయనఁగఁ
బరఁగు నిద్దఱు దుహితల భద్రమతుల
మఱియుఁ జిక్కప్పయను సత్కుమారమణిని. 34

శా. ఆచిక్కప్ప మహాప్రధానమణి వేదాంతార్థవిజ్ఞాతమే
ధాచక్రీశుఁడు రాజయోగసుకళాధారేయుఁ డాత్మైక్యని
ష్ఠాచాతుర్యపరుండు సద్గురుకటాక్షావాప్తధీరుండునై
భూచక్రంబునఁ బేరుగాంచి వెలసెన్ బూర్ణప్రయోగాఢ్యుఁడై. 35

వ. అంత. 36

క. ఘనుఁ డాసుబ్బన్న జగద్వినుతుఁడు రామాయణంబు వేంకటనరసిం
హునిపుత్త్రి యైననరసమ్మను బరిణయమయ్యె వారి రమాసతిపగిదిన్. 37

సీ. అతిథిసత్కారంబు లాచరించెడివేళ నన్నపూర్ణను బుద్ధియనఁగవచ్చు
నతిశయభోగంబు లనుభవించెడిపట్ల శ్రీదేవికిని సాటిచెప్పవచ్చు
సతతక్షమాగుణసంపత్సమృద్ధిచే భూదేవికిని సరిపోల్పవచ్చుఁ
బరమపాతివ్రత్య భవ్యశీలంబుల నయ్యరుంధతికి జోడనఁగవచ్చు

తే. నార సుబ్బన్న మంత్రియర్ధాంగ లక్ష్మి
యనఁగఁ జెలువొందు నిరతంబు నవనియందు
విమలసౌజన్యసీమ సాధ్వీలలామ
నవ్యసౌభాగ్యనికురుంబ నరసమాంబ. 38

మ. మానశరోపమానుఁ డగు సుబ్బనమంత్రి ముదంబు మీఱఁగా
నానరసమ్మయందు నుదితార్కసమానులఁగాంచె మువ్వురన్

భూనుతకీర్తి పాండునృపపుంగవుఁ డాపృథయందు ధర్మజా
మానితశౌర్యభీము ననమానుని ఫల్గుని గన్నకైవడిన్. 39

గీ. అనుమారాన్వయంబుల నభినుతింతు, ధర్మశీలుండు రామప్రధానమౌళి
రాజమాన్యుండు లక్ష్మీనారాయణుండు, రమ్యతరకీర్తి చెంగల్వరాయవిభుఁడు. 40

క. ఈమువ్వురుసుతులందు మహామతి శేషాహిమూర్తి యనఁగా వెలసెన్
రామన్న కల్పతరుచిం,తామణిసురధేనుసదృశదానోజ్జ్వలుఁడై. 41

సీ. పక్షపాతంబునఁ బక్షపాతములేని నిర్మలస్వాంతుండు నీతిపరుఁడు
రణభీరుతయు వితరణభీరుతయు లేని సత్యప్రతిజ్ఞుండు సజ్జనుండు
హరునందు దైత్యసంహరునందు మతభేదవాదంబులేని తత్త్వజ్ఞమూర్తి
అధికారులందు ననధికారులందును సమదృష్టిగలుగునిశ్చలగుణుండు

తే. యవనకర్ణాటహూణదేశాధినాథ, ఘనతరాస్థాన మంటపాగ్రముల నిలిచి
రాజకార్యధురీణతాప్రౌఢి వెలయు, ధైర్యగుణశాలి రామప్రధానమౌళి. 42

క. ఆరామామాత్యునకును,గూరిమితమ్ముఁ డన వెలసెఁ గూరిమి లక్ష్మీ
నారాయణప్పధారుణిఁ, బేరయ్యె మహేంద్రునకు నుపేంద్రునిమాడ్కిన్. 43

సీ. తనకీర్తి దరకుంద ఘనసారచంద్రికాశరదభ్రవిభ్రమస్ఫురణ మెరయఁ
దనవిక్రమోద్వృత్తి శారకప్రత్యర్థి పరశురామాతిగప్రతిభ వెలయఁ
దనవదాన్యత కర్ణధారాధరామరక్షోణీరుహంబులఁ జుల్కసేయ
తనదువైష్ణవభక్తి తార్క్ష్యవిష్వక్సేన పార్థాదిసామ్యవిభ్రమత నెనయ

తే. ధారుణిస్థలిఁ జెలువొందుధర్మపరుఁడు, బంధుపోషణు డతిమృదుభాషణుండు
శౌర్యగాంభీర్యధైర్యాదిసకలసుగుణ,రత్నములకుప్ప లక్ష్మీనారాయణప్ప. 44

చ. అతనియనుంగుఁదమ్ముఁడు మహామతిమంతుఁడు దానమాన వి
శ్రుతుఁడు ముకుందభక్తిపరిశుద్ధమనస్కుఁడు సాధులోకస
మ్మతుఁడును నీతిశాలి యసమానగుణాఢ్యుఁడు రూపకాంతిస
ద్రతిపతియొప్పఁ జెంగలువరాయఁడు ధైర్యకళాభిరాముఁడై. 45

వ. అం దగ్రజుండు. 46

క. రామఘనుఁ డధికసుగుణా,రాముఁడు కోవ్వూరి యాదిరాజతనూజన్
శ్రీమతియగునచ్చమ్మను, గోమతినివరించె నుభయకులములు వెలయన్. 47

ఉ. సమ్మతశీలవృత్తముల కాంతరసానుభవంబునన్ వివే
కమ్మున దానమానములఁ గారుణికత్వమునన్ బతివ్రతా
త్వమ్మునఁ జోతి రామ సచివాగ్రణికిం బ్రియపత్నియైన య
చ్చమ్మకుసాటిపత్తురె నిజమ్ముగ లోకములోనభామినుల్. 48

క. ఆలక్ష్మీనారాయణుఁ, డోలిమియతిరాజు రాఘవోత్తమసుతయా
శీలవతిసుబ్బమాంబను, బాలామణి నుద్వహించె భాగ్యము లొలయన్. 49

సీ. కొనవ్రేలఁ జూపించు కొననియరుంధతి చలనంబునొందనికలిమిబోఁటి
చండికగానట్టి శైలరాజతనూజ తలవాఁకిలెఱుఁగని పలుకువెలఁది
పతిపచోహితవృత్తిఁ బఱగు లోపాముద్ర భయకంపములులేనిపంటవాలఁతి
చెలువుని నకళంకుఁ జేసినరోహిణి పరుషోక్తులాడనిధరణితనయ

తే. యనఁగ విలసిల్లి లక్ష్మీనారాయణప్ప,పాలిసౌభాగ్యలక్ష్మి యై ప్రబలుచుండు
స్థిరకృపాలంబ పోషితద్విజకుటుంబ,సోమసంకాశముఖబింబ సుబ్బమాంబ. 50

తే. కంతుసన్నిభుఁ డైనచెంగల్వరాయ, ఘనుఁడు రామాయణంబుదిక్కుప్పవృత్తిఁ
వెంచమాంబనువరియించె నంచితముగ, ఫల్గునుండు సుభద్రఁజేపట్టినట్లు. 51

వ. అంత. 52

క. ఆరామఘనుఁడు లక్ష్మీ,నారాయణధీరుఁడును జనస్తుత్యగుణో
దారతఁ జెరొందిరి కా,శీరామేశ్వరసుమధ్యసీమలయందున్. 53

వ. మఱియు నస్మహాప్రధానశేఖరులు శ్రీరామచంద్రచరణారవిందమరందబిందు
బృందాస్వాదనతుందిలేందిందిరాయమానానందమానసులును నిరంతరాన్న
దానసంతర్పితానేకభూసురాశీర్వాదసంపన్నులును మహావిభవాభిరాములును సమ
స్తజనమాన్యులును సకలసద్గుణసంపన్నులునుబరేంగితజ్ఞాననిపుణులును నీతికార్యవిదు
లును బరోపకారులును బరస్పరసౌభ్రాత్రకులును నై యనవరతంబు నఖిలబాంధవ
మిత్రపుత్రవిద్వజ్జనకవిగాయక పౌరాణికసహితంబుగా నిష్టకథాసల్లాపంబులఁ
బ్రొద్దుగడుపుచుండిరొక్కదివసంబున సప్తసంతానలాభమహాభిలాషంబు మనంబున
నంకురింప సప్తసంతానంబులయందు ముఖ్యసంతానంబు ప్రబంధంబుగావున నస్మ
ద్గురుదేవతావతంసం డగుపార్థివేశ్వరుని పేరిట నంకితంబుగాఁ గృతి రచియింప
నొక్కకవీంద్రు నియోగింపవలయు నట్టి నస్మద్వంశంబు పావనంబగు నాచం
ద్రతారార్కంబుగా యశంబు ధ్రువం బయి యుండునని మనంబున నిశ్చయించి.

శా. శ్రీమద్వేంకటరామనామునిఁ గవిశ్రేష్ఠున్ రమావల్లభ
ప్రేమాపాంగవిశేషలబ్ధకవితాభివ్యక్తసూక్త్యన్వితుం
గామారిస్తవభక్తియుక్తవిలసద్గాంభీర్యధైర్యాఢ్యు న
స్నామోదంబునఁ జూచి పల్కిరి సముద్యత్కౌతుకం బొప్పఁగన్. 55

క. వనములును దటాకంబులు, ధననిక్షేపములు దేవతాగృహములు నం
దనములు పురములు కృతులును, జనముల కివి తలఁప సప్తసంతానంబుల్. 56

క. ఈచెప్పినసంతానము, లాచంద్రార్కముగ నుండు నయినను గృతియే
భూచక్రంబున బుణ్యక,థాచరితం బగుచు శాశ్వతంబుగ వెలయున్. 57

వ. అట్లుగావున. 58

సీ. శ్రీవేంకటాచల శ్రీయనఁబలమధ్యసీమలయందుఁ బ్రసిద్ధమగుచు
సిరులచేఁ జెన్నొంది శ్రీశైలదక్షిణద్వారమై తగు సిద్ధవటపురంబు
నప్పురంబునకుఁ బ్రత్యగ్భాగమున నర్ధయోజనదూరమై తేజరిల్లు
జలసస్యతరులతాజనకృతానందమై పురహరాతపురిఁబోలు పొన్నవోలు.

ఆ. అది పురాతనంబు నస్మదీయగ్రామ,మచట జనపదంబు లైదుగలవు
అట్టిపల్లెలందు నంబాపురంబునా, వెలయు నొకటి భూమితిలక మగుచు. 59

ఉ. శ్రీపతిమిత్రుఁ డార్యజనసేవ్యపదుండు పినాకినీతట
స్థాపితమందిరుండును భుజంగవిభూషణుఁ డీశ్వరుండు నం
బాపురవాసుఁ డైన వృషభధ్వజు పేరిట నంకితంబుగా
దీపితమైన యొక్కకృతిఁ దెల్లముగా రచియింపఁ గాఁదగున్. 60

క. ఖండేందుధరప్రియ మా,ఖండలభాగ్యప్రదంబు కల్మషలతికా
ఖండనమగు బ్రహ్మోత్తర,ఖండము రచియింపు పద్యకావ్యముగాఁగన్. 61

గీ. తరుతటాకాదిసప్తసంతానములకు, నొక్కవేళల శైథిల్య మొప్పతిల్లు
గాని కృతులకు నెన్నండు హానిలేదు, ప్రతియుగంబున ధ్రువమై ప్రబలుచుండు.

ఉ. శ్రీవనితాధిపాంఘ్రిసరసీరుహయుగ్మము సేవచేసినన్
కేవల భక్తియుక్తి శివకేశవభేదముఁ జేయ నెన్నఁడున్
గావున నీశ్వరాంకితముగా రచియింపు మహాంధ్రకావ్యమున్
పావనమైనపుణ్యకథఁ బల్కిన సర్వశుభంబు లయ్యెడిన్. 63

వ. అని పలికి బహుమానపూర్వకంబుగాఁ దాంబూల జాంబూనదాంబరాభరణంబు
లొసంగిన నేనును బరమానందకందళితహృదయారవిందుండనై స్కాందపురాణో
క్తం బైన బ్రహ్మోత్తరఖండంబు పరమేశ్వరమహిమానుభావంబును బురాతన పుణ్య
చరితంబును భోగమోక్షప్రదంబును నగుటం జేసి. 64

ఉ. ఉత్తములైనపూర్వకవు లొక్కట నాంధ్రకృతుల్ రచింపుచు
న్నిత్తఱి మన్మహాసుకృత మెట్టిదొ మున్ దెనిఁగింపరైరి బ్ర
హ్మోత్తరఖండ మిప్పు డది యొప్పుగఁ జెప్పెదఁ బద్యకావ్యమున్
జిత్తమునందు సమ్మదముఁ జెందఁగ జన్మము సార్థకంబుగన్. 65

క. పురహరునుతించుకావ్యము, లిరవుగ శబ్దార్థపుష్టిహీనములైనన్
సరసంబు లిక్షుఖండము,లరువక్రములైన రసము లారకయున్నన్. 66

వ. అట్లుగావున నిమ్మహాపురాణంబు సకలజనమనోహరంబుగాఁ దెనుఁగుఁ గావించెద
వని మనంబున నిశ్చయించి కృతినాథుం డైన శ్రీమహాదేవునకు షష్ఠ్యంతంబులు
వివరించెద. 67

ష ష్ఠ్యం త ము లు.

క. ఓంకారరూపునకుఁ బ్రాకాంతకకాలాయుధునకు నకలంకునకుఁ
శంకరునకుఁ బన్నగరాట్కంకణునకు శాశ్వతునకు గౌరీశునకున్. 68

క. సారంగదనుజనాయక, సారంగమృగేంద్రునకును సజ్జనపటలీ
సారంగవారిధరునకు, సారంగకరాగ్రునకును సర్వజ్ఞునకున్. 69

క. హాలాహలభక్షణునకుఁ, గైలాసనివాసునకును గాలాత్మునకుం
గాలమదధ్వంసునకును, ఫాలాక్షున కభవునకును బరమాత్మునకున్. 70

క. ఉక్షేంద్రవాహునకు సం, రక్షితబాణునకు రాజరాజాప్తునకుఁ
గుక్షిస్థితభువనునకును, దక్షాధ్వరహరున కమితతాపఘ్నునకున్. 71

క. అంబరకచునకు గజచర్మాంబరధారునకు సచ్చిదానందునకుఁ
శంబరధరశేఖరునకు,నంబాపురవాసునకు మహాదేవునకున్. 72

వ. అంకితంబుగా నారచియింపంబూనిన బ్రహ్మోత్తరఖండం బనుమహాపురాణంబు
నకుఁ గథాప్రారంభం బెట్టిదనిన. 78

# ప్రథమాశ్వాసము.

---

## కథా ప్రారంభము.

సీ. కపిలమార్కండేయ కణ్వకౌశికముఖ్య బహుతాపసాశ్రమభ్రాజితంబు
మునికన్యకాహస్తవనజాతధృతఘటీ వారివర్ధితవృక్షవాటికంబు
వైఖానసోత్సంగవర్ధితనాభి వాళిస్ఫురన్మృగశాబలక్షితంబు
సంయమ్యనుష్ఠానసమయాచితస్వచ్ఛపులినశోభితనదీభూషితంబు
తే. హంససారసచక్రవాకాదిపక్షి, కలకలారావకాసారకలిత మగుచు
వెలయుజగతీతలంబున విబుధశరణ్య మొప్పారు నైమిశారణ్య మెపుడు. 1

గీ. బ్రహ్మవాదరతులు బ్రహ్మసమానులు, యాగదీక్షితులును యోగరతులు
బ్రహ్మనిష్ఠులైన బ్రహ్మర్షివరులచే, నొప్పుచుండు నవ్వనోత్తమంబు. 2

వ. మఱియు నమ్మహారణ్యంబు గాలవ శాండిల్య పిప్పల కింశుక ప్లక్ష వట తింత్రిణీ రసాల సాల తమాల చందనాద్యనేకవృక్షవాటికావిరాజితంబును సింహ శరభ శార్దూల గండక భేరుండ వరాహ సారంగ గజ గవయ రోహిష మహిషాది మృగసంకులంబును భరద్వాజ శుక శారికా నీలకంఠ క్రౌంచరవముఖరిత దిఙ్ముఖంబును వికసిత కమల కైరవామోద ఘుమఘుమిత జలప్రపూరిత కమలాకరంబులుం గలిగి భువనపావనంబై యొప్పు నవ్వనంబునందు శౌనకాదిమహామునులు వ్యాసశిష్యుండును రోమహర్షణకుమారుండును నైన యుగ్రశ్రవసుం డను పేరం బరంగిన సూతువలన సకలపురాణేతిహాసంబులు వినుచుండి యొక్కనాడు వెండియు సూతుం జూచి యమ్మహామును లిట్లనిరి. 3

క. ధన్యుండవు విద్వజ్జన, మాన్యుండవు కుశలమతివి మానితగుణ సౌ
జన్యుండవు మానవసా, మాన్యుండవె నీవు నీసమానులుగలరే. 4

శా. వేదవ్యాసమునీంద్రుఁ డాద్యుఁడు మహావిద్వద్వతంసుండు దా
వేదార్థంబు పురాణసంహితలుగా విఖ్యాతి నిర్మించి వి
వ్యాదానంబుగ నీకొసంగ నవి యాద్యంతంబుగానట్టు స
త్త్వాదస్ఫూర్తిఁ దెలంగఁ బల్కితివి సంపూర్ణాంతరంగుండవై. 5

శా. ఉల్లం బందుల నన్యకర్మ కలనం బూహింపఁగా నేటికిన్
ముల్లోకంబుల కాదిదేవుఁడు జగత్పూజ్యుండు గౌరీశుఁ డు
ద్యల్లక్ష్మీఫలదుండు శంభుఁడు శివుం డ ట్లాట నేతత్కథా
సల్లాపంబులఁ బ్రొద్దుఁబుచ్చుము భవజ్జన్మంబు ధన్యంబుగన్. 6

ఉ. వింటిమి సర్వధర్మములు వింటి మశేషపురాణసంహితల్
వింటిమి పూర్వరాజుల పవిత్రచరిత్రము లార్యవృత్తముల్
వింటిమి విష్ణుసత్కథలు వీనులవిందుగ నింక మాకు ము
క్కంటి చరిత్రముల్ వినఁగఁ గౌతుకమయ్యెడిఁ దెల్పు మేర్పడన్. 7

సీ. కాలునిర్జించి మార్కండేయమునికిఁ గల్పాంతపర్యంతదీర్ఘాయు వొసఁగ
దశకంధరుఁడు దేవదానవాభేద్యుఁడై భాసిల్ల నొకచంద్రహాస మొసఁగ
భక్తవత్సలుఁ డౌట బాణాసురునియింటఁ గావలియుండె సత్కరుణ మెఱసి
గాండీవిరథముచెంగట నుండి శూలియై కౌరవ్యబలముల నిఱుకసేసెఁ
ఆ. పార్వతీప్రియుండు పరమపవిత్రుండు, చంద్రశేఖరుండు శంకరుండు
సన్మహానుభావు నాశ్రయించినవార, లిందు నందు శుభము లందు టరుదె. 8

క. ముంగొంగుపసిఁడివాఁకిలి, ముంగిటఁగల్పద్రుమంబు మొగిగోష్ఠములో
నంగల్గ కామధేనువు, తంగేడుజున్నరయఁగా సదాశివుఁ డెందున్. 9

వ. అట్లుకావునఁ బరమేశ్వరచరిత్రంబులును దత్కథావ్రతప్రభావంబులును దద్భక్తలక్షణంబులును సవిస్తరంబుగాఁ దెలియంబలుకవలయునని శౌనకాదిమహామునులు శివకథాశ్రవణకుతూహలచిత్తులై యడిగిన రోమహర్షణకుమారుం డగు సూతుండు పరమానందకందళితాంతరంగుం డై యమ్మహర్షుల కిట్లనియె మహాత్ములారా సర్వజ్ఞులైన మీకుం దెలియరానియర్థంబులుంగలవే యైనను మీరు నన్నడిగినప్రశ్నలకు నుత్తరంబీవలయుం గావున నాకుం దోఁచినంతయుఁ జెప్పెద సావధానులరై వినుండని కృష్ణద్వైపాయనుం దలంచి గురువందనంబుగావించి పంచాక్షరీమహత్త్వం బి ట్లని చెప్పం దొడంగె. 10

## పంచాక్షరీప్రభావము.

క. పంచాక్షరీమహత్త్వము, లెంచఁగ శక్యంబె జగతి నెవ్వరికైనన్
బంచాస్త్రజనక శక్రవిరించి ప్రముఖులు దలంతు రిష్టము గాఁగన్. 11

గీ. పుణ్యకాలమందు పుణ్యతీర్థములందు, పుణ్యవంతులైన పురుషవరుల
కృపకుఁ బాత్రులగుచు నుపదేశములుగొన్న, వారిమహిమ లెన్నవశముగాదు. 13

వ. అట్టి పుణ్యతీర్థ పుణ్యకాలాదు లెయ్యవియనిన. 13

మ. మధురా ద్వారవతీ చిదంబర మహామాయాపురక్షేత్రముల్
మిథిలావంతి గయా ప్రయాగములు రామేశాది పుణ్యస్థలుల్
నిధులౌ సూర్యసుతా సరస్వతులు వేణీ తుంగభద్రా కళా
నిధి పుత్రీ మణికర్ణికాదినదులౌ నిశ్శ్రేయసస్థానముల్. 14

ఆ. వ్యాసపూర్ణిమలును హరివాసరంబులు, ద్వాదశులును భానువాసరములు
సంక్రమణము అర్కచంద్రోపరాగంబు, లెలమిఁ బుణ్యకాలములు దలంప. 15

క. గతదోషులు మితభాషులు, జితకాములు విచారు లాత్మ శిష్యప్రియులున్
మతిమంతులు నతిశాంతులు, గుణకాత్మకు లైనఘనులు గురువులు దలఁపన్. 16

క. చిత్తమున శుద్ధిగలిగియు, మత్తత్వము లేక విగతమత్సరు లగుచున్
సత్తామాత్రంబుగ సుగుణోత్తరు లయినట్టిశిష్యు లుపదేశార్హుల్. 17

మ. పరమక్షేత్రములందు సాధుజనసంభావ్యైకకాలంబునన్
గురువక్త్రోదిత మైన శాంకరమహాసుస్తోత్రమంత్రంబు సు
వ్వరితైనన్ శుభమోక్ష సత్ఫలద మై భాసిల్లు సెట్లన్న శం
బరరాశిస్థితశుక్తిసంపుట పతత్స్వాత్యంబుబిందుక్రియన్. 18

క. సలలితముగ నిమ్మంత్రముఁ, దలఁపఁగ నుపదేశహోమతర్పణదీక్షా
దులు లేకున్నను జపితల, కలవడ నిష్టార్థ మొసగు నఘము నడంచున్. 19

సీ. రమణీయతరమంత్రరాజంబులం దెల్ల నధికమై యొప్పు బంచాక్షరంబు
ఆగామిసంచితప్రారబ్ధపాతక హరణకారణము పంచాక్షరంబు
గణుతింప ధర్మార్థకామమోక్షము లతి దక్షతనిచ్చుఁ బంచాక్షరంబు
శౌనకాగస్త్యాది మునిమునీంద్రులు చెప్పు లక్షణం బరయ పంచాక్షరంబు

తే. జపపరాయణులకు సాధుజనుల కెల్ల, నక్షయఫలప్రదంబు పంచాక్షరంబు
పూర్వజన్మకృతానేకపుణ్యసాధ్య, మాగమోక్తంబు శైవపంచాక్షరంబు. 20

క. ఇమ్మంత్రము ప్రణవసహాయమ్ముగ జపియింప నది షడక్షరమగు మీ
రిమ్మెయి భజియించిన నది, సమ్మతమగు శంకరునకు సన్మునులారా. 21

మ. కలుషధ్వాంతదివాకరం బమృతమార్గస్వచ్ఛదీపంబు ని
శ్చలతాపత్రయదావపావకము సంసారాబ్ధిపోతంబు ని
ర్మలకల్యాణఫలప్రదంబు విలసన్మంత్రాధిరాజంబు నై
యలరున్ శైవషడక్షరంబు నిఖిలార్యస్తుత్యమై నిత్యమున్. 22

ఆ. తారకలయందు శశియును దరువులందుఁ
గల్పకము శైలములయందుఁ గనకగిరియు

వరయ మంత్రంబులందు షడక్షరంబు
శ్రేష్ఠతరమనఁ దగు మునిశ్రేష్ఠులార. 23

వ. మఱియు నీయర్థంబునకుఁ బురాతనం బయిన యొక్క యితిహాసంబు గలదు దానం జేసి మీసంశయంబులు దొలంగు నది సమస్తదురితభంజనంబును సుజనమనోరంజనంబును ముక్తినిధానాంజనంబును నగుదానిం జెప్పెద వినుం డని సూతుం డిట్లని చెప్పందొడంగె. 24

## కాశీపురవర్ణన.

సీ. అవనిలోఁ గల్గుపుణ్యక్షేత్రములకంటె సిరిమించి యుండుఁ గాశీపురంబు
బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి సముదాయసేవ్యమై యుండు గాశీపురంబు
కైవల్యసంధాయకంబునై భువనప్రసిద్ధమై యుండుఁ గాశీపురంబు
బ్రహ్మహత్యాదిపాపములుభస్మములుగాఁ జేయుచు నుండుఁ గాశీపురంబు
తే. మహితజలరాశిమధ్యనిమజ్జమాన, పటుచరాచరజాలకల్పాంతకాల
కాలభైరవకరధృతకఠినశూల, శిఖరసంస్థాపితంబు గాశీపురంబు. 25

క. కాశిక్షేత్రమహత్త్వము, గాశికునకైనఁ గమలగర్భునకైనం
గాశికునకైన నెన్నం, గాశక్యముగాదు పలుకఁ గుశక్యాకా. 26

గీ. కాలభైరవుండు గణనాయకుండును, బిందుమాధవుండు విందుధరుఁడు
పార్వతియును గుహయు భాగీరథియు మణికర్ణికయును వెలయుఁ గాశియందు.

ఉ. ఎప్పుడు గాశికింజనుదు నెప్పుడు గాంతునువిశ్వనాథు నే
నెప్పుడు భైరవేశ్వరున కింపుగ మ్రొక్కుదు నిందువేడ్కతో
నెప్పుడు గాంగతోయముల నిమ్ముగఁదోఁగుదు నంచు భక్తితో
నెప్పుడుఁబల్కుమానవుల కీశ్వరుఁ డిచ్చు నఖండసంపదల్. 28

వ. మఱియు ను. 29

సీ. దిగ్గజంబులనైన ధిక్కరింపఁగఁజాలు బలములుగలిగినభద్రకరులు
కమలబాంధవరథాశ్వముల నెక్కసమాడు జవములుగలిగిన సైంధవములు
పర్వతంబుల నైన బరిహసింపఁగఁజాలు నమితమహోన్నతస్యందనములు
కంఠీరవంబులగర్వంబు మాయించు ఘనశౌర్యములు గల్గుకాల్బలములు
ఆ. బ్రహ్మతోనైన వాదించుబ్రాహ్మణులును, భార్గవునితోనెదుర్కొనుపార్థివులును
యక్షపతితుల్యులైనట్టి యార్యజనులు, బలునిమెచ్చనిహాలికుల్ గలరు పురిని. 30

వ. మఱియు నమ్మహానగరంబునం గనకమయ సముత్తుంగ సౌధ ప్రాకార గోపురాట్టాలక భ్రాజమానంబును విచిత్ర మణిమయగృహద్వారతోరణ వితర్దికా దేహళీ

కుడ్యవాతాయన కమ్రాల స్తంభవిటంకకేతనాలంకృతంబును ప్రతిగృహప్రాంగణ విరచిత రంగవల్లీవిరాజితంబును సమస్తవస్తువిస్తార నిస్తుల ప్రశస్తవిపణి మార్గప్రదేశంబును ఘనసార మృగమదచందనసమ్మిశ్రహిమజల పరిషిక్తరాజమార్గంబును హారకుండల మంజీర కంకణ కింకిణీ మేఖలాది రత్నహాటకమయభూషణాలంకృత వారకామినీనర్తన ఝుళంఝుళాయమానరంగస్థలంబును సాల తమాల కదళీ కాశ్వత్థనారంగమాతులుంగనారికేళక్రముకపనసజంబీరఖర్జూరమాలూరసాలీరచందనమందారనింబజంబూకదంబాది తరుషండమండితోద్యానవన సమంచిత కీరమయూరకోకిలారావకోలాహలంబును మాలతీమల్లికా సేవంతికాకురంటక చంపకాద్యనేక పుష్పవాటికా శోభితంబును గంగానదీప్రవాహ సంభూత బహువిధ కుల్యాజల ప్రవర్ధమాన ఫలితరసాలకలమాది సస్యపరిపూర్ణంబును బక బలాహకచక్రవాకకోయష్టికకారండవకలహంసముఖరజలపతంగవిహరణసముల్లసత్కుముదకైరవకల్హారపరాగ సుగంధవాసిత సలిలకాసారరమ్యంబును విశ్వేశ్వర మహోత్సవ సందర్శనార్థసమాగత చతుర్విధవర్ణాశ్రమజన నిరంతర కలకలారావ సమన్వితంబును మృదంగపటహనిస్సాణవేణువీణాదివాద్యహృద్యంబునునై బ్రహ్మసదనంబునుంబోలె బ్రహ్మర్షి సేవ్యంబయి మహేంద్రభవనంబునుంబోలె బహువిబుధాకీర్ణంబయి మానససరోవరంబునుంబోలె సముల్లసద్రాజహంసంబై చంద్రమండలంబునుంబోలె నమృతాస్పదంబయి నారాయణాశ్రమంబునుంబోలె జగత్పావనంబయి యొప్పుచుండు. 31

## కాశీరాజుచరిత్రము.

క. ఆకాశీపురమేలెడు, భూకాంతుఁడు శక్రతుల్యభోగుఁడు వినుత
శ్రీకంఠుఁడు శరచందన, రాకేందుయశుండు కాశిరాజన వెలయున్. 32

సీ. తనభవ్యతర కీర్తి దళహరిద్భామినీధమ్మిల్లములు మ్రుతతులఁ గాఁగఁ (?)
దనప్రతాపస్ఫూర్తి దగఁ జక్రవాళాద్రి చరమభాగతమిస్రజాల మడఁపఁ
దననిరంతరదానధారాప్రవాహంబు జలరాసులకు మహోత్సవ మొనర్ప
దనరూపవిభవంబు ధనదాత్మజ వసంతమదనేంద్రజాలకు విస్మయ మొనర్ప
తే. దనభరణకీర్తిదిగ్దంతిఫణికులేంద్ర, జరఠకచ్ఛపములకు విశ్రాంతియొసఁగ
లాలితంబుగఁ దత్పురం బేలుచుండె, జిష్ణుశుభలక్షణుండు గాశివిభుండు. 33

క. ఆరాజురాజ్య మతిచో, రారాతిక్ష్మామడాంబ రాదికరక్షో
మారీభయవిరహిత మై, ధారుణి నిరుపద్రవముగఁ దనరుచు నుండెన్. 34

క. ఈవిధమున నాభూపతి, దేవీసహితుండు నగుచుఁ దేజము మెఱయన్
శ్రీవిశ్వేశ్వరుకరుణను, భూవలయం బేలుచుండె బుధులు నుతింపన్. 35

ఉ. సంతతిలేకయీనృపతిసత్తముఁ డెంతయు నిష్ఠమీఱఁగా
నింతియుఁ దాను సువ్రతము నీశ్వరపూజలు దానధర్మముల్
శాంతికపౌష్టికక్రియలు సంయమిసేవలు సేయుచుండఁ ద
త్కాంతకుఁ జూలునిల్చెఁ గుతుకంబునఁ బౌరులుసంతసిల్లఁగన్. 36

మ. భరమయ్యె న్మణిభూషణంబులు దలంపన్ గౌను లావయ్యె ని
ద్దురమబ్బెన్ ఘనమయ్యె దేహమునఁ గాంతుల్ మించె నాహారమున్
విరసంబయ్యెఁ జనించెఁ గోరికలు నీవీబంధమున్ హెచ్చె న
త్తరుణీరత్నము నాఁటినాఁటికిని యంతర్వత్నియై వర్ధిలన్. 37

గీ. నెలఁత కీరీతిఁ దొమ్మిదినెలలునిండ, దశమమాసంబునందు సంతసమెలర్ప
గ్రహములొక్కట శుభదృష్టిఁగనుచునుండ,నవ్యగుణధన్యయొక్కకన్యక జనించె.

వ. ఇట్లుదయించిన యక్కన్యకారత్నంబునకు జాతకర్మాదిసంస్కారంబులు నిర్వ
ర్తించి యాభూపాలుండు పరమానందంబున భూసురసమారాధనంబులుచేసి భూ
హిరణ్యాదిదానంబులు గావించి హైమవతిం గాంచిన హిమవంతునివిధంబున సం
తుష్టాంతరంగుం డై యుండె నంత. 39

క. శ్రీమతియును ధీమతియును, భామతియును నగుటఁజేసి బ్రాహ్మణజనముల్
నామక్రియ లొనరించిరి, ప్రేమఁ గళావతియనంగ బింబాధరికిన్. 40

క. ఆకన్యక నానాఁటికి, భూకాంతునిగృహమునందుఁ బోషితయగుచుం
శ్రీకాంతికలితయగుచును, బ్రాకట బాలేందురేఖపగిదిఁ దనర్చెన్. 41

చ. కమలదళంబులం దెగడుకన్నులు కుందములన్ హసించు దం
తములు వినూత్నసైకతనితంబము చందురుఁ గేరుమోమునుం
భ్రమరనిభాలకంబులును బల్లవకోమలపాదహస్తముల్
సమదమరాళయానమును జక్కరమోవియు నొప్పె నింతికిన్. 42

క. శైశవముతోడిని మేధా, కౌశలమునఁ గావ్యనాటకాలంకారా
భాసంబులు గావించెను, గాశివిభుకూర్మిపుత్రి గౌతుక మొదవన్. 43

వ. అంత. 44

క. వాసవముఖసురగణసం, త్రాసకర ఘనతపోవిలాసుఁడు యోగా
భ్యాసుఁడు దూర్వాసుండను, భూసురుఁ డేతెంచె రాజపుంగవుసభకున్. 45

శా. దుర్వారస్వతపోబలానుభవనిర్ధూతాఘుఁ డాత్రేయుఁడు
న్నిర్వాణప్రమదాసమేతుఁడు భవానీకాంశజుం డైన యా
దూర్వాసుం డరుదెంచినం గని బుధస్తోమంబునన్ దాను న
య్యుర్వీశుం డెదు రేగుదెంచె యతి కభ్యుత్థానపూర్వంబుగన్. 46

గీ. ఇవ్విధంబున నమ్ముని కెదురునడిచి, యర్ఘ్యపాద్యంబు లొసఁగి యర్హాసనమున
నునిచి యభివాదన మొనర్చి మనుజవిభుఁడు, స్నిగ్ధ మాధుర్యభాషల నిట్టులనియె. 47

మ. స్థిరసద్భావ్యాత్మకమృచ్ఛిలామయము లౌతీర్థంబులుం దేవత
ల్చిరకాలంబున ముక్తి నిత్తురు మహర్షిశ్రేష్ఠులైనట్టి మీ
చరణాంభోజపరాగలేశమున మోక్షప్రాప్తిసిద్ధించున
త్వరమార్గంబున దివ్యయోగికులచంద్రా సత్కృపాంభోనిధీ. 48

ఉ. ఓమునిసార్వభౌమ మహిమోజ్జ్వల మీ రిట కేగుదెంచుట
న్నామది సంతసం బొదవె నాదుగృహంబు పవిత్రమయ్యె మ
త్కామితముల్ ఫలించెఁ గడు ధన్యుఁడ మాన్యుఁడ నైతి నంచు నా
భూమివిభుండు పల్కుచును బూజ లొనర్చె మహామోదంబునన్. 49

క. తదనంతరమున మునిపతి, సదమలమృష్టాన్నపానసంతృప్తునిఁగా
ముద మొనరఁగఁ గావించియుఁ, బదపద్మము లొత్తుచుండఁ బార్థివుఁ డంతన్. 50

వ. ఇట్లు పరిచర్యలొనరింపుచున్న యన్నరనాథునిం గని పరమానందకందళితహృద
యారవిందుం డయి యమ్మహామునీంద్రుం డారాజేంద్రున కిట్లనియె. 51

మ. ధరణీనాయక ధర్మపద్ధతి భవద్రాజ్యంబు పాలింతువే
పురముల్ రాష్ట్రము దుర్గముల్ బలములున్ బూర్ణాసుభోగంబులే
తురగానేకపగోగణంబులును సంతుష్టంబులై యుండునే
తరుణీబాంధవపుత్త్రమిత్త్రులకు భద్రంబే కదా నిత్యమున్. 52

క. అని యడిగిన యమ్మునితో, జననాయకుఁ డపుడు వేడ్కఁ జనియింపఁగ మీ
ఘనతరకారుణ్యంబున, ననిశము సర్వమును గుశల మని పల్కెఁ దగన్. 53

ఆ. మఱియు నిట్టులనియె మనుజాధినాయకుం, డో మునీంద్రచంద్ర నేమమలర
నస్మదీయగృహమునందుఁ గొన్ని దినంబు, లుండవలయుఁ గనుల పండువుగను. 54

క. అనిపలికి యమ్మహాముని, యనుమతిఁ గైకొలుపడసి యవనిపతి యా
శ్రమమున నుప్పొంగుచు నిజ, తనయఁ గలావతిని జూచి తా నిట్లనియెన్. 55

క. అమ్మా విను నామాట ని, జమ్ముగ నిమ్మునికి వినయసత్కారములన్
సమ్మతముగ భోజనపా, నమ్ముల సంతుష్టిఁ జేయు నలినదళాక్షీ. 56

తే. ఇష్ట మాత్ముఁడు దనహృదయమ్మునందు, సంతసిల్లిన జగములు సంతసిల్లు
నట్లు కావున నన్నపానాదికములఁ, బూర్ణకాముని గావింప బొదలు శుభము. 57

క. అని జనకుఁడు నియమించిన, వినయమ్మున సమ్మతించి విలసన్మతి న
మ్మునిసార్వభౌముఁ బ్రమదా, వనమధ్యగరత్నభవనివాసునిఁ జేసెన్. 58

సీ. ప్రతిదివసంబును బ్రత్యూషవేళల సరసపుణ్యోదకస్నానతతిఁ జేయుఁ
బ్రకటసౌవర్ణకాటికలు గట్టఁగ నిచ్చు ఘుమఘుమామోదగంధములుపూయుఁ
దులసికామాలారదళముల నర్పించుఁ బరిమళధూపదీపంబు లొసఁగు
భక్ష్యభోజ్యంబులఁ బరితుష్టిఁ గావించుఁ దగశీతజలముల దప్పిదీర్చు
తే. హస్తపాదాంబురుహశుద్ధి యాచరించు, నాచమింపఁగఁ జేయు హిమాంబువులను
మృదులశయనతలంబునఁ బదములొత్తు, నాళికావతి లబ్ధవివేకి యగుచు. 59

క. ఈరీతిఁ గొన్నిదివసము, లారాజతనూజ మౌని నారాధింపన్
గారుణ్య మొదవి తాపసుఁ, డారమణీమణికి నిట్టు లనియె ముదమునన్. 60

ఆ. బాల వినుము నీసుశీలప్రవృత్తములకు, వినయమునకు నీవివేకమునకు
నిజము మెచ్చినాఁడ నీకుఁ బంచాక్షరి, నిత్తుఁ గొనుము వేగ జిత్తమలర. 61

వ. అని పలికి. 62

క. అక్షీణకృపాకలిత కటాక్షామృతదృష్టిఁ జూచి యమ్మునిచంద్రుం
డాక్షణమున నింతికిఁ బంచాక్షరి నుపదేశ మొసఁగి చనియె యథేచ్ఛన్. 63

వ. ఇవ్విధంబున నక్కన్యకారత్నంబు దూర్వాసమహాముని యందువలనఁ బంచాక్షరీమంత్రోపదేశంబు వడసి నిరంతరంబు దన్మంత్రానుష్ఠానపరాయణత్వంబుగలిగి తదేకధ్యానసమాధిలక్షణంబునఁ గాలంబు గడుపుచు విధూతకల్మషయు వినిర్మలస్వాంతయు సదాచారపవిత్రయుఁ బుణ్యచరిత్రయు నై యుండె నంత. 64

శా. ఆకాశీవిభుకూర్మిపట్టికిని బాల్యాతీతకాలంబునం
దాకర్ణాంతము లయ్యె నేత్రములు నూగా రుద్భవం బందె న
స్తోకం బయ్యె నితంబ మున్నతము లై చూపట్టె వక్షోజముల్
రాకేందుప్రతిమాన మయ్యె ముఖ మభ్రస్ఫూర్తు లయ్యెన్ గురుల్. 65

ఉ. బంగరువంటిదేహము నభం బన నొప్పెడు కౌనుదీగ సం
పంగినిబోలునాసికము పాటలగంధము కెంపుమోవి యు
త్తుంగకుచద్వయంబు శరదుత్పలనేత్రము లొప్పుచుండఁగా
నంగజరాజ్యలక్ష్మి యన నాశుకవాణి చెలంగె నెంతయున్. 66

క. ఈవిధమున నవయౌవనభావంబు వహించి యున్న భామామణికిన్
వైవాహికప్రయత్నము, గావింపఁగఁ దద్గురుండు ఘనమతిఁ దలఁచెన్. 67

వ. ఇట్లు మహీనాయకుండు సంప్రాప్తతారుణ్యయు సకలసద్గుణగణ్యయు సర్వజనమాన్యయు సౌజన్యధన్యయు నై యున్న యక్కన్యకకుం దగినవరుం డెవ్వం డగునో యని విచారింపుచుండె నాసమయంబున. 68

క. విధులకు నృపపాలితమై, మధుభోజాంధకదశార్హ మానిత మగుచున్
బుధజనరంజనకరమగు, మధురాపురి వెలయు ధరణిమండన మనఁగన్. 69

మ. మదనప్రోజ్జ్వలవిగ్రహుండు మృదువాఙ్మాధుర్యధుర్యుండు దు
ర్మదవైరిక్షితిమండలేంద్రగజహర్యక్షుండు దక్షుండు శ్రీ
యదువంశాంబుధిపూర్ణచంద్రుఁ డన దాశార్హక్షమాపాలకుం
డుదితార్కప్రతిమానతేజుఁ డొకఁ డుండుం దత్పురం బేలుచున్. 70

క. ఆరాజతనయుఁ డభినవ, తారుణ్యవిలాసశౌర్యధైర్యాదిగుణో
దారుం డని జను లెన్నఁగ, ధారుణిలోఁ బేరుగాంచె ధార్మికమతియై. 71

క. ఆదాశార్హమహీశుని, సాదరమతిఁ బిలువనంపి సమ్మద మొదవన్
వేదోక్తవిధి వివాహము, గాదిలిసుత నిచ్చి చేసె గాశీవిభుఁడున్. 72

వ. సకలజననయనోత్సవంబుగా దాశార్హమహీపాలునకుఁ దన నందనయగు కళావతిని పాణిగ్రహణంబు చేయించి హయ గజ స్యందన విలాసినీ శతంబులు గోసహస్రంబులు నపరిమితంబు లైనసువర్ణమణిమయాంబరాభరణంబులును నాదిగాఁగల సమస్తవస్తువులు నరణం బిచ్చినం గైకొని యవ్వధూవరులు తూర్యఘోషంబులు చెలఁగ మధురాపురంబునకుం జనుదెంచి రత్నస్తంభవిభ్రాజితంబును హరిన్మణిపీఠద్వారదేహళీసమేతంబును స్ఫాటికోపలకుడ్యావితాయనప్రదీప్తంబును నవాశ్వత్థరసాలపల్లవతోరణమాలికాలంకృతంబును నై యొప్పుచున్న నిజశుద్ధాంతభవనంబు సకలకల్యాణమహోత్సవంబుతో శుభలగ్నంబునం బ్రవేశించి దేవతావిప్రసంతర్పణంబులు గావించి నిజసామ్రాజ్యభోగంబు లనుభవింపుచు సుఖంబున నుండి రంత.

మ. అమరేంద్రప్రతిమానభోగుఁ డగు దాశార్హుండు దైవజ్ఞో
క్తముహూర్తంబున నాఁటిరాత్రి నిజకాంతాసంగమాపేక్షుఁడై
కమలాక్షప్రభ గల్గినట్టి శయనాగారంబున న్మల్లికా
సుమశయ్యన్ శయనించి మన్మథవిలాసుం డుండె మోదంబునన్. 74

వ. అంత. 75

సీ. రాజమండలవినిర్గతకురంగమరీచిఁ గెలఁకువిల్కానిరాచిల్కభాతి
మానససంచరన్మదమరాళముపోల్కి వార్షికాంబుదతటిద్వల్లికరణి
గగననిష్యందనక్షత్రంబుచాడ్పున సాకారహేమశలాకచాయ
మయవినిర్మితరత్నమయపుష్పకము మాడ్కి దీపించు మోహినీదేవిలీల

తే. నిర్మలసువర్ణరత్నమాణిక్యఖచితభూషణంబులు దాల్చి సంతోష మొదవ
వచ్చి నిలుచుండి జీవితేశ్వరుని ప్రేమ, నాకళావతి దన్మనోహరతఁ దనరి. 76

గీ. ఇట్లు తన ప్రేమ నిలిచిన యింతిఁ జూచి, సంగమాసక్తిఁ బిలిచె వజ్రనఖుండు
పలుదెఱంగులఁ బిలిచిన బలుకకున్న, నువిదఁ జెయిపట్టి తిగువ నుద్యుక్తుఁ డయ్యె. 77

వ. అప్పు డా కళావతి పతిసంభ్రమం బెఱింగి యి ట్లనియె. 78

శా. ఓరాజన్యకుమార చాలు నిఁక నోహో నాకు న న్నంటఁగా
వారస్త్రీకులటాదికామినులతో వర్తింపుచు న్నిర్మలా
చారం బేమియు లేక నీవు మధుమాంసద్రవ్యలోలుండ వై
ధీరోదాత్తునిభంగిఁ జేరెదవు భ్రాంతిం జెంద నే కేటికిన్. 79

చ. వ్రతములఁ జేయునింతి యుపవాసము లున్నవధూటి గర్భిణీ
సతియు సుదీర్ఘరోగిణియు సంగమయోగ్యలుగారు శంకర
వ్రతజపమంత్రతంత్రముల వన్నియ కెక్కినదానఁ గాన నే
నతిపరిశుద్ధురాల నను నంటఁగ శక్యమె యంచుఁ బల్కఁగన్. 80

శా. జాయారత్నముపల్కుఁ గైకొనక హస్తస్పర్శముం జేయ ద
త్తాయఃపిండసమాన మైనసతిగాత్రంబు న్విలోకించి చిం
తాయత్తం బగుమానసంబున భయోత్కంపంబుసంధిల్లఁగా
నాయుర్వీశ్వరుఁ డాకళావతి విమోహభ్రాంతుఁ డై యిట్లనున్. 81

గీ. ఇంతి నీమేను గ్రాఁగిన యినుపముద్ద, కరణి నుండుట కిది యేమికారణంబు
దంపతులపట్ల నిట్టిచందములు గలవె, నా కెఱింగింపు మింతయు నలిననయన. 82

క. సతియుఁ బతితోడఁ గూడిన, రతిజగతిసుతోదయాకరం బగుభార్యా
రతిపుత్రఫలప్రదయని, శ్రుతిపలుకఁగ వినఁగలేద సోమనిభాస్యా. 83

వ. అని పలికిన ప్రాణవల్లభునకు గళావతి యి ట్లనియె. 84

ఉ. తపనద్యోతనుఁ డత్రిపుత్త్రుఁడు త్రినేత్రాంశావతారుండు మం
త్రపురాణాగమతత్త్వవేది యగు దుర్వాసుండు పంచాక్షరం
బుపదేశించె సకీలకంబుగను విధ్యుక్తంబుగా నేను ద
జ్జపనిష్ఠారతిచేఁ బవిత్రనయితిన్ సర్వంసహాధీశ్వరా. 85

క. నీవు సదాచారుండవు, గావు దురాచారవృత్తిగలిగిన నీకుం
భావింప నింక సద్గురు, సేవ యొనర్పుటను మేలు చేకుఱు నధిపా. 86

క. అనిపలికిన నయ్యింతిం, గనుగొని పంచాక్షరంబుఁ గారుణ్యమునం
దన కుపదేశింపు మనన్, వనితామణి పల్కెఁ బ్రౌఢవాక్యస్ఫురణన్. 87

ఉ. భర్తవు నీవు నీకయిన భార్యను నే నుపదేశ మీయఁగాఁ
గీర్తియె నీకు గర్గమునికిన్ బ్రణమిల్లి భజింపు మిప్పు డ

యాశ్రితార్తిహరుండు నిన్ను సుకృతాత్మునిఁగా నొనరించు సత్కృపా
స్ఫూర్తి మహామహుండు కృతపుణ్యుఁడు నీ కుపదేశకుం డగున్. 88

క. కలుషంబు లడఁప గోర్కులు, ఫలియింపఁగఁ జెలియ యబ్ధబాలకుఁ డస్మ
త్కులగురు వరనిభుఁ డెంచినఁ జెలియఁగ బంచాక్షరోపదేశ మొసంగున్. 89

గీ. అనుచు విన్నవించి యావిభావరియందు, దంపతులు మహామోదంబు మీఱ
జనిరి గర్గమునిసదనంబుఁ జేరంగ, నితరజనము లెవ్వ రెఱుఁగకుండ. 90

క. భర్గసమానుని జితష,డ్వర్గుని సంభావితాపవర్గుని సత్సం
సర్గుని నిర్గళితాఘుని, గర్గమహామునివరేణ్యుఁ గాంచిరి వారల్. 91

క. కని భయభక్తులు దోఁపఁగఁ, దనపదముల కెఱఁగియున్న దంపతులఁ గనుం
గొని యాసంయమివర్యుఁడు, ఘనభాషల నిట్టు లనియెఁ గారుణ్యమునన్. 92

క. ఈ రేయి భవచ్ఛయ్యా,గారంబు బరిత్యజించి కౌతుక మొదవ
న్మీ రిచ్చటి కరుదెంచిన, కారణ మదియేమొ తెలుపఁగాఁ దగు మాకున్. 93

వ. అని యడిగిన నమ్మునీంద్రునితోఁ గళావతి యిట్లనియె మహాత్మా యిమ్మహీపాలుండు ప్రాకృతపురుషుండును సదాచారవర్జితుండు నయియుండుఁ గావున మీర లిప్పుడీనృపాలునకుం గటాక్షించి భోగమోక్షప్రదంబును నిహపరసాధకంబును బరమపవిత్రంబును మంత్రరాజంబు నయిన శైవపంచాక్షరం బుపదేశింపవలయు నట్లయిన నితండు కృతార్థుం డగు నాగామిసంచితప్రారబ్ధంబు లయిన దుష్కర్మంబులం దొలంగి సకలశుభంబులం బ్రాపించునట్లుగాఁ బ్రసాదింపవలయు నని విన్నవించిన నమ్మౌనినిమ్మృదుమధురభాషణంబుల కలరుచు నట్లసేయుదు నని సమ్మతించిన.

సీ. ఆరాజమిథునంబు నమ్మౌనియుఁ దోడరా యమునానదీసమీపమున కేఁగి
వనజాక్షిఁ దత్తీరమున నుండ నియమించి భూపాలు సంకల్పపూర్వకముగ
నఘమర్షణస్నాన మాచరింపఁగఁ జేసి లలితవిభూతి ఫాలమున నలఁది
సిద్ధాసనస్థుఁగాఁ జేయుచు నిజపాదతలమున నతనిహస్తముల నునిచి
తే. మౌనివర్యుండు విధ్యుక్తమార్గమునను, హస్తమస్తకసంయోగ మాచరించి
శైవపంచాక్షరోపదేశం బొనర్చె, గరుణ వెలయంగ దాశార్హధరణిపతికి. 95

క. అంతట సజ్జనపతి యే, కాంతమతిం దేవదేవు గజచర్మధరుం
గంతుద్వేషిని మదిలోఁ, జింతింపుచు నిష్టజపము సేయుచు నుండెన్. 96

వ. తదనంతరంబ. 97

శా. శ్రీకంఠుం గిరిజాసమేతు మదిలోఁ జింతింపుచు న్నిష్ఠతో
భూకాంతుండు జపింపఁగాఁ దనుసముద్భూతంబులై వాయసా

సికంబుల్ శతకోటిసంఖ్య వెడలె న్నిర్దగ్ధపక్షంబు లై
కాకారావముసేయుచుం బడిరి యక్కాళిందిమధ్యంబునన్. 98

గీ. ఈమహాశ్చర్య మంతయు నేర్పడంగ, జూచి యాదవవీరుండు చోద్యమంది
తమకులాచార్యునకు వందనములు సేసి, విస్మయంబుగ నివార్త విన్నవించె. 99

క. నావిని మునివరుఁ డిట్లను, భూవల్లభుఁ జూచి నీదు పూర్వభవకృతం
బై వెలయఁ గలుషసముదయ, మీవాయసతతి యగుచు నిట్టుల వెడలెన్. 100

క. పంచాక్షరమంత్రంబు జపించిన మాత్రమునఁ బాపబృందము లణఁగున్
నించుక యనలము సోఁక నుదంచితమగుతూలరాశి దగ్ధము కాదే. 101

వ. అట్లు కావున సదాశివానుగ్రహంబున నిమ్మహామంత్రరాజంబు ప్రాప్తం బయ్యె
దానంజేసి నీవు ధర్మశీలుండవైతివి గావున నీవింక భవద్దేవీసహితంబుగా సమ్మదంబున
సుఖంబుండుదువు భవద్వంశంబున భగవంతుం డైన శ్రీవిష్ణుండు కృష్ణాభిధానంబున
నవతరించు మీకులంబు పావనం బగు నని చెప్పి యారాజదంపతుల నాశీర్వదించి
వారలం దోడ్కొని క్రమ్మఱ నిజనివాసంబునకు వచ్చిన యమ్మహామునీంద్రుచరణం
బులకుఁ బ్రణామంబుగావించి యవ్వధూవరు లమ్మహాత్ముని యనుజ్ఞ వడసి. 102

మత్తకోకిల. రాజదంపతు లీవిధంబున రాజసంబుజనింపఁ గా
రాజధానికివచ్చి క్రమ్మఱ రాజరాజనికాంత వి
భ్రాజితం బగునాత్మసౌధము రాజహంససముల్లస
త్తేజము ల్వెలయంగ జొచ్చిరి ధీరచిత్తము లొప్పఁగాన్. 103

శా. ఆకేళీగృహమందు బుష్పమయపర్యంకప్రదేశంబునన్
రాకాచంద్రముఖిన్ సరోజనయనన్ రంభాంగనారూపలుం
టాకన్ జందనచంద్రశీతలను వేడ్కన్ గౌఁగిటన్ జేర్చి యా
భూకాంతుండుఁ గళావతిన్ గుణవతిన్ బూర్ణప్రభావోన్నతిన్. 104

వ. తదనంతరంబున. 105

చ. లలితకశాభిమర్శనములన్ గిలిగింతలఁ గౌఁగిలింతలం
గిలకిలనవ్వుచున్ నిడుద కీల్జడవ్రేటుల గుబ్బపోటులన్
బలుమొనగోటులన్ జతురబంధములన్ వదనాదిచుంబనం
బులఁ బరితృప్తులై రపుడు పుష్పశరాసనకేళినిర్వృతిన్. 106

వ. ఇవ్విధంబున నాదంపతులు పరస్పరప్రేమానురాగంబుల సురతసౌఖ్యంబు లనుభ
వించుచుఁ బరిపూర్ణమనోరథులై యుండుసమయంబున. 107

చ. తెలతెల నయ్యెఁ దూర్పు వలుదిక్కుల సంతమసంబు విచ్చెఁ దెం
గలువలు మోడ్చె దమ్ములు వికాసతఁ జెందెఁ బదాయుధధ్వను

ల్నలువుగ దిక్కుటిల్లె గగనంబునఁ జుక్కలుమాసె శీతలా
నిలములు వీచె జక్కవలు నెమ్మది నుండె నహర్ముఖంబునన్. 108

గీ. సకలదేవర్షి సంఘప్రశస్యమాన, దివ్యతేజంబు వెలుఁగ మందేహదనుజ
సముదితాటోపవ్యాప్తదర్పన మనంగ, నుదయశైలంబుపైఁ దోఁచె నుష్ణకరుఁడు.

వ. అయ్యవసరంబున. 110

చ. శివపదపద్మచింతనముఁ జేయుచు మాగధవందిపాఠక
స్తవములఁ దూర్యఘోషముల సామజబృంహిత వాజిహేషికా
రవముల మేలుకాంచిరి దరస్మితవక్త్రిమ లొప్ప మేదిని
ధవుఁడుఁ దదీయపత్నియును దత్పరివారము నుల్లసిల్లఁగన్. 111

సీ. నిద్దుర మేల్కాంచి నిర్మలచిత్తుఁ డై మహనీయవిధ్యుక్తమార్గమునను
స్నానసంధ్యాద్యనుష్ఠానజపంబులుఁ గమలబాంధవనమస్కారములును
బంచాక్షరీమంత్రపఠనంబు లాదిగాఁ గలిగినసత్కర్మముల నొనర్చి
భూసురాతిథిదేవపూజలు గావించి మృష్టాన్నపానసంతృప్తుఁ డగుచు

తే. మహితవర్ణాశ్రమాచారమార్గములను, దప్పకుండఁగ ధారుణీతలమునందు
బ్రజలఁ బాలింపుచును నిజరాజ్య మేలె, ధర్మచరితుండు దాశార్హ ధరణివిభుఁడు.

క. బ్రహ్మవిచారము దేఁ, బ్రాహ్మణభక్తియును గల్గి పార్థివుఁ డుర్విన్
బ్రహ్మోత్తరముగ నేలెను, బ్రహ్మాపత్యాదిమునులు ప్రస్తుతి సేయన్. 113

చ. ప్రతిదివసంబు శంకరజపవ్రతమంత్రపరాయణత్వ స
మ్మతియును గల్గి భర్తయెడ మజ్జనభోజనపానతల్ప స
త్కృతుల ముదం బొనర్చుచును దివ్యనిమాటల నాదరింపుచున్
జతురత నా కళావతియు సమ్మద మొప్ప మెలంగ వర్తిలన్. 114

గీ. తాను గురుసేవఁ జేసి కృతార్థయయ్యెఁ, దనమనోవల్లభుని బుణ్యాత్ముఁ జేసె
నుభయవంశంబులను దాన యుద్ధరించె, నా కళావతిసాటి యెందైన గలదె. 115

శా. శ్రీమంతంబు శివస్వరూపమును దూరీభూతతాపత్రయం
బామోదప్రద మార్యసమ్మతము తత్త్వార్థప్రదీపంబు శ్రీ
రామాగస్త్యమహర్షి లోకభజనార్హం బైనపంచాక్షరీ
శ్రీమంత్రంబు నమశ్శివాయ యనుచున్ జింతింపుఁ డశ్రాంతమున్. 116

క. ఈకథ యాకర్ణించినఁ, బ్రాకటముగ భక్తితోడ బఠియించిన సు
శ్లోకులగు మానవులకును, శ్రీకంఠుఁ డొసంగు నెపుడు సిరులు శుభంబుల్. 117

వ. అని యిట్లు సూతుండు శౌనకాదిమహామునులకు శైవపంచాక్షరీమహాత్మ్య

తెలింగించిన విని సంతుష్టాంతరంగు లై వెండియు శివకథాశ్రవణకుతూహలతత్ప
రులై శివమహాత్త్వంబు తెలింగింపుఁ డని యడిగిన. 119

మత్తకోకిల. చంద్రశేఖర సత్కృపాకరచంద్రికాధవళాంగ ని
స్తంద్రవైభవ మానిరంజన దక్షయాగవిభంగ నా
గేంద్రభూషణ భక్తపోషణ కేశవప్రియ హేమశై
లేంద్రకార్ముక దేవదేవ మహేశ్వరా భవశంకరా. 120

క. అంబాపురాధినాథస, దంబరచరవినుతపాదహరిణాంకధరా
స్తంబేరమదనుజాంతక, సాంబసదాశివగిరీశ సకలాధీశా. 121

మాలిని. రవిశశిశిఖినేత్రా రాజరాజైకమిత్రా
భువనభరణసూత్రా పుణ్యభాస్వచ్చరిత్రా
భవహరపురజైత్రా ప్రస్ఫురచ్ఛుభ్రగాత్రా
శివపరమపవిత్రా శ్రీభవానీకళత్రా. 122

గద్య. ఇది శ్రీమద్రామభద్రకరుణాకటాక్షవీక్షణసమాలబ్ధగీర్వాణాంధ్రభాషాకవిత్వ
కళాధురంధరబడగలనాటికన్నడవంశపయఃపారావారరాకాసుధాకర ఆశ్వలాయ
నసూత్ర భారద్వాజసగోత్ర శ్రీధరమల్లె అయ్యనార్యతనయ సూరిజనవిధేయ వేం
కటరామనామధేయప్రణీతం బయిన బ్రహ్మోత్తరఖండంబను మహాపురాణంబునం
దిష్టదేవతాప్రార్థనంబును వంశానుచరితంబును సూతమునీంద్రసంవాదంబును గాశి
కానగరవర్ణనంబును దూర్వాసాగమనంబును గళావతీవివాహంబును దాశార్హభూపా
లునకు గర్గమహామునీంద్రుండు పంచాక్షరీమంత్రం బుపదేశించుటయు బంచాక్షర
ప్రభావంబును ననుకథలు గల ప్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము.

---



పార్వతీమనోహర
శాపాయుధహృదయకమలషట్పదభూభృ
చ్చాపమహేశ్వరలసదం
బాపురవరపార్థివేశ ప్రమథగణేశా. 1

వ. దేవా యవధరింపు మశేషపురాణకథాకథనదక్షుం డైనసూతుం డమ్మహామునుల నవలోకించి వెండియు నిట్లనిరు. 2

చ. మునివరులార మీ రిపుడు ముక్తినిదానము దివ్యభోగసా
ధనము జయప్రదంబు దురితప్రకరాపహరంబు పుణ్యవ
ర్ధనము విపద్విమోచనము రమ్యతరంబును నైనకాలలో
చనుని మహాత్వ మెన్నెదను సంతస మందుచు నాలకింపుడీ. 3

శా. ఆయుర్వర్ధన మై రుజాపహర మై యారోగ్యసంధాయి యై
శ్రేయస్సాధక మై తపఃఫలద మై క్షేమంకరం బై సదా
ప్రాయశ్చిత్తము లేనిపాపముల బాపంజాలు పుణ్యైకగా
థాయుక్తం బగుతన్మహత్త్వము ప్రమోదం బొప్పఁగాఁ జెప్పెదన్. 4

ఉ. భాసురకాంతిదాంతి భయభక్తులతో నెవరైన మాఘమా
సాసితపక్షసమ్మిత మహాశివరాత్రి చతుర్దశీల స
ద్వాసరవేళలందు నుపవాసము జాగరణం బొనర్చినన్
మోసములేక వారలు ప్రమోదత గాంతురు శంభులోకమున్. 5

గీ. కేవలముగ మాఘకృష్ణచతుర్దశి, శివున కాగమాభిషేకములును
బిల్వపూజనములు ప్రియమున నొనరించి, జాగరూకవృత్తి సలుపవలయు. 6

క. శమలభవాదిసుపర్వులు, శమదమసంపన్ను లైనసంయమివరులున్
విమలాభిషేకపూజా,క్రమముల శివరాత్రివ్రతము గడుపుదు రెలమిన్. 7

వ. ఈయర్థంబునకు సౌఖ్యపుణ్యం బయినయితిహాసంబుగలదు దానంజేసి మీమనంబు లకు నిశ్చలజ్ఞానం బుదయించు నదియును బ్రకృష్టకలుషభంగంబును బ్రహ్మాప్తి

సుజనాంతరంగంబున నై యుండు దానిం జెప్పెద నాకర్ణింపు మని సూతుం
డమ్మునీంద్రుల కిట్లని చెప్పందొడంగె. 8

## మిత్రసహోపాఖ్యానము.

శా. శ్రీకల్యాణపరంపరాలయము రాజీవాప్తవంశోద్భవా
నేకక్షత్రియపాలితంబు నృపభూయిష్ఠంబు విద్విడ్వరా
నీకాభేద్యము విశ్వకర్మకృతమాసేంద్రప్రజాపూర్ణమై
సాకేతం బనురాజధాని వెలయున్ సర్వంసహామండలిన్. 9

క. ఆపురమున కధిపతియై, దీపించు గకుత్స్థవంశతిలకుఁడు విగళత్పా
పుఁడు మిత్రసహుం డను,భూపశ్రేష్ఠుఁడు మహేంద్రభోగము వెలయన్. 10

శా. వాపీకూపతటాకసేతువనదేవాగారనిర్మాణదీ
క్షాపారీణుఁ డనేకయాగకరణశ్లాఘ్యుండు వీరాహితా
టోపచ్ఛేదకుఁ డానృపాలుఁడు వనాటు ల్గొల్వ నానామృగ
వ్యాపాదస్పృహ నేఁగెఁ గాననకు దివ్యాస్త్రోజ్జ్వలత్పాణియై. 11

ఉత్సాహ. భూరిశౌర్యుఁ డానృపాలపుంగవుండు ఘోరకాం
తారవీథులందుఁ గల్గు దారుణంబు లైన కం
ఠీరవాచ్ఛభల్లవృకకిటి ద్విపాదిసంచర
త్క్రూరదుష్టసత్వములను గూల్చె సాయకంబులన్. 12

వ. ఇట్లు వనంబులోనం గల్గు దుష్టమృగంబుల సమయించుచున్న సమయంబున నొక్క
రక్కసుం గని వాని నొక్కనిశితశరంబున విగతప్రాణునిం గావించిన దత్సహో
దరుం డగుదానవుండు కైతవంబున సూపకారవేషంబు దాల్చి వచ్చి యారాజుం
గావించి బద్ధాంజలిపుటుం డై రాజేంద్రా యేను నానావిధవిచిత్రపాకక్రియానిపు
ణుండ నిన్ను సేవింపఁగోరి యిటకుం జనుదెంచితి నని విన్నవించిన భూవిభుం డది
యథార్థంబుగాఁ దలంచి వానిం దోడ్కొనివచ్చి నిజమందిరంబునందుఁ బాకాధ్య
క్షునింగా నియమించి యుండె నంత. 13

సీ. ఒకనాఁడు ధరణీశుఁ డకళంకమతితోడ మృగమాంసమునను పైతృకముఁ జేయ
సంకల్ప మొనరించి శ్రద్ధాసమేతుఁడై నిజపురోహితు నిమంత్రితునిఁ జేసి
భోజనంబిడువేళ బొలసుదిండికుబుద్ధి నవ్వసిష్ఠునకు నరామిషంబు
వడ్డించిన నెఱింగి వసుధేశుపై నల్గి తన కయోగ్యం బైనమనుజపిశిత

ఆ. యిడిన దుర్మతి వీవు దైత్యుఁడవు గమ్ము, పొమ్మని శపింప నారాజపుంగవుండు
నిరపరాధుండు గావున గురునకలిగి, యపుడు ప్రతిశాప మిచ్చెద నని తలంచి. 14

క. కోపంబున జలములుగొని, శాపం బీదలంచి యున్న సమయంబున నా
భూపాలుని వారించెను, శాపింపక యుండ వలెనిసతి శాంతమతిన్. 15

వ. అప్పు డమ్మిత్రసహుండు నిజభార్యావచనాలుండు గావున దద్వాక్యంబునకు సమ్మతించి కులగురుం డగువసిష్ఠమహామునీంద్రునకుఁ బ్రతిశాపం బిచ్చుట మాని తన ధర్మపత్నితో ని ట్లనియె. 16

క. ఈపగిది నేధరించిన, శాపోదక మిప్పు డెచటఁ జల్లుదు వనినన్
బాపదములఁ నిడుకొమ్మని, యాపడఁతి పచింప నాత డట్ల యొనర్చెన్. 17

గీ. అటుల గావింప నమ్మానవాధిపతికిఁ, దజ్జలస్పర్శనమునఁ బాదములు గమలెఁ
గాన నదియాదిగాఁగ లోకంబునందుఁ, బరఁగె నాతఁడు గల్మాషపాదుఁ డనఁగ. 18

ఉ. అంతట నవ్వసిష్ఠుఁడు మహామతి నాత్మసమాధిఁ జూచి గో
రంతయు రాజునందు నపరాధము లేమి యెఱింగి యమ్మహీ
కాంతుఁడు రాక్షసత్వ మెసఁగ న్భువిలోపల ద్వాదశాబ్దప
ర్యంతము సంచరించి మనుజాధిపుఁ డౌ నని పల్కెఁ గ్రమ్మఱన్. 19

వ. అంత. 20

సీ. గురుశాపమునఁ జేసి ఘోరరూపముఁ దాల్చి క్రూరుఁడై నిజరాజ్యదూరుఁ డగుచు
గలుషభావముఁ జెంది కల్మాషపాదుండు గహనంబుఁ జేరి నిష్కారుణుఁ డగుచు
మృగపక్షిపశువులాదిగ జంతువులఁబట్టి సమయించి వానిమాంసమును దినుచుఁ
గాలంబుఁ గడపుచుఁ గఠినత్వముననుండి యొకనాఁడు క్షుత్తుచే నోర్వలేక
తే. యశన మొక్కింత లేమియునమరకున్న, నొక్కచో విప్రమిథునంబు నొప్పఁగాంచి
యడ్డముగ వచ్చి తత్పతియంటుచుండఁ, గినుక నాద్విజుబట్టి భక్షించె నపుడు. 21

క. తదనంతరమునఁ దత్సతి, మదయంతీరమణు దనుజ మానవనాథున్
మదమత్తుని గనుగొని తా, నదయత శోకాభిత ప్తయై యి ట్లనియెన్. 22

పంచచామరము. తప స్సమాధిఁజెందియున్న తాపసేంద్రు మత్పతిం
గృపావిహీనబుద్ధిఁ బట్టి మ్రింగితీవు గావునన్
నృపాధమా భవత్పతిం బరిగ్రహించు నంతటన్
వ్యపేతజీవితుండవాదు వంచు నిచ్చె శాపమున్. 23

వ. ఇట్లు కల్మాషపాదునకు భూసురాంగన శాపం బిచ్చి పతికళ్యంబులతోడన హుతాశనదగ్ధయై దివంబునకుఁ జనియె నంత నాభూకాంతుండు ద్వాదశాబ్దంబులు నిండిన రాక్షసభావంబు బరిత్యజించి శ్రమ్మర మానుషత్వంబువహించి నిజపురంబునకు వచ్చి గురుజనానుజ్ఞాతుండై రాజ్యంబుసేయుచుండె నాసమయంబున. 24

క. సురతేచ్ఛ నవ్విభుఁడు నిజ,తరుణిఁ రాఁబనుప నది యందగ్రం బగు భూ
సురవనితాశాపస్థితి, నెఱిఁగి నివారింప నుండె నింతులగోష్ఠిన్. 25

ఆ. అట్లు లగుటఁ జేసి యారాజాననుమతి, శిష్టుఁ డైన యవ్వసిష్ఠమౌని
యతనిధర్మపత్నియం దశ్మకుండను,సుతుని గలుగఁజేసె శుభములలర. 26

శా. అఖిలద్విజభామినీప్రకట శాపాప్తి న్నతి వ్యాపి తా
"నౌ భోగో రమణీం వినా" యనెడువ ల్కాహించి నిస్సంగుఁడై
యాభూమీశుఁ డనన్యభుక్తమగు రాజ్యంబు న్విసర్జించి పా
ర్యాభ్యాసత్వము చెంది భూమిఁదిరుగన్ యాదృచ్ఛకుండై చనెన్. 27

మ. సకలోర్వీతలనాయకుండు ధరణీసంచారముం జేయుచోఁ
బ్రకటాఖిలకరాళదంష్ట్రిలును దుర్గంధాంగదుష్కేశముల్
వికటభ్రూకుటిఫాలముం దనరఁగా వెన్వెంట నేతెంచు కా
శికదుస్తారక నొక్క భీకరపిశాచిం గాంచె మార్గంబునన్. 28

గీ. అట్టి దుష్పిశాచ మారాజుచేసిన, బ్రహ్మహత్య యనెడు పాతకంబు
వానివెంట నంటె వసుధ నెవ్వరికైనఁ, బూర్వజన్మకృతము పొందకున్నె. 20

చ. కుటిలపిశాచి గన్పడిన గుండెలు జల్లుమనంగ భూవరుం
డటునిటుచూచి ఘోరవనాంతరసీమ లతిక్రమించి యు
త్కటతరభీతి నేఁగుచును దైవవశంబునఁ గాంచె నొక్కచోఁ
జటులతపోధురంధరుని సంయమివంద్యు మహాత్ముఁ గౌతమున్. 30

వ. ఇట్లు కని సవినయంబుగా దండప్రణామంబు లాచరించి ముకుళితకరకమలుం డై
యున్న యన్నరపతితో నగ్గౌతమమహామునీంద్రుం డిట్లనియె. 31

మ. నరనాథోత్తమ నీవొకండ విటు కాంతారప్రదేశంబులం
దరుగం గారణ మేమి రాజ్యభరణత్యాగంబుఁ గావించి నీ
పురమున్ రాష్ట్రము భద్రమా నిజవధూపుత్త్రాళికిన్ క్షేమమా
పరిణామంబె భవత్ప్రధానతతికిన్ బంధుప్రియశ్రేణికిన్. 32

క. మానవనాయక మృదుసుస్నానవచః ప్రియత నిఖిల మానవపతి యా
మానవుఁడవు సామాన్యుఁడు, మానవుఁడవె తలఁప నీవు మహితవిచారా. 33

చ. అనిన నరేంద్రుఁ డిట్లనియె నాదిమునీంద్ర భవత్కృపారసం
బున సతతంబు రాజ్యబలపుత్త్రకళత్రసుహృజ్జనాళి క
త్యనుపమసౌఖ్యము ల్గలుగు నైనను మత్కృతకల్మషంబు దాఁ
గనలి పిశాచరూపమునఁ గన్పడుచున్నది భీషణంబుగన్. 34

క. గోమేధము లొనరించితి, గ్రామంబులతో రథాశ్వకరివరముక్తా
దామాదిక దానంబులు, భూమిసురోత్తముల కొసఁగి పుణ్యుఁడ నైతిన్. 35

ఉ. చేసితి దానధర్మములు చేసితిఁ దీర్థజలావగాహము
ల్చేసితి సువ్రతంబులను జేసితి భూరితరాశ్వమేధముల్
చేసితి దేవపూజలను జేసితి భూరితరాశ్వమేధముల్
జేసిన ఘోరపాపము నశింపకయున్నది యేమిచెప్పుదున్. 36

వ. అదియునుం గాక యఘాపహారంబు లైన ప్రాయశ్చిత్తంబు లనేకంబు లొనరిం
చితి నైన నిమ్మహాదుష్కృతంబునకు నిష్కృతి గలుగ నేరకున్న యది మహాత్మా కారు
ణ్యసముద్రుండ వగు నీప్రసాదంబునం జేసి కృతార్థుండ నగుదు నీ బ్రహ్మహత్యా
పిశాచంబు పరులకు నగోచరం బై మదీయదృష్టిపథంబునం బడి భర్జింపుచు నె
ను వెంట నంటియున్న యది విపత్సముద్రంబున మునింగియున్న నన్నుం గడతేర్ప
నావయుం బోలె భవత్సందర్శనంబు సిద్ధించె నిప్పిశాచంబు తొలంగునట్లుగా నను
గ్రహింపవలయు నని ప్రార్థించిన యారాజుం గటాక్షవీక్షణంబుల నిరీక్షించి
యగ్గౌతమమహామునీంద్రుం డిట్లనియె. 37

క. ఓకాకుత్స్థకులేశ్వర, సాకేతపురాధినాథ చయ్యన నీ వీ
శోకంబు మాని యిప్పుడు, గోకర్ణస్థలికిఁ జనుము కుశలము గలుగున్. 38

వ. అది యెట్టిదంటేని. 39

## గోకర్ణస్థలమహాత్వము.

ఉ. శ్రీకంఠప్రియమందిరంబు సుకృతక్షేత్రంబు నానాసుప
ర్వాకీర్ణంబు శుభప్రదంబు బహుపాపారణ్యదావాగ్నియా
గోకర్ణస్థలమందు జేరము భవద్ఘోరాఘము ల్వాయు నెం
తే కైవల్య మొగిం గరామలక మై దీపించు ధాత్రీశ్వరా. 40

క. గోకర్ణరాజహారుఁడున్, గోకర్ణశయానసఖుఁడు గోపతిసుతుఁడున్
గోకర్ణస్థలవాసుఁడు, గోకర్ణాశనతురంగగురుఁ డొసఁగు సిరుల్. 41

శా. స్వర్ణస్తేయము బ్రహ్మఘాతము సురాపానంబు గోహత్యయున్
వర్ణాచారవిసర్జనంబు గురువధ్వాసక్తి పైశున్యముం
ఋణాపాకృతియుం గృతఘ్నతయు నా బొల్పారు పాపాళి గో
కర్ణక్షేత్రముఁ జేరినంతనె విదగ్ధం బై చను న్భూవరా. 42

ఉ. రావణకుంభకర్ణముఖరాక్షసకోటి భగీరథాది రా
జావళియున్ మఱిం గలుగు యక్ష పతంగ మహోరగాదులుం

దేవతలు స్మసిళ్వరులు దిక్పతులుం దపమాచరించి యు
ద్దేవుని సన్నిధిస్థలంబ ధీరత నిల్పి రనేకలింగములన్. 43

క. విలసితమగుగోకర్ణ, స్థలమాహాత్మ్యంబు లెన్నఁదర మెరికిఁ ద
చ్ఛిలలెల్లలింగములు త,జ్జలములుతీర్థములునుతింపఁగ. 44

క. అతికాత్ముఁడు శివుఁడు మహాబలుఁ డనాక్రాంత సప్తపాతాళుం డై
వెలసిన నాగోకర్ణ, స్థలమున బ్రహ్మాండభాండతనువు వెలుంగన్. 45

మ. అవనీపీఠము వారివాహకలశం బాకాశలింగంబు కై
రవబంధుప్రసవం బినేందుశిఖినేత్రంబుల్ త్రయీవక్త్రి మ
ర్ణవతుండంబు కుభృద్భుజాయుగ మజాండస్వచ్ఛదేహం బధో
భువనాంఘ్రుల్దనరన్ మహాబలుఁడు దాఁ బొల్పొందు విశ్వాకృతిన్. 46

వ. మఱియు నమ్మహాబలదేవుమందిరంబునకు బ్రహ్మేంద్రోపేంద్రులును వసురుద్రాదిత్య
విశ్వేదేవమరుద్గణంబులును జంద్రసూర్యాదిగ్రహంబులును విమానారూఢులయి
పూర్వద్వారంబున వసియించియుందురు మృత్యుచిత్రగుప్తపావకశమనపితృప్రము
ఖులు దక్షిణద్వారంబున సేవింపుచుందురు వరుణుండు గంగాదిమహానదులుం
దానును బశ్చిమద్వారంబున భజనంబు సేయుచుందురు భద్రకర్ణియును సప్తమాతృ
కలును జండికాదిదేవతలును నుత్తరద్వారంబునఁ గొలిచియుందురు విశ్వావసుచిత్ర
రథాదిగంధర్వులు గానంబు సేయుచుందురు రంభోర్వశీమేనకాతిలోత్తమాద్యప్స
రసలు నమ్మహాదేవునిసాన్నిధ్యంబున నర్తనంబులు సలుపుచుందురు వసిష్ఠకశ్యప
కణ్వవిశ్వామిత్రదక్షాత్రిభరద్వాజజైమినిజాబాలిమరీచ్యంగీరసనారదసనకసనంద
నాదిమహామునీంద్రులు తదుపరిభాగంబున ధ్యానంబు గావింపుచుందురు యతిబ్రహ్మ
చారిస్నాతకవ్రతిజటావల్కలాంబరధారులును యోగులును ద్వగస్థిమాత్రశరీరు
లైనతాపసులును నాచంద్రశేఖరు నారాధింపుచుందురు దేవగంధర్వకిన్నరకింపు
రుషచారణసిద్ధవిద్యాధరగరుడోరగభూతభేతాళయక్షరాక్షసులును జంద్రసూర్య
విద్యుత్ప్రతీకాశంబు లైనవిమానంబు లెక్కి యావృషభధ్వజుముందట నాడుచుఁ
పాడుచు జయజయశబ్దంబులతో స్తోత్రంబు లాచరింపుచు యభీష్టభోగంబు లనుభ
వింపుచు నిత్యానందంబున సుఖంబుందు రని చెప్పి యగ్గౌతమమహామునీంద్రుండు
వెండియు నారాజున కిట్లనియె. 47

ఉ. అంబుజగర్భుఁ గూర్చి తపమందినవేళ మహాబలాఖ్యలిం
గం బతిభక్తినిల్పి దశకంఠుఁడు పూజయొనర్చె నట్ల హే
రంబకుమారకేశవపురందరమన్మథభద్రకాళికా
జ్జాంబుజసంభవాదులు నిజాహ్వయలింగము లుంచి రచ్చటన్. 48

క. ఫణిపద్మేలాపుత్రోక, మణినాగానంతశింశుమారాది మహా
ఫణిరాజులు ఫణివైరియు, ఫణిభూషణు నిలిపి రచట బహులింగములన్. 49

క. తొల్లి యగస్త్యమహాముని, సల్లలితం బగునతపము సలుపుచు గౌరీ
వల్లభుని భక్తిపలనను, మల్లోకంబులు నుతింప ముదమందె నృపా. 50

క. కాకుత్స్థ యేమిచెప్పుదు, గోకర్ణమునందుఁ గోటికోటులు లింగా
నేకంబులు గల వన్నియు, శ్రీకంఠమయంబు అగుట సిద్ధము సుమ్మీ. 51

క. అలవేల్పులలోన మహాబలదేవుఁడె తలఁప సార్వభౌముఁడు సర్వ
స్థలములలో గోకర్ణ, స్థలమే ముఖ్యంబు మూఁడుజగములయందున్. 52

క. ఏల గ్రీవుఁడు శంభుఁడు, హాలాహలభక్షణుండు హిమలుఁడు ధర
న్నాలుగు యుగములయందును, నాలుగు వర్ణముల వెలయు వరసుత చరితా. 53

వ. అది యెట్లనిన కృతయుగంబున శ్వేతవర్ణంబును త్రేతాయుగంబున రక్తవర్ణంబును ద్వాపరంబున పీతవర్ణంబును గలియుగంబున కృష్ణవర్ణంబును గలిగియుండు.

గీ. మాఘకృష్ణచతుర్దశి మహితబిల్వ
పత్రశివలింగములు దుర్లభములు నాల్గు
నొక్కచోటను సమకూడి యుండెనేని
మనుజులకు ముక్తి గరతలామలకమరయ. 55

గీ. భానుశశిభానుభౌమసౌమ్యను రేజ్యవారయుక్తదర్శవాసరములఁ
బల్పిమాఘ్నిదోగి పరమేశుభజియించు, నరులదుష్కృతములు బోరయ వెందు. 56

క. అతిశయభక్తిశ్రద్ధా, యుతుశై యెవ్వఁడైన నచట నొనరించు జప
వ్రత దాన తర్పణ క్రియ, యతిసూక్ష్మం బైన మేలు నై ఫలియించున్. 57

ఉ. సంగరభీమ నీమదిని సంశయమందక యాశ్రయింపు స
త్సంగము భూమణీకృతభుజంగము దేహశశాంకశాభ్రిమా
తంగము భక్తపుష్కరపతంగము హలంకృతిమాత్రనిర్జితా
నంగము పాపభంగము మహాబలనామకదివ్యలింగమున్. 58

వ. అని చెప్పి మఱియు నమ్మునీంద్రుండు రాజున కిట్లనియె. 59

సీ. కోసలేశ్వర విను గోకర్ణమున నుండి యరుగుచెంచితి నిప్పు డతిముదమున
నాస్థలంబున నొక యాశ్చర్య మైనట్టి చరితంబుఁ గంటి నేక్వారక్వతంబు
తథ్యంబుగాఁగ నంతయు నీకుఁ జెప్పెద నాలకింపుము చిత్త మలరుచుండ
మాఘమాసమున నిర్మల కృష్ణపక్షచతుర్దశియందు సంతోష మొదవ
తే. నమ్మహాబలదేవోత్సవమును జూడ, సకలదేశంబులం దుండి జనులుగూడి
సద్విజక్షత్రియాదిక సర్వజనులు, చేర జనుదెంచి రచటికి శీఘ్రమతిని. 60

శా. సౌరాష్ట్రాంగకళింగవంగఖశపాంచాలాంధ్రకర్ణాటకా
శ్మీరద్రావిడచోళపాండ్యకురు కాశీదేశభూపాలకుల్
భేరీధంధణధంధణార్భటులు శోభిల్లంగ నచ్చోటికిం
జేర న్వచ్చిరి డోలికాద్విరదవాజిస్యందనారూఢు లై. 61

శా. శాండిల్యాత్రిమరీచిగౌతమవసిష్ఠవ్యాసకాత్యాయను
ల్మాండవ్యానిలకణ్వకుత్సశుకరామాగస్త్యదూర్వాసులుం
జండాంశుప్రతిమానతేజు లగువిశ్వామిత్రమైత్రేయమా
ర్కండేయాదులు నేఁడు జేరితిమి గోకర్ణంబు వీక్షింపఁగన్. 62

చ. యతులును బ్రహ్మచారులు గృహస్థవనస్థులు వీతభర్తృకా
సతులును వారకామినులు జారవధూటులు దూతికాజన
వ్రతతులు పంగులంధులును బౌద్ధులు సిద్ధులు రోగు లాదిగా
శతనియుతాయుతప్రయుతసంఖ్యలు గాఁ జనుదెంచి రొక్కటన్. 63

గీ. అంత మధ్యాహ్నసమయకృత్యములు దీర్చి
వేడ్క నొక్క తరుచ్ఛాయ విశ్రమించి
వైభవంబులు మెఱయ నీనచ్చువట్టి
ప్రజలఁ గనుఁగొంటి వీక్షణపర్వముగను. 64

క. ఆలోనవృద్ధమనుజుం, డాలియు నంధయును గటిప టచ్చరయుతయున్
లాలామూత్రపురీషకరాళాంగియు నైనయొకవరాకిం గంటిన్. 65

చ. క్రిమికులసంకులవ్రణయు ఖిన్నమనస్కయుఁ గుష్ఠరోగజ
శ్రమయును బూయశోణితరసప్రవిదూషితవిస్రగంధియు
క్షమయు బహుక్షుధార్తయు జగత్ప్రతిమానవయాచమానయుం
గుమతియు లోష్టపాణియును గుత్సితరూపియు నై చరించుచున్. 66

క. ఆకట మలమలమాడుచుఁ, దేకువచెడి చేతు లొగ్గి దీనత్వమునం
గాకముగతి వాపోవుచు, గోకర్ణక్షేత్రజనుల గుయ్యిడఁదొడఁగెన్. 67

సీ. బంధుమిత్రజ్ఞాతిపతివివర్జితురాల నను బ్రోవరయ్య రో మనుజులార
కూడునన్నము లేని కులహీనురాలను నను బ్రోవరయ్య రో మనుజులార
కట్టవస్త్రము లేని కష్టజీవనురాల నను బ్రోవరయ్య రో మనుజులార
దుర్గంధదూషిత దుష్టవిగ్రహురాల నను బ్రోవరయ్య రో మనుజులార
ఆ. భోగశూన్యురాల రోగపీడితురాల, నన్నుఁ బ్రోవరయ్య నాథులార
దిక్కుమాలినట్టి బిక్కుమానవురాల, గరుణచేయరయ్య సరములార. 68

చ. పురహరుపాదపద్మములఁ బూజ యొనర్చినదానఁ గా మహే
శ్వరుని దినంబులందు నుపవాసము సల్పినదానఁ గాను శం
కరుమహనీయలింగములఁ గన్నులఁ జూచినదానఁ గా నరో
నరవరులార నన్ను విసనాడక యన్నముఁ బెట్టి కావరే. 69

సీ. శ్రీపార్వతీనాథుఁ జింతింప నేరని దౌర్భాగ్యురాల నో ధన్యులార
పంచాక్షరీమంత్రపఠనం బొనర్పని పాపాత్మురాల నో భవ్యులార
చంద్రశేఖరకథాశ్రవణవర్జిత నైన దారిద్ర్యురాల నో ధీరులార
రజతాద్రినిలయుని భజనంబు సేయని భిక్షుకురాల నో దక్షులార
ఆ. కాసువీసములను కల నైననియ్యని
కష్టురాల నన్నుఁ గావరయ్య
మేలుచేయరయ్య మీకు మ్రొక్కెద నయ్య
ధర్మ మిదయ్యరయ్య ధనికులార. 70

గీ. అనుచుఁ దల్లడించు నంజలి యొనరించు, సకలదిక్కులందు సంచరించు
వేఁదదీనురాలు పేరాఁకటను జిక్కి, వేఁడఁ దగనివారి వేఁడుచుండు. 71

క. ఈవిధమున వర్తింపఁగ, నావేళ మహేశ్వరవ్రతారాధకు లై
యేవంకఁ దిరిగినను సం, భావింపక నన్ను మిడరు ప్రజ లెవ్వారల్. 72

గీ. అప్రదోషకాలమందు ధూర్తు డొకండు, భిక్ష మనుచు బెట్టె బిల్వదళము
అది పరిగ్రహించి యశనంబు గాకున్న, దాలమీఁద బడఁగ నేలవైచె. 73

గీ. అంత నాస మాలి యచ్చోట నుండక, యొనరఁ గాలిగుడికి నుత్తరమున
సారిదిఁ బవ్వళించి శోషించి శోషించి, చెడుగురండ విగతజీవియయ్యె. 74

ఉ. అంతట పార్వతీరమణునాజ్ఞ శిరంబునఁ దాల్చి నిర్మల
స్వాంతులు కాంతులు న్సకలసద్గుణవంతులు నుల్లస ద్యశో
వంతులు నైన నల్గురు శివప్రియకింకరు లాక్షణంబ ధీ
మంతులు వచ్చి రంచితవిమానముఁ గొంచు దిశల్ వెలుంగఁగన్. 75

వ. వారలు విభూతిరుద్రాక్షమాలికాధారులును మణిమండలభ్రాజితగండభాగులును త్రిశూలఖట్వాంగధారణులును దివ్యతేజోవిరాజమానులు నై చనుదెంచుచున్న సమయంబున. 76

క. బొంకంబుగ నే నచట ని, రంకుశగతి వచ్చువారి నమలాత్మకులన్
బంకజబాంధవతేజుల, శంకరకింకరుల గంటి జగతీనాథా. 77

క. కని భయభక్తులు వినయం, బును దోఁపఁగఁ వారిఁ జూచి ముప్పకధరు లై
చనుదెంచిన మీ రెవ్వరు, చనియెద రెచ్చటికి ననిన సమ్మతి దనరన్. 78

క. గగనమున నుండి శివు నెమ్మొగమునఁ జిరునవ్వు లొప్ప మోదముతోడన్
నగజారమణునికింకరు, లాగి ని ట్లనిపలికి రతిమృదూక్తులు వెలయన్. 79

ఉ. ఇంతకు మున్ను మీరు తగ నిచ్చట నుండఁగ నేఁగినట్టి యా
యంత్యజురాలిఁ దెమ్మనుచు నాజ్ఞ యిడెం బరమేశ్వరుండు సు
స్వాంతుఁడు భక్తరక్షకుఁడు సారకృపాబలరాశి గావునన్
సంతస మొప్ప దానిఁ గొని సన్నిధి కేఁగెద మయ్య శ్రేష్ఠులన్. 80

క. అని యీవిధమునఁ జెప్పిన, ఘనతరరుద్రాక్షమాలికాధారకులన్
మనసిజహరకింకరులం, గని వే ని ట్లంటి వెరపుగలిగినమదిలోన్. 81

క. క్రతుశాల కెక్కఁదగునే, కుతలంబున నీచమైన కుర్కురమునకుం
బతితకుచండాలాంగన, కతిదివ్యవిమాన మెక్క నర్హత గలదే. 82

చ. వ్రతములు చేసెనో సనుపవాసములు సల్పెనో శంభునామముల్
మతి జపియించి తీర్థముల మజ్జనమాడెనొ దానధర్మము
ల్గ్రితువు లొనర్చెనో యిపుడ కారణ మెట్లు విమాన మెక్క స
మ్మతముగ నర్హతయ్యెఁ గసుమాలపుమాలకు దుష్టశీలకున్. 83

మ. చలిపందిళ్ళొనరించెనో తెరువులన్ సత్త్రాన్నము ల్పెట్టెనో
కొలఁకు ల్ద్రివ్వెనొ శంకరాచ్యుతులకున్ గుళ్లెమి నిర్మించెనో
స్థలరాజంబుల కేఁగి షోడశమహాదానంబులన్ జేసెనో
భళిరా యిట్టివిమాన మెక్క నగునే పాపిష్ఠచండాలికిన్. 84

శా. నిత్యానిత్యవివేకము ల్గలిగెనో నిస్సారతం జెందెనో
సత్యోక్తు ల్పచరించెనో శివకథాసల్లాపము ల్సేసెనో
శ్రుత్యాచార్యుల విశ్వసించెనొ మహత్పుణ్యంబు సాధించెనో
యత్యంతాఘవిదూషితాంగికి విమానారోహణం బర్హమే. 85

క. ఈవార్త తెలియఁ బలుకం, గావలయు మహాత్ములార కారుణ్యమునన్
శ్రీవిశ్వేశ్వరు మహిమలు, భావింపఁగ జగములందుఁ బరమాద్భుతముల్. 86

వ. అని యడిగిన వారలు దద్వృత్తాంతంబంతయు నీకుం దెలియం జెప్పెదము విను
మని యాశివకింకరు లిట్లని చెప్పం దొడంగిరి. 87

సీ. గౌతమమునిచంద్ర కలదొక్క చరితంబు వినుపింతు మది నీవు వినుము తొల్లి
కలఁ డొక్కరుఁడు యజ్వాకులసంభవుం డైనబ్రాహ్మణుం డాగమసారవేది
యావిప్రున కపత్యమై పుట్టె నొకకన్య యది రూపవతి యన నతిశయిల్లు
నటు పూటపూటకు నవయువస్ఫురణచేఁ బెరుగుచునుండ న త్తరుణిఁ జూచి

ఆ. తగినవరున కిచ్చి తజ్జనకుండు వేదోక్తవిధి వివాహ మొనరఁజేసె
నంత గొన్నిదినము లరిగినపిమ్మట న్దైవనిహతిఁ జెందె దానిమగఁడు. 88

వ. అంత. 89

మత్తకోకిల. వాలుఁగన్నులు వల్దిచన్నులు వక్త్రమై నపిఱుందు నీ
లాలకంబులు కెంపుమోవియు నబ్జరాగకరాంఘ్రులుం
బాలచంద్రునిఁబోలు చక్కనిఫాలదేశముఁ గల్గి యా
బాలికామణి యొప్పె నప్పుడు భావజాస్త్రము కై వడిన్. 90

క. కామాస్త్రంబుల కోర్వక, కామిని నిర్లజ్జ యగుచు గతశేముషి యై
కాముకులఁ గూడి నిరతముఁ, గామక్రీడలఁ జరించెఁ గామాతుర యై. 91

శా. అవిశ్వస్త యనంగసంగరవినోదాంచద్భుజంగాలితో
గ్రీవాశ్లేషణచుంబనాదిసురతక్రీడావిశేషంబులం
దావర్తింపఁగఁ గాలకర్మగతి నంతర్వత్నియై యున్నచో
వావామాత్రఁ బరిత్యజించిరి తదీయజ్ఞాతిబంధుప్రియుల్. 92

క. అంతట నక్కులటయు దేశాంతరముల నుండి ధనికుఁ డగు నొకవృషలుం
డెంతయు నయ్యింతిం గని, భ్రాంతిం గొని చనియెఁ దనదుభవనంబునకున్. 93

ఆ. శూద్రనాథుఁ గూడి సురతభోగాసక్తి, నహరహంబు బంధనాదిగతుల
మద్యపానములను మాంసభక్షణములఁ, గాల మొక్కరీతిఁ గడపుచుండె. 94

క. తరుణి యొకరేయి మధుమద, పరవశ యై మేషమాంసభక్షణపరతం
గరవాలముఁ గొని చనియెను, గొఱియలు వత్సంబు లున్న గోష్ఠంబునకున్. 95

క. చని తామసమున నాదుర్వనితయు మేషం బటంచు వత్సము ఖండిం
చిన నది యాక్రోశింపఁగ, విని శివశివ యనుచు నుడివె విహ్వలమతి యై. 96

మ. కులటాగ్రేసరి యాగతిన్ మదమునం గోవత్సముం జంపి దో
హలభావం బెసఁగన్ దదర్ధతనుమాంసాహారముం జేసి చం
చలతం జిక్కనిభాగ మట్లునిచి హా శార్దూల మేతెంచి యి
క్కాలఁదిన్ వత్సముఁ జంపెఁ జంపె నని యాక్రోశించి చాటెన్ బురిన్. 97

క. దాని విని పౌరులందఱు, నానిశి యేతెంచి వత్స మారసి తథ్యం
బౌ నని తలఁచుచు విస్మిత, మానసులై మరలఁ జనిరి మందిరములకున్. 98

వ. ఇవ్విధంబున నాకాంత గొంతకాలం బాశూద్రనాయకుంగూడి యథేచ్ఛావిహారం
బుల వర్తించి కాలవశంబున గృతాంతపురంబునకుం జనిన సమవర్తియు దాని
దుష్కృతంబులు చిత్రగుప్తువలన నెఱింగి దుర్గతిద్రోయించిన నదియును కాల

మూత్రాసిపత్రదారుయంత్రతప్తపాషాణ శూలారోహణవైతరణీకుంభీపాకమహా రౌరవాదిఘోరనరకంబు లనుభవించి దండధరుశాసనంబునఁ గ్రమ్మర మర్త్యలోకంబునందుఁ జండాలయోనింబుట్టి జాత్యంధయుఁ గుష్ఠరుజాక్రాంతయుఁ గ్రిమిసంకులవ్రణయును బంధువిహీనయు క్షుత్పిపాసాతురయు నుచ్ఛిష్టాన్నభోక్త్రియునై భిక్షాటనంబు సేయుచు సంచరింపుచుండె నని యాచండాలి పూర్వజన్మవృత్తాంతంబుఁ జెప్పిన విని యాశ్చర్యంబు నొంది యాశివశంకరులం జూచి రుని ట్లంటి. 99

క. ఏయేకర్మంబులచే, నీయింతికి సంభవించె నీదురవస్థల్
రేయనువున నిష్ఠాలకు, శ్రీయుత మగుశివపదంబుఁ జేరం గలిగెన్. 100

వ. అని యడిగిన నమ్మహాత్ము లి ట్లనిరి. 101

సీ. అన్నదానవిహీన లైనదోషంబున క్షుత్పిపాసార్త లై స్రుక్కుచుండె
కామాంధ లై కన్నుగాననికతమున జాత్యంధ లై ధాత్రి సంభవించె
గోవత్సమాంసనిషేవణంబునఁ జేసి దా నుద్భవించెఁ జండాలయోని
స్వైరిణి లై యథేచ్ఛావిహారము సల్పుఫలమున నయ్యె దౌర్భాగ్యురాలు
తే. విధవ లై జారవిద్యల వెలసెఁ గాన, గుష్ఠరోగాదిపీడలఁ గుందుచుండె
వృషలసంపర్కమునఁజేసి విషమవృత్తిఁ, దద్వ్రణక్రిమిబాధలఁ దగిలియుండె. 102

శా. హాలాపానము మాంసభక్షణము నత్యాసక్తిఁ గావింప హ్రా
చ్ఛ్వలాదిప్రరుజావ్యథ గ్గలిగి విక్షోభింపుచున్ ధాత్రి జం
డాలత్వంబు భజించె నువ్రతము లిష్టాపూర్తముల్ లేమి యా
నీలాంగారకవర్ణ యిట్లు తిరిగెన్ నిర్భాగ్యురాలై ధరన్. 103

సీ. శివకరం బగుమాఘకృష్ణచతుర్దశీదిన మిది శివరాత్రి యనఁగఁ బరఁగు
నీపుణ్యదినమున నిహీనకులజను నశనదూరతయు బిల్వార్చనంబు
సంఘటించెను గాన జన్మాంతరార్జితదోషసంఘంబు నిశ్శేష మయ్యె
నది యటులుండఁ బుణ్యక్షేత్ర మగునీస్థలంబున విడిచెఁ బ్రాణంబు గాన
తే. బహుతరామేయపుణ్యవైభవముఁ జెంది, భద్రకరమైన కైవల్యపదము నొంద
దేవదేవునికరుణచే నీవిమాన, మెక్కఁగా నర్హురా లయ్యె నివ్విధూటి. 104

మ. అలగోవత్సముఁ ద్రుంచుచో శివశివా యంచు న్మహాభీతిచేఁ
బలికెం గావునఁ దన్మహామహిమచేఁ బాపాత్మురాలైన ని
ర్మలకైవల్యము నొంద నీశ్వరుకృపన్ మాసంద్ర యుద్దేవు ని
శ్చలభక్తిన్ భజియించుమనుష్యులకు సౌఖ్యప్రాప్తి గాకుండునే. 105

వ. అని యాచండాలిపూర్వవృత్తాంతం బంతయు నెఱింగించి యా శివకింకరు లాత్మబలం
బున నయ్యింతి నద్దివ్యవిమానంబున నెక్కించుకొని శివలోకంబునకుం గొనిపోవు
చుండ నదియును ననేకదివ్యాంబరాభరణభూషితయు హరిద్రానుగంధవిలేపితాంగి
యు ఘుమంఘుమితామోదపుష్పదామయు దివ్యతేజోవిరాజమానయు నై భూతం
బు లైనజన్మంబులు దలంచి తలంచి చండాలసంబంధం బైనదుష్కారం బెందుఁ
బోయె నీదివ్యశరీరం బెట్లుఁ బ్రాప్తం బయ్యె నోహో పరమేశ్వరుమహిమంబుఁ
దెలియ నశక్యం బమ్మహానుభావుండు పత్రమాత్రసంతుష్టుం డై మత్పూర్వకృతం
బు లైన దురితంబులం బరిహరించి నిజసాయుజ్యం బొసంగె నని యాశ్చర్యంబు
నొందుచు గంధర్వగానంబు లాకర్ణింపుచు విద్యాధరకీర్తనంబు లాలోకింపుచుఁ
బరమానందంబున విమానారూఢ యై శివలోకంబునకుం జని యీశ్వరసాన్ని
ధ్యంబున సుఖం బుండె నని చెప్పిన విని గౌతమమహామునీంద్రునకుఁ గల్మష
పాదుం డిట్లనియె. 106

క. నిటలాక్షుఁడు శంభుఁడు త్రి, స్ఫుటముగ నత్యంతభక్తసులభుఁడు దలఁపన్
జటివర యిక శివలోకం, బెటువంటిది తెలియఁబలుకు మిద్ధచరిత్రా. 107

## శి వ లో క ప్ర భా వ ము.

చ. అనిన మునీంద్రుఁ డిట్లనియె నజ్జనవల్లభుఁ జూచి భూవరా
వినుము విపజ్జరామరణవేదన లేఁకలి దప్పి లోకులన్
ఘనతరశోకమోహములఁ గష్టము లెవ్వియు లేక సమ్మదం
బున వసియింపఁగల్గుఁ గృతపుణ్యులకున్ శివలోక మెన్నఁగన్. 108

మ. ఇనచంద్రాగ్నితటిత్ప్రభాపటల మొందేనిం బ్రకాశింపదో
మునులున్ సిద్ధులు యోగు లెచ్చటను సమ్మోదంబుతో నుందురో
జనసందోహము లెందుఁ జేరినఁ బునర్జన్మంబు లేకుండునో
యనపాయస్థితి నుండు నెద్ది యదియే యాశంభులోకం బగున్. 109

క. గురుభక్తులు విమలాంతఃకరణులు సాధులు పరోపకారులు కరుణా
పరులును బరతత్త్వజ్ఞులు, చిరకాలం బుందు రదియె శివలోక మగున్. 110

వ. అని తెలియఁబలికి యారాజుం జూచి యింక నాలస్యంబు సేయ వలవదు సత్వరం
బుగా గోకర్ణక్షేత్రంబునకుం జనుము నీమనస్కృతంబు లడంగు నైహికాముష్మిక
ఫలంబులం బొందెదవు భవిష్యత్కాలంబున భవదన్వయంబున భగవంతుం డైన
నారాయణదేవుండు శ్రీరామనామంబున నవతరింపంగలఁడు దానం జేసి భవదీయ

వంశంబునకుఁ బునరావృత్తిరహితం బయిన బ్రహ్మలోకవాసంబు సిద్ధించునని
యానతిచ్చి తాపసోత్తముండు నిజాశ్రమంబునకుం జనియె నంత. 111

శా. ఆకల్మాషపదుండు గౌతమమునీంద్రాజ్ఞాప్రకారంబునన్
గోకర్ణంబున కేఁగి యందు విగళద్ఘోరాఘసంవాహుఁడై
శ్రీకంఠున్ శివు నద్రిజారమణునిన్ సేవించి తాఁ గ్రమ్మరన్
సాకేతంబున కేఁగుదెంచి నిజరాజ్యం బేలె ధర్మస్థితిన్. 112

క. కువలయనాథుం డీగతి, ప్రవిమలమతి రాజ్యమేలి భక్తిపరుం డై
శివు దలఁచుచు నంతంబున, శివలోకంబున వసించె సిద్ధసుఖుండై. 113

క. గోకర్ణమహిమయుత మగు, నీకథ నెవరైన విన్న నెవరు జదివినన్
భూరికటవిభవాన్వితులయి, శ్రీకంఠునిపదమునను వసింతురు వారల్. 114

వ. అని యిట్లు సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పిన విని సంతోషభరితాంతః
కరణులయి క్రమ్మర సూతున కిట్లనిరి. 115

క. సుజ్ఞానివి నిఖిలపురాణజ్ఞుండవు రోమహర్షణతనూభవ నీ
ప్రజ్ఞాబల మతివిస్మయ, మజ్ఞులు దెలియరు భవన్మహాత్వము తలఁపన్. 116

క. స్మరితంబులు బహుసంప, త్స్ఫురితంబులు శుభకరములు భర్జితనానా
దురితంబులు పరమేశ్వరు, చరితంబులు వినిన జన్మసాఫల్య మగున్. 117

వ. అని యడిగిన యమ్మునులకు సూతుం డిట్లనియె. 118

## దీపకళికాప్రదానప్రభావము.

తే. అసితసితపక్షములఁ జతుర్దశులయందు
దీపమాలిక అర్పించు ధీరమతులు
మహితసుజ్ఞాను లగుచు సామ్రాజ్యపదముఁ
జెందియుందురు శ్రీసాంబశివునికృపను. 119

వ. ఇందులకు వక్తృశ్రోతృమనోరంజనం బయినయొక్కయితిహాసంబు గలదు దానిం
జెప్పెద నాకర్ణింపుం డని సూతుం డమ్మునుల కిట్లనియె. 120

## దాశరాజుచరిత్రము.

తే. జనమనోహర మగుచు నిషాద మనఁగ, నొక్కదేశంబు మహితమై యొప్పుచుండుఁ
దద్విషయ మేలుచుండును దాశరాజ, నామధేయంబు గల్గిన నరవరుండు. 121

తే. ఆనిషాదాధినాథుండు హర్ష మెసఁగ, హరిణనయన కుముద్వతి యనఁగఁ బరఁగు
రాజకన్యక వరియించి తేజ మలర, లీల నిజదేశ మేలమిఁ బాలించుచుండె. 122

శా: ఆదాళక్షితిపాలుఁ డెంతయును భక్ష్యాభక్ష్యలోలుండు మ
ర్యాదాతీతపథప్రవర్తనుఁడు శిష్టాచారహీనుండు స
ద్వేదప్రోక్తబహుక్రియారహితుఁడున్ స్వేచ్ఛావిహారుండు నా
నాదుర్జాతికులాంగనారతుల నానందించు నెల్లప్పుడున్. 123

చ. మతియును భూపరుండు శివమందిరగోపురమండపంబులున్
స్థిరమతితో రచించి హితచేష్ట సహస్రఘటాభిషేకముల్
సురుచిరదీపమాలికలు సొంపుగ బిల్వదళార్చనంబులున్
సరసమహోత్సవంబులును సల్పు మహేశ్వరభక్తియుక్తుఁడై. 124

క. ఈరీతిని వర్తింపఁగ, నారాజుం జూచి సంశయాత్మక యగుచున్
ధీరమతిఁ దత్కళత్రం, బీరసమున నిట్లు అనియె నేకాంతమునన్. 125

క. భూపాల దురాచార, వ్యాపారముగల్గి నీవు వర్తింపుచు గా
రీపతిచంద్రకళాధరు, శ్రీపరమేశ్వరుని భక్తి సేవింతు వొగిన్. 126

సీ. జననాథ వినుము భూజననింద్య మగుదురాచారంబు నీ కెట్లు సంభవించె
నటమీఁద మాధుల కతిదుర్లభం బయిన యీశ్వరభక్తి నీ కెట్లు కలిగె
నేవేళలందైన నిల నైకమత్యంబు గలుగునే దీపాంధకారములకు
నటుగాన సువివేక మవివేకమును రెండు నొకచోట నీయంద యునికిఁజేసి

తే. యిది విచిత్రం బటంచు నా మదికిఁ దోఁచె దీనికలరూపు చెప్పి సందేహ మడఁప
మనుచుఁ బ్రార్థించి యడిగిననాత్మమహిషియగుకుముద్వతితో నిట్లనియె విభుఁడు.

క. విను నే పూర్వభవంబున, మును పంపానగరమందు మదమదలిర్పన్
శునకము నై చరియింపుదు, ననిశంబును తున్నివారజాసక్తమతిన్. 128

క. ప్రతిగృహము నెపుడు దిరుగుచు, నతిశయజనభుక్తశేష మాతురమతినై
గతుకుమ వీధుల నుండుచుఁ, గతిపయసంవత్సరములు గడపితి నచటన్. 129

తే. అంత నొకమాసశివరాత్రి యందుఁ బౌరు, లాత్రి కావసుఁ డగు విరూపాక్షుగుడికి
నరిగి యమృతాభిషేకంబు లాచరించి, దీపమాలిక లొసఁగిరి తేజ మెసఁగ. 130

క. దిక్కులఁ గల సకలజనుల్, మక్కువతో నరిగి దీపమాలిక లొసఁగన్
మొక్కంటిభవన మప్పుడు, చుక్కలమండలమురీతి శోభిల్లెఁ గడున్. 131

వ. ఇట్టిసమయంబున. 132

మ. బలిపీఠస్థిత నైవతత్కబళముల్ భక్షింపఁగాఁ బోయి ని
శ్చిత తేజంబున నందుదీపపటలుల్ సంప్రీతి నీక్షింపుచున్

విలసన్నామసహస్రపాఠరవముల్ వేదధ్వనుల్ వించు నే
నిలువక గాంచి మహీసురుల్ కుపితులై నిందింపఁ దండింపఁగన్. 133

క. అచ్చోటు వాసి చనిచని, యచ్చుగ బలికబళభక్షణాతురమతి నై
వచ్చుచుఁ బోవుచు నుండఁగ, నచ్చటిబాలకులు గొంద ఱత్యుద్ధతులై. 134

మ. కరుణాహీనత బాలురున్వేఁగను గ్రక్కె శబ్దముల్ సేయుచున్
మరలన్ బాఱుచుఁ గ్రమ్మఱం జనఁగ దుర్మార్గప్రచారుల్ ధను
ర్ధరవీరుల్ ననుఁ గాంచి శాతశరసంధానంబుఁ గావించి భీ
కరలీలన్ బడనేసి రప్పుడు శివాగారప్రదేశంబునన్. 135

వ. మహేశ్వరనివాసం బైనయప్పుణ్యక్షేత్రంబున కృష్ణచతుర్దశీప్రదోషపుణ్యకాలం
బున నిరశనత్వంబు నొంది విరూపాక్షుసాన్నిధ్యంబున దీపమాలికాలోకనం
బాచరింపుచు మృతిఁ బొందుటం జేసి నికృష్టం బైనశ్వానకళేబరంబు విడిచి దివ్య
దేహంబుఁ దాల్చి విమానారూఢుండనై కొంతకాలంబు స్వర్గభోగంబు లనుభవించి
క్రమ్మఱ నిషాదదేశంబునకు రాజనై జన్మించితి యిది నాపూర్వవృత్తాంతంబు నాకు
ప్రియపత్నివి గావున నీరహస్యంబు నీకుఁ దెలియ ననుగ్రహించితి. కుముద్వతీ!
నీవును నప్పరమేశ్వరుభజియింపు మద్దేవుండు మహానుభావుండు భక్తవత్సలుండు
పరమపురుషుండు భోగమోక్షప్రదుండు మృత్యుంజయుండు సర్వభూతదయాప
రుండు నీకు నిహపరసౌఖ్యంబు లొసంగు ననిచెప్పిన నాశ్చర్యంబునొంది క్రమ్మర
ప్రాణవల్లభుం గనుంగొని యక్కామిని యిట్లనియె. 136

ఆ. భూవరేంద్ర, నీకుఁ బూర్వజన్మజ్ఞాన, మెట్లు కలిగె ననిన నింతి కనియె
నభవదీపమాలికాలోకనంబున, జ్ఞానసిద్ధి నాకు సంభవించె. 137

చ. పరకృతదీపమాలికలు బాగుగఁ జూచుటఁ జేసి చయ్యనన్
నిరుపమదివ్యబోధమహనీయుఁడనైతి నికృష్టమైన కు
క్కురతనువుం దృజించి నృపకుంజరదేహముఁ గంటిఁ గావ శం
కరునకు భక్తిపూర్వకముగా నొనరించితి దీపమాలికల్. 138

క. అని నుడివిన నిజవల్లభుఁ, గనుఁగొని యిట్లనియె నళినికాంతామణి యో
జననాథ త్రికాలజ్ఞుఁడ, వనుపమసుజ్ఞాని వగుట యంతయుఁ దెలిపెన్. 139

క. భూపాలక ! నీపూర్వవ్యాపారముఁ దెలియఁ బలికినట్లుగఁ గృపతో
నాపూర్వజన్మవృత్తం, బీపట్టున దెలియఁ బలుకు మేకాంతముగన్. 140

వ. అని యడిగిన కుముద్వతికిఁ దక్షిణావల్లభుం డి ట్లనియె. 141

ఉ. ఓగజగామిని! వినవె యొప్పుగఁ బూర్వభవంబునందు మున్

శ్రీగిరికూటమందు విహరింతువు నీవు కపోతివై యదృ
చ్ఛాగతమాంసఖండము రయంబునఁ గొంచుఁ జనంగ నంతలో
డేగయు వచ్చి నొక్కటి కడిందిబలంబున సామిషార్థియై. 142

శా. రౌద్రాస్యం బగు దానిఁ జూచి నిధనత్రాసంబు సంధిల్లఁగా
రుద్రాగారము చుట్టునుం దిరుగుచున్ గ్రోధంబుతో శ్యేన ము
క్షుద్రుం డై వెనువెంట నంటి తఱుమన్ శోషించి పోలేక శ్రీ
శాద్రిస్వామిసుధామనోహర ధ్వజస్తంభంబుపై వ్రాలినన్. 143

క. శ్యేనం బత్యంతకృపా, హీనత గలబుద్ధితోడ నేతెంచుచు ద
త్ప్రాణము హరించి మురుడం, గా నరిగె నిజేచ్ఛ మాంసఖండముఁ గొనుచున్. 144

క. పురహరమందిరవరగో, పురములకుఁ బ్రదక్షిణముగఁ బోవుట కతనన్
ధరణీశకన్య వగుచును, దరుణీ! జనియించితివి తత్సుకృతమునన్. 145

క. పంకజముఖి! నీ విఁక నహి, కంకణు జగదీశు నీలకంఠు నుమేశున్
శంకరు నారాధింపుము, సంకటము లణఁచి సకలసంపద లొసఁగున్. 146

వ. అని యివ్విధంబునఁ దనపూర్వజన్మవృత్తాంతం బెఱింగించిన విని యాశ్చర్యంబు నొంది యాకుముద్వతి పరమానందంబున నిజమనోహరుం డైన ధారారాజున - కి ట్లనియె. 147

శా. శైలగ్రీవమహోత్సవార్చనముల న్నిత్యంబుఁ గావింపుచున్
గాలజ్ఞానముఁ గల్గియుండుదువు నీకం టెన్ ఘనుం డెవ్వఁడీ
భూలోకంబున నట్లు కావున మనస్ఫూర్తిన్ దగన్ వేఁడెదన్
వాలిన్ నా కెఱిఁగింపఁగాఁ దగు భవిష్యజ్జన్మవృత్తాంతముల్. 148

వ. అనిన నమ్మానవతికి యారాజేంద్రుం డిట్లనియె. 149

క. దేవీ! నిమ్మృదుభాషలు, భావింప సుధారసములు పరు లెవ్వారున్
నీవలె నడుగ న్నేరరు, భావిభవంబులను దెలియఁ బలికెద వినుమా. 150

తే. పద్మదళనేత్రి యాగామిభవమునందు, సింధురాజన ధాత్రిఁ బ్రసిద్ధిఁ గాంతు
సృంజయేశ్వరపుత్రివై చెలఁగి నీవు, నన్ను బతిగాఁ గ్రహించెదు సన్నుతముగ.

క. అరయఁ దృతీయభవమున, సౌరాష్ట్రాధీశుఁ డనఁగ జనియింతు భువిం
గూరిమి గళింగరాజకుమారిక వై నను వరించి మనియెదు తరుణీ. 152

క. బంధురచతుర్థభవమున, గాంధారప్రభుని నన్ను ఘనమాగధివై
గంధగజయానపేర్మిము, సంధిల్లఁగఁ గూడెదీవు సరసతమీఱన్. 153

చ. వనజదళాక్షి పంచమభవంబున నేను నవంతిరాజ నై
జననము నొంది బాహుబలసంపదఁ బెంపు వహించియుండ నీ

వసుపమలీల భూసురదశార్ణమహీపతికిం బుత్త్రివై
నను వరియింపఁగాఁ గల ననారతమోహపరీతచిత్తవై. 154

మ. మరలన్ సప్తభవంబునందు దగ బ్రహ్మావర్తదేశంబునన్
ధరణీనాథుఁడ నై జనించి చెలువందం ధాత్రిఁ బాలింపుచున్
దరుణీ నీవు యయాతివంశమునఁ గన్యారత్న మై పుట్టి మ
త్కరపద్మగ్రహణం బొనర్పఁగల నత్యంతానురాగంబునన్. 155

సీ. పద్మాక్షి వినుము సప్తమజన్మమున నేను పాండ్యరాజని ధాత్రిఁ బ్రబలుచుండఁ
బద్మవర్ణాభిఖ్యఁ బరఁగి దానక్షాత్రసాహసధైర్యాదిసద్గుణముల
బద్మమిత్త్రప్రభ భాసిల్లుచుండుదు వైదర్భివై నీవు వన్నెకెక్కి
వసుమతి యను పేర వర్ధిల్లి భోగసౌందర్యాతిశయమునఁ దనరుచుండు
తే. నంత సకలార్థవిదులు దేశాధిపతులు, వచ్చియుందురు నీస్వయంవరమునకును
గెలువుమీఱంగ దమయంతి నలునిమాడ్కి, నను వరింతువు రాజనందనుల విడిచి.

మహాస్రగ్ధర.
అంతన్ గాంధారసాళ్వాద్యఖిలనృపతులున్ హైహయుల్ మాగధాంధ్రుల్
కుంతప్రాసాంకుశోద్యద్గురుతరకరులై ఘోరసంగ్రామకాంక్షం
బంతంబు ల్మీఱ భేరీపటుపటహాలసద్ధ్వానకృత్యు ల్మిన్ను ముట్టన్
దంతిప్రాముఖ్యసేనాతతి గొలువ మహోద్దాములై వత్తు రల్కన్. 157

శా. చండాటోపతఁ బొట్టుముట్టిన పరక్ష్మాపాలురన్ దీప్తకో
దండజ్యాప్రవిముక్తతీవ్రశరసంధానార్తులం జేసి వే
దండస్యందనఘోటకాదుల మహోద్యద్దోర్బలస్ఫూర్తిచే
ఖండీభూతులఁ జేసి తెత్తు నిను ధక్కారావము ల్మ్రోయఁగన్. 158

తే. అంత నగరంబునకు వచ్చి హర్ష మెసఁగ
బ్రేమ శుభలగ్నమున నిన్నుఁ బెండ్లియాడి
యశ్వమేధాదియాగంబు లాచరించి
బ్రాహ్మణుల కిత్తు విత్త మపారముగను. 159

వ. ఇవ్విధంబున సకలప్రజానురంజనంబుగా బహువర్షంబులు రాజ్యంబుఁ బాలించి యనంతరంబున నిజనందనునకుఁ బట్టంబు గట్టి తపోవనంబునకుం జని యచ్చట నగస్త్యమహామునిం గాంచి వినయంబునం బ్రణమిల్లి యమ్మహాత్మునివలన నాత్మ విజ్ఞానంబు వడసి కొంతకాలంబునకు దేహంబులు విడచి పునరావృత్తిరహితం బైన శివలోకంబున శివసాయుజ్యంబు నొంది యుండుదుము అటుమీఁదట

జన్మంబు లేదని భవిష్యత్కాలవృత్తాంతంబులు చెప్పిన విని యాకుముద్వతి మహై
శ్వర్యంబునొంది పరమేశ్వరప్రభావం బింత యొప్పునే యని యగ్గించి నిజవల్లభుం
డైనదాశార్హుం బూజించి యితండు సర్వజ్ఞుం డని తలంచి వెండియు నమ్మహా
పతి యిట్లనియె. 160

క. ధ్యానం బెక్కడ విమల, జ్ఞానంబు వహించి సకలసామ్రాజ్యంబుల్
దానొంది శివపదంబున, నానందముతో వసించు టద్భుత మరయన్. 161

వ. అని పలికి తదనంతరంబున నాదంపతులు మహాదేవుం డైన శ్రీవిరూపాక్షు నారా
ధించుచు ననేకసంవత్సరంబులు సౌఖ్యంబు లనుభవించి మఱియు సప్తజన్మంబుల
రాజ్యంబు పాలించి యంత్యంబున శివసాయుజ్యంబు నొంది రని చెప్పి సూతుం
డి ట్లనియె. 162

క. సదమల మగుసచ్చరితము, జదివిన వ్రాసినను వినిన జనములు బహుసం
పద లనుభవించి శాంకర,పదమున వసియింతు రెపుడు భద్రాత్మకులై. 163

క. శివుఁడే దేవుఁడు జీవుఁడు, శివుఁడే బంధుఁడు గురుండు శివుఁడే పరుఁడున్
శివుఁడే రక్షకుఁ డరయఁగ, శివుఁడే తారకుఁడు సకలజీవులకెల్లన్. 164

ఆ. శివున కర్పితముగఁ జేసినధర్మంబు, స్నానదానయుగము జపము తపము
గొంచెమైన నదియు కోటిశతాధిక, గుణిత మగుచు మిగులఁ గోర్కె లొసఁగు.

ఆ. సిద్ధభక్తితోడ శివున కర్పించిన, పత్రపుష్పమాలఫలజలాదు
లల్పమైన నదియు నల్పఫలం బిచ్చు, సంశయంబు వలదు సత్య మరయ. 166

క. తనమతినందు సుపాత్రత, ధనమందును గలుగుప్రీతిఁ దనరఁగ శివపూ
జన మాచరించువారల, కనిశము నిష్టార్థసిద్ధి యగు టబ్బురమే. 167

సీ. శంభుఁ బూజించుహస్తంబు హస్తంబులు శితికంఠుకథ విన్న శ్రుతులు శ్రుతులు
శివవందనము చేయుశీర్షంబు శీర్షంబు ప్రమథేశు గీర్తించురసన రసన
చిత్తజారి భజించుచిత్తంబు చిత్తంబు దేవదేవు నెఱుంగు తెలివి తెలివి
భవునకు వలగొన్నపదములు పదములు త్రిపురాంతకుని చూచుదృష్టి దృష్టి

తే. భూతనాథునిపైఁ గలబుద్ధి బుద్ధి, భర్గుమహిమల నుడివినపలుకు పలుకు
విశ్వనాథుని దలిపెడువిద్య విద్య, హరునియెడ భక్తిగలిగిననరుఁడు నరుఁడు.

చ. పురుషులు షండు లంగనలు పుల్కసహాలికయాకరాదిసం
కరజనకీటవృత్తు లడుగన్ బనిలే దెవరైన పార్వతీ
శ్వరుభజనం బొనర్చిన నవారితసంసృతిబంధము క్షతిన్
దురితవిదూరులై ముదముతో వసియింతురు శంభుసన్నిధిన్. 169

క. అని మునులకు సూతుం డి, ట్లను నీయర్థంబునకు మహాద్భుతము సనా
తన మగునొకయితిహాసము, వినుపించెద వినుఁడు మీరు వీనులు దనియన్. 170

## చంద్రసేనమహారాజుచరిత్రము.

ఉ. సజ్జనసంశ్రితంబు బలశాసనపట్టణసన్నిభంబు సం
పజ్జలకేళుతామణినివాసము శాత్రవరాడభేద్యమై
యుజ్జగమందుఁ జేరుగ సమున్నతగోపురభర్మహర్మ్యభూమై
యుజ్జయినీపురంబు దగ నొప్పుచు నుండు వసుంధరాస్థలిన్. 171

ఉ. ఆనగరంబునందు గుసుమాస్త్రసమానుఁడు లబ్ధసత్తసం
తానుఁడు మార్గణాలయనిధానుఁడు శాత్రవవాహినీతమో
భానుఁడు భవ్యకాంతిహిమభానుఁడు దుష్కలుషాటవీబృహ
ద్భానుఁడు చంద్రసేనుఁ డనుపార్థివుఁ డేలుచు నుండు నెప్పుడున్. 172

క. ఆభూపతి నిజరాష్ట్రము, వైభవమున నేలుచుండ వసుమతి గ్రహపీ
డాభీలమహోత్పాత, క్షోభంబులు లేకయుండె సుస్థిరలీలన్. 173

ఉ. బంగరుకొండధైర్యమున భవ్యపయోధిగభీరమందు సా
రంగధరుండురూపమున రాముఁడు బాహుబలంబునందుఁ జం
ద్రాంగదుఁ డంబికాధవపదాంబుజనిశ్చలభక్తి నార సా
సింగము చంద్రసేనన్నపశేఖరుఁ బోల్పఁగలేరు ధారుణిన్. 174

తే. అన్నపాలుండు సతత మభ్యాగతులకు, యోగులకు సిద్ధులకును వైరాగులకును
నర్థికులకును గోరినయర్థవితతి, నిండువేడుక నొసఁగుచు నుండునంత. 175

ఉ. సారవిభూతిలేపనము శారమృగాజినకాటిదండముం
గారుడలింగము న్మెఱయఁగా శివయోగికులావతంసుఁ డా
ధీరుఁడు మాణిభద్రుఁ డరుదెంచె మహేశ్వరపాదభక్తి యు
ప్పారఁగఁ జంద్రసేనజనపాలుని జూడ దయార్ద్రచిత్తుఁ డై. 176

## మాణిభద్రుండు చంద్రసేనమహారాజునకు జింతామణి నిచ్చుట.

ఉ. వచ్చినయోగివర్యునకు వందనకృత్యము లాచరించుచున్
మచ్చిక మాటలాడుచును మజ్జనభోజనపానశయ్యలన్
హెచ్చుగ శ్రీతినేయుచు నభీష్టగతిం దనరార నాత్మలో
మెచ్చి యొసంగె రాజున కమేయము నూత్నము దివ్యరత్నమున్. 177

తే. ఇట్లు శివపారిషదముఖ్యుఁ డిద్ధయశుఁడు
మాణిభద్రుండు దీప్తమా మణి నొసంగి
చంద్రసేననృపాలు హస్తంబు పట్టి
యిష్టసల్లాపములతోడ నిట్టు లనియె. 178

క. సంతసము చాల్ప నిది య, త్యంతశుభంబులు నమేయధనము లొసఁగు న్
మంతం బని యానృపునకుఁ, జింతామణిమహిమ చెప్పి శివయోగి చనెన్. 179

క. ఆరాజు దివ్యమగు చిం, తారత్నము గళమునందు ధరియించి మహో
దారుఁడు కౌస్తుభధరుఁ డగు, నారాయణునట్లు వెలిఁగె నరనుతుఁ డగుచున్. 180

చ. రవినిభ మైనయమ్మహితరత్నము సోఁకినయంతమాత్రనే
ప్రవిమలకాంచనంబు అగుఁ బన్నుగ సీసకతామ్రలోహతా
ష్టవము లటుండనిమ్ము మునిసత్తములార తదీయసుప్రభా
లవపరిమిశ్రవస్తువులు లాలితహేమమయంబు లౌఁ దగన్. 181

ఆ. అన్నృపాలచంద్రు సంతఃపురంబునఁ, గలుగునట్టి వేదికాకవాట
సాధకుడ్యభాండశయనాసనద్వార, చయము లెల్ల హేమమయము లయ్యె. 182

క. శ్వేతాహారుం డభవుఁడు, వ్యాళవిభూషణుఁడు నైనవరదునకు మహా
కాళేశ్వరునకును మహా, కాళికి నారాజు సేవఁ గావించు దగన్. 183

ఉత్సాహ. చంద్రశేఖరోల్లసత్ప్రసాదలబ్ధరాజ్యుఁ డై
చంద్రసోదరీకటాక్షజాతభోగభాగ్యుఁ డై
చంద్రచంద్రికాపటీరసామ్యకీర్తిసాంద్రుఁ డై
చంద్రసేనుఁ డుర్వి రమతి సమ్మదంబు వర్ధిలన్. 184

ఉ. సాంద్రయశోవిశాలుఁడును సత్యవిరాజితభారతీహరి
శ్చంద్రుఁడు కార్తికేయనిభశౌర్యుఁడు మందరతుల్యధైర్యని
స్తంద్రుఁడు నైనయానృపతిసత్తముఁ డై భవ మేమిచెప్ప య
క్షేంద్రమహేంద్రసంపదల కెక్కుడునై విలసిల్లు నెంతయున్. 185

తే. ఇవ్విధంబున సామ్రాజ్య మేలుచుండ, దేవలబ్ధానుభవ మని తెలియలేక
నతనివిభవంబు సర్వంబు నపహరింత, మని తలంచిరి యన్యదేశాధిపతులు. 186

శా. సౌరాష్ట్రాంగకళింగవంగకురుపాంచాలాంధ్రగాంధారసౌ
వీరావంతికరూశకేకయశకాశ్యాదిభూపాలకు
ల్వీరాగ్రేసరు లొక్కటై యుత్తమున పృథ్వీభాగ మల్లాడఁగాఁ
దా రేతెంచిరి చంద్రసేనవిజయార్థం బుద్ధతాటోపులై. 187

చ. ధరణితలంబు గ్రక్కదలఁ దారలు డుల్లఁ బయోధరాగ మం
బరమణి గప్ప భూమిధరపఙ్క్తి చలింప దిశాతతంగ
ఘోత్కరములు మ్రొగ్గ నప్పుడు గదాముసలత్సురికాసికాధను
ర్ధరధరులై తదీయ అగుసైన్యపతుల్ చనుదెంచి రుద్ధతిన్. 188

వ. ఇట్లు వచ్చి. 189

క. కట్టల్కఁ దమ్మహీశులు, ముట్టడి గావింత మొక్క మొగి నుజ్జయినీ
పట్టణమున కని సేనల, దిట్టముగాఁ బనిచి రపుడు ధీరోద్ధతులై. 190

క. అత్తటి నాజనపతి యీ, వృత్తాంతము విని పురంబు వెలుపలఁ బరభూ
భృత్తులు చేరుట కెంతయు, జిత్తంబున భయము దోఁపఁ జింతిలుచుండెన్. 191

ఉ. ఈనరనాథయూధపు లనేకులు వీరలతోడ సంగరం
బే నొనరింపఁజాలఁ బరమేశ్వరుఁడే యిఁక నాకు దిక్కటం
చానగరంబువాఁకిట మహారథుల న్నియమించి యంతటన్
సూనశరారికిన్ శరణుఁజొచ్చె దృఢీకృతచిత్తవృత్తియై. 192

చ. కమలభవుండు సారథిగఁ గర్బురశైలము కార్ముకంబుగా
క్షమ యరదంబుగాఁ దరణిచంద్రులు చక్రయుగంబుఁ గాఁగ వే
దములు తురంగమంబులుగ దానవవైరి శరంబుగా భుజం
గమపతి మౌర్విగాఁ దగుమృగాంకధరుం ద్రిపురారి గొల్చెదన్. 193

వ. అని నిశ్చయించి. 194

క. శూలాయుధుఁ డైనమహా, కాళేశ్వరుగుడికిఁ జేరి ఘనమతి నభిషే
కాలంకారక్రియలను, మాలూర దళార్చనము లమర్చును భక్తిన్. 195

చ. మఱియు సుగంధధూపములు మానితగోఘృతదీపమాలికల్
సురుచిరభక్ష్యభోజ్యములు చోష్యఫలాద్యమృతోపహారముల్
నిరుపమమంత్రపుష్పము లనేకము లైనప్రదక్షిణంబులున్
గురుతరవందనంబులును గోరి యొనర్చును జంద్రమౌళికిన్. 196

వ. మఱియు నమ్మహీనాథుండు నిజమంత్రిపురోహితసామంతవిద్వజ్జనభూసురపరివృ
తుండై మహోత్సవంబుగా *శివపూజనంబులు సేయింపుచుండ నద్దేవతాలయంబు నిరం

* నహోరాత్రంబు అనన్యమానసుండయి శివారాధనానందభరితుండయి యుండు
నట్టిసమయంబున.

క. అపురిఁ గాఁపురముండిన, గోపవధూవిధవ యొకతె గొడుకును మేథా
టోపుని బంచాబ్దంబుల, పాపని దయ నెత్తికొనుచుఁ బ్రమదితమతియై.

తర బ్రహ్మఘోషంబులును, భేరీభాంకరణంబులును, శంఖకాహళఘంటాఘణఘణా త్కారంబులును, బహువిధమృదంగడమరుడిండిమనాగస్వరపటహవేణువీణాదివ్య ద్యవాద్యంబులును, నర్తకధిమిధిమిధ్వానంబులును, గాయకగానరవంబులును, స్తోత్ర పాఠకవిరావంబులును గలిగి పౌరజనసంకులంబై కృష్ణాగురుగుగ్గులుదశాంగాదివా సితంబును, గర్పూరనీరాజనాలంకృతంబును నై భాసురంబై యుండె నివ్విధంబున నమ్మహాదేవునకు మహోత్సవంబుఁ గావింపుచు మహీనాథుండు నిరశనవ్రతుండును, నిశ్చలభక్తియుక్తుండును, దృఢమనస్కుండును, గించిదున్మీలితలోచనుండును, దదేకనిష్ఠాగరిష్ఠుండును నై యద్దేవదేవు నిట్లని స్తుతియించె. 197

చ. జయజయ పార్వతీరమణ! చంద్రకళాధర! నీలకంధరా!
జయజయ ఫాలలోచన! గజాసురభంజన! మానిరంజనా!
జయజయ భద్రకేతన! భుజంగవిభూషణ! భక్తపోషణా!
జయజయ వామదేవ! దనుజాంతకసాయక! లోకనాయకా! 198

---

వ. అమ్మహాదేవుదేవాలయంబులోపలికిం జని యం దొక్కచోట.
తే. నిలిచి యాదేవదేవుని నీలకంఠు, భక్తవత్సలుఁ బార్వతీప్రాణనాథు
శ్రీమహాకాళదేవునిఁ జేరి భక్తిఁ, బూజ గావించుధాత్రీశుఁ బొంచి చూచి.
వ. అప్పు డప్పల్లపల్లవాధరి మటియు నారాజుమార్గమ్యుండు ధన్యుండయి యద్ధరాధర ధనుర్ధరు నీశ్వరు వివిధోపాయంబుల ధ్యానంబున నారాధనంబు సేయు తద్విధా నంబు సర్వంబునుం గనుంగొని మనంబున బెనంగొనుసంతసంబున వచ్చుటిమున్కొం టికి మెుక్కి యక్కొడుకుం దానును నిజశిబిరంబునకుం జనుదెంచి యుండునంత.
క. అగోపపుత్త్రుసుతుఁ డను, రాగంబున భక్తితోడ రాజేంద్రుఁడు త
ద్భోగివిభూషణుపూజలు, బాగుగఁ జేయుటలు చూచి భావములోనన్.
క. పలుమఱుఁ దద్విధమంతయుఁ, దలఁచుచు నచ్చాలకుండు తాత్పర్యమునం
బలుపుగఁ బుష్పాలఁ బత్రియుఁ, జెలువుగ నవిరొల్లఁ దెచ్చి శివుఁ బూజింపన్.
వ. ఇట్లు తనకు మనోహరంబు లయినపత్త్రపుష్పంబులు దెచ్చుకొని భక్తిముప్ ప్రదాయకం బగుశివపూజ సేయ నుద్యోగించి.
సీ. తడయక తనుకు వాఁడు దనయింటిచేరువ, నున్న పాడుగుడిసె నూడ్చి యలికి
యందులోన హృద్య మగునొకశిలఁ దెచ్చి, దివ్యలింగముగఁ బ్రతిష్ఠ చేసి.
ఆ. అపుడు వేడ్కతోడ నభిషేక మొనరించి, వస్త్రభూషణములు వరుస గంధ
మక్షతలు నొసంగినట్టివాఁడై పత్త్రి, పుష్పములను బొసఁగఁ బూజ సేసి.
వ. ధూపదీపనైవేద్యతాంబూలాదు లాత్మఁ గల్పించి సమర్పించినవాఁడయి యప్పుడు

సీ. భువనంబులకు నుపద్రవముఁ గావించిన హాలాహలంబెల్ల నాహరించి
లోకభయంకరాలోకనంబులు గల్గుత్రిపురదానవుల నిర్జించి మించి
యమరకంటకు లైనయంధకాసురగజాసురులను ఖండించి సురలఁ బ్రోచి
తాపసానీకసంత్రాణనార్థంబుగా వ్యాఘ్రాసురధ్వంస మాచరించి
తే. యఖిలజగములఁ బ్రోచునయ్యష్టమూర్తి, చారుతరమూర్తి గీర్వాణచక్రవర్తి
దుర్మదాహితకోటులఁ దోలఁగఁ ద్రోచి, చిరకృపాదృష్టి మమ్ము రక్షించుఁగాత. 199

క. పురహర భవహర గిరిశ, స్మరహర మృత్యుహర శైలజావర శంభో
హరహర యనుచును బలుమఱు, నరనాథుఁడు సన్నుతించె నరవాహసఖున్. 200

క. అని మఱియును బహువిధముల, వినుతులు గావింపుచును బవిత్రచరిత్రుం
డనఘుఁడు ధరణీకాంతుం, డనయముఁ జింతింపుచుండె హరుపాదములన్. 201

క. అచ్చటి వేడుకఁ జూడఁగ, విచ్చలవిడిగాఁగ వీథివీథులవెంటన్
వచ్చుచుఁ బోవుచు నుండిరి, యచ్చుగ నాబాలవృద్ధ మప్పురిజనముల్. 202

ఉ. అంతటఁ బంచహాయనవయస్కుని బాలకు నెత్తికొంచు న
క్కాంతువిరోధిఁ జూడఁగ నొకానొకవిప్రియగోపకాంత యా
చెంత వసించి యచ్చటివిశేషములన్ బరికించి ధారుణీ
కాంతుఁడు చేయుపూజఁ గని క్రమ్మఱ నేఁగెఁ గుటీరవాటికిన్. 203

వ. అని చెప్పి సూతుం డిట్లనియె. 204

## గోపబాలునిచరిత్రము.

సీ. వినుఁడు సంయములార విస్మయావహ మైనయొకవార్త వినిపింతుఁ బ్రకటలీల
నావల్లవాంగన కాత్మసంభవుఁ డైనబాలకుం డారాజు భవునిపూజ
సేయ యథాక్రమస్థితులు దప్పకయుండ భావించి చూచి యేర్పడ గ్రహించి
తనకుటీరంబుముందట నుండు నొకశూన్యదేశంబునందు శుద్ధిగ నమర్చి
తే. యొకటిశిలఁ దెచ్చి శివలింగమనుచు భక్తి, నమర గృత్రిమగంధాక్షతములుపత్ర
పుష్పఫలములు నైవేద్యములు నొసంగి, చిత్త మలరంగ శివపూజ సేయుచుండె.

తో. నగపతిముందట నాట్యముఁ ద్రొక్కున్, గగనశిరోజుని గానము సేయున్
భగవంతునిపదభజన మొనర్చున్, జగదీశ్వరుసంస్తవముఁ బఠించున్. 206

వ. ఇవ్విధంబున నాగోపబాలకుండు బాలక్రీడావినోదంబున నానృపాలుం డాచరిం
చువిధంబున దానును శివార్చనంబు సేయుదు నని సంకల్పించి యాకృతకలింగంబు
నకు షోడశోపచారవిధులును నమస్కారంబులుం జేయుచు గొంతప్రొద్దు గడపి
భోజనవాంఛానిరతుండయి నిశ్చలభావంబునఁ బరమేశ్వరధ్యానంబు సేయుచు

నిమీలితలోచనుండును బద్ధాంజలిపుటుండును ననన్యమనస్కుండు నగుచు స
మాధినిష్ఠాతిశయంబున స్థాణురూపంబున నుండునంత. 207

సీ. ఆబాలకునితల్లి యరుదెంచి మమతచే భుజియింప రమ్మని పుత్త్రుఁ బిలువ
మునిపోల్కి నున్నయాముద్దులపాపని పలుమాఱుఁ జీరినఁ బలుకకున్న
దగ్గర నేతెంచి తాడనంబులు సేయ స్థాణువుపగిది నిశ్చలతనుండ
పతినిష్ఠురోక్తుల నదలించి బెదరించి కోపంబు దీపింప గోపికయును

తే. మారుమాటాడకున్న కుమారు దిట్టి, కొట్టి చాలించి యచ్చోటఁ దిట్టమైన
పూజయంతయుఁ జెరిచి దుర్బుద్ధి యగుచు, దూరముగ నశ్మలింగంబుఁ బాఱవైచె.

క. కొంతవడికి నాబాలకుఁ, డెంతయుఁ గనుదెఱచి చూచి యిదియేమియొకో
వింత యటంచును మదిలోఁ, జింతింపుచు రోదనంబు సేయఁ దొడంగెన్. 209

వ. ఇవ్విధంబున నాగోపబాలకుండు కొంతప్రొద్దునకు విగతశోకుండై యిక్కార్యంబు
మదీయజననీకృతంబు గావలయు నని మనంబున నిశ్చయించి తద్దోషపరిహారార్థంబు
గా నప్పరమేశ్వరుని ధ్యానం బొనరింపుచు నిట్లని స్తుతియించె. 210

క. పరమేశ్వర శివ శంకర, కరుణాకర నీలకంఠ గజచర్మధరా
గిరిపుత్త్రీకామనోహర, పురహర ననుఁ బ్రోవు మఖిలభూతశరణ్యా. 211

మత్తకోకిల. తాను జేసినశంభుపూజ యుదగ్రమై తమతల్లి య
జ్ఞానియై పడఁద్రోచిపోయెను శంకరా ననుఁ గావు మో
దీనరక్షక భక్తవత్సల దేవదేవ దయానిధీ
మానినన్నత యంచు నేడ్చుచు మైమఱుంగక మూర్ఛిలెన్. 212

ఆ. అంత బాలకుండు నవనిపైఁ బడియుండి, బుద్ధి దెలిసి కొంతప్రొద్దునకును
మూర్ఛఁదేరి లేచి ముందట శొక్కదేవాలయంబు గాంచె నద్భుతముగ. 213

ఉ. శ్రీరమణీయ ముజ్జ్వలవిచిత్రమణీవిలసద్ధిరణ్మయ
ద్వారకవాటతోరణము వజ్రవిదూరజమౌక్తికప్రభా
పూరితవేదికాస్థలము భూరితరస్ఫటికాభిరామసౌ
ధోరునవీనహేమకలశోన్నతమైనశివాలయంబునన్. 214

తే. దివ్యచింతామణిప్రభాదీవ్యమాన, భద్రపీఠంబునందుఁ బ్రభాతకాల
భానుకోటిప్రకాశమై పరఁగునట్టి, భవ్యలింగంబుఁ గాంచె నాబాలకుండు. 215

వ. తనుంగొని తదీయమహాప్రభావంబునకు వెఱఁగుపడి విస్మితస్వాంతుండును బుల
కాంకురితగాత్రుండును హర్షాశ్రుమిళితనేత్రుండును నై గద్గదస్వరంబున నిట్ల
ని స్తుతియించె. 216

సీ. జయభక్తసముదాయ సంరక్షణోపాయ జయకాలకూటభక్షణవినోద
జయవిష్ణుకాండకాంచనశైలకోదండ జయపద్మజాండభాస్వత్ప్రచండ
జయశైలజాచిత్తజలజాతరోలంబ జయరతీశాపన్నజనకదంబ
జయజహ్నుకన్యకాజలసిక్తవరజూట జయజయహాల్లకసఖకిరీట
తే. జయరజితభూధరాంచితస్థలనివాస, జయవృషతురంగ రాజీవశరవిభంగ
జయకృతాంతకమృత్యుభంజనవిలాస, జయకృపాపాంగ ధవళాంగ శంభులింగ.

శా. స్వామీ నీదుమహత్త్వము న్దెలియఁగా శక్తుండ నేఁగాను వి
ద్యామూఢుండను గోపబాలకుఁడ వీతప్రజ్ఞుఁడఁ దేవ నీ
సామర్థ్యంబు విరించిముఖ్యవిబుధు ల్వర్ణింపఁగాలేరు లీ
లామూర్తిం బ్రభవించు టద్భుతము నీలగ్రీవ విశ్వేశ్వరా. 218

క. మాతల్లి నినుఁ ద్రిలోక, ఖ్యాతునిఁగాఁ దెలియలేక కతిసాత్మకయై
వీతప్రజ్ఞతఁ జేసిన, పాతకములు పరిహరించు పరమాత్మ శివా. 219

వ. అని యివ్విధంబున బహుప్రకారంబుల వినుతులు సేయుచున్న సమయంబున. 220

తే. సరసతరపద్మినీదివాసంగమంబు, నేని తద్దోషపరిహారసిద్ధికొఱకు
స్నానమొనరింపఁగాఁబోవుచందమునను, పశ్చిమాంబుధిలోఁ గ్రుంకె భానుఁడపుడు.

వ. ఆసమయంబున గోపబాలకుండు భోజనేచ్ఛావిరహితుండై యమ్మహాప్రదోషకా
లంబున మహాదేవపూజనంబు గావించి యత్యద్భుతకరం బయినయావృత్తాంతంబు
తమతల్లికిం దెలియ బల్కవలయు నని మనంబున నిశ్చయించి యతిత్వరితంబుగా
నిజగృహంబునకు జనుదెంచె నంత. 222

క. నవరత్నహేమమయమై, యవిరళధనధాన్యయుక్తమై పెంపెసఁగా
శివుకృపచే నాగోపీ, భవనము వెలసెను గుబేరభవనము మాడ్కిన్. 223

క. రయమునఁ జని నిజమందిర, శయనస్థలమునను జేరి జననిని లెమ్మా
జయము శుభంబులు వెలయఁగ, దయతో నీశ్వరుఁ డొసంగెఁ దగువిభవంబుల్.

క. అని నిదురలేపి చెప్పిన, జననియు నిజమందిరంబు శయ్యాతలమున్
గనుఁగొనఁగ రత్నకీలిత, కనకమయం బగుటఁజేసి కడువెఱఁగందెన్. 225

తే. మణివిభూషిత మగునిజతనువుఁ జూచి, మహితధనరాశిచే నొప్పు గృహముఁ జూచి
స్వర్ణమణిదీప్తమైన ఖట్వంబుఁ జూచి, యిది యపూర్వం బటంచు నెమ్మది దలంచె. 227

వ. అప్పుడు.

శా. మాతం డోడ్కొనివచ్చి తత్సుతుఁడు శుంభద్రత్నసౌధంబుపైఁ
జేతస్తోషదమై సువర్ణకలశశ్రీమంతమై కాంతమై

శితావార్యసమున్నతం బగుచు లక్ష్మీమందిరం బైనయా
భూతేశాలయ మొప్పఁజూచె నచటన్ బూర్ణప్రమోదంబునన్. 228

క. గోపికయు వెలుఁగునొందుచు, భూపాలునికడకుఁజేరి పురహరభవన
వ్యాపారము నిజతనయా, లాపంబులు విన్నవించె లాలితఫణితిన్. 229

సీ. ఆవార్త విన్నంత యాశ్చర్యమును జెంది శంభుపూజామహోత్సవము విడిచి
శీఘ్రంబు గాఁ జంద్రసేనమహారాజు పరివారసహితుఁడై యరుగుదెంచి
దివ్యమాణిక్యదేదీప్యమానం బైన యంబికారమణుదేవాలయంబు
నందుఁ గాంచనమయం బగురత్నవేదికాస్థలమునఁ బీఠమధ్యమున వెలసి

తే. బాలభానుస్ఫురత్కాంతి పరిఢవిల్ల, నఖిలజనచిత్తలోచనాహ్లాద మగుచుఁ
బూర్ణవిభవాభిరామ మపూర్వమైన, కనకమణిమయదివ్యలింగంబుఁ గాంచె. 230

క. దానిదిని పౌరులందఱు, మానుగఁ జనుదెంచి హర్షమగ్నాత్మకులై
యానూతనశివలింగము, వానిని వీక్షించి రద్భుతాదృతమతులై. 231

తే. ఇట్లు వీక్షించి సాష్టాంగ మెరఁగి భక్తి, పూర్వకంబుగ నభిషేకములను బిల్వ
పూజనంబులు కీర్తనంబులునుజేయు, చుండె రాజయు భూపాలయుక్తముగను. 232

వ. ఇవ్విధంబున నితరవ్యాపారంబులు మాని పౌరజనపరివారసమేతంబుగా నమ్మహీవల్లభుండు ప్రహృష్టాంతరంగుఁడై భుజంగాభరణం బైన యమ్మహాలింగంబునకుఁ బూజామహోత్సవంబు సలుపుచుండె నంత. 233

క. అనరపతికిఁ దత్పర, భూనాయకులకును సంధిఁ బొసఁగించుటకై
తా నరుగుదెంచెనో యన, భానుఁడు దోతెంచె నపుడు ప్రాగ్భాగమునన్. 234

ఉ. కూరిమి చంద్రసేననృపకుంజరుపట్టణమందు నొక్కయా
భీరకుమారుఁ డాటలకు భీమసమర్చనఁ జేయుచుండ ని
ష్కారణలీలఁ గన్పడిరా శంకరుమందిర మంచు నానృపుల్
జారులు దెల్పఁగా విని భృశంబుగ విస్మయమంది రందఱున్. 235

ఉ. ఈవిభుసంగరంబున జయింపఁగరాదు మహానుభావుఁడున్
దైవబలాభిరాముఁడును దారయశుం డని నిశ్చితాత్ములై
యావసుధేశులందఱు రహస్యమునన్ గుమిగూడి వీనితో
నేవిధినైన నిష్టమతి నేర్పడ నుండుద మంచు నెంచుచున్. 236

క. ధీరుల నతిగంభీరుల, సారనయానయవచోవిచారులను మహో
దారులఁ జారులఁ గనుఁగొని, యారాజకుమారు లిట్టు లని రతిమైత్రిన్. 237

క. శ్రీహరుఁడు సాక్షిగను మా, వాహనములు నాయుధములు వర్జించి మహో
స్నేహమున భవత్పురికిన్, సాహసకృత్యములు మాని చనుదెంతు మొగిన్. 238

క. ఈవృత్తాంతము మీ రా, భూవిభునకుఁ జెప్పి రండు పొం డని పనుపం
గా వచ్చి రపుడు చారులు, వేవేగమె చంద్రసేనవిభుసన్నిధికిన్. 239

ఉ. వచ్చి నృపాలచంద్రునకు వందనకృత్యము లాచరింపుచున్
మచ్చికఁ జారు లిట్లనిరి మానవనాయక యుద్ధకాంక్షులై
వచ్చినరాజవర్యులు శివాలయగోపకదర్శనార్థమై
వచ్చినవారు వాఁకిటికి వారలవాక్యము లాదరింపుఁడీ. 240

క. శ్రీహరుఁడు సాక్షిగను మా, వాహనములు నాయుధములు వర్జించి మహా
స్నేహమున భవత్పురికిన్, సాహసకృత్యములు మాని చనుదెంతు మొగిన్. 241

క. అని చారముఖంబున నుడివిన నృపవచనముల కలరి విభుఁ డతిమైత్రిన్
జనపతుల వేగ రమ్మని, తనభృత్యులఁ బంపె నతిముదంబు చెలంగన్. 242

క. ఆదూతవరులు చని యపు, డాదేశాధీశ్వరులకు ననుమతి యొసఁగన్
మోదంబునఁ జనుదెంచిరి, నాదరతను చంద్రసేనుసన్నిధి కరయన్. 243

వ. ఇట్లు పురంబులోనికిఁ జనుదెంచిన యారాజసత్తములకు నత్యంతవినయంబునం జంద్రసేనమహీనాథుం డెదుర్కొని వందనాలింగనాదిసత్కారంబుల వారల నాదరించి తోడ్కొని తెచ్చి వారలుం దానును నత్యంతమిత్రభావంబు మెఱయ హేమరత్నమయం బైన నూతనశివాలయంబునకు వచ్చి యమ్మహాదేవుదర్శనంబు గావించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి యందఱు సభాస్తరణంబుల సుఖాసీనులై మృదుమధురసల్లాపంబు లొనర్చుచుఁ బరమానందంబున సుఖవృత్తి నుండి రంత. 244

క. ఆభూమీశ్వరు లపు డా, యాభీరకుమారు గుణగణాలంకారుం
బ్రాభవరేఖాకారున్, శోభితశంకరవిచారుఁ జూచిరి ప్రీతిన్. 245

శా. వాత్సల్యంబున బాలకుం బిలిచి సంభావించి యాభూపతుల్
స్వోత్సంగంబుల నుంచి తద్గుణగణోద్యోగప్రచారంబులం
దత్సామర్థ్యముఁ దన్మనోదృఢతయున్ దర్శించి యూహించి య
త్యుత్సాహంబున నిచ్చి రప్పుడు ప్రభాయుక్తార్హభూషావళుల్. 246

ఉ. కొందఱు ఘోటకంబులను గొందఱు భద్రగజోత్కరంబులన్
గొందఱు చామరంబులను గొందఱు భవ్యసితాతపత్రముల్
గొందఱు భేరికాదులను గొందఱు రత్నకిరీటకేతువుల్
గొందఱు రాంకవంబులను గోపకుమారున కిచ్చి రానృపుల్. 247

వ. మఱియును. 248

క. గోపతి విభవము మెఱయఁగ, గోపకులంబునకు నెల్ల గురుఁ డగు నంచున్
గోపాధ్యక్షుని జేసిరి, గోపార్చన నచటఁ గలుగుగోత్రాధిపతుల్. 249

## హనుమంతుఁడు రాజులకుఁ బ్రత్యక్షంబై గోపబాలునికథఁ జెప్పుట.

శా. అంతన్ సర్వధరాధినాథులు ప్రమోదాయత్తులై చూడ శ్రీ
మంతుం డుజ్జ్వలకీర్తిమంతుఁ డతిధీమంతుండు దైతేయదు
ర్దాంతుం డంచితరామనామజపమంత్రధ్యానసంతోషిత
స్వాంతుం డాహనుమంతుఁ డయ్యెడను సాక్షాత్కారుఁ డయ్యెన్ గృపన్. 250

క. క్షిత్యధినాయకు లందఱు, నత్యుజ్జ్వలతేజుఁ డైనహనుమంతునకున్
బ్రత్యుత్థానము మొదలుగ, బ్రత్యుపచారము లొనర్చి శోభిల్లి రొగిన్. 251

క. అక్షితిపులమధ్యంబున, నక్షాసురదమనుఁ డైనయనిలజుఁ డొప్పెన్
నక్షత్రమండలంబున, నక్షత్రేశ్వరునికరణి నభినుతుఁ డగుచున్. 252

వ. ఇట్లు రాజసభామధ్యంబున గూర్చుండి యమ్మారుతనందనుండు గోపకుమారునుద్దేశించి యమ్మహీనాథులతో ని ట్లనియె. 253

క. ఈవల్లవబాలుఁడు ధర, దైవాత్మకుఁ డై యశోవిశాలుం డగుచున్
బావనచరితుం డగుచును, శ్రీ వెలయఁగ బేరు గాంచు శ్రీకరుఁ డనఁగన్. 254

ఆ. అరయ నితనికులజుఁ డష్టమపురుషుండు, నందుఁ డన జనించునందనుండు
నతఁడు గోపకులకు నధినాథుఁ డగుచును, ధారుణీతలమున బేరు వెలయు. 255

శా. ఆనందుం డతిధార్మికాగ్రణి సమస్తాభీరనాథుండునా
దానక్షాత్రపరుండునా దగి యశోదాభర్తయై యుండఁ ద
త్సూనుత్వంబున బాలకేళి విహరించుం దన్నివాసంబునన్
శ్రీనారాయణుఁ డార్తరక్షకుఁడు శ్రీకృష్ణావతారంబునన్. 256

క. ఉభయప్రదోషములయం, దిభచర్మాంబరునిపూజ లెడపడకుండన్
శుభమతి జేసిననరులకు, విభవంబులు చెందు లోకవిఖ్యాతముగన్. 257

చ. ప్రవిమలకృష్ణపక్షమున భద్రకరంబు శనిత్రయోదశీ
దివసము గాన నందు సుమతిన్ శివపూజన మాచరించువా
నరులు మహేశుసత్కరుణ నాగతురంగరథాధిరాజ్యవై
భవములం జెంది యుందురు నృపాలకులార భజింపుఁ డీశ్వరున్. 258

క. ఈగోపకుమారుని శ్రీ,యోగము చేకూరు శనిత్రయోదశి యగుటన్
శ్రీగౌరీశార్చనమున, వేగమె సమకూరె భవ్యవిభవస్ఫూర్తుల్. 259

క. అని పలికి గోపబాలున, కనుపమశివమంత్రములు శివాచారవిధుల్
వినువడ నుపదేశించియు, హనుమంతుఁడు చనియె నప్పు డంతర్హితుఁడై. 260

ఆ. చంద్రకీర్తి యైనచంద్రసేననృపాలుఁ, డఖిలభూపతులకు హర్ష మొదవ
భూషణాదికములఁ బూజించి పనిచెను, మగుడ వారివారినగరములకు. 261

వ. తదనంతరంబున నాచంద్రసేనమహీపాలుండును శ్రీకరుండును మహేశారాధన తత్పరులై యనేకవర్షంబులు భూలోకమున నపరిమితసామ్రాజ్యభోగము లనుభవించి యంత్యమున సిద్ధగంధర్వవిద్యాధరజేగీయమానులై శివలోకమునకుం జని తత్సాయుజ్యము నొంద రని చెప్పి సూతుం డిట్లనియె. 262

ఉ. మానివరేణ్యులార మతిమంతులు శాంతులు దాంతు లైనస
న్మానవు లెవ్వరేని నియమంబున శైవకథాసుధాపయః
ఫేనము శ్రీనిధానమును వేదసమానము నైనయీయుపా
ఖ్యానము విన్నవారలకుఁ గల్గుఁ జిరాయువు భోగమోక్షముల్. 263

క. అని చెప్పినయాసూతుం, గనుఁగొని యిట్లనిరి శౌనకప్రముఖమునుల్
ఘనమతి వగునీవలనను, వినఁగంటిమి శైవకథలు విస్మయపదముల్. 264

ఆ. అమృత మారగింప నరుచి లేనట్లు శ్రీ, సాంబశివునికథలు సంతతమును
వినఁగవినఁగ మాకుఁ దనివి లే దెంతయుఁ, దెలియఁ బలుకుమయ్య తేటపడఁగ. 265

వ. అనిన సూతుం డిట్లనియె. 266

ఉ. తాపసులార మీరు కడుధన్యులు విశ్రుతు లెవ్వరేనియున్
మీపగిదిన్ సదాశివసమృద్ధకథల్ పలుమారు వేడఁగా
నోపరు ఫాలనేత్రుఁడు మహోక్షతురంగుఁడు భక్తలోకసం
తాపహరుండు శంకరుఁ డుదారుఁడు పూజ్యుఁడు ముజ్జగంబులన్. 267

క. తరమే ప్రదోషమహిమల, నెఱిఁగింపఁగ నెవ్వఁ డోపు నింద్రాదిసురల్
పరమేశ్వరు సేవింతురు, నిరతము దత్సమయమునను నిశ్చలమతులై. 268

చ. భవభయరోగతాపబహుపాపనితాంతవిపజ్జలామహా
ర్ణవవినిమగ్నమర్త్యులకు నావ గదా పరమేశ్వరుండు నా
శివుభజనంబు నిశ్చలత చేయుమహాత్ములు ఘోరశాత్రవా
హవఘనశైలమధ్యగతు లయ్యును బాధలఁ జెంద రెన్నఁడున్. 269

క. ఈయర్థమునకు నొకకథ, పాయక వినుపింతు నదియుఁ బాపవినాశం
బాయుష్కర మారోగ్యము, శ్రేయస్కర మగుచు నుండు సిద్ధం బరయన్. 270

## సత్యమహారాజుకథ.

చ. సరసవిదర్భదేశమున సత్యరథుం డనుభూవరుండు భా
సురతరధర్మశీలుఁడు యశోధనుఁ డాశ్రితరంజనుండు నై
నిరతము ధారుణీతలము నీతిపథంబున నేలుచుండఁగా
నరిగె ననేకవత్సరము లానరపాలునకున్ సుఖంబుగన్. 271

ఉ. అంత కృతాంతతుల్యులు మహాబలవంతులు దుర్మదాంధు లా
క్రాంతజయాభిలాషులు ససైన్యులునై చనుదెంచి శత్రుభూ
కాంతవరుల్విదర్భకటకంబునఁ దన్నగరంబుచుట్టు న
త్యంతపరాక్రమంబు వెలయ న్విడియించిరి సర్వసేనలన్. 272

క. ఆసత్యరథుఁడు నిజసే, నాసహితముగాఁగ నరిగి నానారిపువి
త్రాసనుఁ డగుదుర్మర్షణు, తో సంగర మపు డొనర్చె దోర్బల మెసఁగన్. 273

క. సింధురవాజిస్యందన, బంధురసైన్యద్వయంబు పాతాళమునన్
గంధర్వపన్నగులక్రియ, సంధిల నని సేసి రపుడు శౌర్యం బెసఁగన్. 274

క. ఆసంకులసమరంబున, నాసత్యరథుండు నిహతుఁ డయియుండ మహా
త్రాసమున గదనరంగముఁ, బాసి పరాభవము నొంది పరచెం బలమున్. 275

వ. ఆసమయమున దుర్మర్షణప్రధానప్రముఖు లావిదర్భనగరం బాక్రమించి చొచ్చిన యవసరమున యప్పురము ప్రణష్టరాజకంబును ప్రక్షోభితబాలవృద్ధజనమును ప్రధావితపౌరలోకమును ప్రభూతకోలాహలంబునై యుండె నంత. 276

మ. అరివీరుల్ పురిలోనఁ జొచ్చినఁ దదీయారావ మాలించి యా
ధరణీపాలునిపత్ని పూర్వమున నంతర్వత్నియై యుండి త
న్నొరు లెవ్వార లెఱుంగకుండ నతిమాత్రోద్విగ్నయై యంత స
త్వరయానంబున నేఁగె బశ్చిమహరిత్కాంతారమార్గంబునన్. 277

తే. ఇట్లు కాంతారపథమున నేఁగి యేఁగి, యచట నొక్కసరోవరం బమరఁ గాంచి
తత్తటంబున నుండుశీతలవటంబు, క్రింద నిలిచె శ్రమంబులు డిందుపడఁగ. 278

తే. తరుణి యవ్వేళ శుభమహూర్తంబునందు
లలితసామ్రాజ్యలక్షణలక్షితాంగు
నొక్కసుతుఁ గాంచి యచ్చోట నునిచి చనియె
సలిలపానాభికాంక్షఁ గాసారమునకు. 279

క. అమ్మదిర పిపాసాతిశ, యమ్మునఁ జని నీరు త్రావ నపు డొకకుంభీ
ర మ్మేఁగుదెంచి పట్టిన, దమ్మున దిగ మ్రింగె నపుడు ధరణీశసతిన్. 280

సీ. అంత నాబాలకుం డభ్యుదితుం డైనభాస్కరుం డన మహాప్రభ వెలుంగ
క్షుత్పిపాసార్తుఁడై క్రుక్కి భూతలమున వసియించి రోదనధ్వని చెలంగ
నేడ్చుచు పితృమాతృహీనుఁడై యున్నచో నాస్థలంబునకు భిక్షార్థి యగుచు
సుమ యనఁబరగిన యొకవిప్రభామిని యేకహాయనసుతు నెత్తుకొనుచు
తే. నిరత మూరూరు దిరుగుచు నరిగి యరిగి, విమలమతి వచ్చె దైవయోగమునఁజేసి
యంత నాడింభకునిఁ గాంచి యావధూటి, మదిని జింతించి చాలవిస్మయము నొందె.

ఉ. లాలితరూపకాంతిశుభలక్షణలక్షితదివ్యదేహుఁడై
నేల వసించినాఁడు జననీజనకు ల్దలపోయ నెవ్వరీ
బాలుఁడు విప్రుఁడో నృపుఁడొ వైశ్యుఁడొ శూద్రుఁడొ కాకయున్నచం
డాలుఁడొ వీనివంటుట కొడంబడ దెంతయు నామనం బొగిన్. 282

క. వీఁ డెవ్వఁడొకో వీనిం, జూడఁగ నచ్ఛిన్న నాభిసూత్రుం డహహా
నేఁ డెంతవింత గనుపడె, నీడింభకుఁ గన్నతల్లి యెం దఱిగినదో. 283

క. ఈయర్భకుచే నంటక, పోయెద ననియెంచుతలంపు పుట్టదు మదికిన్
వేరొల వీనిఁ గొని చని, నాయింటను బెంచుచుందు ననవరతంబున్. 284

ఆ. అనుచు నిశ్చయించు నాత్మలోఁ జింతించు, సమ్మతించు మగుడ సంశయించు
నట్టు లిట్టు చనక యావీతభర్తృక, శిశువుమీఁదిభ్రాంతి జెందియుండు. 285

వ. ఇట్లు డోలాయమానమానసయై విచారించుచున్న సమయంబున. 286

క. విచ్చలవిడి నాక్షణమున, వచ్చె నొకానొకఁడు భిక్షువర్యుఁ డచటికిన్
మచ్చిక నాబాలకునిం, జెచ్చెర కరుణింప వచ్చు శివుఁడో యనఁగన్. 287

చ. లలితమృదూక్తి భూసురకులాంగనఁ గన్గొని భిక్షుఁ డిట్లనెన్
వలవదు సంశయింపఁగ నవశ్యము నీశిశువున్ భరింపు ని
శ్చలమతితోడ నీ వధికసమ్మదలీల శుభంబు లందఁగాఁ
గల వనిచెప్పి యాఘనుఁడు క్రమ్మర దాఁ జనియెన్ రయంబునన్. 288

తే. అప్పు డాభిక్షువర్యునియాజ్ఞ శిశువు, నెత్తుకొని వేగ నాలేమ యేకచక్ర
పురమునకు వచ్చి తనయింటఁ గరుణనునిచి, చిత్తమలరంగ వానిఁ బోషించుచుండె.

సీ. తనపుత్త్రితోపాటు చనుబా లొసంగుచుఁ గూరిమితోఁ బెంచెఁ గొన్నినాళ్లు
బాగుగా నింటింట భైక్షాన్నములు తెచ్చి కుడువఁబెట్టుచు సాఁకెఁ గొన్నినాళ్లు
సతతంబు దేవతాసంతర్పణంబులఁ గొమరొప్పఁ బోషించెఁ గొన్నినాళ్లు
అవనిసురులయిండ్ల హవ్యకవ్యము లైనఁ గోర్కులు సమకూర్చెఁ గొన్నినాళ్లు
తే. ఆత్మసుతుఁ డంచు బరసుతుఁ డంచు మదిని, భేద మింతయులేక సమ్మోదమునను

ప్రేమ నిరువుర నొకటిఁ బెంపుచుండె, నార యాయువసాటి రెండైనఁగలక.

క. ఇట్టుగ భూసురజనముల, సమ్మతిఁ జౌలోపనయనసంస్కారంబుల్
సమ్మదమునఁ గావించె శు, భమ్ముగ నమ్మానవులకుఁ బ్రాభవ మెసఁగన్. 291

ఉ. చోలెలు చంకలం దిడి కిశోరకభావము లుప్పతిల్లఁగా
ఫాలమునందు భూతికలపంబులు పూయుచు బ్రహ్మచారులై
బాలకు లిర్వు రప్పు డిరుపార్శ్వములన్ జనుదేర నేఁగి గ్రా
మాలయసీమలం దిరిగి యాయువు భైక్షముఁ దెచ్చు నిత్యమున్. 292

క. ఈరీతి సబాలకులై, యారూరును దిరుగుచుండి రొకనాఁడు విధి
ప్రేరణమున నొక్కశివా, గారమునకుఁ జనిరి సుమతులుఁ గౌతుక మొదవన్.

ఆ. అచట వృద్ధు లగుమహర్షిసంఘంబులు, పౌరజనులు జానపదులుఁ గూడి
శివమహోత్సవంబు సేయుచు నుండ న, య్యుత్సవంబుఁ జూచుచుండె నంత. 294

శా. మాండవ్యాదిమహామునీశ్వరసభామధ్యస్థుఁడై చండమా
ర్తాండప్రోజ్జ్వలతేజుఁ డంచితశివధ్యానైకపారీణుఁడున్
ఖండీభూతసమస్తకల్మషుఁడు లోకఖ్యాతచారిత్రుఁ డా
శాండిల్యుం డనుమౌని యిట్లనియె నాశ్చర్యంబు సంధిల్లఁగన్. 295

చ. స్థిరతరమైన దైవగతి చిత్రముగన్ నిజకర్మపాక మె
వ్వరికి దురత్యయంబు జనపాలకనందనుఁ డివ్విధంబునన్
బరసతి నాత్మమాత యని భావనచేయుచు మానహీనతం
దిరిగెడు భైక్షవృత్తి నిరతిం బ్రతిగేహముఁ దప్పకుండఁగన్. 296

క. అని పలుకుచున్న మౌనిం, గనుఁగొని యావిప్రవనిత కౌతుకమతియై
వినయమ్మున నమ్మునిపద, వనజంబుల కెరఁగి కలరవంబున ననియెన్. 297

ఆ. ఓమహానుభావ యీమాణవకుఁ డెవ్వఁ, డెవరు తల్లిదండ్రు లెద్దికులము
పుత్రు పగిది నితనిఁ బోషించి పెంచితిఁ, దెలియఁబలుకు మీనికలతెఱంగు. 298

క. భిక్షార్థ మరుగుచో నా, వృక్షసమీపమునఁ బోరు వెట్టుచు నుండన్
వీక్షించి సంశయింపక, భిక్షునియోగమునఁ దెచ్చి పెంచితిఁ గరుణన్. 299

వ. మునీంద్రా యీబాలకుజన్మంబు సవిస్తరంబుగాఁ దెలియ ననుగ్రహింపవలయు నని ప్రార్థించిన నావిప్రభామినిం గటాక్షదృష్టిం జూచి యమ్మహాత్ముండు. 300

క. తజ్జనకుమరణవృత్తియుఁ, దజ్జన్మప్రకరణంబు నక్రమునవలనం
దజ్జనని మరణ మొందుట, తజ్జాతియుఁ దెలియఁజెప్పె దథ్యముగాఁగన్. 301

సీ. అని యానతిచ్చిన యమ్మహామునిం గాంచి వెండియు ద్విజకాంత విన్నవించె
నేమికారణమున నీయర్భకునితండ్రి సమరరంగమున బంచత్వ మొందె
నేదుష్కృతంబున నీబాలునితల్లి కర్కశగ్రాహసంగ్రస్తయయ్యె
నేకర్మమునఁజేసి యారాజసుతునకుఁ జేకూఱె భిక్షాన్నజీవనంబు

తే. ఇది మహాద్భుత మనుచు నామదికిఁ దోఁచె, తాపసోత్తమ కరుణామృతాంబురాశి
వరయ సర్వజ్ఞమూర్తి వట్లగుటఁ జేసి,యిన్నియునుఁ దెలియఁగాఁబల్కుమిద్ధచరిత.

వ. అని యడిగిన యాతాపసవర్యుం డాభూసురాంగన కిట్లనియె. 303

చ. వినుమిల పాండ్యరాజనఁగ వీనిగురుండు భవాంతరంబునన్
దనరి ప్రదోషపూజనము దప్పక చేయుచు నుండె నంతయున్
ఘనమతి నొక్కనాఁడు శివకంఠసమర్చన సేయునట్టిచో
జనదుమాలంబుగాఁ గలకలార్భటు లుప్పతిల్లెఁ బురంబునన్. 304

శా. ఆకోలాహల మాలకించి శివపూజాసక్తి వర్జించి భీ
మాకారంబున రాజు వచ్చి విశిఖామధ్యంబున న్నిల్వఁగా
నాకాలంబున దత్పురీధవుఁడు గృహీతారాతియై వచ్చి తా
సాకల్యంబుగ దెల్పె దద్రచితచంచద్దుష్క్రియారంభముల్. 305

శా. చండక్రోధము మీఱఁ బాండ్యవిభుఁ డాశత్రుక్షమావల్లభున్
ఖండీభూతశిరస్కుఁ జేసి దురహంకారంబు దీపింప న
ద్దండప్రాభవ మొప్ప వచ్చి నిజసౌధంబందు మృష్టాన్నతృ
ప్తుండై కోమలపుష్పతల్పమున సుప్తుం డయ్యె మదాత్మకన్. 306

తే. పంచవక్త్రునిపూజ వర్జించినట్టి, దోషమునఁ జేసి సామ్రాజ్యమూఁ డయ్యె
బద్ధుఁ డగువైరిఁ జంపినపాపమున ని, కృత్తమస్తకుఁ డయ్యె నాన్నృపవరుండు. 307

ఉ. ఆనరపాలనందనుఁ డహంకృతి మున్నుఁ బ్రదోషకాలమం
దానగజాకళత్రుని సమర్చన మాని భుజించి యంతటన్
దా నటు నిద్రఁ జెందినకతంబున నీజననంబునందు భి
క్షానియతాత్మకుం డగుచు శైశవభావమున న్నలంగెడున్. 308

క. ఆరాజుపత్ని సవతికి, ఘోరవిషాన్న మిడి చంపెఁ గుత్సితమతిఁ ద
త్కారణమున నిప్పుడు కుం, భీరముఖగ్రస్తమయ్యె భీతాత్మకయై. 309

క. పరమేశ్వరుఁ బూజింపని, నరులకుఁ బేదఱిక మొదవు నగజారమణున్
ధరఁ బూజించినజనులకు, జిరతరసంపదలు చెందు సిద్ధం బరయన్. 310

వ. అని యావిదర్భరాజకుమారు పూర్వవృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెలియఁజెప్పి

యాభూసురాంగనతో వెండియు శాండిల్యమహామునీంద్రుం డిట్లనియె. 311

ఉ. సారము వేదసమ్మతము సత్యము భద్రకరంబు నాపదు
ద్ధారక మైనవాక్యము హితంబుగ నే వచియింతు ఘోరసం
సారపయోధిమగ్న లగుజంతుగణంబుల కీశ్వరాంఘ్రిపూ
జారతిదప్ప వేఱొకటి సాధన మేమియు లేదు చూడఁగన్. 312

చ. ఎవరు మహాప్రదోషమున నీశ్వరపూజ యొనర్పకుందురో
యెవరు విశిష్టభక్తి గిరిశేశనమస్కృతు లాచరింపరో
యెవరు నిరంతరంబుఁ బరమేశ్వరసత్కథ లాలకింపరో
భువి నతిమూఢభావమునఁ బుట్టుదు రామనుజు ల్దరిద్రులై. 313

ఉ. ఏనరు లైనగాని నిటలేక్షణుఁగూర్చి యనన్యచిత్తులై
పూని ప్రదోషకాలమున పూజ లొనర్చినవార లెప్పుడున్
భూమితభోగభాగ్యజయపుత్రకళత్ర సుహృత్సమేతులై
దీనతలేక యుందురు సుధీజనమానితులై ముదంబునన్. 314

సీ. కైలాసగిరిమీఁదఁ గాలకంఠుఁడు దివ్యహాటకరత్నసింహాసనమున
నద్రిజ నుంచి మహాప్రదోషంబున సకలదేవర్షులు సన్నుతింప
వాణీమహాదేవి వీణ మీటుచునుండ గమలసంభవుఁడు తాళములు వైవ
దానవాంతకుఁడు మృదంగవాద్యము సల్ప శ్రీలక్ష్మి గానంబు సేయుచుండ
తే. వాసవుఁడు వైణవోన్నతస్వరముఁ గూర్ప, గరుడగంధర్వయక్షకిన్నరపతంగ
సిద్ధవిద్యాధరాధిపు ల్సేరి కొలువ, హర్ష మిగురొత్త తాండవం బాడుచుండు. 315

ఆ. ఆప్రదోషమునను హరుఁ డొక్కరుఁడు దక్క, బూజ్యు లెవరు లేరు భూతలమున
నమహానుభావుఁ డర్చితుం డైనఁ బ్రసన్ను లగుదు రపుడు సకలసురలు. 316

మ. వనితా నీతనయుండు పూర్వమున విప్రశ్రేష్ఠుఁడై యాత్మజీ
వనరక్షార్థము దుష్ప్రతిగ్రహత యావజ్జీవపర్యంతమున్
దనరం గాలముఁ బుచ్చి దాన రహితత్వం బొందుటంజేసి క్షై
తనిశాంతస్థితి నుండె నీభవమునన్ సంపత్కళాహీనుఁడై. 317

క. కావున నీతనయుని నీ, భూవరసుతు నీప్రదోషపూజాపరులం
గావింపుము సంచితదో,షావళి నశియించు భాగ్య మబ్బెడు నెలమిన్. 318

చ. అనవిని యాధరామరవరాంగన యమ్మునిసార్వభౌమునిం
గనుఁగొని తత్పదంబులకుఁ గ్రమ్మర వందన మాచరించి యి
ట్లనియె ముదంబు మీఱఁగ మహాత్మ సదాశివపూజనక్రమం
బును వివరింపఁగావలయుఁ బూర్ణకృపారసభావ మేర్పడన్. 319

వ. అని యడిగిన నాభూసురభామినికి శాండిల్యమహామునీంద్రుం డిట్లనిరెను. 320

## శివపూజావిధానము.

తే. ఉభయపక్షంబులందుఁ ద్రయోదశులను, దివమునందు నిరాహారదీక్షఁ దగుచు
వ స్తమయపూర్వఘటికాత్రయంబునందు, స్నానసంధ్యాదికృత్యముల్సలుపవలయు.

సీ. తదనంతరంబున తరుణేందుశేఖరుఁ జిరతరభక్తిఁ బూజింపవలయు
నిర్మలస్థలమున నిబిడగోమయమిశ్రజలముల నచ్చోట నలుకవలయుఁ
బంచవర్ణములుగాఁ బద్మకాదివిచిత్రరంగవల్లుల నొనర్పంగవలయు
అమీఁద నవపల్లవామేయఫలపుష్పవృతమంటపమ్ము నిర్మింపవలయు

తే. నచట నవరత్నఖచితభద్రాసనమున, నంచితంబుగ శివమూర్తి నుంచవలయు
గంధపుష్పాదిపూజోపకరణవస్తు, సంగ్రహము చేసి మునివృత్తి సలుపవలయు. 323

తే. ఆగమోక్తప్రకారమంత్రాభియుక్తి, నపురపీఠంబు నావాహనము నొనర్చి
నాత్మసంశుద్ధి భూతశుద్ధ్యాదివిధుల, నొప్పఁ గూర్చుండవలయు ధీరోత్తముండు.

క. ధీమంతుఁ డైనశైవుఁడు, స్కామముఁడు ముమ్మారు నడువఁగాఁ దగుఁ బ్రాణా
యామంబులు నిశ్చలుఁ డై, కామాద్యంతర్విపక్షఖండనమతి రైౖ. 324

మ. కలుషాఖీలదురంతరోగభవదుఃఖంబు న్నివారించి యు
జ్జ్వలకల్యాణపరంపరాన్వితునిగా సౌభాగ్యవర్ధిష్ణుఁగాఁ
గలితశ్రీనిధిగా నొనర్పు మని సంకల్పంబుఁ గావించి యిం
పలరారఁగ శివపూజ చేయఁదగు నిష్టార్థంబు లీడేరఁగన్. 325

వ. ఇట్లు సంకల్పంబు గావించినబిందుకంబు అయిన బీజవర్ణంబులతో నంతర్మాతృకా ధ్యానముఁ ద్రాధారణంబు లొనర్చి నిజహృదయకమలకర్ణికామధ్యంబున దక్షిణోత్తరప్రదేశంబుల గణపతిగుహసమేతంబుగా సాంబసదాశివునిం బ్రతిష్ఠించి యమ్మహాదేవుండు చంద్రకోటిప్రతీకాశుండును జంద్రార్కవహ్నిలోచనుండును జంద్రశేఖరుండును విశంగజటాజూటుండును నీలకంధరుండును నాగేంద్రకుండలుండును నాగకేయూరహారకంకణముద్రికావలయవిరాజితుండును వ్యాఘ్రచర్మాంబరుండును బ్రహ్మేంద్రాది సమర్చిత పాదపద్ముండును రత్నసింహాసనాసీనుండును మృత్యుంజయుండును వృషభధ్వజుండును నీలలోహితుండును అష్టమూర్తియు శూలపినాకహస్తుండును జగదీశ్వరుండును భగవంతుండునుగా మనంబునం దలంపుచు దద్వామభాగంబున జపాపుష్పసంకాశవర్ణయు నుదయార్కప్రభాభాసమానయు విద్యుత్సమానాంబరయు బాలేందుశేఖరయు సుస్నిగ్ధనీలకుంచితకుంతలయు రోలంబజాలాలకయు మాణిక్యఖచితకుండలభ్రాజితము ఖాంభోజయు

సింధూరతిలకాంచితఫాలభాగయు హరిద్రాగంధవిలేపితకపోలదర్పణయు మంద
హాసవిరాజితశోణాధరబింబయుఁ త్రిరేఖాయుతకంబుకంఠియుఁ బద్మకోశనిశా
శకుచయుగ్మయుఁ జతుర్భుజయుఁ బాశాంకుశధనుర్బాణధారిణియు సువర్ణమణి
మయమేఖలాపరిశోభితనితంబబింబయు రంభాస్తంభప్రతిమానమృదూరుయుగ్మ
యు గంధర్వతూణీరసమానజంఘికయు దేవగంధర్వకామినీసమర్చితపాదకమల
యు నిందీవరేక్షణయు మందారపుష్పదామవిరాజద్వేణియు మహాత్రిపురసుం
దరియు జగదంబయు నైనగిరికన్యక నాత్మలోఁ దలంచి తదనంతరంబున బా
హ్యపూజాపరుండయి సవ్యాపసవ్యంబుల గురుగణేశులఁ బూజించి యాగ్నేయా
ద్యష్టదిగ్భాగంబుల క్షేత్రపాలక వాస్తోష్పతి సరస్వతీ పార్వతీ ధర్మజ్ఞానవైరా
గ్యైశ్వర్యంబుల నవిరాంతంబులుగాఁ బూజనంబులు గావించి యింద్రాద్యష్టది
క్పాలకులను సప్తమాతృకలను నణిమాద్యష్టసిద్ధులను ధర్మాధర్మంబులను దత్తద్దేవతా
కంబు లయినమంత్రంబుల సమర్చితులు గావించి నందీశ్వర చండీశ్వర భృంగీశ్వ
ర కుమారవీరభద్ర సమేతుండును దేజోమయుండును నైనసాంబసదాశివస్వామిని
న్యాసపూర్వకంబుగా రుద్రసూక్తంబుల షోడశోపచారవిధులం బూజింప
వలయు. 326

సీ. ధ్యానంబు త్రిజగదాధారచిన్మూర్తికి నావాహనము శైలజాధిపతికి
నవరత్నసింహాసనము దేవదేవున కర్ఘ్యంబు త్రిపురసంహారునకును
పాద్యంబు త్రైలోక్యపాలనశీలున కాచమనంబు ఫాలాక్షునకును
అభిషేకములు నిర్జరాపగాధరునకు వస్త్రయుగ్మంబు దిగ్వసనునకును
తే. యజ్ఞసూత్రంబు బహువిధయజ్ఞపతికి, గంధపుష్పాక్షతములు శ్రీకంఠునకును
పరిమళోపేతధూపంబు పశుపతికిని, దీప మిడఁ దగు బ్రహ్మాండదీపకునకు. 327

చ సలలితగోఘృతాక్తగుడశార్కరమిశ్రితభక్ష్యభోజ్యముల్
ఫలములు కందమూలములు పాయసము ల్కలమాన్నసూపశా
కలజలదుగ్ధమస్తు దధితక్రముఖప్రథితోపహారము
ల్వెలయ నొసంగి కప్పురపుబీటిక లీఁ దగుఁ జంద్రమౌళికిన్. 328

వ. తదనంతరంబున. 329

క. శైరవహితశేఖరునకు, గౌరీహృదయారవిందకమలాప్తునకున్
శ్రీరంజిల్లఁగ నుత్తర, నీరాజన మొసఁగవలయు నిర్మలభక్తిన్. 330

క. గీష్పతికమలావరవా, స్తోష్పతిముఖదేవనుతశుభపాదునకున్
బుష్పాయుధసంహారునకుఁ, బుష్పాంజలి యొసఁగవలయు బుధులు నుతింపన్. 331

ఆ. వృషభవాహనునకుఁ బ్రదక్షిణత్రయనమస్కారపంచకంబు సలుపవలయు
సిద్ధసేవ్యుఁ డైనశ్రీసదాశివుముందఱ, నృత్యగీతవిధులు నెరపవలయు. 332

సీ. జయచంద్రకోటీర జయభక్తమందార, జయగరళాహార సర్పహార
జయపోషితాజాండ జయజనార్దనకాండ జయమేరుకోదండ సవనఖండ
జయనిర్జితానంగ జయసత్కృపాపాంగ జయసుధాధవళాంగ జయకురంగ
జయదేవతాధ్యక్ష జయమదాసురశిక్ష జయశ్రీవిరూపాక్ష సాధురక్ష

తే. జయగగనకేశ సంసారభయవినాశ, జయభుజగనాయకోష్ణీష సత్యభాష
జయకరాంచితశూల దుర్జనవిఫాల, జయశుభప్రదనామ భాస్కరసుధామ. 333

శా. ఆధివ్యాధిసమావృతుండ భవభారాధీనుఁడన్ దీనుఁడన్
బాధాయుక్తుఁడ నే నకించనుఁడ దుష్పాపాకులస్వాంతుఁడన్
క్రోధాద్యావృతుఁడన్ జడుండ శఠుఁడన్ గ్రూరుండఁ గష్టుండ నో
వేధస్సన్నుత దేవదేవ కరుణ వీక్షించి రక్షింపవే. 334

క. శరభావతార శంకర, శరభా హేరంబజనక చంద్రవతంసా
శరభార్కచంద్ర పాండుర, శరభంగాదికమహర్షిసన్నుతచరితా. 335

తే. శరణు శ్రీపార్వతీనాథ శరణుశరణు, శరణు కైలాసగిరివాస శరణుశరణు
శరణు వృషభేంద్రవాహన శరణుశరణు, శరణు సర్వమహాదేవ శరణుశరణు.

క. రక్షింపుము పరమేశ్వర, రక్షింపుము ఫాలనేత్ర రమ్యచరిత్రా
రక్షింపు భక్తవత్సల, రక్షింపు విపన్నజనశరణ్య మహాత్మా. 337

తే. నిఖిలలోకైకనాథ మహేంద్రవంద్య, మించి నే చేయుతప్పు సహించి ప్రోవు
మనుచుఁ బ్రార్థన మొనరించి హర్ష మొదవ, శివకథాకర్ణనంబుఁ దాఁ జేయవలయు.

క. అనయంబు సాధకుఁడు నిర్ధనుఁ డైన మహాధ్యుఁ డైనఁ దద్దయుఁ బ్రీతిన్
వినయమున శంకరుని బ్రార్థనచేయఁగవలయు భక్తితాత్పర్యమునన్. 339

మ. జపహోమంబు లొనర్చి సాధకుఁడు సచ్ఛాల్యన్నదానక్రియా
ద్యుపచారంబుల భూసురేంద్రులకు సంతోషంబుఁ గావించి మా
న్యపరీతుం డగుచుం దదీయవిభుసాన్నప్రాశనుం డై యుమా
ధిపు సేవించినఁ జెందు సంపదలు భక్తిజ్ఞానవైరాగ్యముల్. 340

చ. ప్రమథగణేశు శంకరుని బన్నగహారు మహాప్రదోషకా
లమున నితాంతభక్తి విమలాత్ములు పూజ లొనర్చి భోగభా
గ్యముల సుఖంబుఁ గాంతురు జగద్విదితంబుగ నట్టివారిదే
హములను లేము అంటవు సహస్రభవంబులనైన మానినీ. 341

మ. ధరణీభాగమునందు మర్త్యులు శివద్రవ్యాపహారక్రియా
దురితం బొక్కటిఁ దక్క దక్కినమహాదుష్పాపముల్ ద్రోచి బం
ధురభాగ్యోన్నతిఁ జెంది మిత్రజనబంధుశ్రేణులం దాము సు
స్థిరులై యుండ్రు ప్రదోషకాలమున భక్తిన్ శంభుఁ బూజించినన్. 342

శా. ఆయుష్యంబు సుపుత్త్రపౌత్త్రసముదాయప్రాపణం బంచిత
శ్రేయోవర్ధన ముత్తమవ్రతము దారిద్ర్యక్షయం బుజ్జ్వల
శ్రీయోగంబు నభీష్టభోగవిభవక్షేమంకరం బైనయీ
సాయంకాలశివార్చనామహిమ యెంచన్ శక్యమే యేరికిన్. 343

వ. అట్లు గావున నీ వింక నీబాలకులచేత మహాప్రదోషవ్రతంబు సేయింపుము అట్లు గావించిన వీరలకు దారిద్ర్యంబులు దొలంగి మహదైశ్వర్యములు సిద్ధించు ననియానతిచ్చిన యమ్మహామునివచనమ్ము లాకర్ణించి యావిప్రభామిని బాలకులుం దాను నమ్మహాత్మునిపాదములకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి ముకుళితహస్తలై యిట్లనిరి. 344

క. మునినాథ నీప్రసాదం, బునఁ జేసి కృతార్థ నైతి బుధసన్నుత మ
త్తనయులుగా నీ యిరువుర, ననయము నొకరీతిఁ బెంచి యరసితి వీరిన్. 345

తే. వసుధ మత్పుత్త్రకుఁడు శుచివ్రతుఁ డనంగఁ, బేరువడినట్టివాఁడు నీధారుణీశ
నందనుఁడు ధర్మగుప్తుఁ డనంగ వెలసె, నింక మేమువ్వురము భవత్కింకరులము. 346

వ. మునీంద్రా యీమహాఘోరదారిద్ర్యపారావారంబున మునింగియున్న మమ్ముద్ధరింప నీవ యర్హుండవు అనన్యశరణ్యులమై యున్నమమ్ముం గడతేర్పు మని దైన్యసంబుఁ దోఁపం బలికిన యాభూసురభామినిం గటాక్షించి యమృతోపమానంబు లగువాక్యముల నూరడించి యాబాలకులకు మహేశ్వరారాధనపరం బగుమంత్రవిద్య నుపదేశించిన వారును ప్రహృష్టాంతరంగులై యమ్మహర్షిసత్తమునకుఁ బ్రణమిల్లి తదనుజ్ఞాతులై యమ్ముగ్గురు నిజమందిరమునకుఁ గ్రమ్మఱఁ జనుదెంచిరి శాండిల్యమహామునీంద్రుండును నిజతపోవనమునకుం జనియె నంత. 347

క. మునివరుసుపదేశక్రమ, మున నయ్యిరువురు ప్రదోషపూజాపరు లై
యనుదినమును వర్తింపఁగఁ, జనిరి మాసములు నాల్గు సమ్మదలీలన్. 348

సీ. అంతట నొక్కనాఁ డాబాలు రిరువురు మాధ్యాహ్నికస్నాన మాచరింపఁ
బోయి నదీతటంబున విహారము సల్పుచుండ నం దొకచోట నుత్కటముగ
నిర్ఘాతపాతవినిర్గతం బగుధననిక్షేప మొక్కటి నేత్రములకు
నగుపడఁ జూచి యత్యాశ్చర్యమును బొంది మునుము [illegible] గొనుచు వచ్చి

తే. అంబ వీక్షింపవమ్మ శ్రీసాంబశివుని, మానితానుగ్రహం బీనిధానకుంభ
రూపమునఁ గానఁబడియె నిద్దట్టముగను, సత్వరంబుగ మనయదృష్టము ఫలించె.

క. అనిచెప్పిన బాలకులం, గనుఁగొని యాయమయు హర్షకలితాత్మకయై
తనయుల కిట్లనె మీ రీ, ధనము విభాగించికొనుఁడు ధర్మస్థితిగన్. 350

వ. అని పలికిన రాజకుమారుం డిట్లనియె. 351

తే. తల్లి యీతనయుండె యీధనముఁ గొనుట, కర్హుఁ డగుఁగాని యేను గానట్టి యగుట
నీశ్వరుం డింక నేమైన నిచ్చునేని, దాని నే భక్తిఁ గొందు దథ్యంబుగాఁగ. 352

క. అని పలికి ధర్మగుప్తుఁడు, మనుపటిచందమున నభవుఁ బూజించుచుఁ బా
వనమతి నుండఁగఁ గాలము, చనియెక సంవత్సరంబు సంపూర్ణముగన్. 353

తే. ఇట్లు వైదర్భనందనుం డింపుమీఱ, ద్వాదశాబ్దవయస్కుఁడై మోద మలర
విమలభక్తి గురూపదేశమునఁ జేసి, సంతతంబును శివపూజ సలుపుచుండె. 354

ఉ. అంత నతిప్రకాశితదిగంతము వర్ధితశాతకౌమరా
ట్కాంతము తోషితాఖిలశకుంతము కైటభజిత్కుమారసా
మంతము భృంగమార్గణసమంతము సర్వవసుంధరాస్థలా
క్రాంతము పాంథజీవనదురంతము దోఁచె వసంత మయ్యెడన్. 355

వసంతఋతువర్ణనము.

క. కలకంఠశుకపికావళి, కలకలరవముల నెసంగెఁ గాననభూముల్
జలజేందీవరమల్లిక, కలితములై యొప్పుచుండెఁ గాసారంబుల్. 356

వ. ఇట్లఖిలజనచిత్తానందకరంబును సమస్తమంగళాయతనంబును నశేషవృక్షవాటికా
జీవనాపథమును రతిరాజవిజయకారణంబు నైన యవ్వసంతసమయమున నా బ్రహ్మ
క్షత్త్రియనందను లిరువురు వినోదార్థముగా వనమునకుం జని యథేచ్ఛావిహారముల
వర్తింపుచున్నంత నతిదూరంబున క్రీడించుచున్న గంధర్వకన్యలం జూచి తద్వి
లాసాతిశయములకు దనమనంబున విస్మయము దీపింప శుచివ్రతుం జూచి ధర్మ
గుప్తుం డిట్లనియె. 357

శా. అన్నా కన్గొను మివ్వనాంతరమునం దత్యంతసౌందర్యసం
పన్నాకారము లొప్ప దివ్యవనితల్ భాసిల్లుచున్నారు ద
త్సాన్నిధ్యంబున కేఁగి చూతము విలాసార్థంబుగా నీవు ర
మ్మన్నన్ భూసురనందనుం డనియె సాంత్వాలాపపూర్వంబుగన్. 358

చ. బుధులము బ్రహ్మచారులము పూర్ణవయస్కులమైన నితాంతవా
క్షధురిమముం జలత్కపటమానసశీలంబులు గల్గుస్త్రీలస

న్నిధి జరియింపఁ బోవఁ దగునే మన కిప్పుడు గ్రమ్మరంగ స
త్యధికరయంబున న్నిజగృహంబున కేఁగుట యుక్త మారయన్. 359

క. నావిని రాజతనూభవుఁ, డావిప్రకుమారుతోడ నటులైనఁ దగన్
నీ విచట నుండు మిప్పుడు, నే వచ్చెద ననుచు బలికి వేడుకఁ జనియెన్. 360

శా. ఆరాజన్యకుమారుఁ డొక్కరుఁడ యుద్యానప్రదేశంబునం
దారామామణులం గనుంగొనఁగ నత్యానందభావంబునన్
జేర న్వచ్చినచో నొకానొకసురస్త్రీరత్న మా రాసుతున్
శ్రీరంజిల్లఁగఁ జూచి యద్భుతముగాఁ జింతించె జిత్తంబునన్. 361

శా. మారుండో నలకూబరుండొ విధుఁడో మానుష్యదేహంబునం
జేరన్ వచ్చె నిజేచ్ఛతో నిపు డహో చిత్రంబు చర్చింప నీ
తారుణ్యస్థితి యీదరస్మితము నీధైర్యంబు శౌర్యంబు మ
న్నేరాజన్యకుమారరత్నములయం దీక్షింపలే దెన్నఁడున్. 362

చ. కమలదళాయతేక్షణుఁడు కంబుగళుం డతిదీర్ఘబాహుఁడున్
సముదగజేంద్రయానుఁడు విశాలసువక్షుఁడు సుందరాననుం
డమలసువర్ణవర్ణుఁ డగునట్టిగుణోన్నతు నంబుజాసనుం
డమర సృజించె నార యహహా యనుచుం దలయూఁచు మాటికిన్. 363

ఉ. ఈవరనాథచంద్రుఁడు మహేంద్రకుమారనిభుండు గావునన్
వీని వరింప నామదికి వేడ్క జనించె నటంచు నుండ నా
లోన నతండు వచ్చి విమలోత్పలనేత్రి మరాళగామినిం
భూనుతుఁ డైనచిత్రరథుపుత్త్రికయై తగుదానిఁ గన్గొనెన్. 364

మ. కని యిక్కోమలి దేవతాయువతియో గంధర్వరాట్కన్యయో
దనుజేట్పుత్త్రియొ నాగకామినియొ సిద్ధాపత్యమో లోకమో
హినియో యోఁచె నటంచు రాసుతుఁడు దా నీక్షించె నీలాలకన్
గనకాంగిం గరిరాజగామిని శరత్కంజాతపత్త్రేక్షణన్. 365

ఆ. అదియు నృపకుమారుహావభావవిలాస, విభ్రమములఁ జూచి వేడ్కతోడ
నచట నిలిచి యారాజసుతునకు, నెదురువచ్చి ప్రీతి నిట్టు లనియె. 366

క. ఓరాజతనయ భవదా,గారంబున కేఁగు మిపుడు గార్యార్థముగా
నీ రేయి గడపి క్రమ్మఱ, నేరమ్ము ప్రభాతమునను వెలయు శుభంబుల్. 367

వ. అని పల్కి యాగంధర్వరాజకన్యక సఖీజనసమీపంబునకు మరలం జనియె నంత
నారాజకుమారుండును భూసురనందనుం డున్నయెడకు వచ్చి గృహంబునకుం జని
తనతల్లికి మనఃప్రియంబు గావింపుచు నారేయి గడపి మఱునాఁడు ప్రభాత

అంబున ద్విజపుత్రకసహితంబుగా వనంబుఁ బ్రవేశించి పూర్వనిర్దిష్టం బైన ప్రదే
శంబునకుం జని. 368

క. కనుఁగొనె నాబాలకయుగ, మనుపమతేజోభిరాముఁ డగుచిత్రరథుం
డనయాయుతుఁడై యతఁడును, గనె నంతఁ గుమారకుల వికాసితముఖులన్. 369

### చిత్రరథుం డను గంధర్వరాజు ధర్మగుప్తునకుఁ దన కూఁతు నిచ్చి వివాహం బొనర్చుట.

ఆ. కాంచి మోద మలర గంధర్వనాథుండు, సాదరముగ వారి సన్నుతించి
లలితవృక్షమూలతలమునఁ గూర్చుండి, నృపకుమారుతోడ నిట్టు లనియె. 370

సీ. భూపాలసుత విను పూర్వదినంబున జనియుంటి కైలాసశైలమునకు
నాస్థలంబున గంటి నార్యాసమేతుఁడై వెలయుమహాదేవు విశ్వనాథు
నంత నద్దేవుఁ డఖిలసుపర్వులు వినఁగ నాతో నిట్టు లనుచుఁ బలికె
ధర్మగుప్తుం డనుధరణీశనందనుఁ డొకఁడు వర్తించు నీయుర్వియందు
ఆ. వాఁ డకించనుండు హతబాంధవుండును, భ్రష్టరాజ్యుఁ డగుచు బరఁగుచుండు
సరసభావ మలర గురువాక్యమునఁ జేసి, చెలఁగి నన్నుఁ బూజ సేయుచుండు.

క. హతబంధుం డగు నాతని, పితరులు నాలోకమునను బ్రియముగ సౌఖ్య
స్థితి నున్నవారు తగఁ ద, త్కృతపూజామహిమఁ జేసి కీర్తి చెలంగన్. 372

ఉ. నీవు వివేకశాలి వతినిశ్చలచిత్తుఁడ వట్లు గావున
న్నే వచియించెదన్ వినుము నిర్మలసద్గుణగణ్యుఁ డైనయా
భూవరనందనుండు పరభూపతుల న్వధియించి రాజ్యసం
భావితవృత్తి నుండ ననపాయసహాయతఁ జేయు మేర్పడన్. 373

క. అని యానతిచ్చిన సుమే, శునియాజ్ఞ మదీయ మైనశుభగృహమునకుం
జనుదేరఁగ నంతట మ, త్తనయాప్రార్థితుఁడ వైతి దద్దయుఁ బ్రీతిన్. 374

సీ. అటుగాన నీశ్వరునాదేశ మంతయుఁ దెలిసి మదీయపుత్రికను గొనుచుఁ
జనుదెంచినాఁడ నివ్వనమున కేనిప్పు డతిమైత్రితోడ మత్సుత గ్రహింపు
మటుమీఁద భవదీయకుటిలశాత్రవరాజసముదయంబుల నెల్ల సంహరించి
నీదుసామ్రాజ్యంబు నీ కిత్తు శివునాన ప్రేమ నీకనకాంగిఁ బెండ్లియాడి
తే. వైభవమున మీఱఁ బదివేలవత్సరంబు, లధికకల్యాణసౌఖ్యంబు లనుభవించి
యంత కిన్నరయక్షవిద్యాధరాది, సేవ్య మగుశివపదమును జేరఁగలవు. 375

క. అనిపలుకుచు గంధర్వుఁడు, తనపుత్రిక నొసఁగి రాజతనయునకును ద
ద్వనమధ్యమున వివాహం, బొనరించె యథోక్తవిధి మహోత్సవ మెసఁగన్.

వ. ఇవ్విధంబున గంధర్వనాయకుం డారాజనందనునకుఁ బరమోత్సవంబుగా నిజ తనూజం బాణిగ్రహణంబు సేయించి పారిబర్హంబుగాఁ గనకరత్నమయంబు లైన యమేయదివ్యాంబరాభరణంబులును భాసమానంబు లగుముక్తాహారంబులును చంద్రసన్నిభం బైనశిరోరత్నంబును దశసహస్రభద్రగజంబులును నీలవర్ణంబు లైన తురంగనియుతంబులును అనేకసహస్రసంఖ్యాతంబు లైనకాంచనస్యందనంబులును మఱియు నొక్కదివ్యరథంబును దివ్యకార్ముకంబును దివ్యాస్త్రమంత్రస్తోమోపసంహారంబులును అక్షయసాయకంబులును దూణీరయుగళంబును అభేద్యం బగునదివ్యవర్మంబును శత్రుమర్దనం బైనఖడ్గంబును అమోఘం బగు శక్తియును దుహితృపరిచర్యార్థంబుగా దాసీజనసహస్రంబు నొసంగిన నారాజకుమారుండు మహాదైశ్వర్యసంపన్నుం డై నిజభార్యాసమేతంబుగాఁ బరమానందంబునుం బొంది యుండె. నంత నాగంధర్వుండు నాదంపతుల వీడ్కొని విమానారూఢుం డై క్రమ్మఱ నిజలోకంబునకుం జనియె. నంత నారాజనందనుం డయ్యామాత్యపుత్త్రుం దమునకుచి వ్రతున కిట్లనియె. 377

తే. సమరమున వైరివీరుల సంహరించి, యస్మదీయమహీరాజ్య మాక్రమించి
మిమ్ము రావింతు నని పల్కి సమ్మతించి, చనియెఁ ద్విజనందనుం డాత్మసదనమునకు.

వ. తదనంతరంబ. 379

ధర్మగుప్తమహారాజు తనశత్రు వైనదుర్మర్షణుని వధించి
తనరాజ్యంబు మరలఁ గైకొనుట.

క. కృతకృత్యుం డగుధర్మగుప్తవిభుఁ డీరీతిన్ గృతోద్వాహుఁ డై
చతురంగంబులు గొల్వఁగాఁ జని ద్విషత్సైన్యంబులం ద్రుంచి యుద్ధతి దుర్మర్షణుఁ బోరిలోఁ జ్యతురదత్తం బైనయాశక్తిచే
హతునిన్ జేసి పురంబుఁ జొచ్చె నిజమిత్రామాత్యయుక్తంబుగన్. 380

శా. భేరీవాద్యము లుల్లసిల్లఁ బరమశ్రీశాల్యుఁ డై వైభవ
శ్రీ రంజిల్లఁ బురంబుఁ జొచ్చి విలసత్సింహాసనాసీనుఁ డై
గౌరీనాథకృపాకటాక్షమున దోర్గర్వంబు దీపింపఁగాఁ
వా రాజ్యం బొనరింపుచుం డెను సమస్తారాతిసంహారుఁ డై. 381

సీ. ఏవిప్రసతి మాతృహీనుని దనుఁ దెచ్చి మచ్చిక చేసి చన్నిచ్చి పెంచె
జాతకర్మాదిసంస్కారంబు లొనరించి శ్రీగురుకారుణ్యసిద్ధుఁ జేసె
సతతప్రదోషము వ్రతశీలు గావించి పరమేశుపూజనాపరుని జేసె
ఘోరదారిద్ర్యాంధకారంబు లెడబాపి భాసురైశ్వర్యసంపన్నుఁ జేసె

తే. నట్టియాభూసురాంగన నపుడు తనయు, సంతసంబుగ రప్పించి జననిమాడ్కి-
దనదుశుద్ధాంతమునసుంచి దయ దలిర్ప, నిజవధూయుక్తుఁడగుచు మన్నించుచుండె.

క. ఆరాజదంపతుల తన, కూరిమి రంజిల్లఁగాను గోడలుఁ గొడుకుం
గా రహిఁ భావింపుచు నతి, గారాబము చేయుచుండె గాంభీర్యమతిన్. 383

వ. ఇవ్విధంబున. 384

మ. జనకుం జంపినవైరులు న్మరలఁగా సాధించి దుర్మర్షణుం
జనితామర్షణుఁ బోరిలోఁ దునిమి రాజ్యం బేలెఁ దాఁ గ్రమ్మరన్
జనసంస్తుత్యుఁడు ధర్మగుప్తుఁడు శివాచారంబు దీపింప న
జ్జననాథాగ్రణి సాటిగాఁ గలరె భూచక్రంబులోఁ బార్థివుల్. 385

క. దశవర్ష సహస్రంబులు, పశుపతిపూజావినోదపారీణుం డై
భృశతరసామ్రాజ్యశ్రీ, వశుఁ డయి నిష్కంటకముగ వసుమతి నేలెన్. 386

వ. ఇట్లు ధర్మగుప్తుండు జన్మాంతరకృతం బయినప్రదోషశివపూజావమానదోషంబున బాల్యకాలమునఁ దాదృశం బగుదైన్యం బనుభవించి శ్రీమహేశ్వరారాధన తత్పరుండయి తత్సుకృతమున నిజభార్య యైనగంధర్వకన్యకతోడం గూడి పిత్రుపై తామహం బయినరాజ్యమున నఖండసామ్రాజ్యభోగము లనుభవించి యంత్యమున ననంతతేజోవిరాజమానం బయినశివలోకమ్మున సుఖం బుండె నని చెప్పి సూతుం డిట్లనియె. 387

సీ. వినుఁడు తాపసులార విఖ్యాతిగఁ బ్రదోషకాలంబునందు శంకరునిపూజ
గావింప ధర్మార్థకామమోక్షములకు సాధకం బై యుండు సత్యముగను
నేకాలమం దయిన నీయుపాఖ్యానంబు వినిరేని సజ్జనవితతి కెల్ల
భవబంధములు వాయు భవశతములనైన దారిద్ర్య మనుమాట దలఁచరాదు

తే. అట్లు గావున పుణ్యాత్ము లైనవారు, శివసమారాధనముఁ జేసి చిరతరముగ
భుక్తిముక్తులు గాంతు రప్పురుషవరుల, పాదరజములు జగముఁ బావనము సేయు.

పంచవర్గరహితము. హరిశరశివసర్వేశ్వర, సురసేవ్యహాలాహలాశశూలవరశయా
సురవైరివీరసంహార, శరహంస యశోవిలాస శైలావాసా. 389

ఉ. గోపతిముఖ్యదేవమునికోటిసమర్చితపాదపీఠతా
రాపథవాహినీజలవిరాజితమస్తకభానునందనా
టోపవిభేదకారణపటుస్ఫుటకాంచనశైలకార్ముకాం
చాపురపార్థివేశ్వర విపన్నజనావనలోకపావనా. 390

కవిరాజవిరాజితము. భవహర శంకర భర్గ శివంకర భక్తవశంకర పాపహరా
భువనసుజీవన భోషితరావణ భూతివిలేపన సౌఖ్యకరా

సమనవిదారణ సన్నుతచారణ శాత్రవమారణ శూలధరా
సుమనితభూధర సోమకళాధర శోషితసింధుర దైత్యవరా. ౩౦

గద్యము. ఇది శ్రీమద్రాముభద్రకరుణాకటాక్షవీక్షణసమాలబ్ధ గీర్వాణాంధ్రభాషా కవిత్వ కళాధురంధర బడగలనాటి కన్నడవంశపయఃపారావార రాకాసుధాకర ఆశ్వలాయనసూత్ర భారద్వాజసగోత్ర శ్రీధరమల్లెఅయ్యసార్యతనయ సుజనవిధేయ వెంకటరామనామధేయప్రణీతం బైనబ్రహ్మోత్తరఖండం బనుమహాపురాణమునందు కల్మాషపాదుచరితమును గోకర్ణమహాత్మ్యమును చండాలీకథనమును దీపమాలికాప్రదానఫలమును శివయోగి యైనమాణిభద్రుండు చంద్రసేనమహారాజునకుఁ జింతామణి యొసంగుటయుఁ దత్కారణమున సకలదేశాధిపతులు దద్విభవము సహింపఁజాలక యుజ్జయినీనగరముచుట్టు విడియుటయు శంకరసపర్యనమును శ్రీకంఠోపాఖ్యానమును హనుమద్దర్శనమును దేశాధిపతులు చంద్రసేనమహారాజుతో మైత్రిఁ గావించి క్రమ్మఱం దమతమనగరములకుఁ జనుటయు ధర్మగుప్తజననమును శాండిల్యమహాముని యనుగ్రహము వడసి ప్రదోషపూజనము సేయుటయును దత్ప్రభావమున గంధర్వపతి యైనచిత్రరథుపుత్త్రిం బాణిగ్రహణము గావించి చతురంగబలసమేతుం డయి దుర్మర్షణుం జయించి పిత్ర్యం బయినరాజ్యంబు వడయుటయు ననుకథలుఁగల ద్వితీయాశ్వాసము.

---

# తృతీయాశ్వాసము.



శ్రీదేవదేవ సాంబ మ
హాదేవ గిరీశ భాస్వదంబాపుర ధా
త్రీదేవార్చిత శంకర
వేదాంతమయాంగ పార్థివేశ్వరలింగా. 1

వ. దేవా యవధరింపు మఖిలపురాణకథాకథనదక్షుం డయినసూతుం డమ్మునుల నవలోకించి యి ట్లనియె. 2

శా. నిత్యానందము నిర్వికల్పము సదా నిర్వాణసౌఖ్యప్రదం
బత్యంతాఘహరంబు నిర్మలము నాద్యంతంబు నిర్దుష్టమున్
సత్యజ్ఞానమయంబు సారమును సంసారాబ్ధిపోతంబునున్
శ్రుత్యుక్తం బగుశైవతత్త్వ మెనఁ డెంచున్ వాఁడె ధీరుం డిలన్. 3

ఉ. ఓమునిచంద్రులార వినుఁ డొప్పుగ మానవు లెవ్వరేని ని
ష్కామమనచిత్తులైనను సకాములునైన నఖండభక్తిచేఁ
గామవిపక్షు శూలిఁ గరకంధరు నాశ్రితపారిజాతమౌ
హైమవతీమనఃప్రియు నహర్నిశమున్ భజియింపఁగాఁ దగున్. 4

క. భవచక్రోద్భవు లగుమానవులకు శరణంబు శంభునామమె తలఁపన్
భువిలో లేదు తదన్యము, శివభజనము సర్వసౌఖ్యసిద్ధి యొసంగున్. 5

క. ధనకనకవస్తువాహన, వనితాసుతభోగభాగ్యవాంఛాపరులై
మనసిజహరు సేవించిన, జనులకుఁ దత్కామితార్థసంసిద్ధి యగున్. 6

మ. అలరన్ సాంబశివుండు కాలమదసంహారుండు సర్వాత్మకుం
డలఘుప్రాభవుఁ డట్లు గావునఁ దదీయారాధనాంతఃప్రతం
బులు సక్రాంత మకాలమృత్యుభయము ల్పోఁ ద్రోయు టాశ్చర్యమే
తొలఁగుం దారుణకాలమృత్యువు తదత్యుగ్రప్రభావంబునన్. 7

## సోమవార వ్రతప్రభావము.

క. వ్రతములలోన మహేశ్వర, వ్రతములు ముఖ్యములు సోమవార వ్రత మా
వ్రతములయందు విశేష వ్రత మన శోభిల్లుచుండు వసుమతిలోనన్. 8

చ. విమలమనస్కుఁడై నరుఁడు విశ్రుతభక్తి వెలంగ సోమవా
రములఁ బ్రదోషకాలమున రాజితమంటపమధ్యపీఠికన్
హిమగిరిపుత్రికారమణు నిందుకళాధరు షోడశోపచా
రములను బూజచేసిన దురంతవిపద్భయ మొందఁ డెన్నఁడున్. 9

చ. అనిశము సోమవారదినమం దుపవాసము సల్పి శంభుపూ
జన మొనరింపఁగావలె ద్విజన్మ నృపాలక వైశ్య శూద్రులం
దును నెవరైన నాశ్రమచతుష్టయవర్తులు నెవ్వరైన స్త్రీ
జనములు నెవ్వరేనియును నీశు భజించుట యుక్త మారయన్. 10

క. క్షితి నీయర్థంబున కొక, యితిహాసము గలదు దాని నెఱిఁగింతు వినుం
డతిమోదంబున నేత, ద్వ్రతమహిమలు దోఁచినంత వర్ణింతుఁ దగన్. 11

వ. అని చెప్పి వెండియు ని ట్లనియె. 12

## చిత్రవర్మమహారాజు చరిత్రము.

మ. అమలాచార ధరామరేంద్రకలితార్యావర్తదేశంబునన్
సమదేభాశ్వరథాంగవీరభటభాస్వద్రాజసంసేవ్యమై
కమలేందీవరహంసకోకవిలసత్కాసారకేళీమ
త్కమనీయం బగురాజధానివెలయుం గాళిందితీరంబునన్. 13

ఉ. అప్పురమేలు సంతతసమప్రతిపాలితధర్ముఁ డుల్లస
ద్రూపజితేక్షుధన్వుఁడు విరోధినరేశ్వరకాలధర్ముఁ డ
ష్టాపదచిత్రధర్ముఁడు విశాలసుకర్ముఁడు చిత్రవర్ముఁ డన్
భూపతిశేఖరుండు పరిపూర్ణకృతాధ్వరపుణ్యశర్ముఁడై. 14

సీ. కారుణ్యమ ప్రభాశాలితవిద్యావా ర్తిఁ గమలాక్షు కమలార్త కమలభవుల
వరభోగసౌందర్యవాగ్విశేషంబుల జిష్ణుజిష్ణుకుమారజిష్ణుగురుల
భూతిప్రతాపసంపూర్ణవైభవముల భర్గభర్గాత్మజ భర్గసఖుల
ఘనబుద్ధిసత్కళాగాంభీర్యగుణముల జంద్రనందనచంద్రచంద్రగురుల

తే. సవహసించు నటంచు దిగంతరముల, సకలజనములు వినుతింప సమ్మదమున
రాష్ట్రమేలుచు నుండె సురక్షితముగ, చిత్రవర్మఁ డను పుణ్యచరిత్రుఁ డగుచు. 15

క. శరణాగతరక్షణమును, హరిహరభక్తియును భూసురారాధనము
న్నిరతం బరినిగ్రహమును, సరసానుగ్రహముఁ గలిగి జనపతి వెలయున్. 16

తే. ధర్మరతుఁ డైనయాచిత్రవర్మనృపతి, కాత్మ మదమందఁ గలిగెఁ బుత్రాష్టకంబు
నంతఁ జిరకాలమునకుఁ గల్యాణధన్య, సకలజనమాన్య యొక్కకన్యక జనించె. 17

గీ. చిత్రవర్మ తనదుపుత్త్రిక నీక్షించి, యార్యుఁ గనిన యాహిమాద్రి కరణి
సంతసిల్లి యపుడు సంపూర్ణకాముండు, నైతి నే నటంచు నాత్మఁ దలఁచె. 18

వ. అంత. 19

మ. అలఘుప్రాభవుఁ డానృపాలకుఁడు కన్యారత్నముం గాంచి యు
జ్జ్వలతేజోవిభవంబు మీఱ నమితోత్సాహైకచిత్తంబు రం
జిలఁగా జాతకలక్షణజ్ఞుల మహాసిద్ధాంతులన్ వేదవే
త్తల రావించి బహూకరించి యడిగెన్ దల్లగ్నభావంబులన్. 20

శా. ఓవిప్రోత్తములార మీరలు మదీయోక్తిన్ విచారింపుఁడీ
మావంశంబున రాజకన్యకలు సామ్రాజ్యాభియోగార్హలై
శ్రీ వర్ధిల్లఁగ నందు రీశిశువు వారింబోలి యశ్రాంతమున్
దేవబ్రాహ్మణపూజనాభిరత యై దీపించునో చెప్పరే. 21

క. నావిని యాసైద్ధాంతికు, లావసుధేశ్వరుని జూచి హర్షముతో సం
భావించి పలికి రప్పుడు, ప్రావీణ్యముతోడ శాస్త్రఫణితులు మెఱయన్. 22

క. ఈమానిని యాగర్భశ్రీమతి యై సత్కళావిశేషాత్మక యై
సీమంతవతీమణి యై, సీమంతిని యనఁగ ధరఁ బ్రసిద్ధి వహించున్. 23

సీ. శరధికన్యకరీతి సౌభాగ్యవతి యగు భారతిగతిఁ గళాప్రౌఢి మెఱయు
మదనారిసతిమాడ్కి మాంగల్యవతి యగు శచిలోమికరణి సంపదలు చెందుఁ
దమయంతిలీల సౌందర్యంబు వహియించు రోహిణివలె మించు రుచిరకాంతి
నయ్యరుంధతిపోల్కి నాచారవతి యగు సావిత్రివైవడి సాధ్వి యగును

తే. విభునితోఁ గూడి తాఁ బదివేలయేండ్లు, సకలసామ్రాజ్యభోగంబు లనుభవించి
యష్టపుత్త్రుల నొక్కకన్యకను గాంచు, పుణ్యచారిత్రి యీపుత్త్రి భూవరేంద్ర. 24

వ. అని యివ్విధంబున నిజపుత్త్రికాజాతకఫలంబులు చెప్పిన సైద్ధాంతికజనంబుల సు
ధారసోపమానంబు లైనభాషణంబు లాకర్ణించి పరమానందకందళితాంతరంగుం
డై యాభూపాలుండు వారల ననేకమణిమయభూషణాంబరంబులం బూజించి
యున్న సమయంబున. 25

తే. అంత నాకధూరభూసురుం డద్భుతముగ, దైవశాలిని బతుర్దశాబ్దంబునందు

పతివిరహాగంబుఁ జెందు నీబాలికయని, రాజునకుఁ దెల్ప మది విచారంబుదోఁప. 26

క. అమ్మాట వజ్రపాతని, భమ్ముగ నాలించి నృపతి బహుతరచింతా
సమ్మూర్ఛితేంద్రియత డెం, దమ్మున నొక్కింతప్రొద్దు తల్లడమందెన్. 27

వ. తదనంతరంబునం బ్రాహ్మణవత్సలుం డైనయమ్మహీపాలుండు గ్రమ్మఱ ధైర్యం బవలంబించి సర్వంబు దైవాధీనం బని మనంబున నిశ్చయించి నిశ్శంకుండై యాబ్రాహ్మణుల నిజనివాసంబులకుఁ బోవం బనిచి తానును నభ్యంతరమందిరంబునకుం జని భార్యాసమేతంబుగా నతిప్రేమంబున నక్కన్యకారత్నంబు ననుదినంబు నుపలాలనంబు సేయుచు నుండె నంత. 28

శా. ఆసీమంతిని పౌరజానపదనేత్రానందసంధాత్రియై
శ్రీసౌందర్యవిలాసయై వివిధధాత్రీవర్ధమానాంగియై
హాసోల్లాసముఖాబ్జయై తరుణరాకాధీశరేఖాకృతిన్
భాసిల్లెన్ బితృబాంధవాదులును సంభావింప నానాఁటికిన్. 29

ఉ. ముద్దుమొగంబు మానికపుఁబోవియుఁ దేటమెఱుంగుఁ గన్నులుం
బ్రొద్దపుమేల్మిసొమ్ములును నిల్కచంబును జెక్కుటద్దము
ల్పెద్దతికంపుముద్దులును బిన్నతనంబును మీఱి యుండఁగా
ముద్దియ యొప్పె బాల్యమున మోహనరూపము గానుపింపఁగన్. 30

సీ. చెలికత్తెలనుగూడి సీమంతినీకన్య శైశవక్రీడాప్రసక్తిఁ దగిలి
బొమ్మలపెండ్లిండ్లు సమ్మోదమునఁ జేయు గురుమైత్రి గుజ్జనగూళ్లు వండుఁ
దులలేనిబంగారుతూఁగుటుయ్యెల నూఁగు నుద్యానవనముల నొప్పఁ దిరుగుఁ
బువ్వువాటికలలోఁ బొలుపొంద విహరించుఁ బంతంబు మెఱసి చేబంతులాడు
తే. దాయములనాడు నోమనకాయలాడుఁ, బాటలను బాడు బేరిగాయలాటలాడు
మున్నుమున్నుగ డాఁగురుమూఁతలాడు, నాసుశీల జగన్మోహనాంగి యగుచు. 31

వ. ఇవ్విధంబున నారాజకన్యక బాల్యక్రీడావినోదంబులం గొంతకాలంబు గడపి పంచమవర్షంబున గురుజనంబులవలన నక్షరస్వీకరణాదికృత్యముల బహువిధశాస్త్రగ్రంథపరిశీలనము గావించి సమస్తవిద్యాప్రవీణయు నత్యంతమేధాధురీణయుఁ బ్రౌఢభాషావిజృంభమాణయు నై యుండె నంత. 32

ఉ. భూవరుతోడ బాల్యమున భూసురవర్యుఁడు పల్కినట్టి త
ద్భావిఫలప్రచారము యథాస్థితిగా నొకనాఁటిరేయి ప్ర
స్తావముగాఁగఁ జెప్పిన నిజప్రియదూత కథానులాపనం
భావము దేశకన్య విని సంతసము [illegible] 33

క. విని యాభూవరనందన, ఘనతరసంతాపశోకకర్శిత యగుచున్
మనమునఁ దహతహఁ జెందుచుఁ, జనియెం గురుపత్నియున్న సదనంబునకున్. 34

ఉ. ఆయవనీశకన్య చని యాత్మగృహాంతరపీఠమధ్యసం
స్థాయిని శుభ్రకేశసముదాయిని భద్రఫలప్రదాయినిన్
శ్రీయుత యాజ్ఞవల్క్యమునిశేఖరమార్గవిధేయి యైనమై
త్రేయిని గాంచె సువ్రతపరిశ్రమతుష్టప్రశాంతపాయినిన్. 35

క. కని తత్పాదాబ్జములకుఁ, దనఫాలము సోఁక మ్రొక్కి తల్లీ వినుమా
నిను నే శరణము సొచ్చితి, మనమున గరుణించి నన్ను మన్నింపఁదగున్. 36

క. ఏసత్కర్మ మొనర్చిన, భాసురసౌభాగ్యపదము ప్రాపించి శుభో
ల్లాసముగ నుండఁ గలిగెను, నాను వ్రత మెఱుఁగఁ బలుకు మనురాగమునన్. 37

వ. అదియునుంగాక దుష్కర్మభయాకులస్వాంతనై భవదీయశరణ్యనై యున్ననన్ను గరుణించి దీర్ఘసుమంగలి యగునట్లుగా ననుగ్రహింపవలయు నని పాదంబులకుఁ బ్రణమిల్లి యున్నయక్కన్యకారత్నంబు నత్యంతకారుణ్యదృష్టిం జూచి తద్గుణశీలంబు లింతయొప్పునే యని యగ్గించి యాశుభాంగికి మనఃప్రియంబుగా మైత్రేయి యిట్లనియె. 38

క. ఓరాజకన్య విను శ్రీ, గౌరిని శాంకరిని నీలకంఠయుతముగా
నారాధింపుము భక్తిని, ఘోరాపద్భయము లడఁచి కుశలము లొసఁగున్. 39

ఆ. సోమవారమునను సురుచిరభక్తితో, నుపవసించి స్నాన మొనరఁజేసి
ధౌతవస్త్రయుగ్మధారణం బొనరించి, శివు నుమేశుఁ బూజ సేయవలయు. 40

చ. శమదమయుక్తులై విమలసామ్యమనస్కులునై సదాశివా
గమనియమజ్ఞులై విగతకైతవభావముఁ గల్గి సోమవా
రములు ప్రదోషకాలముల రమ్యతమోజ్జ్వలగ షోడశోపచా
రములను పార్వతీశ్వరుల రంజిలఁ బూజ లొనర్పఁగాఁదగున్. 41

క. పూజానంతరమున ద్విజు, భోజన మొనరించి మఱియు భూసురసతులం
బూజించి హరిద్రాంజన, రాజితకుసుమకంచుకాంబరము లీయఁదగున్. 42

క. ఎటువంటియాపదలు సంకటములు ప్రాపించినను జగన్నుత మగుధూ
ర్జటిపూజ విడువఁగూడదు, పటుమతి గావించినను శుభం బగు నిపుడున్. 43

వ. అని చెప్పి యమ్మహామునిపత్ని సీమంతినిం జూచి యీ నిష్టమహావ్రతఫలంబు వివరించె
ద సావధానంబుగా నాకర్ణింపు మని యిట్లనియె అభిషేకంబున శాపక్షయంబు
ను దీపపూజనంబున సామ్రాజ్యంబును గంధమాల్యాక్షతార్పణంబులవలన వసే

సౌభాగ్యసౌఖ్యంబులును ధూపదానంబున సౌగంధ్యంబును దీపప్రదానంబున
కాంతివిశేషమును నైవేద్యమున మహాభాగ్యమును తాంబూలదానమున సంపద్
వృద్ధియు నమస్కారంబున ధర్మార్థకామమోక్షప్రాప్తియు మంత్రజపంబున సక
లాద్యష్టైశ్వర్యసిద్ధులును హోమంబున సర్వలోకాభివృద్ధియు బ్రాహ్మణభోజనం
బువలన సమస్తదేవతాసంతుష్టియు సువాసినీపూజనంబున దీర్ఘసుమంగలీత్వ
ము గలుగు నట్లుగావున నీ విమ్మహావ్రతంబు గావించి భవానీశంకరుల నారాధింప
ము తత్ప్రసాదంబున నాపత్సముద్రంబు నిస్తరించి విప్రియత్వంబునుం జెందక
సుఖమున నుండుదువు శివపూజామహాత్మ్యమువలన మహాఘోరసంకటము లైన
దొలంగు నని సోమవారవ్రతప్రభావము దెలియం జెప్పిన నారాజకన్యక సంతు
ష్టాంతరంగ యై యమ్మైత్రేయికి పునఃపునఃప్రణామంబు లొనరించి తదనుజ్ఞాత యై
క్రమ్మఱ నిజసౌధంబునకు వచ్చి తదాజ్ఞాప్రకారమున నమ్మహావ్రతం బాచరించు
చుండె నంత. 44

సీ. చంద్రమండలనిభాస్యంబు గల్గుటఁజేసి కమలాక్షి శ్రీలక్ష్మికరణి వెలయు
గాత్ర్యవక్షోజగౌరవంబు సెలంగి గిరిరాజపుత్రికాకృతి వహించుఁ
బ్రౌఢోక్తిచాతుర్యపాటవంబులు గల్గి వాగ్దేవిసాటి యై వన్నెకెక్కు
లలితసౌందర్యకళావిశేషము గాంచి యలరువిల్తునిసతి యనఁగఁ బరఁగు
తే. విశ్వకర్మకృతామూల్యవివిధరత్న, జాలనిర్మితభర్మపాంచాలి యనఁగ
వెలసె సంప్రాప్తతారుణ్యవిభవ యగుచు, నఖిలగుణపేటి సీమంతినీవధూటి. 45
క. ఆరాజకన్య యభినవ, తారుణ్యవిలాసరేఖఁ దనరెడు సానల్
దీరినమరుశర మనఁ గ్రొక్కారుమెఱుం గనఁగ వెలసెఁ గాంతిస్ఫురణన్. 46

## చిత్రవర్మ సీమంతినికి వివాహం బొనర్చుట.

ఉ. లాలితరూపకాంతిశుభలక్షణలక్షితగాత్రి యైనయా
బాలికఁ గాంచి యాప్తజనబాంధవమంత్రిపురోహితప్రధా
నాళిసమేతుఁ డై పరమహర్షము మీఱఁగఁ జిత్రవర్మభూ
పాలుఁ డాత్మపుత్త్రికి వివాహము సేయఁ దలంచె వేడ్కతోన్. 47
క. ఆరాజనందనమహో,దారప్రాభవగభీరధైర్యాతిశుభా
చారంబులు విని వచ్చిరి, ధారుణిలోఁ గలుగురాజతనయులు వేడ్కన్. 48
సీ. నరవరోత్తముఁ డైననలచక్రవర్తికి దమయంతికిని గూర్మితనయుఁ డగుచుఁ
జెలువు గాంచిన యింద్రసేనమహారాజతనయుఁ డై [illegible] సౌందర్యుఁ డైన

చంద్రాంగదుని శరచ్చంద్రచంద్రాతపచందనామృతపయశ్చంద్రయశుని
బిలిపించి యతనికిఁ బ్రియపూర్వకంబుగా సకలబాంధవసమక్షంబునందుఁ

తే. పరమహీనాథసుతులను బరిహరించి, తనదుప్రియసుత నిచ్చి యుద్వాహ మొప్పఁ
జేసె నత్యంతసంతోషచిత్తుఁ డగుచు, జిత్రవర్మక్షమాపాలశేఖరుండు. 49

ఉ. అనిమిషేంద్రసూనుఁడు మహామతిమంతుఁడు చంద్రశేఖర
ధ్యానపరాయణుండు పరతత్త్వవిదుండు గృహీతభార్యుఁడై
యానలినాక్షిఁ గూడి కుసుమాస్త్రజయంతవసంతసంతత
శ్రీనిధి యొప్పె నప్పుడు శచీవిభుఁ డయినమహేంద్రుకైవడిన్. 50

క. ఆచిత్రవర్మగృహమున, వాచస్పతి సదృశనీతివర్తనశీలుం
డాచంద్రాంగదుఁ డుండెను, ధీచతురుం డగుచుఁ గొన్నిదినములు నెమ్మిన్. 51

మ. అమితోత్సాహసుతోడ నా సుతుఁడు బాహ్యారామవాటీవిహా
రము గావింపఁగ నోడ యెక్కి చనుచేరం దైవయోగంబునన్
యమునాతోయమునందు నాతఁడు దదీయామాత్యసేనాసమా
హసుతోఁ గూడ మునింగె భూజనులు హాహాకారము ల్సేయఁగన్. 52

క. కొందఱు జలముల మునిఁగిరి, కొందఱు గ్రాహోదరములఁ గూలిరి మఱియుం
గొందఱు తీరముఁ జేరిరి, కొందఱు గనుపింప రైరి కుశవేగమునన్. 53

సీ. యమునాజలనిమగ్నుఁ డయ్యెఁ జంద్రాంగదుం డనుఘోరవృత్తాంత మాలకించి
బంధుమిత్రామాత్యపరివారయుతుఁడుగా శీఘ్రంబ చనుదెంచి చిత్రవర్మ
దత్తీరమున నిల్చి దారుణశోకాభిసంతప్తచిత్తుఁడై వంతనొంది
యానదీసలిలమందారసి సుతుఁ గానక బహుదుఃఖశాలిఁ డగుచు

ఆ. హా మహానుభావ హా రాజనందన, హా యశోనిధాన హా కులీన
యెంతపాపకర్మ మేఁ జేసి యుంటినో, యెడలు వాపె మనల నీశ్వరుండు. 54

క. ఏరీతిని సీమంతిని, నూరార్తు నహోభవద్వియోగాతురతా
ధీయుల మాతలిదండ్రుల, నారయ నే నెట్లు నేర్తు ననుశాసుతా. 55

ఆ. పూర్ణిమాసుధాంశు బోలుని న్నెమ్మోముఁ, గనులఁ జూడకున్న ధనము లేల
జీవనంబు లేల శ్రీవైభవము లేల, ననుచు వగచుచుండె నవనివిభుఁడు. 56

వ. ఇట్లు శోకవ్యాకులమానసుండై యమ్మహీపాలుండు నితరవ్యాపారంబులు మాని బహుప్రకారంబుల విలపింపుచుండునంత పౌరజానపదజనంబు లాబాలవృద్ధంబు గా వచ్చి యన్నదీతటంబునఁ బడి హాహారవముల శోకింపుచుండి రయ్యవసరంబున.

మ. గృహసమ్మార్జనధేనుదోహనశిశుక్షీరాంబుపానక్రియా
దహనప్రజ్వాలనప్రదీపజనసంధ్యాస్నానదేవార్చనా

రహితం బయ్యెను చిత్రవర్మపురవర్యం బాదినం బందు దు
స్సహచంద్రాంగదవిప్రయోగభవశుక్సంతాపితద్వంద్వ మై. 58

సీ. పరదేశమునుండి పతి యేఁగుదెంచిన సంతోషభావ మెక్కింత లేదు
కడపటి కొకమంచికొడుకు గలిగిన నైన సంతోషభావ మెక్కింత లేదు
ధనవిహీనునకు నిధానంబు దొరికిన సంతోషభావ మెక్కింత లేదు
... ... ... ...

తే. ఏమిచెప్పంగ వచ్చు నయ్యింద్రసేన, నందనువియోగభరమును జెంది కుంది
చిత్రవర్మమహీపాలునీమఁ గలుగు, సకలజనములు వసగతోత్సాహు లైరి. 59

వ. అంత నచ్చట నిషధదేశాధ్యక్షుం డగునాయింద్రసేనమహీనాథుండును జారుల వలనఁ గర్ణకఠోరాయమానం బగునిజతనయవృత్తాంతం బాకర్ణించి యనేకప్రకారంబులం బ్రలాపించుచుండె నంత నన్నగరంబునం గల సమస్తప్రజలును దద్వియోగదుఃఖంబు సహింపంజాలక మహాఘోషంబుగా బరిదేవనంబులు చేయువారును శిరోజబంధంబులు వీడ శిరస్స్నానంబులు చేసికొనువారును వక్షస్తాడనములు చేసికొనువారును పరమేశ్వరుం డింత దయ దప్పవలయునే యనువారును జంద్రప్రియదర్శనుం డగుచంద్రాంగదకుమారుముఖావలోకము లేని యిచ్చోట నుండ వలయునే యనువారును బ్రాగ్జన్మంబుల నెట్టితపములు చేసితిమో యనువారు నై నిద్రాహారసుఖంబు లనుభవింపక యున్నయెడ నప్పురమును జిత్రవర్మపురమునుం బోలె నత్యంతకోలాహలసమన్వితం బై యుండె నంత. 60

తే. సుతవియోగాభితప్తుఁ డై స్రుక్కి స్రుక్కి
యడలుచున్నఁ దదీయదాయాదు లొకట
నతని బాధించి తద్రాజ్య మపహరించి
తిగిచి యాయింద్రసేను బంధించి రంత. 61

వ. అంత నిక్కడ. 62

మ. బలుశోకంబున చిత్రవర్మధరణీపాలుండు వర్తించి ని
శ్చలవైజ్ఞానిను లైనవృద్ధజను లాశ్వాసించి తత్త్వోక్తులం
దెలియం జెప్పఁగ నెట్టకేలకు మహాధీరాత్ముఁ డై లేచి ని
ర్మలభావంబున నాత్మమందిరముఁ జేరన్ వచ్చెఁ దాఁ గ్రమ్మఱన్. 63

తే. భూతలాధీశ్వరుండు జామాతకున్, డౌర్ధ్వదైహికకృత్యంబు లాచరింప
భూసురులఁబంచియాత్మీయపుత్రికకును, దత్సమయకార్యములొనర్చెఁదథ్యమహిమ.

ఉ. అంతటఁ జంద్రికాగేహమున నమ్మునిపత్ని యనుజ్ఞఁ జేసి సీ
మంతిని [illegible]

శాంతవిధంబునం దనరి క్రమ్మఱ నావ్రత మాచరింపుచున్
గంతువిరోధిభక్తి మదిఁ గల్గి చెలంగెను ధీరచిత్తయై. 65

క. ఈరీతి నావధూమణి, గౌరీశంకరులపూజ గావింపుచు వి
ప్రారాధన మొనరింపఁగ, నారయ నటు వత్సరత్రయముఁ గడచె భువిన్. 66

వ. అని చెప్పి సూతుండు వెండియు నమ్మహామునుల కిట్లనియె. 67

శా. కాళిందీసలిలాంతరాళవినిమగ్నస్వాంగుఁడై విస్ఫుర
చ్చైలేంద్రాత్మభవేశభక్తిపరుఁడౌ చంద్రాంగదాఖ్యక్షమా
పాలుం డత్తటి నాహ్రదంబున జలవ్యాసక్తలన్ యౌవన
శ్రీలాలిత్యల నాగకన్యకలఁ గాంచెం దైవయోగంబునన్. 68

ఉ. మానితమందహాసు నవమన్మథరూపవిలాసు శ్రీశివ
ధ్యానపరున్ శుభోజ్జ్వలగుణాకరు రాజకుమారుఁ గాంచి కుం
భీనసరాజకన్యకలు విస్మయమానమనస్కలై ఫణి
స్థానమనోహరం బగురసాతలలోకముఁ జేర్చి రంతటన్. 69

సీ. అరసాతలమునం దత్యంతరమ్యంబు మణిదీపకోటిసమన్వితంబు
భర్గమిత్రమహేంద్రభవనసంకాశంబు ఫణిఫణారత్నవిభ్రాజితంబు
వజ్రముక్తాఫలవైడూర్యరాజితప్రాసాదసాహస్రశోభాసురంబు
దపనీయతోరణద్వారకవాటంబు చంద్రకాంతోపలస్థలయుతంబు

తే. మంజులం బయినయొకదివ్యమందిరమున, నంచితం బయినరత్నసింహాసనమునఁ
బన్నగేంద్రులు కొల్వఁ గూర్చున్నఘనుని, దక్షకుని గాంచెఁ జంద్రాంగదప్రభుండు.

వ. వెండియు నమ్మహానాగేంద్రుండు ఫణాళతసముజ్జ్వలుండును దివ్యాంబరధరుండు
ను దివ్యరత్నకిరీటకుండలమండితుండును నానామణిగణప్రభావిభాసురవిగ్రహుం
డును సౌందర్యయౌవనవిలాసాతిశోభనుండును దివ్యాభరణభూషితుండును దివ్య
చందనచర్చితుండును కాలాగ్నిసంకాశతేజుండును అనేకపన్నగకుమారసేవ్యమా
నుండును పన్నగేంద్రకన్యకాసహస్రపరివృతుండును దుర్నిరీక్ష్యుండును నైన
తక్షకమహాఫణీంద్రుం గనుంగొని యారాజనందనుం డమ్మహాత్ము దుస్సహతేజంబు
చూడంజాలక నిమీలితలోచనుం డయియుండి క్రమ్మఱ ధైర్యం బవలంబించి
సభాస్థలంబున సాష్టాంగనమస్కారంబుఁ గావించి కృతాంజలియై యున్నఁ గం
దర్పసుందరుం డగునారాజకుమారుం జూచి తక్షకుండు తనమనంబునఁ గొంతతడ
వాలోచించి. 71

క. ఈరా జెవ్వఁడు వీనికిఁ, బేరేమియొ యెచట నుండుఁ దెంపుగ వీనిన్
మీ రిచటికిఁ గొనితెచ్చిన, కారణ మే మనుచు నాగకన్యల నడిగెన్. 72

వ. అని యడిగిన దక్షకునితో నాగకన్యక లి ట్లనిరి. 73

తే. యమునలోన జలక్రీడ లాడుచుండ, నిరవునుండి యచటి కేతేరఁ జూచి
యిప్పటికి మేము దెచ్చితి మింతె కాని, యితనికులగోత్రనామంబు లెఱుఁగ మధిప. 74

క. అనవుడు నాతక్షకుఁ డి, ట్లనియె నా రాసుతునితోడ నతిసుందరయా
ననశాలివి నీ వెవ్వఁడ, వనవుడు నతఁ డిట్టు లనియె నాతనితోడన్. 75

సీ. భుజగేంద్ర వినవయ్య భూతలంబునఁ బ్రసిద్ధం బయిననిషధదేశంబునందు
దమయంతివల్లభుం డనఁ బేరు గాంచిన నలమహారాజున కగ్రతనయుఁ
డింద్రసేనుం డమ్మహీనాథుతనయుండ జంద్రాంగదాభిఖ్య జగతి వెలసి
వరబోధుండ నై శ్వశురాలయంబున మున్ను వతోనుండి యొక్కనాఁడు
తే. లీలఁగా నావయెక్కి నాహ్యాళి వెడలి, యమునలో రాగ దైవయోగమునఁ జేసి
నీట మునిఁగినఁ జూచి మన్నించి యచటి, సతులు దెచ్చిరి నీసభాస్థానమునకు. 76

చ. పొలుపుగఁ బూర్వజన్మమునఁ బుణ్యము లెన్ని యొనర్చినాఁడనో
సలలితదానధర్మములు సద్గురుసేవలు చేసియుంటినో
వెలయఁగఁ దీర్థయాత్రలును విప్రసపర్యలు సల్పినాఁడనో
తలఁపఁగఁ దావకీన మగుదర్శన మబ్బె భుజంగనాయకా. 77

క. ధన్యుఁడ గుణగణ్యుఁడ జన, మాన్యుఁడ నైతిని మహాత్మ మామకభాగ్యం
బన్యులకుఁ గలదె ఫణిరా, జన్యకృతార్థుండ నైతి సత్యము గాఁగన్. 78

క. మా పెద్దలు నైవల్య, ప్రాపితులై రదియుఁ గాక భవదీయకృపా
కూపారము వెల్లువఁగా, నాపైఁ బ్రవహించె నే మనం గలవాఁడన్. 79

వ. అని పలికి మఱియు ని ట్లనియె మహాత్మా నీవు మహానుభావుండవు నిఖిలసురాసుర
గంధర్వచారణప్రస్తూయమానుండవు శరణాగతరక్షకుండవు గావున భవన్మహామహి
మంబులు దెలిసి వర్ణింప నే నెంతటివాఁడ నన్నుఁ గటాక్షించి రక్షింపవలయు నని
బహువిధంబుల సన్నుతింపుచు వినయవినమితశిరస్కుఁ డయి ముకుళీకృతకరకమ
లుం డై యున్న యారాజనందనుమృదుమధురగంభీరభాషణంబులవలన సంతోషిత
స్వాంతుం డయి తక్షకుండు క్రమ్మఱ నక్కుమారున కి ట్లనియె. 80

ఉ. శ్రీవసుధాధినాయకకులోద్వహ నీ కభయం బొసంగుదున్
గేవల భక్తి నాత్మఁ బరికింపుచు ముప్పదిమూఁడుకోట్ల దే
వావళిలోన మానసిక వాచిక కాయిక శుద్ధిగల్గి యే
దేవునిఁ బూజసేయుదువు ధీరుఁడ వై వచియింపు మేర్పడన్. 81

ఆ. అనిన నాతఁ డిట్టు లనియెఁ దక్షకునకు, [illegible]

యీప్రపంచమునకు నెవ్వఁ డీశ్వరుఁడు వ్యాపకుఁడు పూజ్యుఁ డయ్యె మతిఁదలంప.

క. ఏదేవుఁడు సురలందు మ, హాదేవుం డనఁగఁ బరఁగు నట్టియుమేశు
న్వేదాంతవేద్యు నభవుని, సాదరమున భక్తిఁ బూజ సలుపుదు నెపుడున్. 83

ఉ. ఎవ్వనిరాజసంబునఁ బ్రజేశ్వరుఁ డీజగముల్ సృజించునో
ఎవ్వనిసాత్త్వికంబున రమేశుఁడు పోషణచేయుచుండునో
ఎవ్వనితామసంబును వహించినరుద్రుఁడు సంహరించునో
ఎవ్వఁ డచింత్యుఁ డట్టిపరమేశ్వరునిన్ భజియింతు నెప్పుడున్. 84

తే. ధాతలకు నెల్ల ధాతయై దనరు నెవఁడు, గారణంబున కెవ్వడు కారణంబు
తేజములకెల్ల నెవ్వఁడు తేజ మరయ, నట్టియభవుఁడె మాకుఁ దిక్కగు దలంప.

క. తా నంతట నుండియు సుజ్ఞానవిహీనులకు దూరసంచారుం డై
కానఁబడ కుండు నేవిభుఁ, డానిర్మలధాముఁ డయినహరుఁ బూజింతున్. 86

మ. ధరణీవారికృశానుమారుతవియత్ఖద్యోతచంద్రాగ్నిమ
త్పురుషోపేతముగాఁగ నేవిభునకున్ మూర్త్యష్టకం బయ్యె భా
స్కరచంద్రాగ్నులు నేమహాత్మునయనాకారంబులై యొప్పి ర
ప్పరమాత్ముం డగుశంకరుండు మునిసంభావ్యుండు పూజ్యుం డగున్. 87

క. కొందఱు క్షేత్రజ్ఞుఁ డనఁ, గొందఱు పరమాత్ముఁ డజుఁడు కూటస్థుఁ డనం
గొందఱు సాక్షి యనంగను, గొందఱు భిన్నుఁ డన వెలయుఁ గుశలుఁ దలంతున్.

క. ఏదేవునసుగ్రహమున, ఖేదంబులు లేక బుధులు గిరిభేదిబ్ర
హ్మాదిపదంబుల నైనను, సాదరమతిఁ గోర నట్టిసామి భజింతున్. 89

సీ. ఎవ్వనిరూపంబు నేవేళలందైన వేదాంతమృగ్యమై వెలయుచుండు
నెవ్వనినామంబు లేశప్రాద్ధు నుడివినఁ దాపత్రయంబులు దలఁగిపోవు
నెవ్వనిశిరమునం దెవ్వడు సురనది పుష్పదామాకృతిఁ బొసఁగుచుండు,
నెవ్వనిగేహిని యీజగత్త్రయమున జగదంబ యనఁగఁ బ్రశస్తిఁ గాంచె
తే. నెవ్వనికిఁ గుండలంబులై యొసఁగుచుండు
వాసుకియుఁ దక్షకుండును భాసురముగ
నట్టిఖండేందుధరుఁడు మహామహుండు
శివుఁడు పూజ్యుండు మాకుఁ బ్రసిద్ధముగను. 90

సీ. ఏదేవుపదపద్మ మెలమితో నిగమాంతచూడామణిస్ఫూర్తి సొంపు మెఱయు
నేగిరీశునిమూర్తి యోగీంద్రసభలలో ననవరతంబు ప్రఖ్యాతిఁ గాంచు
నేమహామహుదివ్యసామర్థ్యమహిమల సర్వేశ్వరత్వంబు సంఘటించు
నేపురుషశ్రేష్ఠుఁ డేకరూపంబున జగదంతరాత్మయై సంచరించు

తే. సర్వమృత్యుంజయుండు మహానుభావుఁ డప్రమేయుఁ డచింత్యుఁ డనఘుఁ డభవుఁ
డాదిమధ్యాంతరహితుఁ డనాదిపురుషుఁ డయినపశుపతిపూజార్హుఁ డహికులేంద్ర.

వ. అని యివ్విధంబునం బలికిన చంద్రాంగదుభాషణంబు లాకర్ణించి ప్రమోదమాన సుం డయి మహాదేవభక్తితత్పరుం డగుతక్షకుండు గ్రమ్మఱ రాజనందను నవలోకించి యి ట్లనిరి. 92

క. జలజభవాదుల కైనను, దెలియనియర్థంబు మాకు దెలియంగ నహో
తెలిపితివి శైవతత్త్వము, గలరే నీవంటిఘనులు గాంభీర్యనిధీ. 93

మ. ఇది పాతాళము నిర్జరామరణరాహిత్యంబు దేవాసుర
ప్రదరాభేద్యము విశ్వకర్మరచితప్రాసాదయుక్తంబు సం
పదుదారంబును బన్నగాలయము భాస్వద్రత్నదీపప్రభా
స్పద మీభోగవతీపురంబున మహోత్సాహంబుతో నుండుమీ. 94

ఉ. ఇచ్చటిపాదపాళి దగ నెన్నఁగ గల్పతరుప్రభావమా
నిచ్చటిదీర్ఘికాజలము లెప్పుడు దివ్యసుధారసంబు లా
నిచ్చటినాగకన్యక లహీనవిలాసిను లట్లుగాన ని
విచ్చటనుండి సౌఖ్యము లనేకము లందుము నిర్భయుండవై. 95

క. అనిపలికిన యాతక్షకుఁ, గనుఁగొని రాజన్యసుతుఁడు గ్రమ్మఱఁ బలికెన్
వనజాతాసనపత్నీ, ఘనమణిమంజీరనాదకలనార్భటులన్. 96

శా. ఆకర్ణింపుము నాదువిన్నపము సర్వాధ్యక్షభోగాగ్రర
త్నాకల్పాంగ మదేకపుత్త్రకుల నై నాతల్లియుం దండ్రియున్
శోకప్రాప్తిని గుందుచుండుదురు సంక్షోభించు మత్పత్నియున్
వీక న్వారలకు న్మనఃప్రియము నే గావించెదన్ గ్రమ్మఱన్. 97

చ. అదియునుగాక నాహితులు నత్తయు మామయు బంధుకోటులున్
హృదయములందుఁ జింతిలుచు నెప్పుడు శోకభరంబుఁ జెంది యుం
డుదు రటుగాన బాలుఁడ జడుండను మి మ్మొక కేను వేఁడెదన్
సదయత నన్ను మీ రిపుడు చయ్యన వారలఁ జేర్పఁగాఁ దగున్. 98

క. మావారలు నన్నుఁ బగతజీవుం డని తలఁచి చింతఁ జెందరి యాలో
దైవవశంబున బ్రతికిరొ, చావునకుం జేరిరో యెమిచందము తెలియన్. 99

వ. అట్లుగాన బహుదినంబు లిచ్చటనుండుట నాకు ధర్మంబుగాదు మర్త్యలోకంబునకు బోవునట్లుగా ననుగ్రహింపవలయు నని ప్రార్థించుచున్న యన్నరదేవనందనువాక్యం బులకు సంతసిల్లి తక్షకుం డట్ల సేయుదు నని కారుణ్యకటాక్షవీక్షణంబుల నతని నాదరించి, 100

క. దివ్యమణిభూషణంబుల, దివ్యాంబరదామగంధతిలకాదులచే
దివ్యసమానుని రాసుతు, భవ్యమతిం బూజచేసెఁ బన్నగపతియున్. 101

చ. హరియును దక్షకుండు బహుమానముగా నొకకామయానమా
తురగముఁ జంద్రహాసమును దూణయుగంబు నొసంగి క్రమ్మఱన్
నిరుపమరత్నభూషణమణిప్రకరాంబరవాహనార్థము
ద్ధురబలు నొక్కరక్కసునిఁ దోడ్పడఁ బంపెఁ గృపారసంబునన్. 102

క. అప్పుడు రాజకుమారుని, దప్పక వీక్షించి పలికె దక్షుఁ డొగి నీ
వెప్పుడు మదిలోఁ దలఁచెద, వప్పుడ నే వత్తు ననుచు నభయము నొసఁగెన్. 103

ఉ. వెండియుఁ దక్షకుండు ప్రతివీరమహాబలసామజాధిరా
ణ్మండలకేసరిన్ నిజకుమారుని ధీరునిఁ జూచి పల్కె నా
ఖండలవాజిసన్నిభము కామగమైనహయంబు నెక్కి భూ
మండలి కేఁగుమా నృపకుమార సహాయుఁడవై రయంబునన్. 104

వ. అని యిట్లు వీడుకొల్పిన నమ్మువ్వురుఁ దక్షకునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి యమ్మహాత్ముని యనుజ్ఞవడసి యక్షణంబ. 105

క. ప్రమదంబున నమ్మువ్వురుఁ, బ్రమదాధిపపాదపద్మభజనోత్సుకులై
యమునాజలముల వెలువడి, నిమిషంబున వచ్చి రపుడు నిశ్చలమతులై. 106

శా. కాళిందీతటసీమవాయుజవశంఖాణాదిరూఢస్థితిన్
లీలోద్యానవిహారమాల్ సలుపుచున్ నిశ్చింతుఁడై యుండఁగా
నాలో వచ్చె సఖీమణుల్ గ్గొలువ స్నానార్థంబుగా సత్క్రియా
శీలం బొప్ప ధరాసురాంగనలతో సీమంతినీసాధ్వియున్. 107

సీ. ఆనదీతీరంబునందు దర్పకుమాడ్కి నతిమోహనాకారుఁ డైనవాని
వరరూపు లైనపన్నగదానవులఁ గూడి విహరించువాని భూవిభుకుమారు
దివ్యాభరణదీప్తదేహంబు గలవాని మొలకనవ్వులు గలమోమువాని
సుమమాలికాగంధఘుమఘుమామోదంబు దశదిగంతంబుల నొసఁగువాని

తే. అసదపూర్వాకృతివిలాస మొసఁగువానిఁ, గాంచి విస్మితచిత్తయై కంబుకంఠి
సాధ్వి సీమంతినీకాంత సద్వివేక, లోచనంబుల నాతనిఁ జూచుచుండె. 108

శా. ఆరాజేంద్రుఁడు కంఠసూత్రరహితం వ్యక్తాంజనాపాంగి శృం
గారప్రాభవహీనగాత్రి గళితగ్రైవేయహారాదికన్
దూరీభూతశుభాంగరాగతిలకన్ దుర్వారశోకార్దితన్
సారాచారపరాయణం గనియె నాసాధ్విన్ విచిత్రంబుగన్. 109

ఆ. కాంచి దృష్టపూర్వగా నిశ్చయముఁ జేసి, హయము డిగ్గి యాలతాంగిఁ బిలిచి

కువలయేశ్వరుండు కూర్చుండ నియమించి, యింపుమీఱ సతికి నిట్టు లనియె. 110

క. వనితా నీ వెవ్వరవు నీ, జనకుని పే రేమి యెవరిసతి వేమిటికై
ఘనశోకము బాల్యంబున, జనియించెను దెలియఁ బలుకు సత్యము గాఁగన్. 111

క. అని సన్నెహముగాఁ బలికిన యావిభుఁ జూచి యశ్రుకీలితనిజలో
చన యై లజ్జిత యగుచును, వనజేక్షణ యూరకుండె వచనరహిత యై. 112

ఆ. అంతఁ దద్వయస్య యారాజనందను, గాంచి మధురవచనగౌరవమున
నావధూటిచరిత మాద్యంతయుతముగాఁ, దెలియఁబల్కె నపుడు దేటపడఁగ. 113

సీ. ఓమహాత్మక వినుమీ మానినీమణి సీమంతిని యనంగఁ జెలువుగాంచు
నీకాంతజనకుండు లోకప్రసిద్ధిగాఁ జిత్రవర్మ యనంగ ధాత్రి వెలయు
నింద్రసేనుఁడు మామ చంద్రాంగదుఁడు భర్త నిషధాధినాథుఁడు నిక్కముగను
నీవధూమణిపతి దైవయోగంబున యమునాజలనిమగ్నుఁ డయ్యెఁ గాన

తే. వలని రాజ్యంబు దాయాదు లపహరించి, తల్లిదండ్రులఁ బట్టి బంధన మొనర్చి
రట్లు గావున నీయింతి యధికశోక, తప్త యై యుండ వత్సరత్రయము గడచె. 114

తే. సోమవారంబునందు నీసుదతి యిపుడు, సమ్మతంబుగఁ బార్వతీశ్వరులపూజ
సేయఁ గావున నిపు డభిషేచనార్థ, మరుగుదెంచె దృఢవ్రత యగుటఁ జేసి. 115

వ. అని చెప్పి యూరకుండె నట్లు సఖీముఖంబునఁ దనవృత్తాంతంబు సర్వంబు దెలియం జెప్పి క్రమ్మఱ నారాజకుమారునిఁ జూచి సీమంతిని వారి కిట్లనియె. 116

క. శ్రీరంజిల నవమదనా, కారుండవు కిన్నరుఁడవొ గంధర్వుఁడవో
చారణుఁడవొ మనుజుఁడవో, వారెవ్వరు నీదుపార్శ్వవర్తులు దలఁపన్. 117

క. ఇత్తెఱఁగున బలుకుము నా, వృత్తాంతము నడిగి దీవు విశదంబుగ లో
కోత్తర సన్నెహముగా, నిత్తటి ననుఁ జూచినావొ యెన్నం డైనన్. 118

క. ఈవార్తఁ దెలియఁ బలుకం, గావలయు సవిస్తరముగఁ గారుణ్యముతో
నేవేళ నైనబుధులు మృ, షావాక్యము లాడఁ జనరు సకలవిధములన్. 119

వ. అని యివ్విధంబున నారాజపుత్త్రిక యన్నరేంద్రనందనుతో సల్లాపంబు లొనరించుచు బాష్పపూరితలోచనయు గద్గదకంఠయు మోహమూర్ఛాపరవశయు నై ధరణీతలంబుపయిం బడియున్న నిజకళత్రంబు నీక్షించి చంద్రాంగదుండును శోకాకులితమానసుం డై మౌనంబున ముహూర్తం బుండి తదనంతరంబున సమ్మోహనంబు లగుభాషణంబుల నయ్యింతి నూరడిల్లం బలికి తత్పాణిగ్రహణంబు గావించి యిట్లనియె. మేము కామగమనంబునఁ బ్రకాశించుసిద్ధులము నీభర్త సురక్షితుం డై యున్నవాఁడు నిక్కమెఱుఁగుమే మిరువురము నైక్యంబుగా నుండుదుము అతం డును కొండుమూఁడుదినంబులకు నిందు [illegible] గలసి సక

సామ్రాజ్యసుఖము లనుభవించెదరు శ్రీసదాశివుపాదంబు లాన నామాట నిజమ్ముగా నమ్మి శోకంబు మాని యుండు మని పలికిన నలినిమధురవచనములకు నూరడిల్లి విస్మయంబు దీపింప సంభ్రమోద్భ్రాంతనయనంబుల నారాజనందనుం దప్పళ చూచుచుఁ దనమనంబున నిట్లని వితర్కించె. 120

మ. ఇతనిం జూడ మదీయభర్త యగుఁ గాదేనిఁ మహాప్రేమసం
గరమై యుండునె నామనం బదియునుం గాక న్నిజాకారశీ
లత నేతెంతురె యన్యలోకగతు లేలా తోఁచె నాబుద్ధి కా
యతసౌందర్యుఁ డితండు ధూర్తజనుఁడో యక్షుండొ గంధర్వుఁడో. 121

మ. శయనాగారముఁ జేరియున్న పతి సాక్షాత్కారుఁ డయ్యె న్మతి
భ్రమమో మోహమొ స్వప్నమో యిది యథార్థంబో విచారింప ని
శ్చ్యముగా నే నొనరించునట్టివిలసద్గౌరీశపూజావిధా
నము సార్థంబో నిరర్థకంబో తలఁపఁగా నాభాగ్య మెట్లున్నదో. 122

సీ. మునిపత్ని వాత్సల్యమున నుపదేశించె రంజిల్ల సోమవారవ్రతంబు
నెటువంటియాపద లేతెంచి యున్నను శివపూజ దృఢభక్తిఁ జేయు మనుచు
సమ్మతంబుగఁ దదాజ్ఞాప్రకారంబున విడువక వ్రతము గావింతుఁ గానఁ
బరఁగ నుమామహేశ్వరులు సన్మాంగళ్యసిద్ధిగల్గఁగఁ గృపఁ జేసి రొక్క
తె. యదియుఁ గాక నాకు బదివేలవర్షంబు, లధిపుతోడ సౌఖ్య మబ్బునట్లు
ద్విజులు పల్కి రెల్ల నిజమయ్యెఁ గాఁబోలు, నీశ్వరుండు దక్క నెవ్వఁ డెఱుఁగు. 123

మ. లలితాకారపయఃప్రమారసుగుణాలాపస్వరవ్యంజనం
బుల నితండు మదీయభర్తకరణిం బొల్పారె సంభావ్యభా
వ్యలఘుశ్రీఫలనిశ్చయంబులు ఖగవ్యాహారగౌళీవచః
కలనాదంబులు వామలోచనభుజాకంపంబులుం దెల్పెడిన్. 124

తే. ఫాలలోచనుండు పార్వతీనాథుండు, శంకరుండు దగఁ బ్రసన్నుఁ డయినఁ
బ్రాణధారు లయినమానవావళులకు, భూమిలో నసాధ్య మేమిగలదు. 125

వ. అని వితర్కించుచు డోలాయమానమానస యై యాసీమంతినీసతీశిరోగ్రామణి యానందబాష్పపూరితనయనపుటయు నభ్రమాత్రపులకీకృతాంగియు గళదశ్రుసమ్మిశ్రితాపాంగయు లజ్జానమ్రముఖియు నై యున్న యాశుభాంగి కర్ణదేశంబునఁ గించిద్రహస్యంబుగా నీవు విషాదంబుఁ జెందవలదు నీవల్లభుం గూడి సుఖంబున నుండఁగలవు, ఏను దజ్జననీజనకులకు వనని పలికి ప్రష్టుల తుర్గల్గురాధీశాధుం కళలవార్త రుచిరింగింపం బోయెద నని పలికి తద్గృహాంగణంబున నిలిచి తనసహాయులం గూడి తత్క్షణంబున నిజపురోపకంఠవనమునకు నచ్చట నిలిచి నీవు మదీయజ్ఞాతులకడకుం జని వారలకు తత్కలపుత్రుండు వచ్చిన యట్లు సేనునిం బిలిచి

మదాగమనం బెఱింగింపవలయుఁ బోయిరమ్మని పనిచిన నతండును వల్లెయని యతి
త్వరితమ్మునఁ జనుదెంచి తత్సభాసీను లై యున్నవారలం గని యి ట్లనియె. 186

సీ. యమునాజలనిమగ్నుఁ డైనచంద్రాంగదుం డహిలోకముననుండి యరుగుదెంచి
పురసమీపమున భామరకార్యధుర్యుఁ డై యుపవనంబున నిల్చి యున్నవాఁడు
భానుతేజాని నింద్రసేనమహారాజు బంధముక్తునిఁ జేసి పనుపవలయు
శీఘ్రంబుగా రాజసింహాసనము మీరు విడువుఁడు చక్కఁగా విడువకేని
తే. యాన్నపాలితనూభవుఁ డరుగుదెంచి, తక్షకాహీంద్రదత్తదుర్దమకృపాణ
ధారభవదీయశిరములు ధరణిఁ గూల్చి, లీల నిజరాజ్యపదము పాలింపఁగలఁడు.

ఉ. అంగజసుందరాంగుఁడు మహాహితసైన్యవిభంగుఁ డైనచం
ద్రాంగదరాజనందనుఁడు తక్షకుచే బహుమాన మంది సా
రంగధరావతంసుకృపఁ గ్రమ్మరవచ్చె ధరిత్రి కాత్మ ను
ప్పొంగుచు నే నహీంద్రవరపుత్రుఁడ మిత్రిత దత్సహాయుఁడన్. 188

క. అనిచెప్పిన దాయాదులు, విని యంతభయంబుఁ జెంది విస్మయమున వా
రనుపాలవృత్తి మే త్మే, యని పొగడిరి చలితహృదయు లై విభ్రాంతిన్. 189

శా. అంతన్ సత్వరితంబుగా నఱిగి వా రయ్యింద్రసేనక్ష్మా
కాంతున్ స్వీయసతీసమేతుఁ గని వేగ న్ముక్తునిం జేసి య
త్యంతప్రేమ దదీయపుత్రుకథ నాద్యంతంబుగాఁ దెల్పినన్
సంతోషార్ణవమగ్ను లైరి మది నాశ్చర్యంబు సంధిల్లఁగన్. 190

క. అక్షణమున బురజనులు ను, రక్షితుఁ డై వచ్చినట్టి రాజతనూజు
వీక్షించి సంతసిల్లిరి, నిక్షేపము గన్నభంగి నిర్మలమతు లై. 191

తే. మదనసన్నిభుఁ డైనకుమారుఁ డపుడు, లీలఁ జనుదెంచె ననువార్త లాలకించి
రాజపత్నియు రాజు హర్షాతిరేక, పరవశతచేఁ బ్రపంచంబు మఱచి రంత. 192

ఉ. అప్పుడు మంత్రు లాప్తజను లార్యపురోహితభృత్యసంఘముల్
దప్పక వచ్చి రాకుతుని దర్శన మేర్పడఁజేసి కౌతుకం
బుప్పతిలంగఁ దోడ్కొని శుభోజ్జ్వలతూర్యరవంబు మ్రోయ మే
లొప్పఁగ వచ్చి రందఱు మహోన్నతరాజగృహంబుఁ జేరఁగన్. 193

ఉ. పల్లవపాణు లాడుచును పాడుచు లాజలు నక్షతంబులున్
జల్లుచు రాఁగఁ బౌరజనసంఘముచుట్టును గొల్వఁ ధారుణీ
వల్లభనందనుండు విభవం బలరం జనుదెంచి తండ్రికిం
దల్లికి సాగి మ్రొక్కఁగను దమ్ములబాష్పజలంబు లొల్కఁగన్. 194

వ. అంత. 195

క. చంద్రాంగదునభినవమణి, చంద్రాంగదుఁ గౌఁగిలించి స్వస్తి యొసఁగి రా
చంద్రార్కము వర్ధిలు మని, చంద్రార్కసమాఖ్య లతనిజనులజనకుల్. 136

శా. నష్టం బైనమహాధనంబు హృదయానందంబుగాఁ బ్రస్తుతిం
దృష్టం బైనవిధంబున న్మరల నేతెంచె న్నరేంద్రాత్మజుం
డష్టైశ్వర్యధురంధరుం డగుచు నాహా యెంతపుణ్యాత్ముఁ డీ
శిష్టాచారునితల్లిదండ్రు లని వర్ణించెం జనం బంతయున్. 137

క. అనిషధపురంబునఁ గల, మానవులు ప్రమోదమానమానసు లగుచున్
శ్రీనిలయుని జంద్రాంగదు, భానుప్రభుఁ గనిరి నేత్రపర్వముగాఁగన్. 138

క. గరుడుని గన్నమహాహుల, కరణిని గ్రామరాజపట్టగ్రామములరీతిన్
నరనృపతులు చంద్రాంగద, నరపతికడ మెలఁగి రపుడు నమ్రత్వమునన్. 139

వ. అయ్యవసరమునం బరమేశ్వరకృపాకటాక్షమునఁ బునఃప్రాప్తనిజసూనుం డయిన యింద్రసేనుండు పరమాహ్లాదంబున రుద్రాభిషేకములును సమస్తదేవతామహోత్సవములును నఖండదీపారాధనములును భూసురసమారాధనమును నపరిమిత సువర్ణదానములు గావించి నిజకుమారబంధుజనసమేతముగా మృష్టాన్నపానములం బరితృప్తిం బొంది యిష్టానులాపనులం బ్రొద్దుగడపుచు సుఖగోష్ఠినుండె నంత.

క. మరునాఁ డరుణోదయమున, సరసతరాహ్నికము దీర్చి జగతీపతి భూ
సురబంధుమిత్రయుతముగఁ, బరువడిఁ గూర్చుండెఁ దత్సభామధ్యమునన్. 141

శా. కాళిందీసలిలాంతరాళమున నాగస్థానముం జేరి ర
త్నాలంకారచయంబు తక్షకమహానాగేంద్రుచేఁ గొంచు ని
చ్చాలీలం జనుదెంచి నేడు మరలన్ జంద్రాంగదుం డంచు నీ
లీలం బంపెను చిత్రవర్మకడకున్ లేఖార్థసంవాహులన్. 142

సీ. సప్రాణుఁ డైయున్నచంద్రాంగదునివార్త చిత్రంబుగా విని చిత్రవర్మ
సంతతచింతావిచారంబులను మాని సకలబాంధవమిత్రసహితముగను
చారులు సంతోషపారవశ్యమునొంది సొంపు దీపింపఁ జాటింపఁ బనిచె
లేఖార్థవాహకాళికిఁ బ్రీతిమృష్టాన్నరాజితాభరణాంబరంబు లొసఁగి
తే. యపుడు నిజపుత్త్రి రావించి కృప దలిర్పఁ, బూర్వభూషితనవరత్నభూషణములు
మేన శృంగార మొనరించి మేరుధీరుఁ, డతఁడు హర్షాంబునిధి నోలలాడుచుండె. 144

వ. ఆసమయంబున.

మ. యమునాస్నాన మొనర్పఁ బోవునెడ నశ్వారూఢుఁ డై వచ్చి నె
య్యముతోఁ [illegible] మంత్రి కొన్ని హితవాక్యంబు లుపసంగించి చ

న్న మహాత్ముండె మదీయభర్త యని యానందించెఁ జంద్రాంగద
త్రమదారత్నము శాంకరవ్రతమహత్త్వం బాత్మ భావింపుచున్. 145

ఉ. నెమ్మిని చిత్రవర్మధరణీపతి శంకరశాంకరీనివా
సమ్ములయందు నుత్సవము సల్పుటకై తగువారిఁ బంచి చి
త్తమ్మునఁ బ్రేమ దోఁపఁగ హితమ్ముగ నల్లునిఁ జూచువాంఛ శీ
ఘ్రమ్మున నేగి తోడుకొని రాఁ బనిచె న్నిజమంత్రివర్గమున్. 146

వ. ఇట్లు పంపిన వారలు నతిత్వరితంబున నిషధనగరమునకుం జని చంద్రాంగదసమేతుండై యున్న యిందుసేనమహావల్లభుం గాంచి పరమానందకందళితహృదయారవిందులై యారాజున కిట్లనిరి. 147

తే. ఇంద్రసేనమహీశ దేవేంద్రవిభవ, చిత్రవర్మధరాధిపశేఖరుండు
తనదుజామాతఁ జూడఁ జిత్తమునఁ దలఁచి, నెమ్మిమముఁ బంపె నీదుసాన్నిధ్యమునకు.

క. కైరవహితురాకకును జకోరంబులు తరణిరాకకును గోకంబుల్
గోరుచు నుండువిధంబున, నీరాసుతు రాకఁ గోరుదు రెల్లజనంబుల్. 149

క. కావున నీవు నాలస్యము, గావలదు సత్వరంబు గాఁ బనుపు మనన్
భూవరుఁడు సమ్మతంబుగ, వేవేగమె యాజ్ఞ యొసఁగె వేడ్కఁ జెలంగన్. 150

వ. ఇట్లు చంద్రాంగదుండు నిజజనకుచేత ననుజ్ఞాతుండై తల్లిదండ్రులకు బ్రణామంబులు గావించి భూసురాశీర్వాదంబులు భేరీభాంకారరవంబులు చెలంగ దక్ష మహేంద్రదత్తంబైన యశ్వరత్నంబు నెక్కి తత్కుమారుండైన యశ్వసేనుండు తనకు నర్మసఖుండుగా ననేకసేనాసమేతుండై బహువిధజనపదఘనారణ్యపర్వతనదనదంబులు గడచి కతిపయదినములకుఁ జిత్రవర్మపురమునకుం జేరవచ్చె నంత. 151

సీ. ఆభేరీకారావ మప్పు డాకర్ణించి పౌరులు సంతోషభరితు లగుచు
జనుదెంచి యెదురేగి సాధువాదంబుల నభినుతి గావించి శుభము లెసఁగ
వందనాశ్లేషణస్వస్తిభాషణములు గడుమైత్రి నెఱఁగిరి ఘనత మెఱయ
నప్పురవీథిపుణ్యాంగనాజనములు నవరత్ననీరాజనంబు లొసఁగ

తే. గమలనేత్రలు సౌధభాగములనుండి, సరభసంబుగ సేసలు చల్లుచుండ
భవ్యమైనమహేంద్రవైభవము దనర, నచ్చెఁ జంద్రాంగదుఁడు చిత్రవర్మసభకు.

వ. ఆసమయంబున. 153

శా. ప్రౌఢోక్తిప్రతిభాషనింద్రుఁ డఖిలప్రత్యర్థిసేనామద
వ్యూఢోగ్రద్విపసింహుఁ డంధకవిపక్షోదగ్రపూజాక్రియా
బాధప్రేక్షుఁడు చిత్రవర్మధరణీపాలుండు చంద్రాంగదున్
గాఢాలింగితుఁ గా నొనర్చె నతఁడు [illegible]వ్యాళుఁడై. 154

క. భానుప్రభుఁ డగునిషధప్రస్థానాథుఁడు చిత్రవర్మ మహితపదములకా
సానందాశ్రుజలంబులఁ, దా నప్పుడు గడిగి వినమితశిరస్కుం డై. 155

తే. అత్తలకు మ్రొక్కి వెండియు నార్యులైన, బాంధవులకును హితులకు బ్రాహ్మణులకు
వందనము లాచరించిన వార లతనిఁ, గాంచి జయవాక్యములను దీవించి రంత. 156

## సీమంతినీపునర్వివాహఘట్టము.

మ. పునరుద్వాహము సేయఁగా దలఁచి యాభూపాలచంద్రుండు భూ
జనసన్మాన్యులు భూసురోత్తములు రాజశ్రేష్ఠులుం దాను శా
స్త్రనిరూఢక్రియ నిశ్చయించి విలసత్సౌధం బలంకారశో
భన మై యుండ నొనర్చె నప్పుడు సుహృద్బంధుప్రజ లెచ్చఁగన్. 157

క. భూసురభామినులు మహోల్లాసంబున భద్రగీత లలితోక్తులతో
శేసలు చల్లఁగ రత్నమయాసనమున రాకుమారుఁ డటు కూర్చుండెన్. 158

సీ. కమనీయతరళరత్నమయరాకాచంద్రబింబంబు శ్రీయమఖాబ్జంబు వెలయఁ
జారుభాతపేశావిరాజత్సరోజాతసామ్యంబు లైనలోచనము లలర
వర్ణావసరవిభాస్వత్తటిద్వల్లికామానితం బగుచు నెమ్మేను దనరఁ
దిమిరబంధురనిశీధినిదారకలమాడ్కి వేణీఖచితపుష్పవితతు లమర

తే. విశ్వకర్మవినిర్మితవివిధరత్న, చిత్రితపటీవసాలభంజిక యనంగ
వచ్చి కూర్చుండె జీవితేశ్వరునిపజ్జ, నిర్మలాపాంగి సీమంతినీలతాంగి. 159

క. శృంగారశేఖరులకును, మాంగల్యధురీణులకును మానధనులకుం
బంగారుపళ్ళెరంబుల, మంగళహారతుల నిడిరి మంజులవాణుల్. 160

క. ఆభోగయౌవనులకును, శ్రీభవధుర్యులకు సురభిభరతైలమునన్
శోభనములు పాడుచు పేర్మాభలు దల లంటి రపుడు మంజులఫణితుల్. 161

క. కంకణరాజత్కరులకుఁ, బంకజనేత్రులకు పుణ్యభాగులకు సుమా
శంకరభక్తుల కప్పుడు, సుంకులు చల్లిరి శశాంకసుందరవదనల్. 162

క. పన్నగజాతీరసనం, పన్నంబుగఁ దలలఁ బులిమి మందోష్ణం బౌ
పన్నీట జలకమార్చిరి, కన్నియకును రాకుతునకుఁ గామిను లంతన్. 163

ఆ. సుందరాంగులకును శుభచరిత్రులకును, రాజదంపతులకుఁ దేజ మలర
ధౌతవస్త్రములను దడియార్చి రప్పుడు, హరిణనయన లధికహర్షమునను. 164

సీ. కట్టంగనిచ్చిరి కనకాంబరంబులు గమనీయసుందరాకారులకును
లలితార్ధశిరోభూషణంబు లనుదివ్యతిలకము లీర్చిరి ధీయుతులకును

ఘుమఘుమావాదగంధము లలందిరి మేన గుణరత్ననిధులకు గొమరు మిగులఁ
గుప్పదామములు సొంపుగ నలంకారంబుగా వేసిరతివలు ఘనయశులకు
తే. హారకుండలమణికంఠకాంగదాది, భూషణంబులఁ దొడిగిరి బుధనుతులకు
దీపితంబుగఁ జెక్కుట దృష్టిచుక్క, లింపుగ నొసర్చి రారాజదంపతులకు. 165

వ. ఇవ్విధంబున నవ్వధూవరు లత్యంతశృంగారాభిరాములై యాక్షణమున భేరీమృదం
గాదితూర్యరవంబులును ననేకబ్రాహ్మణపుణ్యాహఘోషంబులును పుణ్యాంగనాజ
నస్త్రమధురగీతనిస్స్వనములును వందిమాగధస్తవనాదములుం జెలంగ గల్యా
ణవేదికాతలమున నాదుంబరభద్రపీఠంబునఁ గూర్చున్న సమయంబున. 166

శా. అన్యక్షత్రియగర్వపర్వతసుపక్ష్యాధీశ్వరుం డైనరా
జన్యశ్రేష్ఠుఁడు చిత్రవర్మ విహితాచారంబు దీపింపఁగా
ధన్యం బయ్యె మదన్వయం బని పయోధారానుపూర్వంబుగాఁ
గన్యాదాన మొనర్చె నైషధునకున్ గల్యాణలగ్నంబునన్. 167

క. జాంబూనదాంబరంబులు, గంబళములు భూషణములు గాంగేయకము
ల్దాంబూలము లాదిగ మోదంబున విప్రుల కొసంగె ధరణీశుఁ డొగిన్. 168

మ. కలమాన్నంబులు పాయసంబులును శాకానీకము ల్గోఘృతం
బులు పచ్చళ్లు పదంశకాళిమధురాపూపంబులుం జారులున్
జలము ల్తేనియ లానవాలు పెరుగు ల్సంతుష్టిగా బంధుమం
డలితో భవ్యముగా భుజించిరి విశిష్టప్రీతినాదంపతుల్. 169

తే. భోజనానంతరమునఁ దాంబూలసురభి, గంధమాల్యాద్యలంకారకలితుఁ డగుచు
మిత్రబాంధవభృత్యసమేతముగను, సరససల్లాపముల నుండుసమయమునను. 170

ఉ. మల్లికగంధు లంతఁ బరిహాసము లొప్ప వరాన్వితోల్లస
త్పల్లవకుంభకింశుకసుపుష్పరసంబులు మేను లందు రం
జిల్లఁ బరస్పరంబుగను జిమ్మనగ్రోవుల నించి యొంపిగాఁ
జల్లుచు బాంధవంబున వసంతము లాడిరి సంభ్రమంబుగన్. 171

శా. రూపస్తుత్యుఁడు ధర్మరక్షణవిచారుం డైనచంద్రాంగద
క్ష్మాపాలుండు నిజాంగనామణికి మున్దక్షుశ్శ్రీవస్వామిచేఁ
దా పాతాళమునందుఁ దెచ్చినమహోద్యద్దివ్యభూషామణీ
లేపస్రగ్వసనాదికంబు నొసఁగెన్ లేవప్ప మా మొప్పఁగన్. 172

క. అంతట మణిభూషణహారి, దంతఘుమంఘుమితగంధదామాన్విత యై
యొంతయుఁ దేజంబున [illegible] సర్వమంగళ వగిదిన్. 173

వ. అంత. 174

మ. శరజన్మప్రతిమప్రతాపనిధి యాచంద్రాంగదుం డంత భా
స్వరజాంబూనదచంద్రకాంతమణిరాజత్కుడ్యభాగంబు బం
ధురసిలామలవజ్రవేదికము కస్తూరీవిలిప్తంబు భా
స్కరతేజోమణిదీప్తమైనశయనాగారంబుఁ జేరె న్వెసన్. 175

ఉ. కల్పతరుప్రసూనఫలగంధసుభాషితసంయుతంబు సం
కల్పభవప్రతాపజనకం బగులాలితహంసతూలికా
తల్పమునందు రాసుతుఁడు దర్పకరూపధరుం డమోఘసం
కల్పుఁడు విశ్రమించె శితికంఠపదాంబుజభక్తియుక్తుఁడై. 176

క. అంత భవానీపదయుగ, చింతామృతపానపరవశీకృతవిమల
స్వాంతంబున నచటికి సీమంతిని జనుదెంచె రతిసమాకృతి వెలయన్. 177

క. ఈవీరపతివ్రతయును, దైవవియోగమునఁ జేసి తనపతిఁ బడసెం
గావున నీపుణ్యాంగన, సావిత్రికిఁ బ్రతి యటంచు జనులు నుతింపన్. 178

మత్తకోకిల. వచ్చియున్నతలోదరిన్ శుకవాణిఁ జూచి కరంబులన్
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి మిక్కిలి మార్మిఁ జెక్కిలి నొక్కుచుం
మచ్చిక ల్దనరార దీయనిమాటలాడుచుఁ బ్రేమతోఁ
బచ్చవిల్తునికేళి కప్పుడు పైకొనెం దమి మీఱఁగన్. 179

ఉ. రాజకుమారుఁ డంతఁ బరిరంభణచుంబనబంధనంబులన్
రాజితదంతఘాతనఖరక్షతముఖ్యవిమర్దనంబులన్
రాజమరాళయానమధురాధరసారదసీలవేళ్లి నా
రాజతనూజఁ గూడె రతిరాజవినోదము లుల్లసిల్లఁగన్. 180

వ. ఇవ్విధంబున నాదంపతు లన్యోన్యప్రేమాతిశయంబులం గొంతప్రొద్దు సురతాను
భోగములఁ దృప్తిఁబొంది తత్పారవశ్యమున సుఖనిద్రం జెంది ప్రభాతకాలమున
మేల్కాంచి గౌరీశ్వరధ్యానపరాయణులై మంగళస్నానాదికృత్యంబులు శివపూ
జావిధానంబు లాదిగాఁ గల కార్యకరణీయంబులు నిర్వర్తించి తదనంతరమున
మధురాహారంబుల సంతుష్టిం జెందియుండి రంత కతిపయదినంబులకుఁ జంద్రాంగ
దుండు నిజకళత్రసమేతంబుగాఁ గ్రమ్మఱ నిజరాజధాని యగునిషధపురమునకుం
బోవ సమకట్టి యున్నయన్నరేంద్రనందను నభిప్రాయం బెఱింగి. 181

క. విశదయశుండు తదీయశ్వశురుం డసుచిత్రవర్మ జామాతకు ధీ
కుశలునకు నరణమిచ్చెను, దశసాహస్రాశ్వగజరథప్రకరంబుల్. 182

క. మున్నుగ నాత్మతనూజకు, మన్నించి యమూల్యవస్త్రమణిభూషణముల్
చెన్నలర నిచ్చె నప్పుడు, గన్నుల నానందబాష్పకణములు దొరఁగన్. 183

ఆ. మఱియు వివిధగంధమాల్యమృగీమద, కుంకుమాంజనార్ద్రసాంకవములు
దగ సహస్రదాసదాసీజనంబులు, గ్రామశతము లొసఁగె గరుణ వెలయ. 184

వ. ఆసమయంబున. 185

చ. తనగురుసాక్షిఁ జేసి నిషధప్రభునందను వెంట వచ్చి త
జ్జనకకళత్రబాంధవుల సన్నిధిఁ జేర్చి యతండు సాదరం
బున మరలింప నాభుజగపుంగవనందనుఁ డాక్షణంబునం
జని దనుజాన్వితంబుగ రసాతలలోకముఁ జేరెఁ గృష్ణుఁడన్. 186

వ. తదనంతరమునఁ జిత్రవర్మమహీపతిచేత ననుజ్ఞాతుండై నిజకళత్రంబగు సీమంతినిఁ దోడ్కొని చంద్రాంగదుం డనేకసేనాపరివృతుండై కతిపయదినములకు నిజనగరమునకు వచ్చి శుభముహూర్తమునఁ దూర్యరవములు భూసురాశీర్వాదనాదముల చెలంగ శుద్ధాంతప్రదేశము గావించి జననీజనకులకు గురుబంధుజనములకుఁ బ్రణామంబు లాచరించి వారల యాశీర్వాదముల గైకొని పరమానందమున సుఖంబుండి రంత. 187

సీ. అంత శుభాచారరైనసీమంతిని యత్తమామలకును హర్ష మొదవ
బంధువర్గములకు బ్రాహ్మణోత్తములకు నతిభక్తి వందన మాచరింప
నాపతివ్రత నంద ఱాశీర్వదించిరి సతతంబు సౌభాగ్యవతియు గాఁగ
మఱియును దద్వ్రతమాహాత్మ్యమునకును లాలిత్యమునకు సుశీలతకును

తే. వినయగాంభీర్యధైర్యవివేకములకు, సకలజనములు చూచి విస్మయము నొంది
రట్లు శ్వశురులు కోడలి నభినుతించి, యిది సురాంగన యని మది నెంచి రపుడు.

ఉ. మింటను సిద్ధచారణులు మేదినియందు మనుష్యులు న్వ్వని
ష్కంటకపుణ్యశీల సుభగత్వము గల్గినదీని కల్ల ము
క్కంటివధూటి సాటి యగుఁ గాని తదన్యులు గా రటంచు జే
గంటలకైవడిం బొగడఁగా నుతికెక్కె జగత్ప్రసిద్ధిగన్. 189

తే. అతివ యీరీతి యాత్మవల్లభునిఁ గూడి, భయము వయమును బ్రియమును భక్తి గలిగి
స్నానజపహోమభోజనశయనములను, సంతతంబును సంతుష్టి సలుపుచుండె. 190

ఉ. రాజతనూజ మద్వ్రతపరత్వమునం బతిఁ గంటి నంచు వి
భ్రాజితసోమవారముల రాజకళాధరుఁ బార్వతిం జగ
త్పూజితులం భజించుచును భూసురదంపతులన్ ముదంబునన్
బూజలు సేయుచుండె నిజపూర్వభవార్జితపుణ్యవైఖరిన్. 191

వ. అంత. 192

సీ. నిషధదేశం బేలు నిర్మలాచారుండు భానుతేజుం డింద్రసేనవిభుఁడు
ఆరాజనందనుం డయ్యెఁ జంద్రాంగదుం డతని పట్టపుదేవి యనఁగ వెలసి
సీమంతినీమణి సీమంతిని యనంగ దీపించు నధరిత్రీతలమున
సోమవారంబుల సోమశేఖరు సోముఁ బూజించి దంపతిపూజ సల్పి

తే. కామధేనువు క్రైవడి గామితార్థ, జాలము లొసంగు చనుచును సకలదిశల
యందు పేరయ్యె నపుడు రాకేందువదన, వనజదళనేత్రి యాచిత్రవర్మపుత్రి. 193

వ. అంతఁ గొంతకాలమునకు నయ్యింద్రసేనమహీనాథుండు నిజరాజ్యభోగసుఖముల
యందు విరక్తుం డయి తదనంతరంబున నిజకుమారుం డైన చంద్రాంగదునకు బట్టముఁ
గట్టి సకలసామ్రాజ్యభారధురంధరుంగా నియమించి భార్యాసమేతుండయి వనము
నకుం జని యచ్చట వానప్రస్థాశ్రమమున మహాఘోరతపం బాచరించి దేహము
విడిచి భార్యాసమేతముగా దివ్యవిమానారూఢుం డయి సిద్ధచారణులు సేవింప
శివలోకమున శివసాయుజ్యము నొంది రని చెప్పినవిని పరమాశ్చర్యము నొంది
శౌనకాదిమహామునులు క్రమ్మఱ సూతున కిట్లనిరి. 194

క. మామనములు రంజిల్లఁగ, హైమవతీశ్వరపదార్చనాసాదితమా
సీమంతినీప్రభావం, బే మైనను గలిగెనేని యెఱిఁగింపు మొగిన్. 195

క. తొలనుండి చెలుక మొదటికిఁ, దినదినఁగా మధుర మైన తెలుఁగున నిటలా
క్షునిదివ్యచరిత్రంబులు, వినవినఁగా మాకు మిగుల వేడ్క జనించెన్. 196

వ. అని యడిగిన నమ్మహామునులకు సూతుం డిట్లనియె. 197

ఉ. వింతలు దన్మహాత్త్వములు విప్రియమై వ్రతనిష్ఠ సల్పుచున్
గంతువిరోధిసత్కృపను గ్రమ్మఱ నబ్బినవేళ యయ్యె నా
కెంతపతివ్రతాతిలక మెంతటినిశ్చలచిత్త యార సీ
మంతిని సత్ప్రభావగరిమంబు గణింపఁ దరంబె యేరికిన్. 198

తే. అమ్మహాపుణ్యసాధ్వి మహత్త్వ మొక్క, చిత్రకథఁ జెప్పెద వినుండు మైత్రి వెలయ
నదియుఁ గల్యాణదాయకం బది మనోజ్ఞ, మది సమస్తాఘహారణమై యలరుచుండు. 200

వ. అది యెట్టిదనినఁ జెప్పెద నాకర్ణింపు డని సూతుం డిట్లనియె.

క. శ్రీ రాజరాజవిభవా, ధార మగు విదర్భరాజధానిమణికిన్
జేరువదౌ భూరమణీ, హారం బన నొక్క యగ్రహారము వెలయున్. 201

క. అందు వరమిత్రుఁ డను నిం, పొందఁగ సారస్వతుఁ డను భూసురయశుఁడై
యురుదురు భూసుర వరుఁడును, [illegible] తక సకలశాస్త్రజ్ఞులునై. 202

## సుమేధ సోమవంతులచరిత్రము.

క. వరమిత్రునిఘనతనయుఁడు, పరఁగు సుమేధుం డనంగ భాసురకీర్తి
స్ఫురణుఁడు సారస్వతునకు, వరపుత్త్రుఁ డొకండు సోమవంతుఁ డనంగన్. 203

శా. ఆవిప్రోత్తమసూను లొండొరులఁ దుల్యప్రాయులై సూక్ష్మమే
ధావిఖ్యాతులై కృతోపనయనోద్యత్సర్వసంస్కారులై
శైవాచారకళాధురంధరులునై చంద్రార్కసంకాశులై
శ్రీవిద్యాధికులైరి వారలు విపశ్చిన్ముఖ్యులౌ నా జనుల్. 204

క. ఆకుటిలమతు లయ్యిరువురు, సకలపురాణేతిహాసశాస్త్రాగమము
ల్ప్రకటముగ నభ్యసించిరి, యకలంకవచోవిభూతి నార్యులు మెచ్చన్. 205

వ. ఇవ్విధమునం బెరుగుచు సమస్తవిద్యాప్రవీణులును వివాహసమయోచితతారు
ణ్యాధురీణులును నైన కుమారులం గనుంగొని తజ్జనకు లిట్లనిరి. 206

ఉ. పుత్త్రకులార మీరు పరిపూర్ణవయస్కులు గాన నిప్పుడి
ద్ధాత్త్రిఁ బరిభ్రమించి వసుధాతలనాథుల నాశ్రయించి సు
క్షేత్రపరిగ్రహార్థముగఁ జేయుఁడు యత్నము మీకు సత్తమ
శ్రోత్త్రియ లంచు నిత్తురు వసుప్రకరంబుల నమ్మహీపతుల్. 207

క. పదపడి పరవాదములకు, నెదు రెవ్వరు లేకయుండ నింపు దలిర్పన్
జదివితిరి వేదశాస్త్రము, లిది సమయము యాచకమున కేఁగుడు మీరల్. 208

తే. శైశవం బాదిగా సర్వసంస్కృతులును
వ్రతము లొనరించితిమి బహుకృతుల మైతి
మిపుడు వృద్ధుల మైతి మే మెంచి చూడ
శక్తులము గాము దేశసంచారమునకు. 209

క. మీరలు పదియే డేండ్లకుమారులు విద్యాప్రసంగమహిమ విదర్భ,
క్ష్మారమణు నడిగి యర్థం, బారూఢిగ దెచ్చి పెండ్లియాడుఁడు వేగన్. 210

వ. అనిపలికిన నిజజనకులవాక్యములకు సమ్మతించి బ్రహ్మచారులైన యయ్యిరువురు
విదర్భరాజసముఖమునకుం జనిన నమ్మహీనాథుండును ప్రత్యుత్థానపూర్వకంబుగా
వారలం బూజించి యథార్హపీఠంబులం గూర్చుండ నియోగించి యుండునంత. 211

శా. ఛందోవ్యాకరణప్రతర్కఘనశిక్షాజ్యోతిషప్రక్రియా
సందర్భంబు లుపన్యసింపుచును రాజశ్రేష్ఠు మెప్పించి సో

నందస్వాంతునిగా నొనర్చి వివిధామ్నాయోక్తమంత్రాళిచే
సింధూరద్రవమిశ్రితాక్షతఫలాశీర్వాదము ల్చేసినన్. 212

క. మెచ్చి నరపాలుఁ డప్పుడు, మచ్చికతో ననియె నాకుమారవరులతో
నిచ్చటికి మీర లిరువురు, వచ్చుటకును హేతు వెద్ది వచియింపుఁ డనన్. 213

ఆ. వార లిట్లు లనిరి వసుధేశు గనుఁగొని, విత్తవిరహితులము విప్రవరుల
మట్లుగాన నిచటి కస్మద్వివాహార్థ, మరుగుదెంచితిమి ధనాభికాంక్ష. 214

క. అని వారు దెలియ నుడివిన, విని యానృపకుంజరుండు విప్రాత్మజులం
గనుఁగొని యిట్లని పలికెను, ఘనహాస్యరసంబు బాహ్యకము గాకుండన్. 215

సీ. విప్రనందనులార వినుఁడు నావచనంబు విపులార్థసంసిద్ధి వెలయ మీకు
సదమలచారిత్రి చంద్రాంగదునిపత్ని సీమంతిని యనంగఁ జెలువుగాంచి
సోమవారంబున సోమశేఖరుపూజ లాచరింపుచును నిరంతరంబు
దంపతిపూజ లత్యద్భుతంబుగఁ జేసి తుష్టిఁగా నొసఁగు నభీష్టధనము

తే. గాన మీలోన మీర లొక్కరుఁడు యువతి
యొకఁడు బురుషుండుగా వేష మొనర దాల్చి
పోయి యాసాధ్వీమందిరంబున భుజించి
ధనము గొని రండు మత్సన్నిధానమునకు. 216

చ. అని వచియించిన న్విని మహాభయ మందుచు విప్రసూను లి
ట్లనిరి నరేంద్రచంద్ర తగునా మిము బోంట్లకు నిట్టులాడఁగా
జనకులపట్ల దేవతలసన్నిధి సద్గురురాజులం
దును గపటప్రయత్నుఁ డగుదుర్మతి దాఁ జెడు సాన్వయంబుగన్. 217

ఉ. ఎన్నఁగ మేము భూసురకులేంద్రులమున్ బహువేదశాస్త్రసం
పన్నుల మిట్టికాపటికభాషణ మర్హమె మాకుఁ గైతవ
చ్ఛన్నమనుష్యసంతతికి సాధ్వసమున్ గలుషంబు వైరమున్
బన్నగ నిందయుం గలుగు బార్థివశేఖర సత్యమారయన్. 218

వ. నరేంద్రా భవదీయశాసనమున నిమధపురమున కెట్లు పోవనేర్తుము కౌటిల్యమార్గ
మున సంచరింపుచున్నమ మ్మెవ్వరేనియు నెఱింగిన దండనార్హుల మగుదుము కుల
శీలవిద్యాగుణములం బ్రయోజనము లగులజ్జాభిమానములు దొలంగుఁ గావున
నే మిట్టి కార్యమునకుం బోవుట యర్హంబు గా దని పలికిన నవ్విప్రకుమారులవచ
నంబు లాకర్ణించి శివెంధియు నాభూవరుం డిట్లనియె. 219

క. దేవ గురు జనక జననీ భూవరశాసనము గలదు పురుషులు గలరే
యీవిధమున కర్తవ్యము గావున నాయాజ్ఞ మీఱఁగారాదు సుమీ. 220

క. శుభమైన నశుభమైనను, బ్రభువులు పచియించినట్టిపలుకులు వినినన్
విభవంబు లబ్బు నిజముగ, నభయము సమకూఱు నమ్మహాత్ముల కెపుడున్. [illegible]

క. మీరల్ల మదీయాజ్ఞా, ధారకులై యుండవలయు దథ్యం బనినన్
ధీరమతి సమ్మతించిరి, వా రపుడు విదర్భరాజవచనంబులకున్. [illegible]

వ. ఇట్లు సమ్మతించిన యావిప్రకుమారుల యభిప్రాయం బెఱింగి యాభూవరుండు. [illegible]

క. సారస్వతసుతుఁ డాగమ, పారజ్ఞుం డైనసోమవంతున కెలమి
న్నారీవేష మొనర్చను, హారిద్రాంజనవిభూషణాంబరమణులన్. [illegible]

సీ. కటిభాగమున దివ్యకౌశేయము ధరించి నుదుటఁ గుంకుమరేఖఁ గుదురుపఱిచి
ప్రచురతాళంబుల గుచమండల మమర్చి సొగసుగా మృదులకంచుకముఁ దొడిగి
శిలవస్త్రమునఁ బెన్నెరివేణిఁగ నొనర్చి ప్రవిమలం బైనపుష్పములు దురిమి
రాజింప మొలను నొడ్డాణంబు బిగియించి చెక్కిళ్ల మకరిక ల్చక్కఁ దీర్చి

తే. కరములను రత్నకంకణాంగదము లమర, గర్ణములయందుఁ బొజాలకమ్మ లొప్పఁ
గంఠసూత్రాదిభూషణకలితుఁ డగుచు, సోమవంతుఁడు కృత్రిమభామ యయ్యె. [illegible]

క. క్షితిపతియాజ్ఞావిధమున, నతిశయసౌందర్యవంతు లావిప్రులు దం
పతివేషంబులు దనరఁగ, రతికుసుమాయుధులమాడ్కి రంజిల్లి రొగిన్. [illegible]

వ. ఇట్లు రాజానుశాసనంబున నాబ్రహ్మచారు లిరువురు కృత్రిమదంపతివేషంబుల ధరియించి కోఁగలయర్థంబు లవశ్యంబుగా ననుభోక్తవ్యంబు లని ధైర్యం బవలంబించి కతిపయదినప్రయాణంబులన్ జని చని యభ్రంకషమణికాంచనసౌధప్రాకరగోపురంబును నిజవైభవపరాభూతగోపురంబును నగునిషధపురంబుం బ్రవేశించి తత్పట్టణవిలాసంబు లాలోకింపుచు రాజమార్గంబున నరుగుదెంచి యచ్చట నానాదేశసమాగతబ్రాహ్మణవధూవరులం గాంచి వారలుం దామును రాజమందిరద్వారంబు చేరువ నుండునంత. [illegible]

క. ఆవేళ సోమవారము, గావున సుస్నాత యగుచుఁ గౌతుకమున నా
భూవరపత్నియును మహా, దేవాగారంబు సొచ్చెఁ దేజం బలరన్. [illegible]

క. ఆసమయంబున వచటికి, భూసురముఖ్యులును మఱియు భూసురవనితల్
హాసోల్లాసముఖంబుల, నాసాధ్వీమణిని జేర నరిగిరి వరుసన్. [illegible]

తే. మెండురంబుగ వాదిత్రనాదములును, వేణువీణారవంబులు వేదనాద
ములును ఘంటాఘణత్కారములును శంఖ, నిస్స్వనంబులు దిక్కుల నిండె నపుడు.

సీ. కదళికాస్తంభసంగతచతుర్ద్వారంబు పల్లవతోరణభ్రాజితంబు
హరితరాంకవవితానాలంకృతంబును బహురంగవల్లికాభ్రాజితంబు

ఫలపుష్పమంజరీపరిమళోపేతంబు దేదీప్యమానప్రదీపకంబు
... ... ... ... ...

తే. మణిమయం బైనకల్యాణమంటపమునఁ, బృథులసౌవర్ణమయరత్నపీఠమునను
వెలయఁ గూర్చుండి నిషధభూవిభునిసాధ్వి, చిత్తమలరంగఁ బూజలు సేయుచుండె.

సీ. ధ్యానంబు గావించెఁ దరుణేందుమౌళికి నావాహన మొనర్చె దైవపతికి
భద్రాసనం బిచ్చెఁ బార్వతీధవునకు నర్ఘ్యం బొసంగెఁ గాలాంతకునకు
నభిషేకములు జగత్ప్రభునకు నొనరించె వస్త్రయుగ్మము కృత్తివాసునకును
శ్రీగంధతిలకంబు శివునకు నలరించె నక్షతంబులు జగద్రక్షకునకుఁ

తే. కుందమందారబిల్వమాకందవకుళ, చంపకాశోకపున్నాగజలజములను
బూజ లొనరించె రవికోటితేజునకును, సారిది నీ మంతిని భామ సుగుణధామ. 282

క. సౌరభ్యధూప మొసఁగెను, వారిధితూణీరునకును వైభవ మలరన్
నీరాజన మిచ్చెను కర్పూరసుతోడను భుజంగభూషణధృతికిన్. 283

క. ధిషణాపతిరైయె మణిమయ, చషకంబున మధురభక్ష్యశాల్యోదనముల్
నిషధేంద్రపత్ని శివునకు, వృషభేంద్రతురంగునకు నివేదన మొసఁగెన్. 284

క. అక్షణవతి యగు నాసతి, నక్షత్రపుహారతిచ్చె నవరత్నములన్
రక్షితలోకత్రయునకు, దక్షసుతాసహితునకు నతత్రాణునకున్. 285

తే. వంశపావని యాచిత్రవర్మపుత్రి
పుష్పములు దోయిట ఘటించి బుధులు దాను
మంత్రపుష్పంబు లొసఁగిరి మహితవృత్తిఁ
జంద్రమౌళికిఁ గారుణ్యసాంద్రమతికి. 286

క. మేరుశరాసనునకు బృందారకవినుతునకు సచ్చిదానందునకున్
గౌరిమి ప్రదక్షిణనమ, స్కారంబు లొనర్చె నపుడు గజగామినియున్. 287

చ. దురితవిపద్దశావ్యసనదుస్సహతాపభయాశుభాళి బం
ధురతరసంసృతిప్రకటదోషముల న్విదళించి ప్రోవుమీ
స్మరహర చంద్రశేఖర భుజంగవిభూషణ యంచు భక్తి న
ప్పరమపతివ్రతామణియు భావములోనఁ దలంచె నిర్వురున్. 288

చ. శరణు గిరీంద్రజారమణ చంద్రకళాధర కాలకంధరా
శరణు మహాత్మ హేమగిరిచాప మహేశ్వర భక్తవత్సలా
శరణు విరించివిష్ణుముఖసన్నుత భద్రఫలప్రదాయకా 289
శరణు [illegible] భుజంగవిభూషణ దీనపోషకా.

చ. జయజయ రక్తబీజదనుజాధిప శుంభనిశుంభమర్దినీ
జయజయ ఖడ్గఖేటశరచాపగదాంకుశశూలధారిణీ
జయజయ భోగభాగ్య జయ శాశ్వతభద్రఫలప్రదాయినీ
జయజయ యోగిమానసవశంకరి శాంకరి విష్ణుసోదరీ. 240

క. భువనత్రాణసుధాకర, ధవళాంగశర త్రిశూలధారణ శంభో
శివ శంకర మృత్యుంజయ, భవహర మాం పాహి పాహి భర్గనిధానా. 241

క. జపమంత్ర వ్రతనిష్ఠా, తపములు సలుపంగ నోప దక్ష్యముగ భవ
త్కృప నమ్మియుండెదను నా, యపరాధంబులు సహింపు మార్తశరణ్యా. 242

వ. అని బహుప్రకారంబులం బ్రార్థింపుచు శంఖకాహళఘంటారవంబులు చెలంగ ననేకఛత్రచామరకుసుమాదిరాజోపచారంబులం గొంతప్రొద్దు సేవ గావించి తదనంతరంబున శివమంత్రపారాయణమును శివపురాణశ్రవణమునుం గావింపుచున్నంత.

తే. ఇవ్విధంబున నాపార్వతీశ్వరులకు, నురుతరంబుగఁ బూజామహోత్సవంబు
లింపుతోఁ జేసి మతి విప్రదంపతులకు, సొంపు మీఱఁగఁ బూజ గావింపుచుండె.

ఉ. రాజనిభాస్య యానిషధరాజకుటుంబిని భక్తి మీఱ వి
భ్రాజదుమామహేశులుగ భావన జేయుచు నైజమానసాం
భోజమునందు నిశ్చలత భూసురదంపతిపఙ్క్తి కెంతయుం
బూజ లొనర్చె భస్మమయపుష్పసుగంధములం బ్రియంబునన్. 245

క. ఆసమయంబున గృత్రిమ, భూసురదంపతు లటంచు బుద్ధిఁ దెలిసి సో
త్సాహము మనమునఁ దోఁపఁగ, నాసీమంతినియు వారి నారాధించెన్. 246

క. ఒకరుని భవానిగను వే, ఱొకరుని శంకరుని గాఁగ నూహింపుచుఁ దా
నకుటిలమతి బూజించెను, శుకవాణి దరస్మితాస్యశోభిత యగుచున్. 247

క. వనజాక్షి యిట్లు బ్రాహ్మణ, జనములకును షోడశోపచారంబులఁ బూ
జనము లొనరించి మణికాం, చనభాజనభోజనములు సరవి నొసర్చెన్. 248

సీ. శాల్యోదనంబులు సద్యోఘృతంబులు మొలకబేడలపప్పు మోదకములు
గలవంటకంబు లప్పడములు వడియంబు లతిరసములు వడ లామవడలు
పరమాన్నములు దేనె ఫలరసప్రకరంబు లిడ్డెన లుప్పళగంబు లడ్డువములు
నారుబిండులు నల్ల నారుగాయలు నావ పచ్చళ్లు పెరుగులు పానకంబు

తే. లాదిగా గలుగుభక్ష్యభోజ్యములొసంగి, భూసురేంద్రుల కప్రుడుదాంబూలములును
దక్షిణ లొసంగి యంతఁ బ్రదక్షిణముగ, వందనము లాచరించె నవ్వనరుహాక్షి.

శా. శిష్టాచారము తప్పకుండఁగ దదాశీరక్షతౌఘంబులన్
హృష్టస్వాంతముతోడఁ గైకొని శుభశ్రీకాము లై యంతటన్

మృష్టాన్నంబులఁ దుష్టిఁ జెందినధరిత్రీదేవతాశ్రేణికిన్
స్వేష్టార్థంబు లొసంగి పంపె మరలన్ హేమాంగి లీలాగతిన్. 250

క. తదనంతరమున నాసతి, ముదమునఁ మృష్టాన్నపానములఁ బరితుష్టిం
బొదలుచు బతికి హితంబుగ, సదమలమతి నుండె నవుడు సఖులుం దానున్. 251

వ. అంత దేశాంతరసమాగతబ్రాహ్మణప్రకరంబు లారాత్రి యచ్చట వసియించి మరు
నాఁడు నిజనివాసములకుం జని రంత నాకృత్రిమదంపతులు పరజనసందర్శనభీతు
లై యపరరాత్రంబున మేల్కాంచి గృహములకు సత్వరప్రయాణమున జనుచుండి
రాసమయంబున. 252

శా. శ్రీరంజిల్లఁగఁ బూర్వరాత్రమున నాసీమంతినీదేవి దా
గౌరీశంకరు లంచు జిత్తమున సంకల్పించి పూజించుటం
దారుణ్యాకృతిభూసురుండు పురుషత్వంబు న్విసర్జించి కాం
తారూపంబు ధరించి నిల్చె నవు డత్యాశ్చర్యమొందంగన్. 253

క. ఈరీతిని బ్రభవించిన, తారుణ్యవతీలలామ దర్పకవిశిఖా
సారాహతిఁ బరవశయై, మీఱి రతిప్రీతి నల సుమేధుని జేరెన్. 254

ఆ. నిలువు నిలువు రమణ నీవు పోవఁగ నేల, పుష్పఫలవితానపూర్ణమైన
యౌవనంబుఁ జూడు మిచ్చోట వసియించి, కామకేళి నన్ను గారవింపు. 255

ఆ. అని వచింపుచుండ నయ్యింతి పలుకులు, హాస్య మనుచు దలఁచి యాద్విజుండు
పడుచుఁదనముసుద్దు లుడిగి మౌనంబున, రమ్మటంచు సత్వరముగ నరిగె. 256

ఉ. వల్లభ నిల్వు మంచు జెలువంబుగ నడ్డము వచ్చి ప్రోవకు
న్నల్లన మాటలాడు దమి మించెఁ దిరంబుగ నాదువాక్యము
ల్లల్లలు గా నటంచు బిగి కౌఁగిటఁజేర్చును బోవి యాను నా
పల్లవపాణి పంచశరభల్లహతి న్నిలుపోవ కెంతయున్. 257

క. ఈతెఱఁగున నాకామిని, చేతోజాతప్రయుక్తచేష్టలు వెలయన్
భూతము సోఁకినరీతిని, గోఁతికి కల్లు ద్రావినట్లు కొంతనటించెన్. 258

వ. ఇట్లు కామోపాస్వాదంబున బ్రవర్తింపుచున్న యాయింతిం గనుంగొని సుమేధుండు నిజకృ
తం బయినరహస్యకార్యము ప్రకాశం బగునో యనుతలంపున భయమును జెంది
యిట్లనియె. 259

మ. తగునే యిట్లు కుచేష్టలం బడఁగ నిత్యబ్రహ్మచర్యుండవై
తగ సారస్వతవిప్రనందనుఁడవై తర్కాగమామ్నాయపా
రగమేధానిధివై జితేంద్రియుఁడవై రంజిల్లునీ విట్లు దు
ర్భగకాంతాకృతి సంచరింప నగ[illegible]. 260

చ. పురుషుఁడ నంచిచూడ ననబోఁడివిగావు విగర్హితోక్తులన్
సరసము లాడఁగాఁ జనదు చయ్యన బోవుద మన్న నింతి భూ
సురసుతుఁజూచి పల్కె బురుషుండను గాను వధూటి గాని న
న్నరయుము నేను సోమవతి నంచును జూపె నిజాంగకంబులన్. 261

వ. ఇట్లు చూపిన. 262

మ. తరుణీరూపవతి న్యథార్థవిలసద్ధమ్మిల్లతుంగస్తనిన్
హరిణీలోచనఁ జంద్రబింబవదనన్ హర్యక్షమధ్యాంచితన్
హరినీలాలకవిద్రుమాధరగరీయశ్శ్రోణి నత్యంతసుం
దరి నాసోమవతి న్గనుంగొనిరి యద్ధాత్రీసురుం డంతటన్. 263

క. కని యత్యాశ్చర్యంబును, ఘనతరభీతియును దోఁపఁ గంపితగాత్రుం
డును నతిచంచలచిత్తుం, డును నై యతఁ డూరకుండె దుర్ముఖుఁ డగుచున్. 264

వ. ఇవ్విధంబున నేమియుం దోఁచక వెల్లఁగుపడియున్న యాద్విజకుమారునిం గాంచి నిజానురాగంబునఁ గామోన్మాదంబు దోఁప నవ్వరారోహ వెండియు నిట్లనియె.

సీ. మదనసుందర నీవు మానముద్ర వహించి చిత్తంబు వెలయ భాషింపవేమి
దైవకృతం బిది తప్పింప వచ్చునే యనుభవింపక తీర దజునకైన
వంచకుఁ డైనభూవరుని చేరఁగనేల దంపతివేషము దాల్పనేల
మనము వద్దనక సమ్మతమంది రానేల యమ్మానినిసమక్ష మరుగనేల

తే. యాపతివ్రత యిది సిద్ధ మగు నటంచుఁ, జిత్తమున నెంచి యిట్లు పూజింపనేల
నంతమాత్ర నయిటులౌటయద్భుతంబు, లింతయుఁ బ్రాకృతంబని యెఱుఁగవలయు.

క. భువిలోన ధూర్తమానవు, లెవరైనను గాని పరుల యొడలను నతికై
తన మొనరించినమాత్రన, నవితథముగ ధాత్రి నశ్యులగుదురు వారల్. 267

క. మనమందిరమున నిప్పుడు, మన మరిగినఁ బురుషభావ మగపడకున్న
న్మనవారియనుమతంబున, మన మిద్దఱమును వివాహ మాడము నెమ్మిన్. 268

ఆ. చింత సేయవలదు శివునిపాదము లాన, సమ్మదముగ నుండు నెమ్మనమునఁ
గాఁగలట్టిపనులు గాకమాన వటంచుఁ, బలికి యంతవలపు నిలుపలేక. 269

వ. వెండియు నమ్మహీసురకుమారునితో నమ్మానిని యిట్లనియె. 270

చ. జనరహితంబు పుష్పఫలసంయుతమంజునికుంజపుంజరం
జనము మయూరకీరపికషట్పదముఖ్యసమస్తపక్షిని
స్వనితముఁ గామిపురుషసంగమయోగ్యనివాస మైనది
వన మిటు చూడు మిందు రతివల్లభకేళిచరిత్ర మొప్పఁగన్. 271

వ. అని పలికి. 272

ఉ. అంగజుఁ డేయుపుష్పవిశిఖావళి క్రొవ్వఁగ లేత యాత్మ ను
ప్పొంగుచు లజ్జఁ బోవిడిచి మోహభరంబును జెంది యప్పు డ
య్యంగన ప్రాణనాథు మధురాధరము న్మనిపంట నొక్కి యా
లింగన మాచరించెఁ దరళీకృతచిత్తము తత్తరింపఁగన్. 273

వ. ఇవ్విధమున నతిశయప్రేమాతిరేకంబునం బయిం బడియున్నయమ్మానిని నాథుఁడు రమణుండు సాంత్వవచనమ్ముల నెట్టకేలకు ననునయించెఁ గ్రమ్మఱ నవ్విప్రమిథునం బు నిజగృహంబులకుం బోవుచు నహో సీమంతినీప్రభావంబు మహాశ్చర్యకరం బని మనంబునం బొగడుచు జని రంత. 274

క. గృహమున కేతెంచిన తన, దుహితను వీక్షించి కినుక దోఁప గురుండు
న్మహిళారూపం బేమని, యహితోక్తుల ననుగఁ జెప్పి రాద్యంతంబుల్. 275

క. వినినంతమాత్రలోన, జ్జనకులు సక్రోధు లగుచు సరభసముగ నా
జనపతికడ కరుదెంచిరి, తనయాన్వితు లగుచు మదిని దత్తరపడుచున్. 276

వ. అంత నాభూవరుం జూచి సారస్వతుం డిట్లనియె. 277

శా. శుద్ధశ్రోత్రియు మత్కుమారు గతదోషు న్గామినీవేషస
న్నద్ధుం జేసినకారణంబునఁ దగ న్నారీస్వరూపంబు దా
సిద్ధం బయ్యెఁ దదేకపుత్త్రికుఁడనై జీవింప నెట్లోర్తు నీ
యుద్ధారం బిటులయ్యె నీవు కపటోద్యోగుండ వుర్వీశ్వరా. 278

క. మాంజీదండకమండలు, రంజితవటుచర్య లుడిగి రమణీమణియై
మంజులతరభూషణహారి, ద్రాంజనసిందూరకాదు లమర ధరించెన్. 279

క. సుతహీను లైనవారల, పితరులు పరికింప లుప్తపిండోదకులై
సతతము నిరాశు లగుదురు, క్షితివర మద్గతికి నేమి చెప్పెదొ చెపుమా. 280

తే. స్నానసంధ్యాదివిధులును జపతపములు, వేదపారాయణంబులు నీటఁ గలిపి
నాతిచందంబుఁ దాల్చిన నాదుసుతున, కిట్టి గతిగల్గు రాజ నీ వెఱుఁగఁ బలుకు.

వ. అని బహుప్రకారంబుల నిష్ఠురభాషణంబు లాడుచున్న సారస్వతునివాక్యంబు లాకర్ణించి యాభూపాలుం డతివిస్మయమానసుం డయి తనమనంబున నిట్లని వితర్కించె. 282

మ. పరిహాసార్థముగాఁగ నిద్విజసుతున్ భామాకృతిన్ బంపినం
బురుషత్వంబుఁ బరిత్యజించి సతియై పొల్పొంద నిచ్చెసెఁ గ్ర
బురుషత్వంబుఁ బరిత్యజించి సతియై పొల్పొంద విచ్చేసెఁ గ్ర
మ్మఱ నా గిరిజామహేశ్వరులసామర్థ్యంబుఁ దద్భక్తభా
సురమాహాత్మ్యము నెంచిచూడ భువిలోఁ జోద్యంబులై కన్పడున్. 283

క. సీమంతినిప్రభావము, [illegible] బుధులఁ జెంతయుఁ దలఁపన్

సీమంతినియై నిలిచెను, నామునుపలతపంబు లెన్న నజునకు వశమే. 284

సీ. అని వితర్కింపుచు నావిదర్భాధీశుఁ డాప్తమంత్రులం దాను నాక్షణమునఁ
దాపసోత్తము భరద్వాజుని రప్పించి యమ్మహామునినాథునసుమతమున
సావిత్రు లిరువురు నాత్మజయుతముగాఁ దనవెంట రా నతిత్వరితగతుల
నంబికాదేవిగృహంబున కేతెంచి యారాత్రి గౌరీసమర్చనంబుఁ

తే. జేయ సమకట్టి యమ్మహీనాయకుండు, విగతభోజనపాననివేశుఁ డగుచు
ధీరమతి నమ్మునీంద్రోపదేశమునను, విహితనిష్ఠాసమాధిఁ గావింపుచుండి. 285

దండకము. శ్రీమన్మహాదేవురాణీ నతేంద్రాణి రుద్రాణి శర్వాణి కల్యాణి దాక్షాయణీ
శూలపాణీ పృథుశ్రోణి ధూమ్రాక్షసంహారిణీ పారిజాతప్రసూనాంచితస్నిగ్ధ
వేణీ అసత్కీరవాణీ భవానీ శివా శాంకరీ రాజరాజేశ్వరీ గౌరి శాకంభరీ కాళి
కంకాళి రాజీవనేత్రీ సుచారిత్రి కల్యాణగాత్రీ మహాదైత్యజైత్రీ నగాధీశపుత్రీ
జగన్మాత లోకైక విఖ్యాత గంధర్వ విద్యాధ రాదిత్య కోటీరకోటీ స్ఫురద్దివ్య
మాణిక్య దీపప్రభా తుల్లసత్పాదకంజాత కేయూర హారాంగదాది జ్వలద్భూ
షణ వ్రాత కౌమారి మాహేశ్వరీ నారసింహీ రమా వైష్ణవీ శాంభవీ భారతీ
భైరవీ దుర్గ కాత్యాయనీ పార్వతీ నీదుసామర్థ్య మెన్నంగ బ్రహ్మాదులుం శేష
భాషాదులుం జాల రే నెంతవాడన్ బ్రశంసింప నేతజ్జగజ్జాల నిర్మాణ సంరక్ష
ణారంభ సంరంభకేళీ వినోదంబులుం గల్గి వర్తింతు వెల్లప్పుడో యాదిశక్తి పరం
జ్యోతి నారాయణీ భద్రకాళీ శుకశ్యామలా భ్రామరీ చండికా లక్ష్మి విశ్వేశ్వరీ
శాశ్వతైశ్వర్యసంధాయినీ యంచు ని న్నెంతయుం సన్నుతుల్ సేయు లోకాళి
కిం సంతతాఖండదీర్ఘాయురారోగ్యసౌభాగ్యసంసిద్ధిఁ గావింతు నశ్రాం
తముం రక్తబీజాది దైతేయులన్ ద్రుంచి బృందారకశ్రేణి రక్షింతు వీ వప్పు
డుం నారదాగస్త్యశాండిల్య మాండవ్యమైత్రేయ జాబాలికణ్వాదిమౌనీంద్రు
లత్యంత నిష్ఠాగరిష్ఠాత్ములై హృత్సరోజంబులన్ ధ్యానము ల్సేయుచున్ బూజఁ
గావింతు రంతర్బహిత్వంబునం జంద్రఖండావతంసా భవద్దివ్యరూపంబు బ్రహ్మాం
డభాండంబుల న్నిండి వెల్గొందు నేతత్ప్రపంచంబు సర్వంబు నీవై ప్రవర్తింతు
వీ సూర్యచంద్రాదులున్ భూజలాకాశవాతాగ్ని జీవాత్ములున్ నీవ నీకంటె వేఱైన
దింతైనయుం లేదు యమ్మత్కృటాక్షార్హులైనట్టి వారల్గదుం ధన్యులై మాన్యు
లై పుణ్యులై గణ్యులై యుందు రీధాత్రిలో నేను మూఢుండ గర్వాధిరూఢుండ
దుశ్చిత్తుఁడన్ మత్తుఁడన్ జ్ఞానహీనుండ దీనుండ నేఁజేయు నేరంబులం గాంచి
రక్షింపఁగా భారమే తల్లి సద్భక్తమందారవల్లీ నమస్తే శరచ్చంద్ర శోభాన
నాఢ్యై నమస్తే శశాంకారుణప్రజ్వలత్కుండలాఢ్యై నమస్తే పరిత్రాత భూమండ

లారైు నమస్తే విపద్ధ్వాంతభానుప్రభాయై నమస్తే పరిధ్వస్తతాపత్రయాయై నమః శ్రీపదాయై నమో ముక్తిదాయై నమశ్చండికాయై నమస్తేంబికాయై నమస్తే నమస్తే నమః 286

కవిరాజవిరాజితము. జయజయ పార్వతి శంభుకుటుంబిని చారునితంబిని కంబుగళే
జయజయ విద్రుమబింబఫలాధరి చక్రసహోదరి పీనకుచే
జయజయ శాంకరి సాధువశంకరి శత్రుభయంకరి మానినుతే
జయజయ శుంభనిశుంభనిషూదని సత్యవినోదిని శాంతిరతే. 287

తే. అనుచు వినుతులు చేయుచు నన్నరేంద్రుఁడుపవసించెను దద్విప్రయుతముగాఁగ
మూఁడహోరాత్రములు మౌనముద్రఁదాల్చి భక్తి వెలయుంగ నంజలీబద్ధుఁడగుచు. 288

వ. ఇట్లున్న సమయంబున. 289

సీ. రాకేందుబింబవిభ్రాజితాస్యముతోడ ధవళాంబుజాతనేత్రములతోడఁ
గటిభాగశోభితకనకాంబరముతోడ డమరుత్రిశూలఖడ్గములతోడ
గళవిరాజన్మణిగ్రైవేయములతోడఁ జంద్రావతంసమస్తకముతోడ
సౌదామినీపుంజసన్నిభప్రభతోడ మహితలావణ్యవిగ్రహముతోడ

తే. హారమంజీరకటకకేయూరముఖ్య, భూరిభూషణరాజివిస్ఫూర్తి లోలయు
నిర్భరకృపాస్ఫూర్తితోడ విదర్భపతికి, నంబికాదేవి యపుడు ప్రత్యక్షమయ్యె. 290

తే. ఇట్లు సాక్షాత్కరించినయిందుమౌళి, గేహినికి వందనముచేసి కేలుదోయి
ఫాలభాగంబున ఘటించి ప్రముదితాత్ముఁడగుచునారశయుండెనయ్యవనివిభుఁడు. 291

వ. ఇట్లు వినయవినమితశిరస్కుఁడై యున్నయారాజున కంబికాదేవి యిట్లనియె. 292

క. ఏమిటికై ప్రార్థించితి, వేమిభవత్కామితంబు లెఱిఁగింపుము నీ
కామోదంబున నొసఁగెద, నామాట నిజంబుగాఁగ నమ్ము మధీశా! 293

చ. అనిన ధరాధినాథుఁ డను నంబికతో జగదేకరక్షణీ
వినుము ద్విజేంద్రనందనులు వేడుకఁ గృత్రిమదంపతిత్వముం
బనుపడ నైషధేంద్రుసతిపాలికిఁ బోయిన నావధూటి ని
స్సన మలరం భజించుకతనం బలనామణి యయ్యె నొక్కఁడుం. 294

క. దేవీ సారస్వతునకు, నీవిప్రుం డొకఁడె పుత్త్రుఁ డీయిలనాగం
భావింప మరలఁ బురుషుని, గావింపు మటన్న రాజుఁ గనుఁగొని పలికెన్. 295

క. ఈవరమడక్కు మతిరొక, రేవరమైనం దలంప నిత్తు నిజముగా
భూవర వేఁడు మటంచన, నావసుధేశుండు పలికె నయ్యంబికతోన్. 296

ఉ. నీకిది యేమిభారము గణింపఁగ నోజగదంబ తొల్లి యి
క్ష్వాకుసహోదరిం బురుషసత్తముఁగాఁగ ననుగ్రహింపవే

లోకులు నన్ను బుద్ధిచపలుం డని నింద లొనర్పకుండఁగా
నీకమలాక్షికి స్మరణ నిచ్చులు బుం త్త్వ మొసంగు శాంకరీ. 297

క. కపటాత్మకుఁ డితఁడని న, న్నపవాదము చెందకుండ నరయుచు మఱి నీ
కృపకుం బాత్రునిఁ జేయుము, కపిలాదిమునిస్తుతాంఘ్రికమలభవానీ. 298

సీ. అనుచుఁ బ్రార్థించిన నానృపాలుని జూచి యంబికాదేవి యిట్లనియె మరల
వినవయ్య నరనాథ వినిపింతు నొకవార్త సోమవారవ్రతనార్తిఁజేసి
యాపతివ్రత తనయాత్మలో భావించి భజనం బొనర్చె దంపతు లటంచు
మదికసంకల్ప మమోఘంబు కావున నది మాన్ప నలవిగా దటునకైన

తే. నట్లగుటఁజేసి వీరల కతిమోదమున, నెమ్మిఁ గావింపు డిపుడు పాణిగ్రహంబుఁ
భాస్వరఖ్యాతి రైనసారస్వతునకు, నుద్భవించు గులోద్ధారుఁ డొకసుతుండు. 299

క. అని యానతిచ్చి శ్రీభువనజనని తిరోధాన మొంద సారస్వతుఁడుం
దనమనమున వెఱఁగందుచు, జనితానందుండు నిర్వ్యాజాత్ముం డయ్యెన్. 300

ఆ. గాఢభక్తి నంబికాదేవి మెప్పించి, వాంఛితంబు దీర వరము వడసి
భూమరోత్తములను పూర్ణకాములఁజేసి, చనియె నృపతి తనదుసదనమునకు. 301

క. పరివారవిరహితుండై, మారుపత్నివరంబునకుఁ గృతార్థుం డగుత
న్నరపతిచే నర్చితుఁడై, యరిగె భరద్వాజముని యాశ్రమమునకున్. 302

మ. జనము త్మె అనఁగా జగజ్జననికిన్ సద్భక్తితో మ్రొక్కి పా
వనశీలుం డగుతాపసేంద్రుని భరద్వాజున్ బ్రశంసింపుచున్
మునిసంకాశుని నావిదర్భనృపతిన్ మన్నించి దీవించుచుం
జని రాభూసుర లాత్మగేహములకున్ సంతుష్టచేతస్కులై. 303

ఆ. అనుమేధునకును నాసోమవతి నిచ్చి, పెండ్లిఁ జేసె గురుఁడు ప్రీతి యలర
నావధూరమణులు నత్యంతసౌఖ్యంబు, లనుభవింపుచుండి రనుదినంబు. 304

వ. తదనంతరంబున. 305

క. సారస్వతునకు వంశో, ద్ధారకుఁడును సత్కళానిధానుం డగుచున్
గారిత్రభావమహిమను, భూరిగుణోదారుఁ డొకసుపుత్త్రుఁడు పుట్టెన్. 306

క. ఈసోమవారసువ్రత, భాసురకథ విన్న పుణ్యపరులకు విజయ
శ్రీసౌభాగ్యశుభంబులు, శ్రీసాంబశివుం డొసంగుఁ జిరతరకరుణన్. 307

వ. అని యివ్విధంబున సీమంతినీప్రభావంబును శంభుమాహాత్మ్యంబునుం దెలియం బలి
కినవిని యమ్మహామునులు పరమప్రహృష్టహృదయులై సూతుం బ్రశంసించి మఱి
యును శివభక్తలక్షణంబు లెఱింగింపు మని యడుగుటయును. 308

## ఆశ్వాసాంతము.

క. శరణాగతసంరక్షణ, శరణీకృతరజతశైలశంకర కరుణా
వరుణాలయమహితాంబా, పురమందిరపార్థివేవ భువనాధీశా. 309

పంచచామరము. ధరాధరేంద్రకన్యకానితాంతహర్షవర్ధనా
చరాచరాత్మకప్రపంచజాలరక్షణక్షమా
సురాసురప్రసేవ్యమానశోభితాంఘ్రిపంకజా
పరాపరాత్మవామదేవ భానుకోటిభాస్కరా. 310

మాలిని. కుజనఫణిమయూరా కుంభిదైత్యప్రహారా
భుజగనికరహారా పోషితాజాండవారా
వృజినఘనసమీరా విశ్వరక్షావిచారా
రజతగిరివిహారా రాజయోగప్రచారా. 311

గద్యము. ఇది శ్రీరామభద్రకరుణాకటాక్షవీక్షణసమాలబ్ధ గీర్వాణాంధ్రభాషా కవిత్వ కళాధురంధర బడగలనాటి కన్నడవంశపయఃపారావార రాకాసుధాకర ఆశ్వలాయనసూత్ర భారద్వాజసగోత్ర శ్రీధరమల్లాయ్యార్యతనయ సూరి జనవిధేయ వేంకటరామనామధేయప్రణీతం బైనబ్రహ్మోత్తరఖండం బనుమహా పురాణంబునందు సీమంతినీవివాహంబును జంద్రాంగదుండు యమునాజలాంతరాళంబున నాగలోకమునకుం బోవుటయు నందు దక్షకువలన బహుమానప్రాప్తుండై క్రమ్మఱ నిషధపురమునకువచ్చుటయును సీమంతినీప్రభావకథనమును ననుకథలం గల తృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.

---



శ్రీకలితాంబాపురసద
నాకంధినిషంగధరణ నానానిద్వి
డ్భీకర శూలపరశ్వథ
నాకాధిపపూజ్యచరణ నాగాభరణా. 1

వ. దేవా యవధరింపుము శివపురాణకథాకథనచతురుం డయినసూతుం డమ్మహామునుల నవలోకించి వెండియు ని ట్లనియె. 2

చ. వినుఁడు మునీంద్రులార పృథివిస్థలి నెన్నఁగ శ్రీమహేశపూ
జనము లొనర్చుమానవులసచ్చరితంబులు భుక్తిముక్తిసా
ధనములు జన్మదైన్యభయతాపహరంబులు సర్వలోకరం
జనములు నై యశేషకలుషంబు లడంచును విన్నవారికిన్. 3

క. ఘటనాఘటనసమర్థులు, నిటలాక్షునిభక్తు లతివినిర్మలహృదయుల్
ఘటికాసిద్ధులు వారల, పటుతరమహిమంబు లెన్న బ్రహ్మకు వశమే. 4

క. పరధేనువులకు దృణమును, జెలువల కుదక మిడినట్లు శివభక్తుల కా
దరణ మొనర్చినజనులకు, నరయఁగ నది కోటిమడుఁగు లై ఫల మొసఁగున్. 5

వ. అట్లు గావున శివభక్తులసామర్థ్యంబులు దెలియుటకుం గా నొక్కయితిహాసము గలదు దానిం జెప్పెద సావధానమతుల రై వినుం డని సూతుం డి ట్లనియె. 6

## సుందరుం డనుబ్రాహ్మణునిచరిత్ర.

చ. సురుచిరహేమరత్నగృహశోభిత మైనయవంతికాపురాం
తరమున నొక్కవిప్రుఁడు సదా విషయాభిరతుండు సత్యశౌ
చరహితుఁ డంగనారతుఁడు చంచలచిత్తుఁడు దుర్మదుండు సుం
దరుఁ డనుపేరుగల్గి సతతంబును గాపుర ముండు నచ్చటన్. 7

ఉ. అంగదహారకుండలముఖాభరణంబులు దాల్చి గంధసా
రంగమదప్రలిప్తరుచిరాంగము శోభిల నాశ్రమంబునం
బింగళ నాఁ బరంగి కడుఁ బేర్మివహించినదాని నొక్కవే
శ్యాంగన గూడియుండు నతఁ డంగజతంత్రముల న్దెలంగుచున్. 8

ఋషభయోగి మందరుం డను బ్రాహ్మణుగృహంబునకు వచ్చుట.

తే. స్నానసంధ్యాద్యనుష్ఠానహీనుఁ డగుచు
జాతిమాత్రోపవీతియై సంచరింప
నతనిగృహమున కొక్కనాఁ డరుగుదెంచె
విషమనేత్రకృపాభోగి ఋషభయోగి. 9

వ. అంత. 10

సీ. సిద్ధసేవ్యుఁడు సదాశివమూర్తి యైనట్టికృతపుణ్యు ఋషభయోగీంద్రుఁ గాంచి
వేశ్యాసమేతుఁడై విప్రవంశజుఁ డంతఁ దగ నెదురేఁగి పాదముల కెఱఁగి
యర్ఘ్యపాద్యాదుల నర్చించి మద నొప్ప విమలహిరణ్యపీఠమున నునిచి
మృష్టాన్నపానసంతుష్టుని గావించి తాంబూల మిచ్చుచు దల్పమందుఁ
తే. బండఁ జేసియుఁ దాను తత్పాదపద్మ,యుగము లొత్తుచు నారాత్రిపగలు భక్తి
సేవ గావింప సంతుష్టచిత్తుఁ డగుచు, వెలఁగ నవ్వేళ నాయోగిశేఖరుండు. 11

క. ఈవిధమున నాఋషభుం, డావిటదంపతులచేత నర్చితుఁ డగుచున్
దైవగతినుండి క్రమ్మఱ, నావేకువ నరిగె నమ్మహామహుఁ డంతన్. 12

క. ఈలీలనుండు నాద్విజ, మాలం బెఱిఁగింతు వినుఁడు పూర్వంబున దు
శ్శీలుండై నిజదాసీ, లోలత గలయాయజామిషుం డితఁ డరయన్. 13

వ. అని చెప్పి వెండియు సూతుం డిట్లనియె నివ్విధంబున నావిప్రుండును దదీయవే
శ్యయుఁ గొంతకాలంబు వర్తించి తదనంతరంబున విగతప్రాయులై కాలవశతం
బొంది రంత నవ్విప్రుఁడును నిజకృతకర్మానుభవంబునకై పునర్జనన మందుటకొ
ఱకు దశార్ణదేశాధీశ్వరుం డగువజ్రబాహుఁ డనురాజున కగ్రమహిషి యైనసుమ
తి యనుదానిగర్భంబు నాశ్రయించి యున్నంత 14

క. దుర్భరభారాన్వితయై, గర్భిణియై యున్నసుమతిఁ గని సైఁపక నా
విర్భూతకైతవంబున, నిర్భరగరళాన్న మిడిరి నెలఁతుక సవతుల్. 15

తే. ఘోరతర మయినతద్విషం బారగించి, సుమతి మృతిదప్పె దైవయోగమునఁ జేసి
యంత సంతాపదుస్సహం బా నవసుఁ, జెందియుండె మహేభేంద్రమందగమన. 16

శా. ఆలో నొక్కదినంబునందు దనయుం డారాజ్ఞికిం బుట్టె న
ద్వేలాక్రందనఘోషణాన్వితుఁడు దుస్తేజుండు నై దుస్సహా
క్ష్వేళప్రాప్తమహాప్రజాళి వలివిచ్ఛిన్నాంగుఁ డై యుండె నా
బాలుం దట్టనయుండు తజ్జననియున్ బాధాపరీతాత్ములై. 17

క. ఆరాజునిజకళత్రకుమారులకు విషాపహరణమంత్రౌషధస
త్కారంబు లాచరించిన, నారోగ్యత లేకయుండి రతిదుఃఖితులై. 18

తే. ఇట్టిమహారాత్రములు రోదనేచ్ఛఁదగిలి, యుస్సుఁ జూచి యసహ్యత నొదవుచుండ
బంధుమిత్రపురోహితప్రముఖజనులఁ, గాంచి నరపతి పల్కె నిష్కారణుఁ డగుచు.

క. ఈరమణీసుతు లిరువు, స్త్రారంపరోజాతరోగతాపవ్యధితు
ల్వీరలకతమున నిద్రా, హారంబులు దూరమయ్యె ననవరతంబున్. 20

క. నరకాలయులై యిచ్చటి, కరుదెంచినవారు వీరి నతిదూరముగాఁ
బరపెద దేశము వెడలన్, జిరతరరోగార్తుల నవిశీర్ణాశ్రుతులన్. 21

## వజ్రబాహుండు తనజ్యేష్ఠభార్య యైనసుమతిని పుత్త్రసహితంబుగా నరణ్యంబున కనుచుట.

వ. అని నిశ్చయించి యాభూనాథుండు కనిష్ఠపత్నీవ్యాసక్తుండు గావున నిజసారథిం బిలిచి యీ విక్కారిణీడింభకుల నరదంబుపై నిడుకొని మనదేశంబు వెడలునంతకుం గొనిపోయి విజనప్రదేశంబున వారలం డించి రమ్మని పంచిన వాఁడును "వల్లె" యని రాజశాసనప్రకారంబున బహుయోజనవిస్తారం బయినదూరంబు గొనిపోయి యచ్చట. 22

శా. ఘోరవ్యాళభయానకంబు బహురక్షోగుహ్యకాభీలమున్
వీరుచ్ఛిన్నము నైనకాఱడవి దుర్వృత్తిన్ విసర్జించి ని
ష్కారుణ్యుం డగుసూతుఁ డేఁగిన మహోత్కంపంబు దీపింపఁగా
నారాజాంగన యంతటం జనియెఁ గొండారణ్యమార్గంబునన్. 23

క. ఘోరవ్యాఘ్రమృగాదన, వారణగవయాచ్ఛభల్లవానరఝిల్లీ
దారుణ మగుకాననమున, దారకు నెత్తుకొని చనియెఁ దరళేక్షణయున్. 24

వ. ఇట్లు వాతాతపదుర్గమంబును దివ్యంబును వేత్రకీచకవేణుకంటకపాదప లతాకీర్ణంబును నైనయమ్మహారణ్యమార్గంబునం బడి యారాజభామిని ఝిల్లీరవంబుల కు మలంకుచు కంకకాకగృధ్రోలూకఘూత్కారంబులకు భయంబు నొందుచు వనమదేభంబులం గాంచి పలాయనంబు నొందుచు వరాహ మహిష జంబుక మా

ర్జాలాది క్రూరమృగసంచారంబులకు వెఱచుచుం జనుచున్న సమయంబున గమ నాశక్తయు క్షుత్పిపాసాతురయు శీతవాతాతపక్లాంతయు కుశాశ్మకంటకప్ర చ్ఛిన్నపాదయు ముక్తకేశియు భయభ్రాంతచిత్తయునై ప్రాగ్జన్మదురితకర్మంబుల నిందించుకొనుచు నిట్టూర్పు లెగయ ధరణీతలంబునం బడుచు లేచుచు మందమంద గమనంబుల నరుగుచున్నంత. 25

మ. ఒకచో వ్యాఘ్రమహారవంబు లొకచో నుద్దండభల్లూకగం
డకసారంగవృకస్వనంబు లొకచోట౯ భూతబేతాళగు
హ్యకశబ్దంబులు నొక్కతావున మహోద్యద్భ్రాంతరక్షఃపిశా
చకహుంకారము లాలకింపుచు నికుంజవ్రాతము ల్దూరుచు౯. 26

క. దుర్గమకాంతారమహీ, మార్గంబులు దప్పి మరల మరలం జనుచు
న్నిర్గళితసకలసుఖయై, దుర్గంబు లతిక్రమించి తోయ్యలి యంత౯. 27

శా. ఆరాజాంగన బాలు నెత్తుకొని ఘోరారణ్యదేశంబుల౯
ధీరప్రజ్ఞ నతిక్రమించి హయదంతిస్యందనాకీర్ణము౯
దూరీభూతభయంబు సర్వజనసందోహాన్వితం బైనకా
శీరామేశ్వరసత్పథం బొకటి గాంచె౯ దైవయోగంబున౯. 28

సుమతి దైవవశంబున బద్మాకరుం డను వైశ్యునిపట్టణంబుఁ జేరి యతనిచే మన్ననలఁ బొందుట.

క. వరనాథకుటుంబిని యా, తెరువునఁ జని కొంతవడికి దృఢమతి నానా
వరనారీశోభితమై, మరు వగునొకవైశ్యపురము ముందటఁ గాంచె౯. 29

క. హాటకరత్నధనంబులఁ, గోటికి బడగెత్తినట్టికోమటు లొప్పం
బాటలంబున వెలసిన, పేటఁ బ్రవేశించె నపుడు ప్రియము దలిర్ప౯. 30

సీ. ఆవైశ్యపురమున కధినాథుఁడై యుండు పద్మాకరుం డనుభద్రయశుఁడు
గురుకృషివాణిజ్యగోరక్షణరతుండు ధనవంతుఁ డత్యంతధార్మికుండు
అతనిమందిరదాసి యరుదెంచి యారాజ్ఞి నీక్షించి యడిగె నీ వెవ్వ రనుచు
నడిగినయంతలో నారాజమహిషియు దనదువృత్తాంత మంతయు వచించె

తే. నంత నావార్త యాలేమ యరసి వచ్చి, సంభ్రమము దోఁపఁగా నిజస్వామితోడ
విన్నవించిన నతఁడు సువిస్మయముగ, నావధూమణి రప్పించి యాదరించి. 31

క. తనవృత్తాంతం బడిగినవిని యాసతి దనకు సవతి విష మొసఁగుటయుం
దనబాలకునియవస్థయుఁ, దనదుపరిత్యాగమును యథాస్థితిఁ జెప్పె౯. 32

తే. అంత నారాజ్ఞివచనంబు లాలకించి, యావణిక్పతి దనమది నహహ యొంత

కష్ట మొందె నటంచును గాఢచింత, నొంది తలయూఁచి కారుణ్యయుక్తుఁ డగుచు.

ఉ. అమ్మదిరేక్షణ న్నిజగృహాంతిక సీమ రహస్య మైనగే
హమ్మున నుంచి దివ్యశయనాసనభోజనపానవస్త్రమా
ల్యమ్ముల నౌషధక్రియల నాదరణం బొనరించి మాతృసా
మ్యమ్ముగ బూజసేసె బుధమాన్యుఁడు వైశ్యవిభుండు నెమ్మితోన్. 34

ఉ. ఆనిలయంబునందు వసుధాధిపగేహిని యాత్మసూనుఁడుం
దాను వసించి యుండ నిరతంబును వైద్యులఁ బిల్వఁ బంచి స
న్మాన మొనర్చి వైశ్యపతి నవ్యవిషాపహరౌషధంబు లె
న్నని యొసంగ వారలకు నిష్కపటంబుగ ధర్మకాంక్షియై. 35

క. ఎన్నిచికిత్స లొనర్చిన, నున్నతముగఁ బాదిలోనివహోమం బగుచు
న్నన్నాళ్లకు రుజమానక, క్రన్నన నాశిశువు చనియెఁ గతజీవుండై. 36

మృతుం డైనకుమారునిం గూర్చి సుమతి విలపించుట.

వ. ఇట్లు విగతప్రాణుండై పడియున్న నిజకుమారుం గాంచి యారాజపత్ని హాహాకారంబులు సేయుచు నత్యంతవిషాదంబునఁ బరివేదనం బొనరింపుచున్న సమయంబున నయ్యాక్రందనధ్వని విని పురంబునం గలవైశ్యస్త్రీజనంబు లచ్చటికిం జనుదెంచి బహువిధంబు లగుసాంత్వనాలాపంబుల నూరడింపుచుండ నయ్యింతియుఁ దద్దయు ఖేదంబున నాబాలకు నుద్దేశించి. 37

క. హా రాజసన్నిభానన, హా రాజకుమార ధీర హా సుకుమారా
హా రవిసన్నిభతేజా, హా రమణీయాంగ యనుచు నాక్రందించెన్. 38

ఉ. పాపము లెన్ని చేసితినొ బాలక పూర్వభవంబునందు న
త్యాపదఁ జెందె నిప్పు డహహా విషవేదనచేత నితాంత మైనసం
తాపముఁ జెందుఁ గాని మరణంబు లభింపక యుండ వ్రాసెనే
కాపురుషుండు బ్రహ్మ యెటుగా నిఁక దాఁటెద దుఃఖవారిధిన్. 39

సీ. తనసపత్నుల కెరికిని లేక నావంటిపాపిష్ఠి కేల గర్భంబు గలిగెఁ
గలిగిన నేమాయెఁ గాపత్యమున గాంత లీరీతిని విషాన్న మిడఁగఁ దగునె
ఇడినమాత్రన ప్రాణ మెడలకుండఁగ నేల బహుతాపవేదనాభార మొందవె
నొదవనే నిజభర్త యదయుఁడై మనమున నడవులపాలుగా విడువనగునె
తే. విడిచెఁబో భైక్ష్యవృత్తి జీవింపకుండ, దైవ మీచందమున దయఁ దప్పఁదగునె
యున్నిటికి మత్పురాకృతం బింతచేసె, గాక వేఱొండు గలదె యోరాజకుమార.

క. పతిసంత్యక్త ననాథను, గతబాంధవఁ గృపణవిపులకలుషాత్మక న
ష్టతిదుఃఖాంబుధిఁ ద్రోయుచు, సుత యెక్కడఁ బోతి వనుచు శోకించునెడన్.

### ఋషభయోగి సుమతికిఁ దత్త్వోపదేశంబు చేయుట.

తే. అవఘాటివిషాదంబు నపనయింప, శక్తు లెవ్వరు లేకున్న సమయమునను
వచ్చెఁ దచ్ఛోకదుర్వ్యాధివైద్యుఁ డగుచుఁ, బూర్వవర్ణితశివయోగిపుంగవుండు. 42

ఉ. అక్షసరంబు పాదుకలు నంచితభూతివిలేపనంబు రు
ద్రాక్షలు యోగదండము విరాజితలింగము నొప్పుచుండఁ బ్ర
త్యక్షశివావతారుఁ డన దైవగతిం జనుదెంచె యోగిహ
ర్యక్షుఁడు శైవదీక్షుఁడు మహాత్ముఁడు నాఋషభుండు లీలతోన్. 43

ఉ. వచ్చినయోగివర్యునకు వైశ్యవిభుం డెదురేఁగుదెంచి తో
డ్తెచ్చి మహార్ఘ్యపాద్యము లతిప్రియభక్తి నొసంగ నంత నా
సచ్చరితుండు రాజసతిసన్నిధికిం గరుణార్ద్రచిత్తుఁ డై
వచ్చి సుధాసమంబు లగువాక్యము లిట్లని పల్కె నెమ్మితోన్. 44

సీ. భూపాలసతి నీవు భూరిశోకంబునఁ బొరల నేటికి మూఢబుద్ధి వగుచు
నెవ్వఁడు జనియించు నెవ్వఁడు మృతిఁ బొందు దెలియఁబల్కుము నాకు దేటపడఁగ
నీదేహసంఘంబు లెంచి చూచిన జలబుద్బుదంబుల క్రియఁ బోవుచుండు
సత్త్వాదిగుణము లచ్చపుమాయతోఁ గూడి సకలశరీరము ల్సంభవించు

తే. సాత్త్వికంబున సురలు రాజసమువలన
మనుజులు మహోగ్రమైనతామసమువలన
మృగచయంబులు పుట్టుఁ దన్మిశ్రములను
దలఁప బహుజంతుకులము లై వెలయుచుండు. 45

క. గురుసంసారభ్రమణముల, గరుదే తమపూర్వజన్మకర్మానుభవం
బిరవొందు సురలకైనను, నరు లనఁగా నెంతవారు నలినదళాక్షీ. 46

క. కొందఱు కాలం బనుచును, గొందఱు కర్మం బటంచు గుణము లటంచుం
గొందఱు పంచాత్మక మని, యందురు తనుకారణములు హరినిభమధ్యా. 47

ఆ. జనన మయ్యె ననుచు సంతోష మందరు, మృతినిఁ జెందె ననుచు వెతలఁ బడరు
ధీరు లైనవారు దేహంబు వీక్షించి, భ్రాంతి నొంద రెపుడు పద్మనేత్రి. 48

క. అవ్యక్తమున జనించును, నవ్యక్తమునందె యణఁగు నామధ్యమునన్
సువ్యక్తముగా నెనయును, భవ్యమతీ తనువు నిమిషభంగుర మరయన్. 49

క. ఎప్పుడు గర్భ[illegible] యాదేహి నాశమందుట సిద్ధం

బొప్పఁగ విధివశగతి నగు, నుప్పతిలుట చచ్చుటయును మహోత్పలగంధీ. 50

ఉ. కొందఱు గర్భవేళములఁ గొందఱు సంభవ మైనమాత్రనే
కొందఱు యౌవనంబునను గొందఱు వార్ధకతాదశన్ లయం
బందుదు రెల్లజంతువులు నాత్మభవాంతరకర్మరీతులం
జెంది సుఖాసుఖంబులు ప్రసిద్ధముగా భుజియింతు రందఱున్. 51

క. పితృమాతృసురతసమయో, ద్గతతేజోరక్తమిశ్రతాజనితంబై
వితతంబై తను వలరును, సతి యనఁగాఁ బురుషుఁ డనఁగ షండుఁ డనంగన్. 52

ఆ. సుకృతదుష్కృతములు సుఖదుఃఖములు మహా, విద్య తీర్థములును విభవములును
ఆయువును శుభంబు లజుఁడు వ్రాసినయట్ల, యనుభవింపుచుందు రఖిలజనులు. 53

క. అనతిక్రమ మగుకర్మము, ఘనతరకాలంబుఁ గడవఁ గారాదు భువిన్
దనువులు శాశ్వతములుగా, వనయము శోకింపఁ దగునె యబలా నీకున్. 54

ఆ. నిక్కమనరు జనులు నెలఁత స్వప్నంబులు, సత్య మగునె యింద్రజాలవిద్య
యీకళేబరంబు లెన్నిభంగుల నైన, శాశ్వతంబు లౌనె చంచలాక్షి. 55

సీ. నీకు జన్మంబు లనేకంబు లైయుండ నిప్పు డీవ్యామోహ మెట్లుగలిగె
నెక్కడి జనకుండు నెక్కడి జననియు నెక్కడి సదనం డెంచిచూడ
నెక్కడి వల్లభుం డెక్కడి ప్రియురాలు దైవమాయాకల్పితములుగాక
నిజదేహజములంబు వీక్షించి సుతుఁ డంచు కించిదజ్ఞ వగుచు శోకింపఁ దగునె

తే. రక్తమాంసపురీషమూత్రాస్థినిచయ, పూయమేదోవసాశుక్లమయ మగుచు
నస్వతంత్రం బశాశ్వతం బయినయట్టి, తనువుపైఁ గాంక్ష సేయుట ధర్మ మగునె.

క. తపముల విద్యల బుద్ధిని, జపముల మంత్రౌషధముల సత్క్రియల మహా
నిపుణతల నెంతవారికి, విపులం బగుమృత్యుభయము విడుచునె చెపుమా. 57

ఆ. మేనినీడపగిది మృత్యువు వర్తింప, జనుల కెట్లు సుఖము సంభవించు
వ్యాఘ్రి యెదుటనుండ వనమృగంబులకును, హర్ష మగునె మేఁత లారగింప. 58

వ. అని చెప్పి వెండియు నమ్మహాత్ముం డిట్లనియె. 59

శా. ధీరోదాత్తుఁడవై వచింతు విను సాధ్వీ సంచితాగామిక
ప్రారబ్ధాఘము లెల్లఁ బాయుటకు నశ్రాంతంబు సద్భక్తితో
నారాధింపుము నీమనంబున విరూపాక్షున్ జగద్రక్షకున్
గౌరీవల్లభు నీలకంఠు నభవున్ గంగాధరున్ శంకరున్. 60

క. అని యానతిచ్చి యతఁ డి, మ్మనమున శోకోపశమన మయ్యెనొ లేదో
వినుపింపు మనిన యోగీం, ద్రునిఁ గనుఁగొని యింతి పలికె దుఃఖితమతియై. 61

మ. పరయోగీంద్ర భవత్కటాక్షమున భాస్వచ్ఛక్తి చేకూరె నే
నరయ న్బాంధవభర్తృపుత్త్రికులఁ బాయం ద్రోచి యేకాంగినై
గరళక్లిష్టశరీర నైతి నిఁక శోకవ్యాకుల న్మాన్పఁగా
మరణోపాయము దక్క నొండు గలదే మంత్రౌషధప్రక్రియల్. 62

వ. అట్లు గావున నేను నీబాలకసహితంబుగా నరిగెద మరణోపాయం బెఱిఁగింపవల
యు నని దైన్యరసంబు దోఁపం బలికినయా రాజపత్నివాక్యంబు లాకర్ణించి కారు
ణ్యరసార్ద్రచిత్తుండై యమ్మహానుభావుండు సకలధర్మజ్ఞుండును గృతజ్ఞుండును గావు
నఁ బూర్వోపకారంబుఁ దలంచి మృతుం డయినశిశువుసమీపంబునకు వచ్చి. 63

ఋషభయోగీశ్వరుండు మృతుం డైన రాజకుమారుని బ్రతికించుట.

ఉ. భూవినుతప్రభావుఁ డగుపుణ్యుఁడు నాఋషభుండు మంత్రసం
భావిత మైనభూతి కరపద్మమునన్ ధరియించి దీర్ఘని
ద్రావశుఁ డైనబాలుఁ గని తన్ముఖమం దిడి క్రమ్మఱంగ సం
జీవితుఁ జేసె నప్పు డతిచిత్రముగాఁ జనులెల్ల జూడఁగన్. 64

క. వెల్లని కన్నులు విచ్చుచుఁ, బల్లవితేంద్రియుఁడు నగుచు బాలకుఁ డంతం
దల్లిఁ గనుంగొని మది రం, జిల్లఁగ నాక్రందనంబుఁ జేయం దొడఁగెన్. 65

క. చచ్చినబాలుఁడు గ్రమ్మఱ, విచ్చేయుట దలఁప నెంతవింత యనుచుఁ దా
రచ్చటినగరీలాదికు, లచ్చెరువుగఁ జూచి రపుడు హర్షము వెలయన్. 66

ఉ. క్రొన్నెలవంటివెన్నుదుటఁ గుంతలము ల్వెలయంగ నున్నయా
చిన్నికుమారుఁ గాంచి మఱి చెన్నెసలారఁ దదీయమాతృ దాఁ
గన్నులవార్ష బాష్పములు గ్రమ్మఁగ బాలకు నెత్తి ప్రేమతోఁ
జన్నులు సేఁపఁ బాలొసఁగి సాధుజనాకృతి నుండె నయ్యెడన్. 67

చ. పరమతపోబలాఢ్యుఁడు కృపానిధి యాఋషభాఖ్యయోగి య
య్యరువురదేహయుగ్మమున నీశ్వరమంత్రపవిత్రభూతిచే
గర మనురక్తి లేపనముగా నొనరించినయంతమాత్ర ని
ష్ఠురవిషవేదన ల్విడిచి శోభితవజ్రశరీరు లైరి రాగిలన్. 6

సీ. ఆరాజపత్నియు నారాజనందనుం డత్యంతరుచిరదేహములు దాల్చి
యింద్రవైభవశతం బినుమడించినభంగి నతిశయానందసౌఖ్యంబుఁ గాంచి
పాదపద్మములపైఁ బడియున్నయయ్యింతి గనుఁగొని ఋషభుండు కరుణతోఁడ
బలికె నోవత్స నీవిల చిరంజీవివై యుండువు సామ్రాజ్యయుక్త మగుచు

తే. ఎంతకాలంబు జీవింతు వంతదనుక నీకు ముదిమియుఁ జావులును లేకయుండు
నీతనూజుండు [illegible] ధనుల విఖ్యాత మందుము వనజనేత్రి. 69

క. భద్రాశ్వక్ష్మాపాలకుండు, భద్రయుతుం డగు నటంచు బాలకునకుఁ దా
భద్రాయు వనఁగఁ బేరిడి, భద్రగతిం జనియె యోగపారగుఁ డంతన్. 70

వ. ఇట్లు మహానుభావుం డైనఋషభయోగీంద్రుండు మృతుం డైనరాజనందనుని మహేశ్వర మంత్రపూత భస్మప్రభావమునఁ బ్రదీప్తుని సంజీవితుంజేసి యథేచ్ఛాగతిం జనియె నని చెప్పి వెండియు నమ్మహామునులకు సూతుం డిట్లనియె. 71

మ. మునినాథోత్తములార మీరు వినుఁడీ ముక్కంటిమాహాత్మ్యము
న్మును నేఁ జెప్పినవైశ్య పింగళ యనం బొల్పారుపూఁబోఁడి స
జ్జనసంస్తుత్యమహాప్రభావుఁ డగువాచంద్రాంగదత్మారశే
శుని సీమంతినికిం జనించె మరలన్ శుంభత్సువర్ణాంగియై. 72

క. అతన్యామణి నిషధ, త్మాకాంతునిపుత్రి కీర్తిమాలిని యనఁగా
లోకమున వెలసె సౌంద, ర్యాకారవిలాసములను రంభ యనంగన్. 73

క. ఆదాశార్ణమహీపతి, గాదిలిపత్నియుఁ దనూభవసమేతముగా
మోదమున వైశ్యపురమున, సాదరమతి నుండె నపుడు సరసుల వొగడన్. 74

క. ఆబాలుఁడు నానాఁటికి, ప్రాబల్యకళావిశేషపారీణుండై
శ్రీబాలచంద్రుకైవడి, ధీబలయుతుఁ డగుచుఁ బెరిగెఁ దేజం బెసఁగన్. 75

క. ఆరాజకుమారునకును, భూరిగుణుం డైనవైశ్యపుత్రకుఁడు మహో
దారుఁడు సునయుం డనువాఁ, డారయ సఖుఁ డయ్యె నచట నతిశయమైత్రిన్ 76

తే. కాంచనాంగదకుండలకంకణాది, భూషణంబులు ధరియించి పొత్తుగూడి
బాలక్రీడలను జోడువాయకుండు, రనుదినము వైశ్యరాజనందనులు ప్రీతి. 77

శా. ఆవైశ్యప్రభుఁ డంత బాలకులయోగ్యత్వంబు వీక్షించి భూ
దేవశ్రేష్ఠులచే యథావిధిగ నాడిన్ ప్రాప్తసంస్కారులం
గావింపం గురుసన్నిధానమునఁ దక్కల్పంబు లూహింప నా
నావిద్యాభ్యసనం బొనర్చిరి ప్రయత్నం బొప్ప నయ్యిర్వురున్. 78

క. జననాథతనయునకుఁ ద, జ్జననికి నప్పురిని నిర్విచారత్వమునన్
ఘనమతి నుండఁగఁ గాలము, చనియెం దగఁ బదియు నాఱుసంవత్సరముల్. 79

సీ. చిరతరకీర్తి పూజితసదాశివమూర్తి జయవర్తి శివయోగిచక్రవర్తి
గతజీవుఁ డగుబాలు బ్రదికించి చనినయాఋషభాఖ్యసద్గురుఋషభుఁ డంత
నావైశ్యపురమున కరుదెంచె నొకనాఁడు ఘనతరస్వచ్ఛందగమన మొప్ప
నమ్మహామహులఁ గాంచి యమ్మాతృతనయులు భయభక్తివినయసంభ్రమము దనర

తే. నెమ్మనమ్మున సాష్టాంగదమ్ముగాఁగఁ, దలఁపుచుఁ దదీయపాదపద్మముల వ్రాలి
యున్నవారల నతిమైత్రి నూరడించి, యెలమి నారాజతనయున కిట్టు లనియె. 80

శా. బాలా క్షేమమె నీకు నీజననికిం భద్రంబె నీ వెప్పుడున్
గాలిన్ ధ్యాన మొనర్తువే గురులకున్ శుశ్రూష గావింతువే
శీలంబొప్ప వహింతువే చదివితే శిక్షాదిక గ్రంథముల్
పాలిన్ మమ్ము దలంతువే సతతమున్ మార్గంబుతో నుందువే. 81

మ. అని వాత్సల్యము దోఁపఁ బల్కఁగ సుమత్యక్షాక్షి యాత్మీయనం
దను యోగీంద్రునిపాదపద్మములమీఁద న్వైచి యాబాలకుం
డనఘా మీతనయుండు శిష్యుఁడును దథ్యం బారయన్ వీని జీ
వనసంయుక్తుఁగఁ జేసినాఁడవు గురుస్వామీ కృపాంభోనిధీ. 82

క. పతిబాంధవవిరహిత నే, నితరం బేమియు నెఱుంగ నీబాలకునిన్
మతిమంతుని గావింపుము, సతతకృప వెలయ మమ్ము సారయవలయున్. 83

వ. అని యివ్విధమునం బలికిన యారాజపత్నివాక్యంబులకు సంతసిల్లి మహామహాలం దైనఋషభయోగీంద్రుఁ డా రాజనందనునకు సన్మార్గం బుపదేశించి కృతార్థుం జేయవలయు నని మనంబున నిశ్చయించి యక్కుమారు నుద్దేశించి యి ట్లనియె. 84

ఋషభయోగీశ్వరుఁడు భద్రాయువునకు నష్టాదశపురాణ
రహస్యంబు లుపదేశించుట.

ఉ. శ్రీగురుదేవహేళనము సేయఁగరాదు పురాణవేదశా
స్త్రాగమధర్మము ల్విడువరాదు మహీసురరాజదేవతా
క్షాగతి మీఱరా దొగి మృష ల్పచియింపఁగరాదు నిత్య మ
ఖ్యాగతపూజ మాని కుడువం జనరాదు నరేంద్రనందనా! 85

క. గురుగోబ్రాహ్మణపూజా, పరత వ్వర్తింపు మెపుడు పరధనములకున్
బరసతుల కాస జెందకు, నిరతసదాచారధర్మనియతుఁడ వగుమీ. 86

క. స్నానజపహోమతర్పణ, దానములను విప్రదేవతాగురుపూజా
మానితకార్యములను నీ, మానసమున నలసవృత్తి మానఁగవలయున్. 87

క. కోపము విద్వేషంబును, దాపము నాక్రోశవృత్తి దంభమును దురా
లాపంబులు పైశున్యము, పాపవిచారములు విడువు భద్రగుణాఢ్యా. 88

క. నిరతము విషయాసక్త, స్ఫురితమనోవృత్తి సాధ్వమాయయు హింసా
పరతయు నాత్మస్తుతియును, బరనింద యొనర్పవలదు పార్థివతనయా. 89

క. అత్యాహార మతిశ్రమ, మత్యాలాపములు మతియు నతిశయకోపం
బత్యుత్కటమగు విభ్రమ, మత్యాకాంక్షయును విడువు మనవరతంబున్. 90

క. జనకశ్వశురసతీగురు, జనసిబుధభాషణములు సత్యద యొప్పు
న్విని విశ్వసింపుము మది, ననయము నిష్కపటవచన మది నమ్మ దగుఁజా. 91

క. కృపణు ననాథుల వృద్ధుల, నపరాధవిహీను బాలు నబలను భాస్వ
త్కృప వెలయఁగ రక్షింపుము, తపసియాదికము లొసఁగి దాక్షిణ్యమునన్. 92

సీ. బంధుమిత్రులయెడ భావంబు నిలుపుము కృపగల్గియుండు దుఃఖితులయందు
సజ్జనులందు హర్షంబు గావింపుము కుజనులవీక్షింపు కోపదృష్టి
శరణాగతుం డైనశత్రువునైనను జంపఁగా వలదు నిశ్చయముగాను
రోలమిఁ బాత్రాపాత్ర మెవరైన వేఁడిన లేదన కిమ్ము దేహాదులైనఁ
తే. దల్లి దండ్రియు గురుఁడు నందనుఁడు మిత్రుఁ, డాచరించినయపరాధ మది సహింపు
మాత్మరక్షాపరుండవై యనుదినంబు, నప్రమత్తుండవై యుండు మనఘచరిత. 93

క. కీర్తి మహాభూషణ మగు, కీర్తియ లక్ష్మీకరంబు కృతకృత్యతయుం
గీర్తి శుభంబగుఁ గావునఁ, గీర్తి యుపార్జింపు మెపుడు కృతపుణ్యుఁడవై. 94

తే. హయగజాశ్వరత్నహాటకంబులనైన, నపహరింప ధాత్రి నపయశంబు
విడువవలయు దానిఁ గడుసత్వరంబుగఁ, దృణముగాఁ దలంచి ధీరవర్య. 95

క. గౌరీశ్వర పదభక్తుల, నారాధింపుము ప్రసన్ను లగునట్లుగ సం
సారపయోనిధిమగ్నుల, నారసి వా రుద్ధరింతు రనవరతంబున్. 96

క. ఆయుర్బలధనవిద్యా, శ్రేయస్కీర్తిప్రతాపశీలంబులు క
ర్త్రాయత్తత వచ్చినచోఁ, బాయక యవి యనుభవింపు భవ్యవిచారా. 97

క. కాలము దేశము శక్తియుఁ, దా లెస్సఁగ దెలిసి చేయఁదగుకార్యము నా
ర్యాలోచనపూర్వకముగ, మేలగు నెచ్చోటనైన మితహితవచనా. 98

క. జపహోమస్నానంబులఁ, దపములఁ బిత్రుకార్యములను దత్పరమతివై
చపలత్వ మడిగి యుండుము, కపటం బించుకయు లేక కలుషవిదూరా. 99

క. దాక్షిణ్యసమేతం బల్పాక్షర మధికార్థ మకల మతిహృద్యతరం
బక్షీణ మసందిగ్ధము, దక్షం బగుపలుకువలుకఁ దగుఁ దథ్యముగన్. 100

క. ఆపదలందును శత్రు, వ్యాపారములందు భీతి వలవదు సకలం
బాపములకు గురువిప్రా, లాపములకు వెఱచి యుండు లాలితబుద్ధిన్. 101

సీ. పరుల నెవ్వరినైన బాధింపకుండుము పరులబాధ లడంపు కరుణ వెలయఁ
జోరదుష్టారినివారణం బొనరింపు బాహ్యగేహమున మృత్తిఁ బఱఁగవలదు
బంధుమిత్రజ్ఞాతిభార్యాసుతాతిథిభోజనంబుల సమబుద్ధి మనుము
విద్యాశ్రుతధర్మవిహితవాక్యోపదేశములందు సతతనిశ్చలుండ వగుము

తే. ఏస్థలము సాధువిప్రభూయిష్ఠమగును, బుణ్యతీర్థంబు లెచ్చోటఁ బొందియుండు
శివనివాసంబు లేభూమిఁ జెలఁగుచుండు, నచట నిలువు మవశ్యంబు హర్ష మొదవ.

క. కులటావేశ్యాకాముక, ఖలసంగతదేశముల నొకానొకవేళ
న్నిలువకుము జగత్ప్రభు వగు, నలికాక్షుని మదిఁ దలంపు మశ్రాంతంబున్. 108

క. ఎప్పుడు శాంతియు దాంతియు, నెప్పుడును శుచివ్రతంబు నెప్పుడు ధర్మం
బెప్పుడు జితషడ్వర్గత, దప్పక వర్తింపు మీవు ధరణీశసుతా. 104

క. యతులకు విప్రులకుఁ బతి, వ్రతలకు వరధేనువృషభరత్నములకుఁ బు
ణ్యతరనదీనిజగృహదైవతలకు వందన మొనర్పు వాలాయముగన్. 105

ఆ. భక్ష్యభోజ్యలేహ్యఫలపుష్పతాంబూల, వస్త్రభూషణాదివస్తువితతి
శివసమర్పితంబుఁ జేసి యాపిమ్మట, ననుభవింపవలయు ననుదినంబు. 106

శా. భద్రాచారపరుండవై నిరతమున్ బ్రాహ్మీముహూర్తంబున
న్నిద్రాసక్తిఁ బరిత్యజించి శుచివై నిష్కల్మషత్వంబునన్
రుద్రాణీరమణున్ గృపాగుణసముద్రున్ శంకరున్ శ్రీమహా
రుద్రున్ జిత్తమునన్ భజింపు మతిధీరోదాత్తభావంబునన్. 107

ఆ. నిర్వికల్పముగను నీ వాచరించిన, స్నానదానహోమజపతపములు
ననుదినంబుఁ దత్ఫలాపేక్ష లుడిగి కృత్యముగఁ జేయు మీశ్వరార్పితములు. 108

చ. విహరణభాషణశ్రవణవీక్షణభోజనపానదానసం
గ్రహాళి యనస్థలంబులను రాజకళాధరుఁ బార్వతీపతిన్
గుహజనకున్ వృషధ్వజుని గోత్రశరాసను దేవదేవునిన్
మహితవిచారు నీదుమది మానక నిల్పి భజింపు మేర్పడన్. 109

మ. వరపంచాక్షరమంత్రపాఠకులు శైవాచారపారీణు లీ
శ్వరభక్తు ల్భసితత్రిపుండ్రవిలసత్ఫాలప్రదేశాంచితు
లురురుద్రాక్షమణిప్రదీప్తకరయుగ్ము ల్పావ్యా లైనట్టియా
పురుషశ్రేష్ఠులు నిల్చుచుండు శివుడున్ భూతేశులోకంబునన్. 110

వ. అని చెప్పి వత్సా యివ్విధంబున ననేకపురాణంబులయందు విస్తరింపంబడిన ధర్మసంగ్రహంబు లన్నియు సంక్షేపరూపంబున నీకుం దెలియ ననుగ్రహించితి నింక సమస్తపురాణగుహ్యంబును నశేషదోషహరణంబును బరమపవిత్రంబును సకలశుభప్రదంబును సర్వాపన్నివారణంబును నగు శివకవచం బుపదేశించెద భక్తిపూర్వకంబుగా విను మని భద్రాయు నుద్దేశించి ఋషభయోగీంద్రుం 111
డి ట్లనిరి

## ఋషభయోగి భద్రాయువునకు శివకవచం బుపదేశంబు చేయుట.

క. శివదాహ్వయుఁ డైనసదా, శివునకు వందన మొనర్చి నేమము వెలయన్
శివభక్తుఁడ వగుటకును, శివకవచ ముపన్యసింతుఁ జిత్తం బలరన్. 112

శా. చేతోజాతహరుం బరాత్పరు విభుం జిత్తంబున న్నిల్పి ని
ర్ధూతాఘుండు జితేంద్రియుండును జితక్రోధుండు నై లోకవి
ఖ్యాతం బైనషడక్షరంబునఁ గరన్యాసంబుఁ గావించి వాం
ఛాతీతం బగు శైవవర్మమున రక్షాన్వితుఁడుం గాఁ దగున్. 113

ఉ. ఘోరవిపత్పరంపరల గుందుచు దైన్యపరీతవృత్తిసం
సారగభీరకూపమున సైరిభలీల జరించునన్ను ను
ద్ధారితుఁ జేయుఁ గాతఁ బరతత్త్వమయుం డగుశంకరుండు త
త్తారకనామమంత్రము సదా దురితంబు లడంచుఁ గావుతన్. 114

తే. అణువులకు నెల్ల నణు వైనయప్రమేయుఁ, డధికముల కెల్ల నధిక మైనట్టివిభుఁడు
దనరు జ్యోతిర్మయానందఘనుఁ డజుండు, చిన్మయాత్ముఁడు నన్ను రక్షించుఁగాత.

సీ. భూస్వరూపమున నేపురుషుఁడు సకలప్రపంచంబుఁ దాన ధరించు నెపుడు
జలరూపుఁ డగుచు నేసర్వజ్ఞుఁ డిలఁ గల్గు నరులకు సంజీవనం బొనర్చుఁ
గాలాగ్నిరూపుఁ డేకల్పాంతమునఁ ద్రిలోకము లెల్ల నెవఁడు దగ్ధముల చేయు
వాయురూపమున సర్వవ్యాపి యై యుండు గగనాకృతిని బూర్ణుఁ డగుచు వెలయు

తే. నట్టిలోకైకనాయకుఁ డష్టమూర్తి, సచ్చిదానందమయుఁడు వృషధ్వజుండు
సలిలవాతాగ్నిబాధలఁ బొలియకుండఁ, జిరకృపాదృష్టి నన్ను రక్షించుఁ గాత. 116

సీ. తత్పురుషాఖ్యుండు తటిదగ్నివర్ణుండు పరశుహస్తుఁడు పూర్వభాగమునను
ఢక్కాక్షమాలాగ్నిధరుఁ డఘోరాకృతి దక్షాధ్వరధ్వంసి దక్షిణమున
రాజశేఖరుఁడు సద్యోజాతుఁ డభవుండు శ్రీసదాశివుఁడు పశ్చిమమునందు
మునివందితుఁడు చతుర్ముఖుఁడు త్రినేత్రుండు వామదేవుండు తత్పార్శ్వమునను

తే. శుభ్రదేహుఁ డచింత్యుండు శూలపాణి, యుగ్రవిక్రముఁ డీశానుఁ డూర్ధ్వమునను
సకలదిశల విదిక్కుల సంతతంబు, పంచవక్త్రుండు నన్ను రక్షించుఁగాత. 117

మ. శిరమున్ ఫాలము నేత్రముల్ శ్రవణముల్ జిహ్వాననగ్రీవలున్
గరవక్షోధరకంఠపార్శ్వములు వక్షఃకోశకట్యూరులున్
జరణంబుల్ సకలాంగకంబులు మహాజానుస్ఫూర్తి రక్షించు నీ
శ్వరుఁ డర్ధేందుధరుండు శంకరుఁడు నీశానుండు లీలాగతిన్. 118

క. శూలాయుధుఁడు గిరీశుఁడు, కాలాంతకుఁ డైననీలకంఠుఁడు పగలుం
డేలును నను రక్షించును, లాలితకరుణాకటాక్షలక్షితముఖుఁడై. 119

క. చింతితఫలదుఁడు గౌరీ, కాంతుఁడు పరమేశ్వరుం డగణ్యుఁడు బాహ్యా
భ్యంతరదేశంబుల న, న్నంతట రక్షించుఁగాత ననవరతంబున్. 120

తే. నిలిచి కూర్చుండి శయనించి నిదురఁ జెంది, మేల్కనినవేళలను గాలమృత్యుహరణుఁ
డంబికారమణుండు త్ర్యంబకుండు, ఖండపరశుండు నను వేడ్కఁ గాచుఁగాత.

వ. మఱియు నఖిలగిరిదుర్గమమార్గంబులయందు నీలకంఠుండును మహారణ్యప్రవాసంబులవలనఁ ద్రిపురాంతకుఁ డైనమృగవ్యాధుండును దుర్మతాఖిలశాత్రవవ్యూహంబులవలన భీషణాట్టహాసపరికంపితబ్రహ్మాండకోశుం డైనవీరభద్రుండును గరితురగరథపదాతిసమేత బహుతరాక్షౌహిణీశతపరివృతు లైన యాతతాయి సమూహంబులవలన ఖండపరశుం డైనమహాదేవుండును చోరాదిగణంబులవలనఁ ద్రిశూలధారుం డైనయంధకాంతకుండును సింహవ్యాఘ్రభల్లూకవరాహాదిక్రూరమృగంబులవలనఁ బినాకపాణి యగువామదేవుండును దుష్టారిష్టవిషమహోత్పాతవ్యాధులవలన జగదీశ్వరుం డగుసాంబశివుండును నన్ను రక్షించుఁగాత యని పలికి మఱియుఁ బరమేశ్వరు నుద్దేశించి శ్రీసాంబసదాశివా సకలలోకైకనాయకా సకలజగదుత్పత్తిస్థితిలయకారణా చంద్రకోటీరా భాసకోటిప్రతీకాశా మృత్యుంజయా విరూపాక్షా వృషభవాహనా నాగేంద్రభూషణా వ్యాఘ్రచర్మాంబరధరా డమరుత్రిశూలఖట్వాంగగదాప్రాసభిండివాలకరవాలపాశాంకుశాద్యాయుధపరిశోభితదీర్ఘభుజార్గళా సార్వకాలంబును మహాబలపరాక్రమతేజఃకీర్తిసంపన్నుండ నగునట్లుగా ననుగ్రహించి నన్ను రక్షింపుము సర్వవిధబాధల నుపశమనంబు నొందింపుము మదీయచోరగణంబుల మారణంబుగా విదళింపుము కూష్మాండమారీగణబ్రహ్మరాక్షసనివహంబులకు సంత్రాసంబు గావింపుము క్షుత్తృష్ణాతురుండ నగు నన్ను నాప్యాయనంబు నొందంజేయుము దుఃఖార్తుండ నగునన్ను సానందుండ నగునట్లుగా, బ్రసాదింపుము మరణభయంబువలన సంజీవితుంగా నొనర్పుము నరకభయంబులవలన నన్నుద్ధరింపుము శివకవచంబున నన్ను నాచ్ఛాదింపుము సదాశివుండ వైనను బహువందనంబులు గావింతు ననుచు ననేకవిధంబులుగాఁ బ్రార్థింపవలయు నని చెప్పి వెండియు నారానందమునకు ఋషభుం డిట్లనియె. 122

క. అనుశాసనత విను మతిరహస్యం బైనకవచంబు నాచేఁ గలితమయ్యె
నదియును బాపత్రయధ్వాంతమహారణము [illegible] నివారణంబు

సకలసౌభాగ్యైకసామ్రాజ్యసదనంబు పశుపతికారుణ్యభాజనంబు
నీ శైవకవచంబు నేకాగ్రచిత్తులై హితమతిఁ బఠియింతు రెవ్వరేని

తే. వారు శ్రీసాంబశివునికృపారసమున
నఖిలయవ్యాధిమృత్యుభయంబు లుడిగి
చిరతరాయుష్కు లగుచు లక్ష్మీకటాక్ష
పాత్రులై బహుసౌఖ్యము లొందఁగలరు. 123

క. కావున భక్తిశ్రద్ధా, ప్రావీణ్యము లొప్ప నీవు పఠియింపుము రా
జ్యావహుఁడ వగుదు విప్రుఁడు, కైవల్యపదంబుఁ జెందఁగాఁ గలవు తుదన్. 124

క. అని యానతిచ్చి బ్రహ్మర్షి, మనుజేంద్రతనూజునకు సమంత్రకముగఁ ద
త్తనువున భస్మోల్లేపన, మొనరించెను యోగిచంద్రుఁ డుజ్జ్వలకరుణన్. 125

క. అగణితవాత్సల్యమునన్, ద్విగుణీకృతపట్టసాంద్రదివ్యమదేభేం
ద్ర గరిష్ఠబల మొసంగెన్, జగతీవరనందనునకు సంయమికరుణన్. 126

ఆ. నిరుపమానకాంతి నిశితధారం బగు, చంద్రహాస మొకటి శంఖ మొకటి
సోమతేయునకుఁ బ్రసన్నదృష్టి నొసంగి, హితము వెలయ యోగి యిట్టు లనియె.

వ. నిఖిలనిగమగుహ్యం బైన శైవకవచం బుపదేశించి నీకు వాత్సల్యంబున ఖడ్గశంఖంబు
లొసంగితిం గావున రాజనందనా యేతత్ప్రభావముం జెప్పెద సుస్థిరుండవై వినుము
ఈఖడ్గంబు మంత్రతపస్సంభావితమును సునిశితధారమును సకలాధినిష్పాదనంబు
ను నై యుండు దీనిం గాంచినమాత్రంబుండు కృతాంతోపమితుం డయినను విగళ
ప్రాణుం డగు నీశంఖనినాదంబు వినిన పరిపంథిజనులు సన్న్యస్తశస్త్రులును
విచేతనులును మూర్ఛాగతులు నై భూతలపతితు లగుదు రీసాధనంబులు రెండును
బరసైన్యవినాశకములును స్వపక్షసైన్యతేజశ్శక్తివివర్ధనంబులు నై యుండు నీ వి
మ్మహాశైవకవచమువలనను ఖడ్గశంఖప్రభావమువలనను ద్వాదశసహస్రనాగబల
మువలనను భస్మధారణసామర్థ్యమువలనను శత్రుభూపతుల బరాజితులం గావిం
చి పిత్ర్యం బయిన భవద్రాజ్యమున నభిషిక్తుండవై యనేకసంవత్సరములు సా
మ్రాజ్యభోగముల ననుభవింపఁగలవాఁడ వని యానతిచ్చి సమాతృకుం డయిన
భద్రాయువు నాశ్వాసించి మహానుభావుం డయిన ఋషభయోగీంద్రుండు నయ్యి
రువురచేతఁ బూజితుండయి యథేచ్ఛావిహారమ్మునం జనియె నని చెప్పి సూతుం
డమ్మహామునీంద్రుల కిట్లనియె. 128

సీ. మునివరోత్తములార వినుఁ డిమ్మహాశైవకవచంబు సర్వరక్షాకరంబు
నిర్మలహృదయులై నిరతంబు సద్భక్తిఁ బఠనంబు చేసిన భక్తులకును

బహుళశ్రైశ్వర్యసంపదలు పాలింపించినఁ గలుషబృందంబులు దొలఁగిపోవు
సకలశుభంబులు సమకూఱు. నెప్పుడు నిష్టార్థసంసిద్ధి నెసఁగుచుండుఁ

తే. పుత్త్రమిత్త్రకళత్త్రాదిభోగభాగ్య, సౌఖ్యములు చెందుఁ జేకూఱు సమ్మదంబు
శ్రీసదాశివప్రకరణచే సిద్ధముగను, వారలకు సంఘటించుఁ గైవల్యపదము. 129

ఆ. అన్యపాలసతియు నాత్మజుండును దాను, రాజకళలు వెలుఁగ రమ్యవృత్తి
నద్రిజాకుమారులట్టులఁ జెలువొంది, విగతశోకు లగుచు వెలసి రపుడు. 130

## వజ్రబాహుని మగధదేశపురాజు జయించుట.

శా. ఆదాశార్ణకవజ్రబాహుఁడు స్వరాజ్యం బప్రమాదంబుతో
నాదిక్షత్త్రచరిత్ర నేలఁగఁ దదీయారాతిరాణ్మాగధుం
ప్రాదేశంబున సైనికాగ్రణులు రాష్ట్రక్షోభకార్యంబు బా
హాదర్పోద్ధతులై యొనర్చిరి జిగీషాయత్తులై యెంతయున్. 131

చ. పురములు గాల్చి కూపములు పూడిచి పేటలు దోఁచి కోటలన్
ధరఁ బడఁ ద్రోచి భూరుహవితానముల న్వదలించి గోధనో
త్కరములు సంగ్రహించి వనితామణులం జెరపట్టి సైనికు
ల్దిరువులు గట్టి భూప్రజ నతివ్యధ నొందఁగఁ జేసి రయ్యెడన్. 132

ఉ. ఆమగధాధినాథుఁ డగు హైమరథుండు దశార్ణభూమికిన్
సామజఘోటకాద్యఖిలసైన్యముతో రణకాంక్షఁ జేరినన్
భీమచమూసహస్రపరివేష్టితుఁడై తగ వజ్రబాహుఁ డు
ద్దామబలుం డెదుర్కొనియెఁ దన్మగధాధిపవాహినీతతిన్. 133

వ. ఇట్లుభయసైన్యంబులుం దలపడి దేవాసురులవిధంబునం బోరాడుచున్న సమయంబున. 134

మ. గురుశౌర్యం డగువజ్రబాహుఁడు లసత్కోదండియై కాండియై
సరభుండై మగధేశుసైన్యముల భాస్వద్బాణవర్షంబులం
గరిగంధర్వరథౌఘమెల్లను విభగ్నంబై ధరం గూలఁగా
బరపెన్ దుస్సహతేజుఁడై సమరభూభాగంబునన్ బొల్మిడిన్. 135

మ. జవనాశ్మాగవర్షముల్ గురియు దాశార్ణక్షమాపాలుచే
ద్ధవిధిస్ఫూర్తి సహింపలేక మగధేంద్రవ్యూహ మక్షౌహిణీ
నవకం బుద్ధతిఁ జుట్టుముట్టుకొని సేనానాయకోపేత న
య్యవనీనాథుని సైన్యముం [illegible] సారథారావళిన్. 136

క. ఘోరారివీరవిశిఖా, సారంబున వజ్రిబాహుసైన్యంబున హ
స్త్యారోహకయారోహక, సారథిరథికాదులెల్ల సమసి రనేకుల్. 137

క. వారును బిఱుతివియక తమ, పౌరుషములు మెఱయ మగధపతిసైన్యమునన్
వారణవాజిస్యందన, వీరభటులఁ గూల్చి రపుడు విస్మయ మొదవన్. 138

మత్తకోకిల. ఈ తెఱంగున రెండుసేనలు హెచ్చుతగ్గులు లేక వి
ఖ్యాతిఁ బోరుచు నుండ నందు దశార్ణయోధులు విద్విష
చ్ఛాతబాణపరంపరాహతి జర్జరీకృతదేహులై
భీతులై కకుభాళి కేఁగి రనేకవాహనశస్త్రులై. 139

వ. తదనంతరంబున. 140

క. అలఘుప్రాభవయుతులై, చలమున నమ్మగధరాజసైన్యంబులు దో
ర్బల మెసఁగ దశార్ణునితోఁ, దలపడి పోరాడి రపుడు దర్పోద్ధతులై. 141

ఉ. కొందఱు చాపదండమును గొందఱు కేతువు గొందఱశ్వము
ల్గొందఱు సారథిన్ రథముఁ గొందఱు ఖడ్గము ఖేటకంబునున్
గొందఱమందఁజేసి ధరఁ గూల్చి పదంపడి వజ్రిబాహునిన్
సందిటఁ బట్టి కట్టిరి భుజాబలశోభితు నాక్షణంబునన్. 142

తే. ఇట్లు బంధించి తెచ్చి నిజేశ్వరునకు, నొప్పగించి తదాజ్ఞచే నుత్సహించి
దండనాయకముఖ్యు లుద్దండవృత్తిఁ, బట్టణంబు చరాచూఱ బెట్టి రపుడు. 143

క. గజవాజిరథోష్ట్రంబుల, నజగోమహిషాదికముల నంబరతతులం
గజగమనల హరియించిరి, రజతస్వర్ణధనధాన్యరత్నావళులన్. 144

వ. ఇవ్విధమున నమ్మాగధప్రధానులు రాజభవనముఁ జొచ్చి యందు భాండాగారమం గల యనేకధనకనకమణిభూషణాంబరములును సువర్ణరజతగజదంతమయమ్ము లయిన శిబికాశయనవాహనమ్ములును మొదలయిన సమస్తరాజద్రవ్యము లన్నియుఁ దన్మహిషీసమేతముగా నపహరించి నిర్భయత్వముగా నిజనగరమున కేఁగుచున్న సమయమున నద్దేశంబంతయు నరాజకం బయి మగధసైన్యపరిక్షుబ్ధం బయ్యె నంత బాలవృద్ధవనితాజనంబులు భయాక్రందనంబు లాచరింపుచుఁ బ్రణష్టధనధాన్యపశుభూషణాంబరులై యథేచ్ఛాగమనములం జనుచుండి రంత. 145

మ. మగధేశుండు దశార్ణదేశముల శుంభద్విక్రమాభీలుఁడై
తగ సప్తాంగములన్ హరించె ననువృత్తాంతంబు దేశాగతా
ధ్వగబృందంబు వచింప రాజసుతుఁడా భద్రాయు వాలించి ప
న్నగరాజప్రతిమానరోషమున జన్యాకాంక్షితోద్యుక్తుఁడై. 146

భద్రాయువు మాగధుని జయించి తనతండ్రికి మరల రాజ్యము నిచ్చుట.

మ. గురుదత్తోచితఖడ్గశంఖధరుఁడై కోదండభృత్పాణియై
శరసంపూర్ణనిషంగుఁడై కవచియై శౌర్యప్రభావాఢ్యుఁడై
సరథుండై తగ వైశ్యనందనుఁడు దా సారథ్యముం జేయఁగా
ధరణీభాగము కంప మొందఁ జనియెన్ దాశార్ణకక్షోణికిన్. 147

చ. ఖగపతి మున్ సుధాహరణకాంక్ష దివంబున కేఁగుచాడ్పునన్
భృగుపతి కార్తవీర్యపృథివీశు వధింపఁగఁ బోవుపోలికన్
మృగపతి కుంభికుంభములమీఁదికి వ్రాలువిధంబు దోఁపఁగా
మగధపతి న్జయింపఁగఁ గుమారవరుం డరుదెంచె నద్ధతిన్. 148

క. చని చని నిజరాష్ట్రంబునఁ, గనుఁగొనియె నపేతవస్త్రశయ్యామణిగో
ధనముల్ విద్రావితమును, జనితాక్రందనము నైనసకలజనంబుల్. 149

శా. చండక్రోధము మీఱ మాగధులసత్సైన్యంబు సొత్తెంచి కో
దండజ్యారవ మాచరించి సకలాస్త్రంబుల్ ప్రయోగించి యు
ద్దండాటోపముఁ జూపి శత్రుపటలిన్ ధాత్రీస్థలిన్ గూల్చె వే
దండాశ్వధ్వజినీచయంబుల మహోద్యద్విక్రమారంభులన్. 150

క. వారును గ్రమ్మఱ బహువిధ, దారుణఖడ్గాదిశస్త్రధారాహతిచే
నారాసుతు నొప్పించిరి, సారభుజాశౌర్యధైర్యసంపద మెఱయన్. 151

తే. ఇవ్విధంబునఁ దొడరి వా రేయునట్టి, యస్త్రవర్షంబు సైరించి హస్తిలీల
భవ్యతరశైవకవచప్రభావమునను, సంగరస్థలి ధీరుఁడై సంచరించె. 152

క. మఱియును మాగధబలములఁ, గరితురగపదాతిరథనికాయంబుల ధీ
వరలీలఁ ద్రుంచి దానొక, యరదమును గ్రహించె రథికు హతుఁజేసి తగన్.

క. ఆరథమున వైశ్యాత్మజ, సారథికుం డగుచు సమదశాత్రవవిలస
త్సారంగమధ్యమునఁ గం, ఠీరవగతి మెలఁగె నతిదృఢీకృతతనుఁ డై. 154

వ. ఇట్లు రథారూఢుం డైనయా రాజకుమారుం గాంచి మాగధులు సహింప నోపక చతురంగబలంబులతోఁ దలపడిన సక్రోధుం డయి యాజగజ్జెట్టి శౌర్యోద్రేకంబున భుజగంబులం గాంచిన విహంగవల్లభుండునుంబోలె వారల వెనువెంట నంటం దాఁకి కమలాకరంబునం గేళిసలుపు కలభంబుచాడ్పున [illegible]రంబులోనఁ జొచ్చి బ్రహ్మాండపరిస్ఫోటితంబుగా సింహనాదం బొనరించి శరాసనంబు సజ్యంబు గావించి కఠోరనిర్ఘాతప్రతీకాశంబు లైనవత్సదంతశిలీముఖభల్లార్ధచంద్ర కూర్మనఖర[illegible]నారాచపరంపరలఁ బ్రయోగించి వీరసారణ్యాం

బుల దహించుదవానలంబు లెఱంగున నబ్బలంబులన్ జర్జరీభూతశరీరులం గావించి బడలువడం జేయుచున్న సమయంబునఁ గూలెడుతురంగంబులును వ్రాలెడుమాతంగంబులును గ్రుంకెడుశతాంగంబులును నోరలెడుకాల్బలములును ఖండీభూతము లైనమస్తకంబులును నికృత్తంబు లయినకటికంఠప్రదేశంబులును భగ్నంబు లైనజానుజంఘలును తెగిపడినబాహువులును శకలంబు లైనసర్వావయవంబులును దునియ లైనదివ్యాయుధవిశేషములును విభ్రష్టంబు లైనభూషణవ్రాతంబులును విచ్ఛిన్నంబు లయినకేతనఛత్త్రచామరంబులును విశీర్ణంబు లయినతనుత్రాణంబులును విభిన్నంబు లయినమురజమృదంగపటహకాహళనిస్సాణాదికంబులును వివర్ధమానంబు లయినశోణితనదీప్రవాహంబులును విజృంభమాణంబు లయినభూతబేతాళకలకలారావంబులును గలిగి సంగ్రామరంగం బత్యంతభీషణం బై యుండె నయ్యవసరంబున. 155

క. జన్యంబు సేయ నొల్లక, దైన్యంబును జెంది మదికిఁ దత్తర మొందన్
సైన్యేశులు హరిఁ గాంచిన, వన్యేభము లట్లు చని రవారితభీతిన్. 156

ఉ. హైమరథుండు భీతి జను సాత్త్వబలంబులఁ గాంచి పల్కె నీ
భీమబలోద్ధతుం డెవఁడొ వీనిమదం బణఁగింతు రండు సం
గ్రామమునందు శూరులు పరాజితు లై చన రా దటంచుఁ దా
సామవచఃప్రసంగముల సైనికుల న్మరలించెఁ గ్రమ్మఱన్. 157

వ. ఇట్లు మగధరాజప్రయత్నమున నెట్టకేలకు సైనికులు మరలి చతురంగబలసమేతు లయి చనుదెంచి యొక్కుమ్మడి నాథప్రాయువుం జుట్టుముట్టి యనేకవిధమ్ము లయినశక్తి శూల పరశ్వధ భిండివాల గదా కుంత తోమర క్షురికా ముసలాదిసాధనముల నొప్పించిన వాఁ డట్టహాసంబు సేసి ఋషభయోగీంద్రుం దనమనమ్మునం దలంచి కరాళమృత్యుజిహ్వాభీలంబును మహోగ్రప్రభాజాలంబును ధగద్ధగాయమానమ్మును నైనకరవాలము కేల నమర్చి ఝళిపించిన దద్దర్శనమాత్రమున శిఖిశిఖాజాలమ్ము డగ్గఱినశలభమ్ములవిధమ్మునఁ బంచత్వమ్ము నొందువారును విముఖామ్ముఁ జెంది పాదాక్రాంతు లగువారును మహాభయభ్రాంతు లై గంపమ్ము నొందువారును నై యున్నసమయమున వెండియు నమ్మహాబలుండు రోదసీకుహర పరిపూర్ణమ్ముగా శంఖధ్వానంబు సేసినఁ దదీయభీషణఘోషణం బాలకించి యమ్మాగధులు మూర్ఛాగతు లై రథికసారథినిషాదిసాదిపదాతిసహితముగాఁ బరిత్యక్తశస్త్రాస్త్రు లయి భూతలమ్మునఁ బడియున్నవారలం గని యతండు ధర్మశాస్త్రమర్మజ్ఞుండు గావున మృతప్రాయులు నిరాయుధు లయినపురుషులు వధ్యులు గారని వారల విసర్జించి రణాంగణమ్మున బద్ధుం డై యున్న నిజజనకుని బంధముక్తుం

గావించినఁ గ్రమ్మఱ దత్పత్నీనివహమ్మును దత్ప్రధానబంధుజనపురోహితప్ర
ముఖపౌరజానపదవర్గమ్మును మఱియును గోవృషాదికమ్మును బంధనిర్ముక్తతనొందిం
చి నిషాదవ్యాకులచిత్తు లయియున్నవారల నందఱ నత్యంతమధురాలాపమ్ముల
ననునయించి యనంతరంబ మదీయరాష్ట్రభంగంబుఁ గావించి యుద్ధరాత్ముల
మానభంగంబు చేయుట యుచితం బని నిశ్చయించి. 158

మ. మగధాధీశ్వరుఁ డైన హైమరథుదుర్మానంబుఁ దూలించి వా
జిగజస్యందనతత్ప్రధానసఖదాసీబంధువర్గంబుతో
మగుడన్ బద్ధునిఁ జేసి తోడ్కొనుచు శుంభద్విక్రమోల్లాసుఁ డై
నగరద్వారముఁ జొచ్చె రాజసుతుఁ డానందంబు సంధిల్లఁగన్. 159

తే. లావుచెడి సంగరమున పలాయమాను, లైనయోధులు క్రమ్మఱ నరుగుదెంచి
జనకబాంధవసచివాదిసహితుఁ డైన, రాజపుత్త్రునిఁ గనిరి హర్షంబు వెలయ. 160

మ. కని యీపుణ్యుఁడు సిద్ధుఁడో ఖచరుఁడో గంధర్వుఁడో యక్షుఁడో
వనజాతాసనుఁడో హరుండొ హరియో వజ్రోల్లసత్పాణియో
యనుచున్ సంశయమగ్నచిత్తముల నత్యాశ్చర్యమున్ బొందుచున్
జను లెల్ల న్వినుతించి రప్పుడు మహోత్సాహంబు సంధిల్లఁగన్. 161

క. కృతసమాల మగుడ సంజీవితులం గావించె నితనివిక్రమగుణముల్
మతిఁ దలఁప నమానుషములు, జితకాశి యితండు యోగసిద్ధుఁడొ చూడన్. 162

ఆ. ఈమహాత్ముతల్లి హిమశైలకన్యక, యితనితండ్రి శంభుఁ డెంచి చూడ
గాకయున్న నొంటిగ నక్షౌహిణీబలము గెలువ నొరుల కలవి యగునె. 163

వ. అని బహువిధములం బ్రశంసించుచున్నయా తత్ప్రధానజనమ్ములతోఁ దనవృత్తాం
తము యథార్థమ్ముగాఁ దెలియం జెప్పి యనంతరంబ విస్మయావిష్టమానసుండును
హర్షాశ్రుబిందుసందోహాలోచనుండును నతిశయప్రేమవిహ్వలుండు నగువజ్ర
బాహునిసమీపమ్మునకు వచ్చి. 164

క. తనపాదాంభోజములకు, వినయంబున మ్రొక్కియున్నవిఖ్యాతయశో
ధనుఁ గనుఁగొని గాఢాలింగన మొనరించె న్నరుండు కౌతుక మొదవన్. 165

క. అవ్వజ్రబాహుఁ డిట్లను, నీ వెవ్వఁడవో తెలియఁ బలుకు నిజముగ మాకున్
దేవుఁడవో మనుజుఁడవో, ధీవర్య మదీయభాగ్యదేవతవో తగన్. 166

క. శ్రీమెఱయ భవత్సఖుఁ డయి, భీమాహవరంగమునకు భీతిల్లక స
త్ప్రేమంబునఁ జనుదెంచిన, యీమంధరధైర్యుఁ డెవ్వఁ డేర్పడఁ జెపుమా. 167

సీ. అలఘువిక్రమ నీకుఁ దలిదండ్రు లెవ్వారు నీదేశ మెయ్యది నిశ్చయముగ
నీధైర్య మీశౌర్య మీతేజ మీబలం బెవ్వరియందుఁ గలవె

దేవాసురమనుష్యదీప్తంబు లైనముజ్జగముల గెలువంగఁ జాలు దీవు
నిపూర్వభవకృతానేకపుణ్యంబుల నభినుతిచేయ నాకలవి యగునె

తే. నాదుపత్నుల హితులను నందనులను, నాదురాజ్యంబు పురము నంతయును విడిచి
నాదుచిత్తంబు నీయందె నాటియున్న, దలికయప్రేమబంధకం బగుటఁజేసి. 168

క. అని యడిగిన భద్రాయువు, కనుదమ్ముల హర్షబాష్పకణములు దొరుగన్
ఘనజలధరగంభీరస్వనమున దా నిట్టు లనియె జనకునితోడన్. 169

ఉ. ఓ యనఘాత్మ వీఁడును నయుం డనువైశ్యతనాభవుండు భ
ద్రాయువు నాదుపేరును మదంబయు నేనును వీనియింటి న
త్యాయతవైభవంబున నహర్నిశము న్వసియింతు మెంతయున్
శ్రీయుత మీఱ నత్కథ యశేషముగా వివరింతు మీఁదటన్. 170

ఆ. ఇపుడు పోయివత్తు నేనవచ్చుదనుక నీ, జనుని మగధవిభుని విడువవలవ
దనుచు విన్నవించి యాక్షణంబున నేఁగె, సుతుఁడుఁ దాను నాత్మసదనమునకు. 171

వ. అట్లరుగు దెంచి. 172

మ. జనకపాదసరోరుహంబులకు శక్త్యద్భక్తితో మ్రొక్కి చ
య్యనఁ దాఁ జేసినకార్య మంతయును నాద్యంతంబుగాఁ జెప్పిన
న్విని తన్మాతయు హృష్టయై నిజసుతు న్వేడ్కన్ నాశీర్వదిం
చెను బద్మాకరుఁ డంతఁ గౌఁగిటను జేర్చె న్గారవం బొప్పఁగన్. 173

క. ఈతెఱఁగున భద్రాయువు, మాతృసమేతముగ వైశ్యమందిరమున వి
ఖ్యాతసుఖంబున నుండెను, చేతోమోదంబు వెలయ శివతత్పరుఁ డై. 174

తే. రణములో నొక్కరుండు శాత్రవులఁ గెలిచి, జయము చేకొనివచ్చె నిర్భయతగాఁగ
గురుకటాక్షంబుఁ జెందిన పురుషులకు, కవని సాధింపరానికార్యములు గలవె. 175

వ. అంత. 176

## సూర్యాస్తమయవర్ణనము.

తే. అదశార్ణక్షమాపాలు ననుఁగుసుతుని, చండశౌర్యప్రభావంబు సైఁపలేక
భానుఁడు పలాయమానుఁ డై పరచె ననఁగఁ, జరమశైలంబుమాటుకు జరిగె నపుడు.

క. మాగధుల నిజైశ్వర్య, త్యాగాపయశం బనంగఁ దనరుచు రోధో
భాగంబున నల్దిక్కులఁ, బ్రాగల్భ్యముతోడఁ దిమిరపటలము పర్వెన్. 178

క. దేవజ్యేష్ఠుఁడు రాసుతు, భావికరగ్రహమునకు నభఃపాత్రమునన్
భావించిన మార్యము లన, గా వెలసె విశుద్ధతారకానికరంబుల్. 179

ఉ. కంతునిమేనమామ శిశిరాంశుసయాదలపువ్వు సింధుజా
కాంతయనుంగుఁదమ్ముఁడు జగజ్జనరంజనదర్శనుండు భా

స్వంతునిరయుద్ధి సత్కళాకళ వారిధిముద్దులపట్టి తారకా
కాంతుఁడు చందమామ కుతుకంబునఁ దోఁచెను దూర్పుదిక్కునన్. 180

ఆ. సకలభువనజాలసౌధాగ్రతలమున, వెలుఁగుచున్న హేమకలశ మనఁగఁ
గానుపించె నపుడు గగనేందిరాకర్ణకుండలంబు చంద్రమండలంబు. 181

క. భద్రాయువు వరకీర్తి స్ఫయుద్రము దా వెల్లివిరిసి భువనంబుల ని
ద్రిద్రగతి నించెనో యన, భద్రకరజ్యోత్స్న వెలసె బ్రహ్మాండమునన్. 182

వ. అసమయంబున. 183

ఋషభయోగీశ్వరుండు చంద్రాంగదునియొద్దికిఁ జని భద్రాయువునకుఁ
గూఁతునిచ్చి వివాహంబు సేయు మని యుపదేశించుట.

క. వృషభధ్వజావతారుఁడు, ఋషభుం డారాత్రియందు ఋషులు నుతింపన్
ధిషణప్రజ్ఞాబలుఁడై, నిషధేంద్రునిపురికి వచ్చె నెమ్మి దలిర్పన్. 184

వ. ఇట్లు విచ్చేసిన ఋషభయోగీంద్రునకుఁ జంద్రాంగదమహీపాలుం డెదుర్కొని య
భివందనంబులు గావించి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి కనకాసనంబున
గూర్చుండ నియమించి యున్నసమయంబున నన్నరనాథునితో యోగీంద్రుం డి
ట్లనియె. 185

సీ. విను నైషధేశ్వర వినుపింతు నొకవార్త దాశార్ణపతికి భద్రాయు వనఁగ
జనియించి నిజమాతృసహితంబుగాఁ దమతండ్రిచేతను బరిత్యక్తుఁ డగుచు
నొకవైశ్యపురమున నుండ నంతట గతప్రాణుఁడై యున్నయాబాలు మరల
సంజీవితునిఁజేసి శైవధర్మం బుపదేశించి ధీమంతుఁ జేసినాఁడ

తే. వరుఁడు మాగధుఁ గెల్చి జయంబుఁ గాంచి జనకునకుఁ గ్రమ్మఱంగ రాజ్యంబు నొసఁగె
నట్టి రాజాత్మజునకు నీయనుఁగుపుత్త్రిఁ, గీర్తిమాలిని నిమ్ము సత్కీర్తి వెలయ. 186

క. అని యానతిచ్చి క్రమ్మఱఁ, జనియెను యోగీశ్వరుండు చంద్రాంగదుఁడున్
దనపత్ని యైనసీమంతిని యనుమతివడసి యుండె దృఢనిశ్చయుఁడై. 187

వ. అంత నమ్మహీనాథుండు సుఖనిద్రం జెంది యుండు నాసమయంబున. 188

తే. వాసరాధీశ్వరుండు దా వచ్చునపుడు, జనుల కెఱిఁగించు వాద్యనిస్వనము లనఁగ
గొక్కొరోకో యటంచును గోళ్లుగూసె.
తారచోరుల గుండియల్ ఝల్లు మనఁగ,

సీ. పద్మాకరంబుల బద్మముల్ వికసించెఁ గమలయతరవాల్లికములు వొడ్చె
[illegible] లార్పుటులు మించెఁ

జక్రవాకములకు సౌఖ్యంబు సేయ నెఱి వితతకాపోతహుంకృతులు మించె
దధిమథనప్రణాదంబులు మితెంచె వర్ణంబు లంధకారములఁ జెఱఁగ
తే. ముదితభూపాలగౌళాదివివిధరాగ, గీతములు మ్రోసె దేవతాగేహములను
వేదపాఠరవంబులు వెలయుచుండె, లాలితం బైనప్రత్యూషవేళయందు. 190
సీ. యజనాభిరతులు త్రేతాగ్నులు ప్రణయింప మునివరేణ్యులు సాఁగి మ్రొక్కుచుండ
అధ్వన్యజనులు దేశాంతరంబుల కేఁగ హాలికులు కేదారములకుఁ జనఁగ
ఘూకబృందంబులు కోటరంబులు చేరఁ జక్రవాకముల కుత్సవము దనరఁ
బుష్పజాతులు పరిస్ఫుటము లై వికసింప సకలజీవులు సంతసమునఁ బొదల
తే. హరిహరబ్రహ్మమయుఁడు సామాదినుతుఁడు, హల్లకారాతి పద్మినీవల్లభుండు
దేవవంద్యుండు భువనత్రదీపకుండు, భానుఁ డుదయించెఁ బూర్వదిగ్భాగమునను.
వ. అంత నిషధభూమండలాఖండలుం డైన చంద్రాంగదనృపాలుండు బ్రాహ్మ్యము
హూర్తమ్మున నిద్ర మేల్కాంచి మనమునం బరమేశ్వరధ్యానం బొనర్చుచు ననంత
రంబునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి విప్రసంఘములకు బహువిధమ్ము లగు
దానము లాచరించి తదీయాశీర్వాదంబులు గైకొని గురువందనము లాచరించి
తదనుమతి వడసి దివ్యాంబరాభరణాద్యలంకృతశరీరుండును దత్కకదత్తతురంగాధి
రూఢుం డై వందిమాగధస్తవంబు లాకర్ణించుచు నిజసందర్శననిమిత్తసమాగత
పౌరజానపదవర్గంబుల నెడ గలుగం జడియుచు కంచుకిజనంబులు బరాబరులు గావిం
పుచు ముందట నడునం జనుదెంచి మొగసాలహయావతరణంబు సేసి సభాస్థలి
మునకుం జని యచ్చట సింహాసనాసీనుం డై సమస్తప్రధానసామంతదండనాయక
కవిగాయకవిద్వజ్జనహితపురోహితబాంధవప్రకృతిజనములు బరివేష్టించి కొలువం
బేరోలగమ్మునసుండి యారాత్రి ఋషభయోగీంద్రుం డానతిచ్చినవృత్తాంతం బం
తయు సవిస్తరంబుగా వారల కెఱింగించి తదనుమతంబున నారాజనందనుం డో
త్తిచ్చి యుచితజ్ఞు లయినప్రధానులం బిలువం బంచి. 193

చంద్రాంగదమహారాజు భద్రాయువును శుభలేఖ వ్రాసి పిలిపించుట.

సీ. శ్రీమత్సదాశివ శ్రీపాదరాజీవ మధుపాయమానసన్మానసుండు
తక్షకనాగేంద్రదత్తఖడ్గతురంగభూషణాంబరజాతతోషణుండు
చంద్రాంగదుండు రాజన్యచూడామణి శ్రీయుతుం డైనభద్రాయువునకు
నాశీర్వదించి వృత్తాంతంబు వ్రాయించి పంపినలిఖిత మేర్పడఁగ వినుము
ఆ. నీకుఁ గూర్మి వెలయ నాపేర్మి సుత నిత్తు, వైభవమున నీవు వైశ్యపతియు
బ్రాహ్మణోత్తములును భవదీయజననియు, నరుగుదెంచి పెండ్లియాడవలయుఁ. 198

ఉ. అని లిఖియించి పంపినఁ దదాజ్ఞ శిరంబునఁ దాల్చి సత్వరం
బునఁ జని మంత్రిసత్తములు పొల్పుగ వైశ్యపురంబుఁ జొచ్చి సా
మ్మనములు పల్లవింప ననమానబలోజ్జ్వలు వజ్రబాహువం
దనుఁ గని మ్రొక్కి భద్రలిఖితంబు లొసంగుచుఁ బల్కి రొక్కటన్. 194

శా. ఆలస్యం బిఁకఁ జేయఁగావలదు కల్యాణంబు సంధిల్లె ను
ద్వేలప్రాభవధుర్యుఁ డైననిషధోర్వీనాయకుం డాత్మలో
బాలారత్నము నీకు నిత్తు నని సంభావించి మమ్మంపినన్
వాలి న్వచ్చితి మిత్తటి న్వడలు మత్యానందభావంబునన్. 195

క. ఖ్యాతిగ నీ విభుడు భవ, స్త్రాతయుఁ బద్మాకరుండు మఱియుఁ దదీయ
భ్రాతృకళత్రసుపుత్రిస, మేతముగా దర్లి రండు మిత్రయుతముగాన్. 196

భద్రాయువు వివాహార్థమై నిషధపురమునకు వచ్చుట.

సీ. అని విన్నవించిన యాప్రధానులపల్కు లాలించి భద్రాయు వపుడు వేడ్కఁ
గనకభూషణవస్త్రగంధానులేపనసరసాన్నములను వారి సత్కరించె
నంతఁ బద్మాకరుం డధికహర్షంబున నారాజనందను నభిమతించి
మంగళస్నానంబు సంగతిఁ గావించి దివ్యభూషణదీప్తదేహుఁ జేసి
తే. రథముఁ గానొనరించి తూర్యములు మొఱయ, జననితోఁ గూడ నతని దోడ్కొనుచువచ్చె
నాత్మసతియునుఁ బుత్త్రితో నరుగుదేర, నిఖిలభూసురయుక్తుఁ డై నిషధపురికి. 197

వ. ఇవ్విధమున నిషధపురముఁ బ్రవేశించిన దశార్ణరాజనందను నెదుర్కొని చంద్రాం
గదుండు వారల సకలవస్తుపరిపూర్ణం బైనయొక్కనివేశనంబున విడియించి తత్పు
రం బతిసుందరంబుగా నలంకారంబు గావించిన నదియును ననేకతోరణమాలికా
లంకృతంబును కర్పూరగంధసారమృగమదమిశ్రితసలిలసంసిక్తవిపణిమార్గంబును
బహువిధరంగవల్లీవిచిత్రితప్రతిగృహాంగణప్రదేశంబును భేరీమృదంగఢక్కావేణు
వీణావాదిత్రఘోషణంబును దేశాంతరాగతచతుర్విధవర్ణాశ్రమజనసంకులంబు నై
యుండె నంత నప్పౌరులు ప్రమోదాయత్తచిత్తు లై యారాజనందనుం గాంచి. 198

క. మునికీర్తిమాలినికి నీ, మనుజేంద్రసుతుండు దగును మఱియు నితనికిన్
మునరాజకన్య దగు నని, మనమున హర్షించి రపుడు మమతదలిర్పన్. 199

భద్రాయువునకు వివాహం బొనర్చుట.

సీ. అంతఁ జంద్రాంగదుం డత్యంతరయమునఁ దనహర్మ్మపట్టి యుద్వాహమునకుఁ
గాశ్మీర కాంభోజ కర్ణాట దాశార్ణ [illegible]

కేకయ గాంధార కేరళ నేపాళ గౌళ చోళాదిభూపాలకులను
భూసురశ్రేష్ఠుల భువిలోనిజనముల నతిమైత్రి రప్పించి యాదరించి

తే. వారియనుమతి వడసి దైవజ్ఞకథిత, శుభముహూర్తంబునందు విస్ఫురణ మెఱయఁ
గన్యకాదాన మొనరించె గౌరవమున, శ్రీయుతుండై వెలుంగు భద్రాయువునకు.

వ. ఆసమయంబున. 201

క. సురవరులు పుష్పవర్షముఁ, గురిసిరి దివి మొనసె దూర్యఘోషణములు కి
న్నరు లాడిరి యప్పుడు వధూవరుల కరగ్రహణవేళ వైభవ మెసఁగన్. 202

తే. సర్వమంగళకరుణచే సంతతంబు, జగతి దీర్ఘసుమంగలి వగు మటంచు
గట్టె మంగళసూత్రంబు గళమునందు, నావధూరత్నమునకు భద్రాయు వపుడు.

క. లలితము లగుముత్తియములు, నలరులు దోయిళ్ల నునిచి యన్యోన్యముగాఁ
దలఁబ్రాలు వోసి రప్పుడు, చెలువయుఁ జెలువుండు హృష్టచిత్తత వెలయన్. 204

క. శంకరుకారుణ్యంబున, సంకటము లణంగ భూమిచక్రంబు నిరా
తంకమతి నేలు మని సతి, కంకణమును గట్టెఁ బ్రియుని కరపద్మమునన్. 205

తే. అఖిలసామ్రాజ్యభోగంబు లనుభవించి, యుర్వివంశాభివృద్ధిగా నుండు మనుచు
కీర్తిమాలినికరమునఁ గీర్తివెలయఁ, గంకణము కట్టె రాజశశాంకుఁ డపుడు. 206

మ. కనకాదుంబరభద్రపీఠగతులై కల్యాణవేదిస్థలిన్
మన ముప్పొంగ హుతాశను న్నిలిపి నేమం బొప్ప నాజ్యాహుతుల్
దనర న్వేల్చి వసిష్ఠమౌనిసతి సందర్శించి రాదంపతుల్
వనితల్ పాటలు పాడుచుండ విలసద్వాద్యధ్వను ల్మ్రోయఁగన్.

క. మేదురకుశప్రస్తృత, వేదస్వనముల వివాహవేదిక రహింపన్
సాదరణకృతాహుతులను, నాదట వహ్నియె ప్రదక్షిణార్చుల వెలిఁగెన్. 208

వ. తదనంతరంబున. 209

క. నవ్వులు సల్లాపంబులు, నివ్వటిలన్ బంధుమిత్రనివహంబులతో
బువ్వంబులు భుజియించిరి, దివ్వెలు నలుదిక్కులందుఁ దేజము లెసఁగన్. 210

తే. సారబలిఘను నాందీవిసర్జనంబు, కంకణోద్వాసనంబు పర్యంకవిధియు
నాదిగాఁ గల్గు వరవివాహవిశేష, కార్యములు దీర్చి రమ్మహాచార్యవరులు. 211

తే. పుత్త్రి నారాజకన్యకఁ బెండ్లియాడి, శ్రీయుతాకారుఁ డైనభద్రాయు వొప్పె
ధన్యయగుదేవసేనను దగ వరించి, మానితుండై చెలంగుసేనానికరణి. 212

వ. ఇవ్విధంబునఁ బరమోత్సాహంబునం దినచతుష్టయంబు గడపి సకలదేశాధీశ్వరులం
బిలిపించి వారల ననేకమణిభూషణాంబరాదిసత్కారంబులం బూజింపుచున్న
చంద్రాంగదుం గనుంగొని వజ్రబాహుం డిట్లనియె. 213

మ. అనఘా యీనరనాథసూనుఁడు మదీయప్రాణసంరక్షణం
బొనరించె న్మను మద్విపక్షజనపాలోద్రేకము న్మాన్పి యీ
ఘనువంశంబును దల్లిదండ్రులను విఖ్యాతంబుగాఁ జెల్వ మీ
వన జంద్రాంగదభూవిభుండు దరహాసాస్యుండునై యిట్లనెన్. 214

## చంద్రాంగదమహారాజు వజ్రబాహునకు భద్రాయుసుమతుల వృత్తాంతం బెఱింగించి మరల నొప్పగించుట.

వ. నరేంద్రా వినుము యితండు భవన్నందనుండు శైశవమున విషవ్రణరోగపీడితుం డయి
యుండి విషవ్రణబాధాక్రాంత యగుతల్లియుం దానును దదీయక్లేశము సహింపనో
పకయున్న నీచేతఁ బరిత్యక్తు లగుచు మహారణ్యంబునం బడి పోవుచుఁ దెరువెఱుం
గక పరిభ్రమింపుచు నొక్కయెడఁ బూర్వజన్మకృతపుణ్యవిశేషమున నొక్క
వైశ్యపురంబుఁ గని యచ్చట నావైశ్యనాథునిచేత సురక్షితు లై యుండునంతఁ
గతిపయదినములకు నబ్బాలకుండు మృతుం డయిన నచ్చటికి దైవయోగంబున ఋష
భుం డనుశివయోగీంద్రుండు విచ్చేసి యబ్బాలకుం గాంచి దయార్ద్రభావంబునఁ
గ్రమ్మఱ సంజీవితుం జేసి యమ్మాతృకుమారులదేహంబులు దివ్యంబు లగునట్లుగా నను
గ్రహించి చని కొంతకాలమునకు నయ్యోగీంద్రసార్వభౌముండు మరలం జను
దెంచి యక్కుమారు బహూకృతుం గావించి యనంతరమున శైవవర్మం బుపదేశించి
సకలశత్రుభీకరమ్ము లయినఖడ్గశంఖమ్ము లొసంగి వెండియు భస్మలేపనంబున ద్వాదశ
సహస్రనాగబలమునుం గలుగునట్లు కటాక్షించి చనినఁ గొన్నిదినములకు భవదీయ
రాష్ట్రోపద్రవవృత్తాంతమ్ము విని యచ్చటికిఁ జని యమ్మాగధుల నందఱం బరాజితులం
గావించి మిమ్మందఱ నుద్ధరించినమహానుభావుం డిప్పురుషశ్రేష్ఠునకు మహాత్ముఁ డయి
నయ్యృషభయోగీంద్రుశాసనమున మదీయపుత్త్రిక నొసంగి పాణిగ్రహణము
గావించితి నీ విప్పు డిక్కుమారు మాతృసహితమ్ముగాఁ దోడ్కొని నిజనగరమునకుం
జనుము నీవు శ్రేయోవర్ధనుండవై సుఖమ్ము లనుభవింపం గల వని తనజామాతృవా
క్యాలమున సవిస్తరముగాఁ దెలియం జెప్పె యాక్షణమ్మున. 215

మ. కుముదాప్తప్రతిమాస్యఁ గుందరదనం గుంభీంద్రకుంభస్తనిన్
సుమనోగంధవిరాజమానచికురన్ సూక్ష్మావలగ్నన్ శర

క్కమలాక్షి న్మణిభూషణాంబరయుతన్ దాశార్ణభూభృత్సుతన్
సుమతిన్ బ్రేమను బిల్వఁ బంచె నిషధక్షోణీశుఁ డచ్చోటికిన్. 216

తే. మేఘనిర్గత మైనక్రొమ్మించనంగ, శంబరారాతి యాలివశర యనంగ
దేవలోకాగతాప్సరస్త్రీ యనంగ, వారిరుహగంధి యచటికి వచ్చి నిలిచె. 217

వ. ఇట్లు చనుదెంచిన. 218

క. పాత్రులు క్షత్రియగోత్రప, మిత్రులు శివభక్తులైనవీ రిరువురు నో
ధాత్రీశ భవత్పుత్రిక, కళత్రము లని చూపి చెప్ప లలితమృదూక్తిన్. 219

సీ. ఆవార్త యాలించి యావజ్రబాహుండు మహితవిస్మయరసమగ్నుఁ డగుచు
దాను జేసినదుష్కృతము లెల్లఁ దలపోసి తనుఁ దాన నిందించుకొనుచు మఱియు
భవ్యతరానందపారవశ్యము నొంది పులకీకృతాంగవిస్ఫురితుఁ డగుచు
నయ్యాత్మజానిఁ బ్రేమ మలర కౌఁగిటఁ జేర్చి కరుణతోఁ దనపత్ని గారవించె

తే. నంత నిషధేంద్రపూజితుం డై యతండు, భార్యయును దాను శృంగారభరితులగుచుఁ
గొడుకు కోడలి నపుడుఁ దోడ్కొనుచువచ్చి, రగణితవిలాసమున నాత్మనగరమునకు.

క. హృద్రాజీవస్థాపిత, రుద్రునిమహిమాసమేతు రుచిరాకారున్
భద్రాచారుని నృపసుతు, భద్రాయువుఁ గాంచి రపుడు పౌరులు ప్రీతిన్. 221

సీ. ఈవిక్రమాఢ్యుఁడే యొంటిగాఁగ మాగధబలవితానంబుల భంగపఱిచెఁ
నీయశస్కుఁడే హేమాంగి మును తనజనకుని బంధముక్తునిగఁ జేసె
నీపుణ్యపురుషుఁడే యింతి యస్వద్ధనపశుధాన్యముల గృహపరత నొసఁగె
నీశుభాచారుఁడే యేణాక్షి బుధభాగ్యగురుకటాక్షముఁ గాంచి కుశలుఁ డయ్యె

తే. నితనితల్లిదండ్రులు దలంప నెంతపుణ్యు, లేమితప మాచరించెనో యితనిసాధ్వి
యనుచు సకల సౌధాగ్రవీథినుండి, పరఁగఁ జూచిరి కన్నులపండువుగను. 222

మ. శివనామస్మరణంబుతో ద్విజకులాశీర్వాదనాదంబుతోఁ
గవివైతాళికమాగధస్తుతులతో గాణిక్యగానంబుతోఁ
బ్రవిభాస్వత్కరదీపికల్ వెలుఁగఁ దూర్యధ్వానముల్ మ్రోయఁగా
భవనప్రాంగణసీమయందు నిలిచెన్ భార్యాసమేతంబుగన్. 223

క. భూసురగీతము లెసఁగఁగ, భూసురకామినులు లాజపుష్పాక్షతముల్
పేసలు చల్లుచు రాఁగా, రాసుతుఁడును రాజమందిరముఁ జొచ్చెఁ దగన్. 224

వ. ఇట్లు నిజశుద్ధాంతంబుఁ బ్రవేశించి యనంతరంబునఁ గృహదేవతాప్రార్థనంబులును బ్రాహ్మణసమారాధనంబులును దేవతాగృహమహోత్సవంబులునుం గావించి సుహృద్బాంధవజనసమేతముగా మధురాహారములు భుజియించి యాసమయంబున.

మ. కమలానందనరూపసుందరుఁడు రాకాచంద్రబింబాస్యవి
భ్రముఁడుం బ్రభానుసమానతేజుఁ డగునాభద్రాయుఁ డంత న్నిజ
ప్రమదారత్నముఁ గీర్తిమాలిని కరాబ్జాతంబు చేపట్టి తా
నుముహూర్తంబునఁ గేళికాభవనముం జొత్తెంచె లీలాగతిన్. 226

మ. కలితాదర్శనతాళవృంతకలికాకాశ్మీరకస్తూరికా
ఫలపుష్పాక్షతగంధయుక్త మగుపూఁబాన్పందుఁ గూర్చుండి ర
త్యలఘుప్రాభవు లవ్వధూవరులు సౌహార్దంబు సంధిల్లఁగాఁ
గలకంఠీమణు లాడిగంబులును శృంగారంబులుం జేయఁగన్. 227

వ. తదనంతరంబున. 228

క. క్షితికాత్రవుఁడు విరూపాక్షున కర్పితముగాఁగ ఫలములతోడన్
దక్షిణలు వీటికాదులు, దక్షుం డై యొసఁగ విప్రదంపతు లలరన్. 229

క. గౌరీసమర్పణంబుగ, హారిద్రపటీరకుంకుమాంజనములస
త్కారము లొనర్చె సతులకుఁ, గౌరవమున నిషధరాజకన్యక వేడ్కన్. 230

క. కాశికవైభవమునఁ బర, మేశునికృప గల్గి ధాత్రి యేలుదు వనుచుం
దాశార్ణధరాధీశుల, కాశీర్వాదము లొనర్చి రాద్విజవర్యుల్. 231

క. మంగళ మని పలుకుచుఁ బు, ణ్యాంగనలు సఖీమనోహరాలాపములన్
మంగళహారతు లొసఁగిరి, సంగీతరవంబు లెసఁగ సతికిం బతికిన్. 232

వ. అంత గొంతప్రొద్దు హర్షంబుతో నుండి, సకలజనులు వేడ్క సంఘటిల్ల
భద్రముగఁ గవాటముద్రలు ముద్రించి, చనిరి వారివారిసదనములకు. 233

మ. స్మరసౌందర్యవిలాసుఁ డంతనిషధక్ష్మాపాలకన్యామణిన్
బరమప్రేమభవార్తిఁ గౌఁగిటను సంభావించి కీలించి ని
ర్భరభావిన్ సడలించి కంతకుచనేత్రద్వంద్వవక్త్రాదిభా
సురదేశంబులఁ జుంబనంబు లొసఁగెన్ మారాస్త్రశాస్త్రజ్ఞతన్. 234

క. కమలమరందాస్వాదభ్రమరముగతి నామృగాక్షి భవ్యవరోవి
భ్రమ మెల్లఁ గొల్లలాడెను, సమరతుల నృపాలసుతుఁడు చతురత మెఱయన్. 235

తే. పన్నగం బాడ నక్షత్రపఙ్క్తి వీడఁ, జంద్రమండలమున జలసారివ మొదవ
గగన మల్లాడ శైలము ల్గదల నప్పు, డుపరతి యొనర్చె మరల నయ్యుత్పలాక్షి. 236

వ. ఇవ్విధంబున నన్నవోఢదంపతు లనంగసంగరమ్మునకుం జొచ్చి భుజాబంధననఖక్షత
దంతక్షతాదికంబులను గూర్మకుక్కుటకుంజరతురంగమార్జాలాదిబంధవిశేషంబు
లం బ్రవర్తింపుచు నుండ నానురతంబు ప్రభూతపులకోద్గమంబును ప్రవర్ధిత
[illegible]ంబును ప్రభగ్నపత్రభంగంబును ప్ర
ప్రేమానురాగంబును బరిస్రస్తధమ్మిల్లబంధంబును

గళితఘర్మబిందుసలిలంబున బ్రస్రావితకామసలిలంబు నై యున్న సమయంబున
నతిశ్రాంతులై సౌధజాలరంధ్రసమాగతశీతలపవనంబుల నాప్యాయనంబు నొంది
తత్పారవశ్యంబున సుఖసుప్తిం జెందియున్నంత బ్రభాతసమయంబునందుఁ బ్ర
బోధనార్థంబుగా వందిమాగధవైతాళికాదిజనంబులు చనుదెంచి యనేకవిధంబులం
బ్రశంసింపుచు నిట్లని స్తుతియించిరి. 237

మ. జయ మార్తాండకులాబ్ధిశీతకరదాశార్ణక్ష్మాపాలకా
జయ హేమాద్రిసమానధైర్యవిలసత్సామ్రాజ్యధౌరేయకా
జయ భూనాయక! సార్వభౌమవినుత క్ష్మాపాలసంహారకా
జయ భద్రాశ్రయురధీశధీనుత మహాశౌర్యప్రభావోజ్జ్వలా. 238

సీ. సంక్రందనుఁడు నీకు సామ్రాజ్యము లొసంగ వైశ్వానరుండు పావనునిఁ జేయ
దండధారుఁడు నీకు దండనీతి యొసంగ నసురుండు శత్రుజయం బొసంగ
వరుణుండు నిర్మలస్వాంతుని గావించఁ బవనుండు నీకు దోర్బల మొసంగ
ధననాయకుఁడు మహాధనవంతుఁగాఁ జేయ నీశానదేవుఁ డభీష్ట మొసఁగ
తే. బ్రహ్మవిష్ణుముఖామరప్రకరములును, సంయమీంద్రులు భాస్కరశశధరులును
నేమ మారసి నిన్ను రక్షింపుచుంద్రు, మిహిరసమతేజ నిద్దుర మేలుకొనుము. 239

క. భవదీయజనకునసుమతి, నమభారము వహింప నభిషిక్తుఁడవై
యువరాజ్య మేలవలయును, బ్రవిమలమతి మేలుకొనుము పార్థివతనయా. 240

తే. అబ్జబాంధవుఁ డుదయాద్రియందుఁ దోఁచె
నిదుర మేల్కాంచి పశుపతిపదయుగంబు
నాత్మ భావించి యాహ్నికం బాచరింపు
సకలభూపాలజనగేయ సామతేయ. 241

వ. అని మఱియు బహుప్రకారంబులం బ్రశంసింపుచున్న వైతాళికజనస్తోత్రపఠనార
వంబులవలనను మతంగజఘటాఘీంకారంబులవలనను భేరీమృదంగాదివాద్యఘోషం
బులవలనను నన్నరేంద్రనందనుండు మేల్కాంచి మానంబున నొక్కింతదడవు
దనమనంబునఁ బరమేశ్వరధ్యానం బొనరించి తదనంతరంబునఁ గాల్యకరణీయంబు
లాచరించి పితృమాతృప్రముఖగురుజనంబుల భూసురులకుం బ్రణామంబు గావించి
తదాశీర్వాదంబులు గైకొనుచుఁ బరమాహ్లాదంబునఁ బరిషన్మధ్యంబునకు వచ్చి
యచ్చట సమస్తప్రధానమిత్రబాంధవవిద్వజ్జనపరివేష్టితుం డయి యున్న తన
తండ్రిసన్నిధానంబునఁ దేజంబు మెఱయ నర్హాసనంబునఁ గూర్చుండి తత్సమయో
చితంబు లగురాజకార్యంబులు నిర్వర్తింపుచు సకలప్రకృతిజనంబులకు సంతో

వం బొనరింపుచు బాంధవజనంబులతో మైత్రి నెఱపుచు దీనానాథజనంబులకు వలసినయర్థంబు లొసంగుచు నతిథిసత్కారంబు లాచరింపుచు యథేష్టభోగంబు లనుభవింపుచు నిజకళత్రసమేతంబుగాఁ బరమానందంబున సుఖం బుండె నంత.

శా. ఆలో నొక్కదినంబునందు మగధక్ష్మాధీశుకారాగృహ
వ్యాళీభర్త్సన మాన్పి తెచ్చి మధురవ్యాహారపూర్వంబుగా
నీలగ్రీవపదాబ్జసాక్షికముగా నిర్భీతుఁ గావించి భూ
షాలంకారము లిచ్చి పంపు నతిసౌహార్దంబు సంధిల్లఁగన్. 243

తే. ఇవ్విధంబున యువరాజ్య మేలుచుండి, యొక్కదినమునఁ గారుణ్య మొప్పతిల్ల
వైశ్యనాథుని బిలిపించి వరవిభూష, ణాంబరంబు లొసంగి భద్రాయు వపుడు. 244

క. పద్మాకరు బహుమణిధను, పద్మాకరు మేరుధీరు బాంధవపటలీ
పద్మాకరహంసోదయుఁ, బద్మాకరభవను గాంచి పలికెను మైత్రిన్. 245

ఉ. పన్నగరాజహారుని కృపాతిశయంబునఁ జేసి మమ్ము నా
పన్నుల నుద్ధరించితివి ప్రత్యుపకారము సేయనోప నా
మన్నన యాదరించి నిజమందిరసీమకుఁ బొమ్మటంచు వి
ద్వన్నుతకీర్తి పంపె నటు వైశ్యపతిన్ బహుమాన మొప్పఁగన్. 246

వ. అంత నావైశ్యనాథుం డైనపద్మాకరుండు భద్రాయువుచేతం గృహీతసత్కారుం డై నిజకుటుంబసమేతముగాఁ దదీయజననీజనకులచేత ననుజ్ఞాతుం డై భద్రాయువుం బ్రశంసింపుచు ఋషభయోగీంద్రమహామహిమంబు లెన్నుచుఁ గతిపయప్రయాణముల పురంబు ప్రవేశించి యాత్మమందిరమున సుఖం బుండె నంత. 247

ఉ. జనకునియాజ్ఞఁ దప్పక యజస్రము సద్గురుసేవ సేయుచున్
ఘనతరధైర్యశౌర్యములు గల్గి సమస్తవిపక్షమండలిం
దునుముచు ధర్మమార్గమున దోర్బలవిక్రమశాలి రాజనం
దనుఁడు నిజాప్తమంత్రిసహితంబుగ నుండెను నిర్విచారుఁడై. 248

క. పదియాఱువత్సరములకుఁ, బదపడి నిజపురము జేరి భద్రాయువు దాఁ
బదిరెండుహాయనంబులు, సదమలమతి నుండెఁ దనదుజనకునిపజ్జన్. 249

## భద్రాయువునకుఁ బట్టముగట్టుట.

ఉ. శ్రీయుతదివ్యలక్షణుఁడు శిష్టజనావనశీలుఁ డంబికా
నాయకపాదపద్మభజనారతుఁ డుజ్జ్వలతేజుఁ డైనభ
ద్రాయువుఁ గాంచి భూభరధురంధరుఁ జేయఁగ నిశ్చయించె న
న్యాయతకీర్తిశాలి యగుతజ్జనకుండు మహావిధంబునన్. 250

వ. ఇవ్విధంబున నవ్విప్రబాలుండు నిజనందనుం డైనభద్రాయువునకు దాశార్ణమహీ
మండలసామ్రాజ్యధురంధరత్వంబునకు నభిషేకంబు సేయం దలంచి పురం బతి
మనోహరంబుగా నలంకారంబు గావింపఁ దగువారల నియోగించి కోసల కేకయ
గాంధారకాశ్మీరవిదర్భశూరసేనమద్రమగధమాలవమత్స్యపాంచాలాదిమహీపతు
లను నిషధాధినాథుం డైనచంద్రాంగదసమేతంబుగా రావించి బ్రహ్మల వైశ్యపతి
యైనపద్మాకరునిం బిలిపించి వారల యనుమతి వడసి బంధుమిత్రామాత్యపురోహిత
బ్రాహ్మణవిద్వజ్జనకవిగాయకప్రధానసామంతదండనాయకప్రముఖనిఖిలజనబృందం
బులు డెందమ్ముల నానందమ్ము నొందుచుండఁ జతుస్సముద్రోదకములును గంగాది
మహాపుణ్యనదీతీర్థములును సంగ్రహించి భూసురేంద్రులవలన గ్రహశాంతి యగు
నట్లుగా హోమమ్ము గావించి దైవజ్ఞనిర్దిష్టశుభముహూర్తమునం గీర్తిమాలినీసమేత
ముగా నాదుంబరభద్రపీఠమునఁ గూర్చుండ నియోగించి యాగమోక్తప్రకారమున
మహర్షిసత్తములును గన్యకాష్టకమును మతియు బ్రహ్మక్షత్రియాదిపౌరజాన
పదవర్గమును సమస్తపరివారములును నభిషేకము లొనరింపం జేసినయనంతరంబ
మూర్ధాభిషిక్తుం డైనయారాజనందనుండు జాంబూనదపట్టబద్ధఫాలభాగుండును
దివ్యదుకూలాంబరధారణుండును మృగీమదసమ్మిశ్రగంధసారవిలేపితదేహుండును
బహువిధపుష్పమాలికాలంకృతుండును హారకిరీటకుండలకంకణాంగుళీయకనూపు
రాంగదగ్రైవేయాది సమస్తమణిస్థగితసౌవర్ణభూషణభూషితుండును నై త్రిలోక
రాజ్యధురంధరుం డగుమహేంద్రుండునుంబోలె భాసమానుం డగుచు నక్షౌ
హిణీబలసమన్వితుం డగు హైమరథుం బిలిపించి ధరియించిన గండపెండేరంబు దా
కాలం బ్రకాశింప భేరీమృదంగపటహనిస్సాణపణవగోముఖవేణువీణాప్రముఖ
చతుర్విధవాద్యరవములు రోదసీకుహరాంతరాళము నిండి నలుదెసలం బిక్కటిల
భద్రగజాధిరూఢుం డై చంద్రమండలప్రతీకాశం బైనశ్వేతచ్ఛత్రమ్ము శోభిల్ల
నిరుపార్శ్వంబుల విలాసవతీజనములు వింజామరములు వీవ హయగజస్యందనభట
సముత్తుంగమ్ము లగుచతురంగములు పరివేష్టించి నడువఁ గరదీపికాసహస్రమ్ములు
వెలుంగఁ గంచుకిజనములు వేత్రహస్తులై సందడిజనముల జడియం ద్రోయుచు
బరాబరులుం గావింపుచు ముందట నడువ ధనకనకవస్తువాహనాద్యుపాయనపా
ణులై సామంతరాజసంఘము లెదుర్కొని ప్రణమిల్లుచుం జనుదేర జగన్మోహనా
కారవిలాసవిభ్రమములం మెఱయు వారకామినీబృందము లెడనెడ నిలిచి మంజీర
కింకిణీస్వనమ్ములు చెలంగ మాళవవసంతసౌరాష్ట్రీఘంటారవభైరవపున్నాగముఖా
రిలాంబరీప్రముఖరాగములు పాడుచుఁ దాళక్రియామానంబులు దప్పకుండ కపి
త్థకటకాముఖసూచీముఖశుకతుండసర్పశీర్షార్ధచంద్రశిఖరభ్రమరపతాకాదిహస్త
ములం నభినయించుచు దండలాస్యాదినృత్యావధానములు సలుపుచుండఁ బుణ్యాంగ

నామణులు సౌధాగ్రభాగంబులందుండి పుష్పలాజాక్షతంబులు సేసలుఁ జల్లుచుఁ బాడుచుండ వందిమాగధబృందము లనేకప్రకారంబుల దాశార్ణదేశాధీశ్వరా భూపాలవంశసార్వభౌమా సుమతీగర్భపయఃపారావార రాకాశశాంకా వజ్రబాహుమహారాజనందనా ఋషభయోగీంద్రకారుణ్యకటాక్షవీక్షణ సమాలబ్ధ ఖడ్గశంఖాదిదివ్యసాధన ప్రకాశమానా ద్వాదశసహస్రవేదండబలసమన్వితదీర్ఘ భుజార్గళా నవాక్షౌహిణీబలపలాయనకరణచండప్రచండప్రతాపా మగధరాజగర్వనిర్వాపణా భూలోకపురందరా కందర్పసుందరా ధైర్యవిజితమేరుమందరా జయవిజయీభవ యని ప్రశంసింపుచుఁ గైవారమ్ములు సేయ వాహ్యాళి వెడలి పరమోత్సవంబుఁ బురవీధులం బ్రదక్షిణముగా విచ్చేయుచుఁ బ్రతిగృహాంగణప్రదేశ నివాళితపౌరాజనంబులు గైకొనుచు సకలజనమనోరంజనముగాఁ గ్రమ్మఱ సభాస్థానమునకుం జనుదెంచి రత్నసింహాసనాసీనుండై బ్రాహ్మణాశీర్వాదంబులు గైకొని వారలకు ననేకగోభూహిరణ్యాదిదానంబు లాచరించి సకలబంధుసమేతంబుగా మృష్టాన్నపానములు భుజియించి కతిపయదినములకు దేశాంతరసమాగతు లయిన రాజుల మణిభూషణాంబరవాజివారణాదిబహుమానంబుల సంతుష్టులం గావించి క్రమ్మఱ యథాస్థానమ్ములకుం బోవం బనిచి తదనంతరమునఁ గొన్నిదినములకుఁ జంద్రాంగదపద్మాకరులం బ్రియపూర్వకముగా వందనాలింగనాదిసత్కారములఁ బూజించి వారివారిపురములకుం బోవునట్లుగా ననుజ్ఞ యొసఁగి యంత దేవీసహితముగాఁ బరమానందంబున రాజ్యపరిపాలనంబుఁ జేయుచున్న నిజకుమారుం డయిన భద్రాయువుం గాంచి వజ్రబాహుండు పరమాహ్లాదంబున సుఖంబున నుండె నని చెప్పి మఱియు నిట్లనియె. 251

సీ. అంతట మఱికొన్నిహాయనంబులకును వార్ధక్యదశఁ జెంది వజ్రబాహుఁ
డాత్మవిజ్ఞానియై హరుపదాబ్జంబులు మదిలోన నిల్పి నిర్మలమనస
నిర్వాణమోహుండు నిరుపమచరితుండు షడ్వర్గరహితుండు సర్వసముఁడు
విజితేంద్రియుండును విగతదోషుండును శమదమాదికగుణోజ్జ్వలుఁడు నగుచు

తే. నంతఁ బత్నీసమేతుఁడై యవ్విభుండు, పావనము లైనపుణ్యతపోవనముల
ఘోరతప మాచరించి యోగులు నుతింప, ముక్తిదం బైనశివలోకమున వసించె.

ఉ. న్యాయము దప్పకుండ రఘునందనరంతిదిలీపకార్తవీ
ర్యాయతవిక్రమంబున నరాతుల గెల్చి సమస్తధర్మముల్
చేయుచుఁ జంద్రశేఖరపదశరణాచ్ఛమనోబ్జ మొప్ప భ
ద్రాయువు రాజ్యమేలెఁ బ్రమదంబుగ భూమిజను ల్నుతింపఁగన్. 253

క. ద్విజబాహుజవిట్శూద్రులు నిజవర్ణాశ్రమధర్మనిష్ఠాపరులై

వృజినరహితులై యుండఁగ, బ్రజలను బాలించె నతఁడు భద్రాయుఁ డొగిన్. 254

మ. పరరాష్ట్రంబుల ధారుణీపతులు కప్పంబుల్ సమర్పించి బం
ధురమైత్రిం దనుగొల్వఁగా సుజనసందోహంబు వర్ధిల్లఁగా
సురగేంద్రద్విపకూర్మశైలముల భారోద్రేకము ల్వీడఁగా
ధరణీపాలన మాచరించె నతఁ డుద్యత్కీర్తిధౌరేయుఁ డై. 255

వ. మఱియు నారాజపుంగవుండు శరణాగతులకు నభయంబు లొసంగుచు వాపీకూప తటాకారామ నిర్మాణ వివాహోపనయన దేవతాగృహప్రతిష్ఠాగ్రహారాది సమస్త ధర్మంబు లాచరించుచు నశ్వమేధాదిమహాధ్వరంబు లొనరించుచు స్వరాష్ట్రంబున కు నీతిబాధలు లేకుండునట్లుగా భూపరిపాలనంబుఁ గావించుచు నిజభార్య యైన కీర్తిమాలినితోడ సకలసామ్రాజ్యభోగంబు అనుభవించుచుఁ బరమానందంబున నుం డునంత. 256

వసంతఋతువర్ణనము.

క. విధుమదనసఖ్యకరమై, మధుకరశుకపికమయూరమధుకరరసవా
గ్వృధిరీకృతదిక్తటమై, మధుమాసము దోఁచె ధరణిమండల మలరన్. 257

మ. చిగిరించె న్సకలద్రుమంబులును బూచె న్మల్లికావ్రాతముల్
సొగసై తోఁచెను మాలతీలతిక రాజీవాకరోద్యానము
ల్మిగులన్ హర్షము దోఁపఁ బుష్పరసము ల్మెండయ్యె నిర్మేఘమై
గగనం బెంతయు నొప్పె మాధవుఁ డభంగఖ్యాతిఁ దోతెంచినన్. 258

భద్రాయువు భార్యతోఁగూడి వనవిహారంబు సల్పుట.

సీ. అంత నాభద్రాయు వతిమనోహరమైనయామధుమాసంబునందు వేడ్కఁ
పల్లవమంజరీప్రసవాదిహృద్యంబు కుంజగుంజద్భృంగరంజితంబు
కుందవాసంతికాకుసుమసౌగంధ్యంబు కోరకితాశోకకురవకంబు
నవఫలభారానమ్రరసాలంబు మాధవీమల్లికామంటపంబు
తే. కీరశారీమయూరకోకిలపురాళి, ముఖరకలకలారావసముజ్జ్వలంబు
నైనరమ్యవనంబున కరిగి యచట, సతియుఁ దాను వనకేళి సంచరించె. 259

వ. ఇట్లు వనవిహారంబు సేయుచు నన్నరేంద్రనందనుండు నిజకళత్రంబున కిట్లనియె.

మ. వనలక్ష్మిం గనుఁగొంటె పంకజముఖీ వర్ణింపఁ దాళీకుచ
స్తనముల్ భాసురపల్లవాధరముఁ గుందస్వచ్ఛదంతంబులున్
వనపక్షిస్వనభాషణంబులును శశ్వద్భృంగనేత్రంబులున్
ఘనవల్లీకచముల్ ఫలాభరణముల్ గన్పట్టెఁ గాంతాకృతిన్. 261

ఉ. శీతరళాక్షి మాధవుసముద్యమ మేమనిచెప్పవచ్చు స
జ్జాతులు వంతనొందఁగ విజాతికుజాతుల నెల్ల వైభవో
పేతుల జేసె మాగులకు జేర్మి వచోగరిమంబు నేర్పె మం
దాళపుఁ డత్యుదగ్రకరుఁ డయ్యె దదీయమహత్త్వసంపదన్. 262

సీ. చంచరీకనికాయఝుంకారరవములు ధరణీసురోక్తమంత్రములు గాఁగ
శుకకోకిలమయూరనికరనాదంబులు సకలవాదిత్రఘోషములు గాఁగ
మహితపుష్పస్రవన్మకరందబిందుబృందములు హారిద్రోదకములు గాఁగఁ
బల్లవమంజరీవల్లికాప్రతతులు భాసిల్లుతోరణపఙ్క్తి గాఁగఁ
తే. దనరి మాధవవనదేవతావివాహ
భవనములమాడ్కి శృంగారభావ మలరఁ
గన్నులకుఁ బండువై యొప్పెఁ గానసములు
హర్ష మిగురొత్త జూడు మబ్జాయతాక్షి. 263

సీ. మంజులపల్లవమంజరీపుంజంబుఁ గనుఁగొన నేత్రరంజనము గాఁగ
శారికాకలకంఠకీరకోలాహలం బెప్రొద్దు వీనుల కింపు గాఁగఁ
చంపకాదికగంధసంపత్తి యాక్రాంత మిష్టమై ఘ్రాణసంతుష్టి యొసఁగ
శైత్యమాంద్యానంతసౌరభ్యమిళితమై కరువలితనుసౌఖ్యకారి గాఁగ
తే. మేదురమరందఫలరసాస్వాదనంబు
మెరసి జిహ్వకు సంప్రీతికరము గాఁగఁ
బరఁగి పంచేంద్రియాహ్లాదపరతఁ దనరె
వనసంబుల జూడు మిందీవరాక్షి. 264

చ. తరువులు గోగణంబులు నదంబులు సత్పురుషుల్ ధరిత్రిలో
నరయ పరోపకారపరులై జనియించినవారు వీరిలోఁ
దరువులు సారపుణ్యఫలదంబులు సర్వజనశ్రమచ్ఛిదా
కరములు నిత్యసౌఖ్యజనకంబులు గన్గొను మంబుజాననా. 265

మ. ఘనకర్పూరపరాగసైకతములన్ గస్తూరికామోదముల్
వనదంతావళకుంభనిర్గళితభాస్వన్మౌక్తికంబు ల్వొట
ప్యనిశప్రస్తుతమరందవర్షములు హిమాంబుపూరంబులన్
గనుఁగొంటే మదహంసయానవిలసత్కాంతారమార్గంబులన్. 266

వ. అని యివ్విధంబునఁ బ్రశంసింపుచు నుపవనలక్ష్మీసందర్శనకుతూహలుం డయి సపరి
వారుండై నిజకుటుంబినీసహితముగాఁ జని యమ్మహీనాథుండు కాంతారమ్ములం
దిరుగుచు సహకార పనస కదళీ ఖర్జూర ద్రాక్షాదిఫలంబు లారగింపుచు వాసంతి

కాకుందకురంటకకరవీరాదికుసుమగుచ్ఛంబులు విదళింపుచు మధురఫలరసమ్ములు గ్రోలుచు మరందమ్ము లాస్వాదింపుచుఁ గృతశైలమ్ము లెక్కుచు నికుంజగృహములం బ్రవేశింపుచు గిరినిర్ఝరమ్ములఁ దోఁగుచు సరోవరమ్ములఁ గ్రుంకుచుఁ దాపసాశ్రమములు గనుంగొనుచు బుండరీకవేదండగండకభల్లూకవరాహాదిభీషణమృగముల ఖండింపుచు నిట్లనేకవిధములైన వనవిహారములు సలుపుచు నొక్కెడ శీతలతరుచ్ఛాయాతలమున విశ్రమించి యున్నసమయంబున. 267

## కృత్రిమదంపతీకథనము.

తే. ఓమహాబల రాజేంద్ర యురుగుణాఢ్య, మమ్ము రక్షింపు రక్షింపు సమ్మతముగ
వాడికోఱలబెబ్బులి వచ్చె వచ్చె, ననుచు నాక్రందన మొనర్చె నాద్విజుండు. 268

చ. నరవరుఁ డంత నెమ్మనమునందు గృపారస ముప్పతిల్లఁగా
శరము శరాసనంబునను సంధిలఁ జేసినయంతలోన నో
హర పరమాత్మ శూలధర హా శివ శంకర యంచు నేడ్చుభూ
సురసతిఁ బట్టె బెబ్బులియు సుస్థిరభీషణరోష మేర్పడన్. 269

క. అంతట శార్దూలముపై, నెంతయు నిశితాస్త్రతతు లనేకంబులు భూ
కాంతుఁడు పరపెన నది యొ, క్కింతయు జలియింపదయ్యె నద్రివిధమునన్. 270

తే. ఈవిధంబున నేయ నాభూవరేంద్రు
బాణములు లెక్కగొనక దోర్బలము మెఱయ
విప్రసతి నెడ్చుకొనిపోయె విపినమునకు
నాక్షణంబున శార్దూల మద్భుతముగ. 271

మ. వికటవ్యాఘ్రనిపాతితాంగ యగుసాధ్విం గాంచి హా కామినీ
వికచాబ్జేక్షణ విద్రుమాధరలసద్వేదండకుంభస్తనీ
శుకసంభాషిణి మన్మనఃప్రియకరీ సోమాస్య యంచున్ మహా
శకభూషంబున భూసురుండు మగచె న్నానాప్రకారంబులన్. 272

సీ. అని విలాపించుచు నారాజు నీక్షించి యోలమి నాబ్రాహ్మణిఁ బట్టు లనిరె
యెగురం డగుశివయోగి యొచ్చటికేఁగె శైవధర్మంబు నేతోఁవఁ జనిరె
ద్వాదశసాహస్రవేదండబలమెద్ది ఖడ్గశంఖంబు లెక్కడ వసించె
మంత్రమంత్రాదివిద్యాభ్యాస మేమాయె భవదీయశౌర్య మేభంగి నుడిగె
తే. విన్నయుమ గల్గియుండి నీ వెంచిచూడ, వనమృగంబును బంపలే వైతి విభుడు
కావ నీపౌరుషం బెల్లఁ గానవచ్చె, వఱలవాలుకుమార నిర్భయాకార. 273

క. భీతుల నార్తుల దీన వ్రాతముల ననాథజనుల వాత్సల్యమునన్
ప్రీతిం బోవనిమనుజుండు, భూతలమున నెంచి చూడ బూజ్యుం డగునే. 274

ఆ. ధనము సంగ్రహించి దానం బొనర్పని, గృహపతికిని భైక్షవృత్తి మేలు
శాకయుండు నేని గరళాశనంబు మే, లగ్నిం జొరుట యంతకన్న మేలు. 275

క. శరణాగతుం బ్రోవనిభూవరుం డధమాధముండు వాడు వసుధాస్థలిపైం
జిరజీవి యౌటకన్నను, మరణం బొందుటయే మేలు మనుజాధీశా. 276

క. అని నిందింపుచు శోకంబునం బొరలుచు లేచుచున్న భూసురనాథున్
గనుంగొని యారాజేంద్రుండు, దనమనమున నిట్లు అని వితర్కించెం దగన్. 277

ఉ. మిత్రసమాన తేజులును మేరుధరాధరధీరులున్ సుచా
రిత్రులు నార్తరక్షణు లరిందములున్ కలుషౌఘవల్లికా
దాత్రులు నైనమత్పితృపితామహు లట్లన యిమ్మహీసుర
క్షేత్రముం బ్రోచి పుణ్యమునం జెందరె యీ నపకీర్తి జెందిరిన్. 278

మత్తకోకిల. ఈమహీసురుం డెంచిచూడ నహీనదివ్యతపోబలో
ద్దామసాహసుం డగ్నికల్పుం డుదగ్ర తేజుండు గావునన్
దామసాకృతి మాని సాత్వికతానిరూఢి వహింపంగా
నీమహాత్ముని వాంఛితార్థము లెవ్వియైన నొసంగదన్. 279

వ. అని నిశ్చయించి. 280

ఆ. విప్రుం జేరి మొగము వెలవెలంబారం ద,చ్చరణపద్మములకు సాంగి మ్రొక్కి
కేలుదోయి నుదుట గీలించి యత్యంత,వినయ మెసంగ నిట్టు లనియె విభుండు. 281

క. ఇది రాజ్య మిది కళత్రం, బిది నాదేహము మహాత్మ యున్నిటిలో నె
య్యది నీ కిష్టము దానిన్, వడవడి రయ నిత్తుం గొనుము బ్రహ్మకులీనా. 282

క. శరణింపుము దుర్బలుండను, బరతంత్రుండం దలంప క్షత్త్రబంధుండను భూ
సురకీర్తివిహీనుండను, మతి నాయపరాధ మిపుడు మన్నింపు తగన్. 283

క. అని పలుకుచున్న భూవరుం, గనుంగొని యావిప్రుం డనియె గాంతాహీనుం
డనుపకపవాదము వీడంగం, దనకు భవత్పత్ని నిమ్ము ధర్మస్థితిగన్. 284

చ. అనిన నరేంద్రుం డిట్లనియె నాద్విజసత్తముతోడ మీ రెఱుం
గనివరధర్మము ల్గలవె కల్మషదూర భవాదృశు ల్పరాం
గనల వరింతురే దురితకర్మములన్ భజియింపు టర్హమే
వినుతతపోధురంధరులు విప్రకులోత్తమ యెంచి చూడంగన్. 285

చ. ధరణితలంబునం గలరు దాత లనేకులు వార లెప్పుడున్
గరిహయరాజ్యవస్త్ర

త్తుఁడు విహితంబుగా మదిఁ దోఁచి నిజాంగన నిచ్చునట్టియ
న్నరవరు లెందునుం గలరె నవ్యగుణోదయభూసురోత్తమా. 286

కం. పరభామాసక్తుల కిల, నరయఁగ నిష్కృతులు గలవె యవనిస్థలిలో
సురపతి మును పరవనితా,పరుఁడై యెట్లయ్యెఁ దెలియఁ బలుకు మహాత్మా. 287

సీ. అని పల్కుచున్న యయ్యవనీశువాక్యంబు లాలించి బ్రాహ్మణుం డనియె మరల
బ్రహ్మహత్యయును సురాపానంబు గురువధూపరతయుం గనకాపహరణ మనెడి
యఖిలాఘములకుఁ బ్రాయశ్చిత్త మొనరించుఁ బూని మదీయతపోబలంబు
పారదారికవృత్తి పాపం బనఁగ నెంత నిమిషమాత్రంబున నమసిపోదె

తే. కాన మఱుమాట లాడక ఘనతమీఱ
నీసతీమణి నిపు డిమ్ము నిశ్చయముగ
నట్లు గాకున్న శరణార్థులైనవారిఁ
బ్రోవనేరని కలుషంబు పొందు నిన్ను. 288

వ. అని యివ్విధంబునఁ బరుషాక్షరంబులుగాఁ బలికిన బ్రాహ్మణునిభాషణంబు లాక
ర్ణించి పాపభయంబునకు వెఱచి యన్నరేంద్రుఁడు దనమనంబున ధైర్యం బవలం
బించి యిట్లని వితర్కించె. 289

ఆ. పాప మెడలి పోవ బ్రాహ్మణోత్తమునకు, మద్వధూటి కీర్తిమాల నొసఁగి
యుపయశంబు దొలఁగ నగ్నిఁ బ్రవేశింతు, ననుచు నిశ్చయించె నాక్షణంబ. 290

కం. స్నానాదికవిహితానుష్ఠానంబు లొనర్చి మానసమునందు గురు
ధ్యానము సేయుచు బహువిధ,దానము లొనరించె నపుడు దద్దయుఁ బ్రీతిన్. 291

వ. అంత. 292

శా. శౌర్యౌదార్యగుణార్ణవుండు వినుతక్ష్మాపాలనాగావళీ
హార్యక్షుం డగువజ్రబాహుతనయుం డారాజచంద్రుండు ని
ర్ధార్యుం డై విబుధు ల్నుతింప జలధారాపూర్వ మానట్లుగా
భార్యాదాన మొనర్చి నాద్విజునకున్ బద్ధానురాగంబునన్. 293

ఆ. అటుల దాన మిచ్చి యంత వైశ్వానరుఁ, బ్రజ్వలింపఁజేసి పార్థివుండు
దాను వినతుఁడై ప్రదక్షిణంబు లొనర్చి, యందు జొరఁగఁబోవు నవసరమున. 294

## భద్రాయువునకు శ్రీసాంబమూర్తి ప్రత్యక్షం బగుట.

సీ. శ్రీపార్వతీపరిష్కృతశరీరముతోడ నవసుధాధవళవర్ణంబుతోడఁ
గుండలీకృతమహాకుండలేంద్రులతోడ డమరుత్రిశూలహస్తములతోడ

మందాకినీవినిర్మలకపర్దముతోడ రమ్యమౌ వ్యాఘ్రచర్మంబుతోడఁ
చంద్రపాండురవృషభేంద్రయానముతోడఁ గరవిరాజన్మృగాంకంబుతోడ

తే. నారదాదులు సామగానములు చదువఁ
ప్రమథగణములు సేవింప భద్రయశుఁడు
సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి
సామతేయున కపుడు సాక్షాత్కరించె. 295

వ. అయ్యవసరంబున. 296

చ. కురిసిరి పుష్పవృష్టి సురకోటులు మింట ననేకభేరికా
మురజమృదంగవాద్యములు మ్రోసె వియచ్చరవారకామిను
సురుచిరలాస్యము ల్చెలఁగ సూర్యసమప్రదగద్ధగత్ప్రభ
ల్పరఁగ దిగంతరంబులఁ గృపాళుఁడు శంభుఁడుఁ దోఁచినంతటన్. 297

క. కద్రూభవభూషణుఁడు జగద్రూపకుఁ డైనవాఁడు గరకంఠుఁడు ని
ర్నిద్రానలాభిముఖుఁ డగు, భద్రాయువుఁ బాణితలముఁ బట్టి మరల్చెన్. 298

వ. అయ్యవసరంబున నింద్రాదిలోకపాలకులును నారదాదిదేవర్షులును సనకసనంద నా
దిపురాణయోగీంద్రులును గపిలాదిసిద్ధులును చిత్రరథాదిగంధర్వులును బ్రహ్మాదిదే
వతలును మాణిభద్రాదియక్షులును రంభాద్యప్సరోగణంబులును భృంగీశ్వర చండి
కేశ్వర నందికేశ్వరాదిప్రమథగణంబులును విఘ్నేశ్వరకుమారవీరభద్రాదిపుత్త్రవర్గ
మును జనుదెంచిన యంతటం దత్సభామధ్యంబునం గూర్చున్నజగదీశ్వరుం డైన
యంబికారమణునకు నత్యంతహర్షాశ్రుమిళితనేత్రుండును బులకీకృతగాత్రుండు
నై యన్నరనాథుండు ధరణీతలంబున సాష్టాంగదండప్రణామంబు లాచరించి పా
ణిపంకజంబులు ముకుళించి వేదవేదాంతాభిప్రాయకథనంబులుగా నిట్లని స్తుతి
యించె. 299

దండకము. శ్రీశైలశర్వా మనఃపద్మసంచార హంసాసురోత్తంస దక్షాధ్వరధ్వం
సగంగాతరంగాంబురంగజ్జటాభార హాలాహలా హారకర్పూరగౌరా స్ఫటీద్ధా
రణీహారవాణీశరచ్చంద్ర చంద్రాతపస్వచ్ఛసత్కీర్తివిస్తార సద్భక్తమందార శ
ర్వా మహాదేవ మృత్యుంజయా నీలకంఠా విరూపాక్ష కోట్యర్కసంకాశతేజా
బిడౌజప్రధానామరస్తూయమానాంఘ్రిపంకేజగోరాడ్ధ్వజా వామదేవా శివా శం
కరా కామసంహార కాలాంతకా వ్యాఘ్రచర్మాంబరా భూతిలిప్తాంగరుద్రాక్షమా
లాధరా శక్తిశూలాసిఖట్వాంగహస్తా సమస్తారివిధ్వస్తలోకత్రికస్తా వియత్కేశ
భూతేశ విశ్వేశ్వరా శాశ్వతైశ్వర్యసంధాయకా దేవదేవా జగద్రక్షయుష్మత్ప్ర
భావంబు వర్ణింప బ్రహ్మాదులు న్నేర రే నెంతవాఁడ న్నినుం గొల్వ నోచంద్ర

కోటీరదేవా జగజ్జాలనిర్మాణసంరక్షణారంభకేళి న్విజృంభించిన కీర్తింతు నెల్లప్పుడుఁ
మాలతీమాధవీమల్లికాకుందమందార సౌగంధికాంభోజపున్నాగసేవంతికా ద్రోణ
పుష్పంబు లర్పించి భక్తిఁ భవత్పూజగావించి సేవించుమర్త్యాళికిఁ మందిరద్వార
భూమిఁ హయాందోళికావారణస్యందనంబుల్ జగన్మోహనాకారలై చంద్రబిం
బాస్యలై యున్న కాంతామణు ల్సంతతాఖండలాఖండసామ్రాజ్యముల్ చెందునం
త్యంబున ముక్తి సిద్ధించు ధాత్రీజలవ్యోమవాతాగ్నులుఁ సోమసూర్యాదిభాస్వ
ద్గ్రహానీకముల్ దారలుఁ జంగమస్థావరాత్మప్రపంచంబును న్నీవయై యుండు నో
భక్తమందార పూర్వంబునఁ ధారుణీస్యందనంబుఁ జతుర్వేదఘోటంబులుఁ
బద్మజుఁ త్తరయు స్మేరుకోదండము న్విష్ణుకాండంబు శోభిల్లఁగాఁ ద్రిపురావాస
దైతేయులం ద్రుంచి సంవర్తకాలానలాభీల మైనట్టిహాలాహలజ్వాలలఁ మ్రింగి
శార్దూలదైత్యు న్విదారించి లోకంబులం బ్రోచి రక్షించుదేవుండ వీ వెన్నఁగా దీన
చింతామణీ దైవచూడామణీ వేదవేదాంతవేద్యా భవవ్యాధివైద్యా శుకవ్యాసకౌం
డిన్యమాండవ్యశాండిల్యమైత్రేయకణ్వాదియోగీంద్రు లెల్లప్పుడుఁ మిమ్ము హృత్ప
ద్మమధ్యంబుల న్నిల్పి యష్టాంగయోగంబులఁ ధ్యానము ల్సేసి దర్శింపగా నొప్పు
చున్నట్టి శ్రీదక్షిణామూర్తి శ్రీసచ్చిదానందమూర్తి కృపామూర్తి నేనెంతవాఁడ
న్నిముఁ సన్నుతుల్ చేయ విజ్ఞానహీనుండ నన్నుం గటాక్షించి నాతప్పులుఁ సైఁచి
మన్నించు మాపన్నరక్షావిచక్షా జగత్త్రాణదీక్షా లలాటాక్ష కైలాసవాసా
మహోల్లాస తాపత్రయధ్వాంతమిత్రానతోద్యానచైత్రాజితా మిత్ర బ్రహ్మ
స్వరూపా త్రిలోకప్రదీపా నమస్తే నమస్తే నమః. 300

ఉ. నీనుతిచేయ నాతరమె నిర్మలబుద్ధివిహీనుఁడ న్మహా
జ్ఞానుఁడఁ బ్రాకృతుండ నపచారపరుండను దేవ నీ వవా
ఙ్మానసగోచరుండ వసమానుఁడ వాద్యుఁడ వద్వయుండ వా
త్మానుగుణైకరూపుఁడ వనాది వతీంద్రియమూర్తి వెన్నఁగన్. 301

ఆ. నిర్గుణుండ వీవు నిష్కారణుండవు
నిర్వికల్పమతివి నిర్మలుఁడవు
నిగమగోచరుఁడవు నిస్సంశయుండవు
నిన్నుఁ దెలియఁ దరమె నిటలనేత్ర. 302

వ. దేవా నీవు ప్రధానపురుషుండవు సచ్చిదానందవిగ్రహుండవు స్వయంప్రకాశుం
డవు జగత్కారణుండవు జగదంతరాత్మవు ఆదిమధ్యాంతరహితుండవు సత్యజ్ఞాన
మయుండవు సర్వజ్ఞుండవు విశ్వస్వరూపకుండవు విధ్వస్తమోహుండవు క్షేత్రజ్ఞుం
డవు సర్వసాక్షివి నిష్కళుండవు [illegible] లింగి

వర్ణింప నతిమాధవ్యాదయుండ నగునాకు శక్యం బగునే యట్లుగావున నాకుం దోఁచినచందంబునం బ్రార్థించి ప్రణామంబు లాచరించెద విపన్నుండ నైన నన్ను రక్షింపు మని మఱియు ని ట్లనిరెు. 303

క. శాశ్వతరూప పరాత్పర, విశేశ్వర నీలకంఠ వినమేత్సణ వా గీశ్వరనుతపదయుగళా, పశ్వధిపతి దేవ నీకుఁ బ్రణతి రొునర్తుక్. 304

క. అని నుతియించినరాజుం, గనుఁగొని శంభుండు పలికెఁ గారుణ్యమునం జనవల్లభ నీసన్నుతి,కిని మెచ్చితి నిపు పుణ్యకీర్తివి ధరణిక్. 305

చ. తలపఁగ నేను భూసురుఁడఁ దక్సతి పార్వతి వట్టిమాయ పె బ్బులి భవదీయమానసము పొందిక నేర్పడఁ జూడ నీదుతో య్యలి నటు వేఁడితిక్ సవినయత్వము ధైర్యము చిత్ర మయ్యె నీ వలచినకోర్కు లిత్తు ననివార్యబలోజ్జ్వల వేఁడు మిచ్చెదక్. 306

క. అని యానతిచ్చిన శివుం, గని భూవరుఁ డిట్టులనిరొ గౌరీశ్వర మ ద్వనిత యగుకీర్తిమాలిని, కిని నాకును ముక్తి రొునఁగఁ గృపతో ననిరక్. 307

మ. సదయుం డై పరమేశ్వరుం డనిరొ రాజ్యశ్రీసముల్లాసివై పదివేలేండ్లు ధరిత్రి నుండుము భవద్భార్యానమేతుండ వై తుద సాయుజ్యము నిత్తు మీ కనుచు రుద్రుం డన్న వార్షంబున న్మది నుప్పొంగుచు భూవిభుం డనిరొ శుంభద్భక్తిపూర్వంబుగక్. 308

క. వర మడిగెను భద్రాయువు, సరసత మజ్జనకునకును జననికిఁ బద్మా కరునకుఁ దత్పత్నికిఁ ద, ద్వరసుతునకు ముక్తి రొునఁగవలయు నటంచుక్. 309

తే. కీర్తిమాలిని శ్రీశాంబమూర్తిఁ జూచి యనిరొ మాతండ్రి రొునచంద్రాంగదునకు మఱియు మాతల్లి రొునసీమంతినికిని నలఘుకైవల్య మొసఁగు మోయభవ యనుచు. 310

వ. ఇట్లు వేఁడిన. 311

శా. అంతక్ శంకరుఁ డావధూవరులవాక్యంబు ల్పమర్థించి య త్యంతప్రేమఁ దదీయవాంఛితము లుత్సాహంబుతో నిచ్చి సు స్వాంతం బొప్పఁగ నాక్షణంబున సమస్తాదిత్యవర్గంబుతో నంతర్ధానముఁ జెంది శీతగిరిజాతాన్వితుఁడై క్రమ్మఱక్. 312

క. భద్రాయు వంతటను శ్రీ, రుద్రునిచే వరము లంది రుచిరాననుఁడై భద్రగతిఁ బురముఁ జేరెను, భద్రేభతురంగముఖ్యబలములు గొలువక్. 313

వ. ఇ ట్లమ్మహీనాథుండు బ్రహ్మేంద్రాదిదేవతలకుం బడయరానిసాంబశివప్రసాదం బు వడసి పదివేలసంవత్సరంబులు నిష్కంటకంబుగా నిజరాజ్యం బేలుచు దురంగ

మేధాదిమహాక్రతువు లాచరింపుచు బరమేశ్వరసమారాధన లొనర్చుచు నిజభార్య యగుకీర్తిమాలినియుం దాను నభీష్టభోగంబు లనుభవింపుచు వంశకరు లైనపుత్త్రు లం బడసి పరమాహ్లాదంబున సుఖంబున నుండె నంత. 314

సీ. సమయోచితముగ బర్జన్యుండు వర్షించె ఫలియించె ముక్కారు పంటపాలతి
వర్ణాశ్రమాచారవర్తన దప్పక చరియింపుచుండిరి సకలజనులు
ఫలపుష్పకోరకపల్లవాన్వితములై యలరుచు నుండె నుద్యానతరువు
లభివృద్ధిగా నుండె నాలమందలఁ బాలు ప్రజలు సౌభాగ్యసంపన్నులైరి
తే. యీతిబాధలు మాని ధాత్రీతలమున, దేవగృహములు మిక్కిలి తేజరిల్లె
ధర్మపద్ధతి వెలయ భద్రాయు వెలది, నవని పాలింపుచున్నట్టియవసరమున. 315

వ. ఇవ్విధమున బహువర్షంబులు ప్రజాపరిపాలనం బొనరించి యనంతరమున నిజనందనునకుం బట్టము గట్టి సకలమహీరాజ్యభారధురంధరుం గావించి కీర్తిమాలిని సమేతంబుగా వానప్రస్థాశ్రమవిధానంబునకుఁ జని పరమేశ్వరు నుద్దేశించి మహాఘోరతపం బాచరించి దేహంబులు విసర్జించి దివ్యవిమానారూఢులై సిద్ధగంధర్వవిద్యాధరాదులు జయజయశబ్దంబులం బ్రశంసింప శివలోకమునకుం జని సాయుజ్యము నొంది రని చెప్పి సూతుం డమ్మహామునీంద్రుల కిట్లనియె. 316

శా. సౌభాగ్యారోగ్యజయప్రదం బఖిలవిఘ్నాశం బైనభద్రాయుషో
పాఖ్యానంబుఁ బఠింపుమానవులు సౌభాగ్యంబు మీఱంగ జగ
త్ప్రఖ్యాతంబుగ బుత్త్రపౌత్త్రధనదీర్ఘాయుర్యశోవంతులై
ముఖ్యం బైనపదంబుఁ జెందెదరు సమ్మోదానుభావంబునన్. 317

వ. అని చెప్పి. 318

ఆశ్వాసాంతము.

క. అంభోదరగుహాజనక చిదంబరమయ సితకంఠ హరిణాంకధరా
యంబుజనాభ కదంబకుశాంబాపురవాస దురితహరణోల్లాసా. 319

భుజంగప్రయాతము. శ్రియంభూషితార్ధాంగ భీమప్రతాపా
జయ శ్రీసమాయుక్త సత్యస్వరూపా
వియద్వ్యాపిసంసక్త వేణీకలాపా
దయార్ద్రీకృపాపాంగ త్రైలోక్యదీపా. 320

పృథ్వీ. గిరీంద్రవరనందనీకృత వినోదజాతోత్సుకా
విరించిముఖదేవతావినుతపాదపంకేరుహా
చరాచరజగత్పతే శమనగర్వనిర్వాపకా
పరాత్పర మహేశ్వరా ప్రమథనాథ గంగాధరా 321

గద్యము. ఇది శ్రీరామభద్రకరుణాకటాక్షవీక్షణసమాలబ్ధ గీర్వాణాంధ్రభాషా కవిత్వకళాధురంధర బడగలనాటి కన్నడవంశపయఃపారావార రాకాసుధాకర ఆశ్వలాయనసూత్ర భారద్వాజసగోత్ర శ్రీధరమల్లెఅయ్యవార్యతనయ సూరిజనవిధేయ వేంకటరామనామధేయప్రణీతం బైన బ్రహ్మోత్తరఖండం బనుమహాపురాణమునందు మందరోపాఖ్యానమును వజ్రబాహుచరిత్రమును భద్రాయువునుత్పత్తియు వజ్రబాహుండు నిజపుత్త్రకళత్త్రంబుల దేశము వెడల నడచుటయు మహారణ్యాగమనమును వైశ్యనగరప్రవేశమును నందు విషవ్రణబాధితుం డై విగతజీవుం డైనబాలకుని ఋషభుం డనుశివయోగీంద్రుండు వచ్చి క్రమ్మఱ సంజీవితుం జేయుటయు బునరాగతుండై ఋషభుండు సన్మార్గం బుపదేశించి శైవవర్మంబు మొదలుగా ద్వాదశనాగసహస్రబలంబును దివ్యంబు లయినఖడ్గశంఖంబు లొసంగుటయు మాగధులతోడియుద్ధంబును బరాజితుం డయిననిజజనకు బంధమోక్షణం గావించి హేమరథు మరల బద్ధునిం జేయుటయు భద్రాయువివాహంబును మగధపతి బంధవిమోచనంబును దద్రాజ్యాభిషేకమును వనవిహారమును గ్రత్రిమదంపతీకథనమును బరమేశ్వరుండు ప్రసన్నుం డగుటయు ననుకథలం గల చతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము.

---



శ్రీలక్ష్మీరమణార్చిత<br>
బాలేందువతంస భక్తపంకజహంసా<br>
నీలగ్రీవాంబాపుర<br>
హేలా వనవాస పార్థివేశ గిరీశా. 1

వ. దేవా యవధరింపు మశేషపురాణకథాకథనదక్షుం డయిన సూతుం డమ్మహామునుల నవలోకించి వెండియు నిట్లనియె. 2

## విభూతిమహాత్మ్యము - వామదేవోపాఖ్యానము.

ఉ. ఓమునులార యీబుధవరయోగిమహాత్మ్యము వింటి రింక స<br>
ద్ధామతపోబలాఢ్యుఁడు సదాశివతుల్యుఁడు వామదేవుఁ డా<br>
శ్రీమహితప్రభావునిచరిత్రము భస్మమహాత్మ్యసంపద<br>
త్త్రేమదలిర్పఁ జెప్పెద నభీప్సితరీతి వినుండు మీ రిఁకన్. 3

మ. కలఁ డత్యుగ్రమహాతపోధనుఁడు నిష్కాముండు నిర్ద్వంద్వుఁడుం<br>
గలుషారణ్యదవానలుండు నిరహంకారుండు ధీరుండు ని<br>
ర్మలచిత్తుం డనపేక్షితాలయకళత్రాపత్యుఁ డైనట్టియు<br>
జ్జ్వలతేజోనిధి వామదేవుఁ డనువిప్రశ్రేష్ఠుఁ డుర్వీస్థలిన్. 4

చ. మఱియు నతండు శాంతరసమగ్నుఁడు భస్మవిలేపితాంగుఁడున్<br>
సురుచిరవల్కలాంబరుఁడు శుద్ధపిశంగజటాకలాపుఁడుం<br>
బరశివతత్త్వవేదియును ద్వైతపరిగ్రహవిహీనుండు నై<br>
ధరఁ జరియించుచుండ జగదాదరణోత్సుకమానసంబునన్. 5

వ. ఇట్లు భూతలం బెల్లఁ గలయం గ్రుమ్మఱుచుండి యొక్కనాఁడు. 6

క. అంచితగతి నమ్ముని శివ, పంచాక్షరజపవిశుద్ధభావుం డగుచున్<br>
గ్రౌంచారణ్యపథంబున, సంచారము సేయుచున్న సమయమునందున్. 7

## వామదేవభక్షణాసక్తిచే బ్రహ్మరాక్షసుండు చనుదెంచుట.

తే. అద్భుతాకారుఁ డధికక్షుధాతురుండు, రూక్షకేశుండు నతిఘోరవీక్షణుండు
వాయుజవమున జనుదెంచె వామదేవు, భక్షణాపేక్ష నొకబ్రహ్మరాక్షసుండు. 8

క. అత్తఱి నరణ్యాగ్నీంద్రుఁడు, వ్యాత్తాననుదీర్ఘకాయు నత్యుగ్రుఁడగు
న్మత్తుని రక్కసుఁ గనుఁగొని, చిత్తంబున భయలవంబుఁ జెందకయుండెన్. 9

తే. అట్లు నిర్భయుఁడై యున్న యమ్మహాత్ము, మ్రింగుదు నటంచు వేవేగ మీఁదికురికి
బాహువులు సాచి బిగఁబట్టెఁ బాపబుద్ధి, సాక్షణంబున నా బ్రహ్మరాక్షసుండు.

సీ. పరుఁగు చింతామణిస్పర్శంబుచే లోహ మతిశుద్ధకాంచనం బైనపగిది
మానససరసీనిమగ్నమై కాకంబు మానుగా రాయంచ యైనరీతి
నమృతపానము జేసినట్టిమనుష్యుండు చెలఁగి దేవత్వంబుఁ జెందినట్లు
లలితజంబూనదీజల మంటి మృత్తిక మానితసౌవర్ణ మైనకరణి
తే. నమ్మహాత్మునిదివ్యదేహమ్ము సోఁకి, నంతమాత్రన రక్కసుం డక్కజముగ
దురితబంధంబు లన్నియు దొలఁగఁద్రోచి, నిర్మలజ్ఞానహృదయుఁడై నిలిచెనపుడు.

## వామదేవమహామునియొక్క దేహస్పర్శనముచే బ్రహ్మరాక్షసుండు తనరాక్షస భావము వదలి పూర్వజన్మజ్ఞానముచే స్తుతియించుట.

ఉ. తాపసగాత్రలగ్నభసితాంకితనైజశరీరతాస్థితిం
బాపపురక్కసుండు జడభావము వీడి భవాంతరస్మృతి
ప్రాపణకేవలీబలవిరాజితుఁడై మునినాథుభాసుర
శ్రీపదపద్మముల్ దనదుశీర్షము సోఁకఁగ మ్రొక్కి యిట్లనెన్. 12

శా. సర్వప్రాణిభయంకరాకృతి నజప్రత్యుప్తపాపార్తుఁడన్
గర్వాంధుండను బ్రహ్మరాక్షసుఁడ దుర్గారణ్యసంచారుఁడన్
దుర్వాసాఘువినిందితాంగుఁడ మహాదుష్కర్మశీలుండ నో
యుర్వీదేవకులావతంస నను ధన్యుం జేసి రక్షింపవే. 13

క. కరుణింపుము మునినాయక, కరుణింపు మహానుభావ గాంభీర్యనిధీ
దురితాబ్ధినిమగ్నుని నను, దరియింపఁగఁ జేయవలయుఁ దథ్యము గాఁగన్. 14

వ. మహాత్మా భవదీయసందర్శనంబునం జేసి మదీయచిత్తము పరిపూర్ణప్రబోధాయత్తం
బై యున్నయది నన్నుద్ధరింపవలయు నని ప్రార్థింపుచున్న యా బ్రహ్మరాక్షసు
నకు వామదేవమహామునీంద్రుం డిట్లనియె. 15

క. ఏ వెవఁడవు ఘోరాకృతి, నీవనమున సంచరింప నేటికిఁ దెలియ
నీవృత్తాంతం బంతయు, భావించి సవిస్తరముగఁ బల్కు మటన్నన్. 16

సీ. ఆబ్రహ్మరాక్షసుం డనిరొ నమ్మునితోడఁ బొలుపొంద విను మేను పూర్వమునను
బంచవింశతి యైనభవమున యావనరాష్ట్రమేలుచు నుందు రాజసమున
జండకార్యుఁడ యథేచ్ఛావిహారుండను గారుణ్యహీనుండఁ గలుషరతుఁడ
దుర్జయుం డనువాఁడ దుష్పార్థివుండను దుర్మదాంధుండను దుర్గుణుండ
తే. నగుచు నాతనసతుల నిత్యంబు దెచ్చి, ప్రతిదినంబున నొక్కొక్కపడఁతిసౌఖ్య
మనుభవింపుచు నంత గృహంబునందు, వారి నరికట్టియుండుదు ధీరవర్య. 17

మ. ద్విజరాజన్యపుళిందవాణిసతుల న్విటచ్ఛద్రకన్యావళి
రజకాభీరకవారకాంతలసమాప్రంబు ల్వడి న్దెచ్చి భా
వజకేళిం జరియింతు రేయిఁబవలు న్స్వాంఛాసమాయత్తత
న్నిజచిత్తంబున దృప్తిఁ బొంద దెపుడు న్నిక్కంబు విప్రోత్తమా. 18

క. ఈరీతిని వర్తింపఁగ, దారుణకామానలాభితప్తుఁడ నగుటన్
ఘోరము లగురోగముల శరీరము శోషింపఁ దొడఁగ దృఢమాంద్యంబై. 19

ఉ. అంతట శత్రుపీడితుఁడ నై యనపత్యుఁడ నై దురామయా
క్రాంతుఁడ నై విముక్తబలగర్వుఁడ నై నిజబంధుమిత్రసా
మంతవివర్జితుండ నయి కుత్సితకర్మఫలానుభూతికా
లాంతముఁ బొంది ఘోరనిరయంబును జెందితిఁ బుణ్యహీనతన్. 20

క. మునివరదుష్కృతకలుషంబునఁ జేసి మదీయపూర్వపురుషులు స్వర్ణం
బుననుండి వచ్చి నరకంబున వసియించిరి సమస్తపుణ్యచ్యుతులై. 21

వ. వెండియుఁ గృతాంతకింకరులు నన్నుం గొనిపోయి శతకుండీనరకంబునఁ బడఁద్రో
చిన నందుఁ బదివేలసంవత్సరంబులు శతసహనంబు గావింపుచు గింకరబాధితుండ
నై యుండి యనంతరంబునఁ బాపావశేషంబున గ్రమ్మఱ నిర్జనం బైనవనంబున
బిశాచత్వంబున నుండి నిరంతరంబు క్షుత్తృష్ణాసమాకులుండ నై దివ్యవర్షశతంబు
లుండి యనంతరంబ ద్వితీయభవంబున సకలప్రాణిభయంకరం బైనవ్యాఘ్రంబ నై
జనియించితి మఱియుఁ గ్రమంబునఁ దృతీయభవంబున ఘోరం బైనయజగరంబునఁ
జతుర్థభవంబున వృకంబును బంచమభవంబున విడ్వారాహంబును షష్ఠభవంబున
గృకలాసంబును సప్తమంబున సారమేయంబును నష్టమజన్మంబున సృగాలంబును
నవమజన్మంబున మృగంబును నేకాదశంబునఁ గర్కటకంబును ద్వాదశంబున
శశకంబును త్రయోదశంబున నకులంబును జతుర్దశమున వాయసమును బంచదశ
జన్మంబున భల్లూకంబును షోడశజన్మంబున [illegible] సప్తదశజన్మంబున

గార్దభమ్మును సప్తాదశజన్మంబున మార్జాలమ్మును నేకోనవింశతిభవంబున మత్స్యంబును ద్వావింశతిభవంబున మూషకమును త్రయోవింశతిభవమున నులూకమును చతుర్వింశతిభవమున గజమును బంచవింశతిజన్మమున నిప్పనమున బ్రహ్మరాక్షసుండ నై జన్మించి క్షుధార్తుండ నై యుండి మిమ్మం గాంచి భక్షణాసక్తతం బఱ తెంచి భవదీయదేహస్పర్శనమాత్రంబున సంప్రాప్తపూర్వజన్మజ్ఞానుండ నై నిర్మలహృదయుండ నైతి నట్లుగావున భవత్ప్రభావంబు దెలియం బలుకవలయు శరణాగతుం డగు న న్నుద్ధరింపు మని వినయవినమితశిరస్కుం డై ప్రార్థింపు చున్న యాబ్రహ్మరాక్షసునకు రాజేంద్రుం డి ట్లనియె. 22

వామదేవుండు బ్రహ్మరాక్షసునకు భస్మప్రభావంబు దెలుపుట.

క. భసితత్రిపుండ్రరేఖా, లసితాచ్ఛమదీయగాత్రలగ్నాంగుఁడ వై
యసురత్వభావదూరుఁడ, వసమానజ్ఞాని వైతి వద్భుతరీతిన్. 23

క. విస్మయము లొదవ రోగా, పస్మారచయంబు లడఁచు పావనకరమౌ
భస్మము దాని ప్రభావం, బాస్మరహరునకును దక్క నలవిరె తెలియన్. 24

సీ. విను పూర్వమునను ద్రావిడదేశవాసుండు వసుధామరుండు భవాద్యుఁ డొకఁడు
గలఁ డొక్కరుండు సత్కర్మపరిత్యాగి చార్వాకవర్తనుఁ డనాచారపరుఁడు
శూద్రాంగనామణీసురతకేళిఁ జరింప నారాత్రి యొకనాఁ డరుగుదెంచి
యాయుధప్రహతిచే నావిప్రు వధియించి యూరికి వెలుపలఁ బారవైచె
తే. నంత నవ్విప్రశవమూపై నచట నొక్క, సారమేయంబు వచ్చి భస్మానులిప్త
పాదములఁ ద్రొక్కి చరియించెఁ బలలరక్త, ఖాదనాపేక్షమదికి నాహ్లాదమొదవ.

ఉ. ఆసమయంబునందు నరకాలయమందు వసించియున్న యా
భూసురుఁ బట్టి క్రమ్మఱను బుష్పక మెక్కఁగఁజేసి బల్మిచే
నాసమవర్తికింకరుల నందఱ నోడి మహేశుదూత లు
ల్లాసముతోడఁ బోవఁగని లజ్జితులై రవిసూనుఁ డి ట్లనున్. 26

మ. కులవిభ్రష్టుఁ డసత్యవాది జడుఁడున్ ఘోరుండు మూఢుండు చం
చలచిత్తుండు వివేకహీనుఁడు దురాచారుండు నైనట్టియీ
ఖలునిం దివ్యవిమానమధ్యగతునిం గావించు టర్హంబె ని
ర్మలకైవల్యపదంబుఁ జేర్చుదురె దుర్మార్గుండు వీఁ డారయన్. 27

వ. అని పలికినశమనునిం గాంచి యాశంకరకింకరు లి ట్లనిరి. 28

చ. కనుఁగొను మీద్విజన్మశవకాయమునందు లలాటవక్షము
ల్భుజపదఁ గంఠదేశములు భస్మవిలిప్తము లయ్యె నావున

న్మనసిజవైరిశాసనమునం గొనిపోరొద రౌకృతాంత నీ
మనమున సంకలింపకుము మాన్యులు గారె త్రిపుండ్రధారణుల్. 29

ఆ. అనుచుఁ దెలియఁ బలికి యామ్యభటులు, తమను వీడుకొనుచు సకలజనులుఁ
జూచుచుండ భూమిసురు చేర్చి రప్పుడు, ప్రాకటంపుఁబుణ్యలోకమునకు. 30

వ. అట్లుగాన సమస్తపాపక్షయంబును మహేశ్వరవిభూషణంబును నైన భస్మంబు నిరంతరంబు నాచేత ధరియింపంబడుచుండు ననిన విని యా బ్రహ్మరాక్షసుండు క్రమ్మఱ భస్మప్రభావశ్రవణకుతూహలుం డై యమ్మునీంద్రున కి ట్లనియె. 31

క. మునినాథ భవద్దర్శన, మున ధన్యుఁడ నగుచు నఘవిముక్తుఁడ నయితిన్
దనరుచు జన్మాంతరకృత, ఘనతరసుకృతప్రభావకారణమహిమన్. 32

మ. అలఘుప్రాభవపూర్వజన్మమున సస్యారామవాటీలస
త్పలితక్షేత్ర మొసంగితిన్ యవనభూపాలుండనై యొక్కని
శ్చలచిత్తుం డగుబ్రాహ్మణోత్తమునకున్ సంప్రీతితోఁ గావునన్
గలుషవ్రాతము లెల్ల వీడెను భవత్కారుణ్యలేశంబునన్. 33

క. ఇరువదిరెం డగుభవమున, సురుతరతేజుఁ డగునొక్కయోగీంద్రకృపన్
దురితంబులఁ బాయుదు వని, తరణిసుతుం డానతిచ్చెఁ దథ్యముగాఁగన్. 34

తే. అట్లు గావున నిర్జనం బైనవనము, నందుఁ ద్వత్సంగతి ఘటించె నద్భుతముగ
నింక భస్మంబు ధరియించిరేని దురిత, కర్మములఁ బాయువాఁడ నిక్కముమహాత్మ. 35

సీ. ఈభస్మధారణం బేరీతి నొసరింతు రెయ్యదితన్మంత్ర మెద్ది ఫలము
నెయ్యదిదేశంబు ఎయ్యదికాలంబు ఎయ్యదివిధిఁ దీని నెఱుఁగఁ బలుక
గాఁ దగు మీవంటిఘనులు మహాత్ములు పుణ్యవంతులు సర్వభూతహితులు
సదమలచిత్తులు సతతంబుఁ గల్పవృక్షముకైవడిఁ బరోపకారపరులు

తే. గాన దుర్జన్మసహితు విజ్ఞానహీను, పాపనిబిడాంధకారకూపప్రవిష్టు
నుగ్రకాయునిఁ బతితు న న్నుద్ధరింపు, భస్మదానం బొసంగి తాపసవరేణ్య. 36

వామదేవమహాముని పాపవిముక్తుఁ డగు బ్రహ్మరాక్షసునకు
నితిహాసరూపంబున భస్మధారణవిక్రమం బెఱింగించుట.

వ. అని బహుప్రకారంబులఁ బ్రార్థింపుచున్న యా బ్రహ్మరాక్షసునకు విభూతిమహాత్త్యంబు సవిస్తరంబుగా నితిహాసరూపమునం జెప్పెద నాకర్ణింపు మని వామదేవమునీంద్రుం డిట్లని చెప్పందొడంగె. 37

క. పూర్వమున మందరాహ్వయ, పర్వతవరశిఖరమునకుఁ బ్రముఖులు గోలన్
నిర్వాణఫలప్రదుఁ డగు, శర్వుం జేరంగ నొక్క ... ముల సంయమిన్. 38

మ. గరుడాభాస్వరసిద్ధచారణమరుద్గంధర్వవిద్యాధరు
ల్సురయక్షోరగసాధ్యరుద్రవసురక్షోభూతవిశ్వాశ్విను
ల్హరివైశ్వానరముఖ్యదిక్పతులు సేవార్థంబు గౌరీమనో
హరుసాన్నిధ్యముఁ జేరవచ్చిరి విమానారూఢులై యందఱున్. 39

వ. మఱియును సనకసనందనాదిబ్రహ్మర్షులును నారదాగస్త్యమార్కండేయజాబాలి
ప్రముఖానేకదేవర్షులును దక్షాదిప్రజాపతులును నూర్వశీపురోగమాప్సరోగణమ్ము
లును జండికాదిమాతృకాగణములును నందిమహాకాళాదిశంకరకింకరులును శంఖ
కర్ణ ఘంటాకర్ణ వీరభద్ర కుంభోదర కృశోదర మహోదర కర్ణధామాది భూతనా
థులును రక్తనీలపాండువర్ణులును ధూమ్రధూసర కర్బురపాలాశవర్ణులును వ్యా
ఘ్రసూకర భల్లూక దంతావళ సారమేయ సృగాల మర్కట లూత సింహశరభ
భేరుండగృధ్రముఖులును ఏకవక్త్ర ద్వివక్త్ర బహువక్త్రనిర్వక్త్రులును ఏకహస్త
ద్విహస్త చతుర్హస్త బహుహస్తులును ఏకనేత్ర చతుర్నేత్ర బహునేత్రులును
దీర్ఘ వామనదేహులు నయినభూతగణంబులు పరివేష్టింప సింహాసనాసీనుం డయి
యున్న సమయమ్మున సనత్కుమారుం డనుమహామునీంద్రుం డరుగుదెంచి సూర్య
కోటిసమప్రభుండును పిశంగజటాపటలశోభితుండును నాలోలఫాలనయనుండును
ఖండేందుశేఖరుండును నీలగ్రీవుండును నాగేంద్రభూషణుండును వ్యాఘ్రచర్మ
ధారణుండును ఘంటాదర్పణమండితుండును ఖట్వాంగపాశాంకుశత్రిశూలధార
ణుండును నప్రధృష్యుండును ననిర్దేశ్యుండును గాలాగ్నిరుద్రుండును నయినపర
మేశ్వరునకు నమస్కరించి బహువిధములఁ బ్రశంసింపుచుఁ గృతాంజలిబద్ధుండును
వినయవినమితశిరస్కుండును నై యమ్మహాదేవువలన సకలధర్మంబులు ప్రశ్నోత్తరం
బులవలన నాకర్ణింపుచుండి వెండియు నమ్మహామునీంద్రుం డిట్లని విన్నవించె. 40

సీ. సర్వజ్ఞ పరమాత్మ సర్వలోకశరణ్య సుఖరూప విను భవన్ముఖమువలన
నపవర్గహేతువు లైనధర్మంబులు వింటి నన్నియును సవిస్తరముగ
నేధర్మమార్గంబు లెంచి చూచినను బహ్వాయాసజనకంబు లగుచు నుండు
నటుగాన నేధర్మ మప్రయాసకరంబు నఘనాశనంబు మహాఫలంబు
తే. నాగమోక్తంబు ముక్తిదం బగుచు నుండు
నట్టిధర్మంబుఁ దెలియ నా కానతిమ్ము
భక్తవత్సల యనినఁ గృపాళుఁ డగుచు
నిందుశేఖరుఁ డమ్మౌని కిట్టు లనియె. 41

తే. ధర్మములలోన సుత్తమధర్మ మగుచు, వ్రతములం దెల్ల నంచితవ్రతము నగుచు
సకలజంతురహస్యమై యలరుచుండు, దాపసేంద్ర త్రిపుండ్రసంధారణంబు. 42

## సాంబమూర్తి సనత్కుమారునకు భస్మప్రభావం బెఱింగించుట.

ఉ. అని విని మౌని యిట్లనిరో నాజగదీశ్వరతోఁ, త్రిపుండ్రసా
ధనమున కెద్ది ద్రవ్య మధిదైవము లెవ్వరు దత్ప్రమాణముల్
ఘనతరశక్తి యెద్ది ఫలకంబున నన్నియు లోకరక్షణం
బునకు వచింపఁగావలయు భూతగణేశ కృపాపయోనిధీ. 43

క. అని యడిగిన మునిపతి కి, ట్లనియెన్ శంకరుఁడు రౌద్ర మన నాగ్నేయం
బనఁగఁ జను దగ్ధగోమయ, మనిశము నది ధారణార్హ మగువిప్రులకున్. 44

ఆ. నాల్గువర్ణములును నాలుగాశ్రమముల, వెలయునట్టిమనుజవితతి కెపుడు
భస్మధారణమునఁ బాతకం బగునుప, పాతకమ్ము లెల్ల భస్మ మగును. 45

సీ. వర్ణనీయం బకారవర్ణత్రయంబును వహ్నిత్రయంబు తత్త్వత్రయంబు
సవనత్రయంబును శక్తిత్రయంబును వేదత్రయంబును విమలమైన
సత్త్వాదిగుణము లీశానుండును త్రిపుండ్రకాధిదైవతములై యలరుచుండు
నేవేల్పులకు మ్రొక్కి యెలమి ననామికామధ్యమాంగుష్ఠాగ్రమానితముగ

ఆ. బ్రహ్మమయము లైన పంచమంత్రంబుల, మఱి త్రియంబకాదిమంత్రములను
మంత్రితముగఁ జేసి మహితఫాలంబున, దగ్ధగోమయంబుఁ దాల్పవలయు. 46

క. జలసమ్మిశ్రితభస్మము, నలవడ ఫాలమున నురమునందు భుజముల
న్వెలయఁగఁ బూసిన నరులకుఁ, గలిమియు బలిమియునుఁ గల్గు గలకాలంబున్. 47

ఆ. మనుజు లెవ్వరేని మంత్రంబుఁ దెలియక, భూతిరేఖ నుదుటఁ బూసిరేని
వారలయిన దురితవర్జితులై పరిశుద్ధు లగుచు నుందు రిద్ధచరిత. 48

సీ. పరసతీగమనంబు పరధనాపేక్షయుఁ బరవృత్తిహారణంబు పరధనంబు
కూటసాక్షిత్వంబు కుత్సితభావంబు పైశున్యమును సురాపానరతియు
నీచసంసేవయు నీచప్రతిగ్రహ మారణ్యదాహంబు ననృతభాష
కన్యారజస్వలాగణికాదికామినీసంగమంబును దివాసంగమంబు

తే. వేదవిక్రయమన్నాదివిక్రయంబు, వాదిగాఁ గల్గు కలుషంబు లణఁగిపోవుఁ
దక్షణంబున భస్మసంధారణమున, భవ్యగుణగణ్యదివ్యతాపసవరేణ్య. 49

క. శివభక్తులనిందనమును, శివధనహరణంబు మఱియు శివహేళనముల్
భువి నొనరించిన నరులకుఁ, బ్రవిమలనిష్కృతులు లేనిపాపము లౌదవుర. 50

క. ఏజాతివారలైనను, భూజనములు నుదుట భూతిఁ బూసినమాత్రం
దేజమున సర్వమానవ, పూజితులై శివపదంబుఁ బొందుదు రనఘా. 51

వ. మఱియును మహేశ్వర [illegible] బ్రహ్మలోక

మానసు కలత్రయకల్మషాలు విష్ణులోకంబునను వసియించి తదనంతరమునఁ బున
రావృత్తిరహితం బయినపరమేశ్వరలోకంబునందు ధ్రువంబుగా నుందురు మునీం
ద్రా! సర్వభూతరహస్యం బైనత్రిపుండ్రమాహాత్మ్యంబు నీకుం దెలియ బలికితి
నీయర్థంబు నీచేతఁ బ్రయత్నంబుగా గోపనీయంబు గావలయు నని నిర్దేశించి యప్ప
రమేశ్వరుం డంతర్ధానంబు నొందు నంత సనత్కుమారుండు బ్రహ్మలోకమునకుం
జనియె నని చెప్పి శ్రమ్మణ యోగీంద్రుండు బ్రహ్మరాక్షసున కిట్లనియె. 52

తే. దివ్యఫలదాయి మానుక దేహలిప్త, భస్మసంపర్కమున నీకు భద్రమైన
తెలివిచెందెనుగాన నిర్మలమతిను, సారభసితంబుఁ దాల్చు విజ్ఞాన మొదవు. 53

వ. అని పలికె. 54

చ. అగణితసత్కృపాకలితుఁ డై మునినాథుఁడు శైవమంత్రితం
బుగ నొనరించి ఫాలమున భూతివిలేపన మాచరించినన్
విగళితపుణ్యు డైనయపవిత్రజగద్భయదాత్మ దేహమున్
దగడుచు బ్రహ్మరాక్షసుఁడు దివ్యశరీరముఁ దాల్చె నంతటన్. 55

చ. గురుచరణారవిందములకుం బ్రణమిల్లి తదాజ్ఞఁ గాంచి దా
నరుణనిభప్రభాకలితుఁ డై మణిదీప్తవిమానయానుఁ డై
హరుపదముం భజించెఁ దగ నాదరణీయుఁడు వామదేవుఁడున్
ధరణిఁ జరింపఁగా నరిగె ధన్యతనార్తజనాళిఁ బ్రోవఁగన్. 56

క. ఈకథ విన్నమహాత్ములు, ప్రాకటముగఁ జదివినట్టి భక్తాత్ములు దా
రాకల్పంబుగ నుందురు, శ్రీకంఠపురంబునందుఁ జిరతరభక్తిన్. 57

తే. పుస్తకమునందు భువనప్రశస్త మైన, భస్మమహిమంబు వ్రాసి సద్భక్తి నభవు
భక్తకోటుల కొసఁగినపాత్రులకును, బాపములు వాయు హరుకృప భాగ్య మొదవు

చ. శివచరణారవిందములు చిత్తమునన్ భజియింపుచుండుఁడీ
భువనగణేశునిం దలఁచి భూతిలలాటమునన్ ధరింపుఁడీ
సవనవిరోధికీర్తనము సమ్మతిఁ జేయుఁడు సార్వకాలముం
దివిజమునీంద్రులార జనిస్తనదుగ్ధము లాన రన్నఁడున్. 59

వ. అని చెప్పినవిని యమ్మహామునీంద్రులు ప్రహృష్టాంతరంగు లై శ్రమ్మణ మాతున
కిట్లనిరి. 60

ఉ. శ్రీగిరిజాధినాథపదసేవనసక్తమనోవిచక్షణ
శ్రీగురువర్యవాక్సరణిచే నుపదేశముఁ గాంచువారికిన్
బాగుగ ముక్తిగల్గు నని పల్కితి కేవలదేశికోక్తిచే
నేగతి నిష్టసిద్ధి యగు నీకథఁ దెల్పుము మాకు నేర్పడన్. 61

వ. అని యడిగిన సూతుం డి ట్లనియె. 62

## సూతుండు శౌనకాదిఋషులకు భక్తిశ్రద్ధాస్వరూపంబుల నితిహాసరూపంబుగా నెఱింగించుట.

క. శ్రద్ధయె లోకహితం బగు, శ్రద్ధయె నిజజననిపగిది సౌఖ్యము లొసఁగున్
శ్రద్ధాపరుల నభీష్టసమృద్ధులుగాఁ జేయుచుండు కల్లసుపర్వుల్. 63

శా. శ్రద్ధాభక్తిసమేతులై విబుధులన్ సంప్రీతిఁ బూజించిన
న్సిద్ధించు న్నిజకామితార్థములు నిశ్శ్రేయసపదప్రాప్తియున్
శ్రద్ధాహీనులపూజ వంధ్యతరుపుష్పప్రాయమై యిష్టసం
సిద్ధిం జేయదు సర్వమానవులకు న్సిద్ధంబు ధాత్రీస్థలిన్. 64

ఆ. ఓమహాత్ములార యుపదేశమునకన్న, శ్రద్ధ గలిగి యునికి సిద్ధి దనరు
నిష్టవార్థమునకు నితిహాస మొక్కటి, విన్నవింతు వినుఁడు వీను లలర. 65

క. ప్రాంచద్విప్రుల సరస్వతీకాంచీస్థలి వెలయునట్టి ఘనతరబహుమ
ట్పంచాళద్విషయములను, బాంచాల మనంగ నొక్కపట్టణ మలరున్. 66

మ. అనిశం బప్పురమేలు ఖండితసమస్తారాతిసంఘాతుఁడై
మనుమత్కీర్తుఁడు విక్రమస్ఫురణమాన్యాభ్యున్నతిస్ఫారతా
శనరాట్కేతుఁడు సత్కృపారసమునన్ సర్వారికేతుండు భూ
జనవిఖ్యాతుఁడు సింహకేతుఁ డనురాజశ్రేష్ఠుఁ డుద్యన్మతిన్. 67

ఉ. సారబలాఢ్యుఁ డానృపతిచంద్రునకుం బ్రభవించె వైరిసం
హారుఁడు దుర్జయుం డనుకుమారుఁడు శౌర్యకుమారుఁ డర్థిమం
దారుఁడు శైలజాధిపపదాబ్జవిచారుఁడు సింధురాజగం
భీరుఁడు మేరుధీరుఁ డరవిందశరోపమసుందరాంగుఁడై. 68

వ. అంత. 69

క. జననాథనందనుం డొక, దినమున మృగయాభికాంక్ష దీపింప ధను
స్సునిశితబాణధరుం డై, చనియెం గాంతారమునకు శబరులఁ గొలువన్. 70

వ. ఇవ్విధంబున నమ్మహారణ్యమునం బ్రవేశించి యచ్చటం బరతెంచువేదండగండక పుండరీకభల్లూకవరాహమహిషాదిదుష్టమృగముల విదళింపుచు విహరింపుచున్న సమయమునఁ దద్భటుం డయినయొక్కశబరుండు చండకుం డనువాఁడు మృగాన్వేషణపరుండై వనమునం దిరుగుచు నొక్కయెడ జీర్ణం బైనదేవాలయమునందు స్ఫుటితం బయినలింగము గావించి దైవనియోగమున దానిం గొనివచ్చి యారాజనందనునకుం జూపి యిమ్మహాలింగమున కేను బూజనం బొనరించెద దీనిం బూజించు

విధానం బెట్టిది సవిస్తరముగా నానతీయవలయు నని ప్రార్థించినళ బరుసకుం బరిహాస
ముగా నారాజకుమారుం డి ట్లనిరొ. 71

## చండకుం డనుశబరోపాఖ్యానము.

సీ. ఇష్టమాలింగంబు నెమ్మితోం బూజించుక్రమ మెఱింగింతు సాంగంబుగాంగ
వినుము మీవు సంకల్పవిధిపూర్వకంబుగా నవవారి నభిషేచనం బొనర్చి
యొప్పుగాం బీతమం దునిచి యాపిమ్మట నతిశుభ్రపుష్పగంధాక్షతముల
నర్చించి ధూపదీపాదికంబు లొసంగి నెమ్మదిలోన ధ్యానమ్ముచేసి
తే. మొదల జితిభస్మ ముపహారముగ నొనర్చి, యంత నాత్మోపయుక్తాన్న మాదరమున
మరల నైవేద్య మొనరించి మంత్రపుష్ప, వందనాదులు గావింపవలయు నెపుడు.
క. క్రమ్మఱ బూజించి ప్రసాదమ్ము ధరింపం దగుసంతతమును జితాభ
స్మమ్ము నివేదించిన శి, వుమ్మాన సంతుష్టిం జెందు గంగాధరుండుకా. 73
క. అని యుపదేశించిన విని, జననాథకుమారుపలుకు సత్యం బనుచున్
దనలోం నెంచుచు దృఢమతిం, జనియొం శబరుండు దనదు సదనంబునకున్. 74
చ. నిరుపమభక్తి నాత్మతరుణీసహితంబుగ శివ్వారార్చనా
పరత వహించి యంతం జితి భస్మనివేదన మాచరించి క్ర
మ్మఱ నిజభోగవస్తుచయ మంత యొసంగుచుం దత్ప్రసాదమున్
శిరమునం దాల్చి పిమ్మట భుజించు నతండు మనంబు రంజిలన్. 75
వ. ఇట్లు శబరీసమేతముగా శబరుం డమ్మహేశ్వరలింగమునకు దృఢభక్తిపరుం డై
నిరంతరము పూజనం బాచరింపుచున్నంత గొన్నిదినంబులకు జితాభస్మరహితం బైన
పాత్రము నిరీక్షించి తత్సంగ్రహణార్థముగా నలుదెసలం బరికించి యెందును
గానక మఱలి నిజనివాసమునకు వచ్చి విషణ్ణచిత్తమున మానక్రుం డై యున్న నిజ
వల్లభుం గాంచి తత్కుటుంబిని యి ట్లనియె. 76
క. ఏ పేటికి చింతించెదు, శైవసమర్చనము లేల సమకూర్పవు నీ
భావముం దెలియం బలుకుము, నా విని యాశబరుం డనియె నతివసుం డై. 77
తే. అతివ వినుము మీదినంబున నీశ్వరోప, హారమునకుం జితాభస్మ మబ్బదయ్యె
శైవపూజాంతరాయంబు సంభవించె, గాన నిం కేమి యొనరింతుం గమలవదన. 78
క. గురువాక్యోల్లంఘనమున, దురితంబులు వొందుగాన దొయ్యలి వినుమా
పరమేశ్వరుం బూజింపక, తిరముగ భుజియింప నొల్ల దృఢమతి నెపుడున్. 79
వ. అని ఇవ్విధమున నుడివిన ప్రాణవల్లభునకు దత్కళత్రం బి ట్లనియె. 80

సీ. ప్రాణేశ దీనికై పరితాపమేటికి నిపు డొక్క సదుపాయ మేనుగంటి
బహుదారుమయనిజగృహదాహ మొనరించి తనమేను వైచి దగ్ధంబుఁ జేసి
దద్భస్మమున నివేదన మాచరింపుము పరమేశ్వరునకు సాదరత మెఱయ
నని విన్నవించిన దనపత్ని వీక్షించి శబరుఁడు పలికె విస్మయమునొంది
తే. సరసధర్మార్థకామమోక్షముల కెపుడు, సాధనంబు సుఖార్ణవంబు సకలభోగ
భాజనము సదయావనం బైనతనువు, నెట్లువిడిచెదు సంతానహీన వగుచు. 81

వ. అని పలికిన శబరునిఁ జూచి శబరి యిట్లనియె. 82

క. పరజనులకుఁ దా నిచ్చిన, శరీరమున సుకృత మొదవు సాక్షాజ్జగదీ
శ్వరున కొసంగిన తనువుల, వరపుణ్యం బెన్నదరమె వాక్పతికైనన్. 83

ఉ. పూర్వభవాంతరంబులను బుణ్యము లెన్ని యొనర్చియుంటినో
పర్వతకందరస్థలిఁ దపంబుల నే క్రియ సల్పియుంటినో
సర్వసరిజ్జలంబుల భృశంబుగ మజ్జన మాడియుంటినో
శర్వసమర్పణంబునకు సారనిజాంగ మొసంగఁ గాంచితిన్. 84

వ. అని పలికి నిజవల్లభు నొడంబఱిచి పుణ్యజలావగాహనం బాచరించి శుచీభూతగా
త్రయై హరిద్రాంజనకుంకుమగంధపుష్పాద్యలంకృతయై నిజగృహద్వారంబున
ననలముఁ దరికొల్పి ప్రదక్షిణత్రయం బొనరించి యవ్వీతిహోత్రునకు నభిముఖం
బుగా నిలిచి గురువందనంబు గావించి యమ్మహాదేవుం దనమనంబునఁ దలంపుచుఁ
గృతాంజలియై యిట్లని స్తుతియించె. 85

ఉ. దేవ మదింద్రియంబులు ప్రదీప్తసుమంబులు దేహ మిష్టసం
భావితగంధధూప మతిభాసురచిత్తము దీప మెన్నఁ బ్రా
ణావళియే హవిస్సు కరణంబులు మీకు సితాక్షతంబులై
జీవితపూజనం బిపుడు చేసెదనయ్య కృపాపయోనిధీ. 86

తే. సర్వలోకాధిపత్యంబు స్వర్గమైన, బ్రహ్మపదమైన వలదు మీపాద మూన
తావకపదాబ్జభక్తి చిత్తంబునందు, నెలయఁజేయుము భవశతంబులకునైన. 87

క. అని ప్రార్థింపుచు శబరుని, వనితామణి ధీరవృత్తి వహ్నిజ్వాలా
మన మలరఁ బ్రవేశింపుచు, దనమేను దహింపఁజేసెఁ దత్క్షణమందున్. 88

క. అంతఁ జితాభస్మము తత్, కాంతుఁడు దా సంగ్రహించి తగఁగఁ గుటీరో
పాంతంబున శైలసుతా, కాంతుని పూజన మొనర్చెఁ గౌతుకమతియై. 89

సీ. శబరుండు శివపూజ సలుపుచు వివశుఁడై మహితప్రసాదసంగ్రహణమునకు
నెప్పటియట్ల తా నొప్పఁగాఁ బిలిచిన దనపత్ని వచ్చి ముందటను నిలిచె

నంత బాళభరుఁ డత్యద్భుతస్వాంతుఁ డై ప్రాంజలి యై యున్న పణతిఁ గాంచి
నిర్దగ్ధదేహ వై నీ వెట్లువచ్చితి విభుడు నిజాలయం బెట్లు బొడమె

తే. దేజమున నగ్ని దహియించు దినకరుండు
కిరణములను దహించు భూవరుఁడు దండ
మునను దహియించు మనమున భూసురుండుఁ
దగ దహించుట శాస్త్రసిద్ధంబు దలఁప. 90

క. అటుగావున గృహయుతముగఁ, బటుతజ్వాలాగ్నిదగ్ధసర్వాంగిక వై
రొటువలె వచ్చితి విప్పుడు, నిటలాక్షుని మహిమఁ దెలియ నేర్తురె మనుజుల్. 91

వ. అని విస్మయాక్రాంతచిత్తుం డై యడిగిన కబరనకు కబరి యి ట్లనియె. 92

మ. దహనజ్వాలలయందుఁ జొచ్చి సుఖనిద్రం జెంది నిర్మాల్యసం
గ్రహణార్థంబుగఁ బిల్వఁగా వినుచు జాగ్రత్త్వంబు సంధిల్లినన్
గృహముం దేహము పూర్వరూపములె భంగిం జెంద నేతెంచితిన్
మహితం బైనశివప్రసాద మిడి న న్మన్నించు ప్రాణేశ్వరా. 93

సీ. అని యివ్విధంబున నతిశయప్రేమానురాగంబు దోఁపఁ బరస్పరంబు
శబరదంపతులు దా సంభాషణముసేయు నవసరంబున విస్మయము జనింప
దివినుండి వచ్చె దేదీప్యమానం బగుమణిమయం బైనవిమాన మొకటి
యంత నయ్యిరువుర నతిమైత్రిఁ బుష్పకారూఢులఁ జేసిరి రుద్రభటులు

తే. భవ్యశివపారిషదకరస్పర్శనమున, విమలతర మైనదివ్యదేహములు దాల్చి
సిద్ధచారణగంధర్వసేవ్య మైన, శ్రీసదాశివలోకంబుఁ జేరి రపుడు. 94

వ. ఇట్లు శబరదంపతులు శ్రద్ధాపూర్వకంబుగాఁ బరమేశ్వరపూజనం బాచరించి
నిజదేహంబులతో మహాయోగిజనసంభావితం బయినశివలోకంబునకుం జని బరమా
నందంబున నుండి రని చెప్పి మఱియుం డి ట్లనియె. 95

క. కులవిద్యాచారంబులు, దలఁపఁగఁ బనిలేదు భక్తితాత్పర్యముచే
నలికాక్షునిఁ బూజింపుము, విలసిల్లెడుభునుని బోలు విజ్ఞులు గలరే. 96

క. ఈశబరోపాఖ్యానము, వ్రాసిన జదివినను విన్న వారలకు భవా
నీశుకరుణాకటాక్షా, వేశంబునఁ జెందు సిరులు విద్యాసిద్ధుల్. 97

వ. అని చెప్పి మఱియుం డి ట్లనియె. 98

చ. స్తుతమతులార శ్రద్ధల విశుద్ధత మీఱ సమాసహేశ్వర
వ్రతపరిపూర్ణపుణ్యకథ రంజిలఁ జెప్పెద నాలకింపుఁడీ
సుతపశుమిత్రబాంధవయశోబలవర్ధన మార్యవంద్యమున్
సతతశుభాస్పదం బదియు శాశ్వతముక్తిఫలప్రదం బగున్. 99

## ఉమామహేశ్వరవ్రతమునందు శారదోపాఖ్యానము.

క. జనులతఁ డార్యావర్తం, బున విశ్వరథుం డనంగ భూసురవర్యుం
డనఘాత్ముఁడు గలఁ డొకరుఁడు, మనసిజమదహరణభక్తిమార్గరతుం డై. 100

క. ఆవిప్రకులోత్తమునకు, దైవనియోగమునఁ జేసి తనయారత్నం
బావిర్భవించె నొక్కతె, సావిత్రీప్రతిభ గలిగి శారద యనఁగన్. 101

సీ. ఆకన్యకారత్న మప్పు డష్టమవర్షమునను ండఁ జూచి తజ్జనకుఁ డంత
వైవాహిక మొనర్ప వలయు నటంచును మది నిశ్చయించి సమ్మదమువలన
నొకవిప్రసుతునకు నకళంకమతి నిచ్చె నంత నాద్విజుఁడు మధ్యాహ్నసమయ
మున గృహోద్వాహుఁడై యొనసి సాయంకాలమున సరోవరతీరమునకు నరిగి

తే. యచట సంధ్యాదికృత్యంబు లాచరించి, పేర్మిఁ జనుదెంచునెడ విధిప్రేరణమునఁ
జేసి పన్నగదష్టుఁడై చేష్ట లుడిగి, యాధరామరుఁ డపగతప్రాణుఁ డయ్యె. 102

వ. తదనంతరంబ సకలబంధుజనములు బరతెంచి హాహాకారములతో విలాపము లాచరింపుచు నిజకర్మయోగమున మరణము నొందినయావిప్రసకు నౌర్ధ్వదైహికాదివిధానము లాచరించి రంత నాభూసురాంగనయును నిజపతివియోగమునం జేసి విరహితాలంకారయు నత్యంతదుఃఖాక్రాంతయు నై నిజజనకమందిరమ్మున నుండు నెడ. 103

## శారద దీర్ఘసుమంగలి యగుట.

శా. శ్రుత్యాచారపరాయణుండు జపనిష్ఠుం డాగమాంతజ్ఞుఁడుం
బ్రత్యాహారసమాధిధారణముఁ బ్రవ్యక్తయోగాఢ్యుఁ డా
దిత్యద్యోతనుఁ డీశ్వరాంఘ్రికమలాధీనస్వచేతస్కుఁ డై
జాత్యంధుండును నై ధ్రువుం డనుమహాత్ముం డేతెంచినన్. 104

క. అనాతియు సాధ్వీజనకు, స్నానాదికములను మధురసాహారములన్
మ్మానితమహోపకారవి, ధానంబుల బూజసేసెఁ దద్దయు భక్తిన్. 105

తే. ఇట్లు పూజించి మ్రొక్కిన యింతి మెచ్చి
యాద్విజన్ముఁడు జాత్యంధుఁ డగుటఁ జేసి
అలన విశ్వస్త యగుట దాఁ దెలియలేక
పలికె దీర్ఘసుమంగలీభవ యటంచు. 106

క. ఈవిధమున నావిప్రుఁడు, దీవించిన యింతి యనిరు ధీరోత్తమ నే
నేవిధి చిరంటి నగుదును, దా విశ్వస్త నని నుడివెఁ దథ్యము గాఁగన్. 107

వ. మహాత్మా మీర లమోఘసంకల్పులును యథార్థవాదులును మహర్షిసత్తములు గావున భవదాశీర్వచనం బెట్లు సంఘటింప నేర్చు దురంతచింతాభరాక్రాంతనై యున్న న న్నుద్ధరింప మీరలు దక్క నొండు శరణంబు లేదని చరణంబుల వ్రాలి యున్న శారదం గటాక్షించి యత్యంతకరుణారసపూర్ణహృదయుండై యమ్మహామునీంద్రుం డి ట్లనియె. 108

చ. కమలదళాక్షి యేనిపుడు కన్నులు గాననివాఁడ నాట నె
య్యము దలకొత్తఁగా నిను శుభాంగివి గమ్మని రోవచించితిం
బ్రమదము దోఁప నీదయినభక్తికి మెచ్చితిఁ గాని నిన్ను ని
క్కముగఁ జిరంటిఁ జేయఁ గలకాలము నుల్లము పల్లవింపఁగన్. 109

క. చతురత నుమామహేశ, వ్రతనియమ మొనర్చి వృషభవాహుల భవాని
న్మతినిల్పి పూజసల్పిన, నతిశయసౌభాగ్య మొదవు ననవరతంబున్. 110

వ. అనిన శారద యి ట్లనియె. 111

క. మునినాథ నీయనుగ్రహ, మునఁ జేసెద నీవ్రతంబు ముదముదలిర్పన్
జనవినుత సవిస్తరముగ, వినుపింపుము దాని తెలుఁగు విశదముగాఁగన్. 112

వ. అని యడిగిన నమ్మహానుభావుం డి ట్లనియె. 113

తే. చైత్రమున నైన మార్గశీర్షమున నైన, శుక్లపక్షంబునందుల శుభదినములఁ
దనరుచున నష్టమీచతుర్దశులయందు, వ్రతము సలుపంగవలయు నవశ్యముగను. 114

## ఉమామహేశ్వరవ్రతక్రమము దెలుపుట.

సీ. ప్రత్యూషమున సరిత్పావనోదకముల స్నానం బొనర్చి నిష్కళంకమతిని
ధౌతవస్త్రంబులు ధరియించి దేవర్షిపితృతర్పణములు సంప్రీతిఁ జేసి
క్రమ్మఱ నిజమందిరమ్మున కేతెంచి ఫలపుష్పతోరణభ్రాజితంబు
నతిరమ్యమును వితానాలంకృతంబును మణిమయం బైనట్టిమంటపమునఁ

తే. బంచవర్ణవిరాజితపంచపద్మ, రంగవల్లులు దీర్చి సంరంభ మొసఁగఁ
దండులన్యస్తకలశవస్త్రములమీఁద, గనకమయపార్వతీశుల నునుపవలయు. 115

మ. కలుషాపద్వినివారణార్థముగ సంకల్పంబుఁ గావించి ని
శ్చలభావంబునఁ బార్వతీశ్వరుల శశ్వద్భక్తిఁ బూజించి యం
జలిబద్ధుండు నిమీలితేక్షణుఁడు నై సంతానసౌభాగ్యము
ల్వెలయం బ్రార్థనసేయఁగాఁ దగు యథావిధ్యుక్తమార్గంబునన్. 116

తే. అనిన శారద పలికె నోమునివరేణ్య, సిద్ధముగ మన్మనోరథసిద్ధిగాఁగ
సమ్మతంబుగ మీర లిచ్చట వసించి, యిమ్మహావ్రతరాజ మీడేర్పవలయు. 117

క. అని చెప్పిన మునివరుల్యాసనమున సత్స్నేహ మొదవ శారదయును స
ఙ్జనబంధుసమ్మతంబుగఁ బనుపడఁ దద్వ్రత మొనర్పఁ బ్రాకటభక్తిన్. 118

పంచచామరము. మహాప్రభావభాసమానమంటపాంతరంబున
న్మహీసురోత్తమోపదిష్టమంత్రతంత్రదీక్షలన్
మహేంద్రముఖ్యదేవమానిమాన్య యైనరాయుమా
మహేశ్వరవ్రతం బొనర్చె మంజువాణి యంతటన్. 119

క. కూర్పాసకాంశుకంబులు,'కూర్పయుగంబులును గంధపాత్రములు నన
కర్పూరవీటికాదులు, నర్పించె సువాసినులకు నతిదృఢభక్తిన్. 120

వ. ఇవ్విధంబున నాశారదావధూటి తనకు నైధ్రువమహామునీంద్రుం డాచార్యుండు
గా మార్గశీర్షమాసమున శుక్లపక్షచతుర్దశీదినమున నుమామహేశ్వరవ్రతం బుపక్ర
మించి యథావిధ్యుక్తంబుగా భక్తిశ్రద్ధాసమన్వితయై యొక్కసంవత్సరము సాం
గముగా నాచరించి తదనంతరమున వ్రతోద్యాపనము గావింప సమకట్టి నిజమం
దిరం బలంకృతంబు గావించి క్రమ్మఱ బూర్వోక్తం బైనదినంబునందు వసించి పు
ణ్యతీర్థజలస్నాతయు ధౌతపరిధానధారిణియు మౌనవ్రతపరాయణయు నై సాయా
హ్నసమయంబున గృహంబుఁ బ్రవేశించి యచ్చట దళికాస్తంభశోభితమును
నవామ్రపల్లవతోరణమాలికాలంకృతంబును బహువిధఫలపుష్పమంజరీసమేతమును
రక్తరాంకవవితానాలంకృతమును స్వస్తికపద్మకాదివిచిత్రరంగవల్లీవిరాజమానము
నైనమంటపప్రదేశమున సువర్ణఖచితం బైనభద్రపీఠమునందు జాతరూపమయము
లగుభవానీశంకరప్రతిమలు తండులన్యస్తకలశవస్త్రోపరిభాగమున నిలిపి భూసుర
కృతపుణ్యాహమంత్రఘోషణములును ననేకవిధమంగళవాద్యధ్వనులును జెలంగ
సంకల్పం బొనర్చి హృత్పద్మమధ్యమున గౌరీశ్వరధ్యానము గావించుచు నావాహ
నాసనార్ఘ్యపాద్యంబులను బంచామృతస్నానవిధులను రుద్రసూక్తాభిషేకము
లను దుకూలాంబరయజ్ఞసూత్రసమర్పణంబులను మణిమయభూషణములును ఘుమం
ఘుమితగంధలేపనములను హారిద్రాకుంకుమాక్షతములను గమలకల్హారమాలతీమల్లి
కాదిప్రసూనార్చనములను గాలాగరుదశాంగధూపములను కర్పూరనీరాజనంబు
లను మధురఫలోపహారములను మంత్రపుష్పప్రదక్షిణనమస్కారములను ననేక
విధములం బూజింపుచు నారాత్రి ప్రథమ ద్వితీయ తృతీయయామంబులు గడపి
జాగరణం బొనరింపుచుండు నంత దైవవశంబునం దన్మహోత్సవసందర్శనార్థసమా
గతపౌరజానపదసువాసినీబ్రాహ్మణజనములు నిద్రావశులై యున్నసమయమున.

తే. శారదయు నైధ్రువుండు నిశ్చలమతిన
నాలుగవయామమునఁ బూజనములు సలుప

గజముఖునితల్లి యాశ్రితకల్పవల్లి
యంబికాదేవి ప్రత్యక్ష మయ్యె నపుడు. 122

ఉ. ఆసమయంబునందు దగ నంధకుఁ డైనమహామునీంద్రుఁడున్
భూసురకాంతయు న్నిజగభూషణుసాధ్వికి సాఁగి మ్రొక్కి పా
ద్యాసనసంవిధానముల నర్చితగా నొనరించిన న్మహో
ల్లాసముతో భవానియును లాలితభావల వారి కిట్లనెన్. 123

క. మీభక్తిశ్రద్ధలకును, మీభాస్వద్వ్రతమునకును మెచ్చితి భవదీ
యాభీష్టార్థ మొసంగెద, నోభూసురవర్య వేఁడు మోత్సాహమునన్. 124

వ. అని యానతిచ్చిన యమ్మహాదేవికిఁ బ్రణమిల్లి ధ్రువమహామునీంద్రుం డిట్లనియె.

శా. దైవాధిష్ఠితకర్మయోగమున జాత్యంధుండ నై యుండ నో
దేవీ నిష్కృతి యైనయీవనిత భక్తిశ్రద్ధఁ బూజింప నే
జూవే దీర్ఘసుమంగలీభవ యటంచున్ స్వస్తిగాఁ బల్కితి
న్నావాక్యంబు యథార్థమానటుల నానందార్తిఁ గావింపవే. 125

క. పతితోడుతఁ జిరకాలము, సతిమైత్రి మెలంగునట్లు నాపిమ్మట స
త్సుతు నొకనిఁ బడయునట్లుగ, నతివకు వర మిమ్ము మది మహాదర మొదవన్. 127

క. అని ప్రార్థించిన విప్రుని, వినయోక్తుల కలరి శైలవిభుకన్యక స
మ్మనమున దయ దళుకొత్తఁగ, వనిత న్వీక్షించి పలికె వాక్యప్రౌఢిన్. 128

శారదయొక్క పూర్వజన్మవృత్తాంతము దెలుపుట.

ఉ. ఓవసుధామరేంద్ర విను మొక్కటి చెప్పెద నీలతాంగి మున్
ద్రావిడదేశమం దొకధరామరవర్యుద్వితీయపత్ని యై
పావనశీలవృత్తముల భావజతంత్రకలానుభూతి నా
నావిధకైతవంబుల మనం బలరించుచు నుండె భర్తకున్. 129

తే. అద్విజన్మాగ్రగణ్యుఁ డహర్నిశంబుఁ, జటులప్రాయంపుపత్ని మచ్చికలు దగిలి
యగ్రభార్యాపరిత్యాగ మాచరింప, నదియు ననపత్యయై మృత్యుపథముఁ జెందె.

క. ఆరెండవభార్యయు శృంగారవిభూషణదుకూలకలితాంగి యై
గౌరీపూజలు సలుపుచు, సారాచారముల వెలసె జనులు నుతింపన్. 131

మ. స్ఫురదాకారవిలాసవిభ్రమములం బొల్పారి ప్రాణేశత
త్పరయై భామ యటంచు పేరు వెలయం బ్రఖ్యాతయై యుండఁగా
పొరుగింట న్వసియించువిప్రుఁ డొకఁ డాపూఁబోణి వీక్షించి త
త్సురతాపేక్షితుఁ డయ్యె మన్మథశరవ్యగ్రాంతరంగంబునన్. 132

తే. ఆద్విజన్ముఁడు వశ్యమంత్రౌషధాది సాధనము లెన్ని చేసిన జడతలేక
తను వరింపనిభామను గని తదీయ సంగమాపేక్ష గ్రక్కున్ మ్రింగుచుండె. 133

వ. ఇట్లు దురంతరం బైనవిప్రగేహినీవ్యామోహంబున విప్రలంభవ్యథాశిథిలీకృతమానసుం డై కోపతామ్రాక్షి యగునక్కామినిచే నివారితుం డై యాకాముకభూసురుండు నిరాశుండై కొంతకాలమునకు దదీయధ్యానపరాయణత్వమున గాలవశత్వమునం జెంది క్రమ్మఱ విప్రకులమున సంభవించి యాజన్మమున దీనిం బాణిగ్రహణము గావించి యావిధంబున నిధనంబు నొందె నిమ్మత్తకాశినియు బతివ్రత యగునిజసపత్నికి భర్తృవియోగం బొనరించెం గావున దద్దోషమున నీభవమున నిట్టి దురవస్థఁ బ్రాపించె నని యానతిచ్చి యమ్మహాదేవి వెండియు ని ట్లనియె. 134

తే. ఆద్విజన్మకులావతంసాగ్రపత్ని, పతివియోగాభితప్తయై పలవరించి
కాలగతిఁ జెంది భుజగియై క్రౌర్యమునను, గలుషమతి దీనిభర్తను గఱచి చనియె.

క. సతిపతుల నెడలు వాపిన, యతివలు కౌమారసమయమందులను విని
ర్గతభర్తృక లై యుందురు, సతతము ద్విసప్తజన్మసముదయమందున్. 136

మ. వినుమీ శారద పూర్వజన్మమున సర్వేదేవతాపత్ని వై
నను బూజించుట నిమ్మహావ్రతము సానందంబుగాఁ జేయుట
న్నిను లోకోత్తరునిన్ భజించుటను ఖండీభూతదుర్దోష వై
ఘనకల్యాణముఁ జెందఁగాఁ గలవు నిక్కంబు బారయన్ భూసురా. 137

సీ. అథామహ్యదయేశుఁ డగుభూసురేంద్రుండు దనపత్ని మదిలోనఁ దలఁచి తలఁచి
కొంతకాలంబున నెంతయుఁ దనమేను విడిచి క్రమ్మఱఁ బాండ్యవిషయమునను
విప్రుఁడై జన్మించి వేదశాస్త్రజ్ఞుండు ధనవంతుఁడును గృతోద్వాహుఁ డగుచు
నున్నవాఁ డచటికి మున్నూటయిరువదియోజనంబులదూర మర్వియందు

తే. నాద్విజన్మసమాగమం బందుచుండు, స్వప్నసమయంబులందు నీచంచలాక్షి
యంతమీఁదట వేదవేదాంతతత్త్వ, ధన్యుఁ డైనట్టియొక్కనందనునిఁ గాంచు. 138

వ. అని యమ్మహామునీంద్రునకుఁ దెలియంబలికి శారదం గాంచి గౌరీదేవి యి ట్లనియె.

మ. యువతీపూర్వభవప్రసిద్ధపతి సంయోగాప్తి నీయందు సం
భవమౌన్ జెందుఁ గుమారుఁ డొక్కరుఁడు రూపఖ్యాతుఁ డామీఁదటన్
ధ్రువమాంగల్యత నీవిధుం గలసి సంతోషంబు వర్ధిల్ల నీ
భువిలోన న్విహరించి శాంకరపదంబున్ జేరు మారూఢిగన్. 140

క. అని నిర్దేశించి జగజ్జనని తిరోహితము నొందె సంయమివర్యుం
డును శారదచేఁ దగ బూజనమంది నిజేచ్ఛ నరిగె సమ్మదలీలన్. 141

వ. తదనంతరంబ ప్రభాతసమయమున నాశారదయు గాల్యకరణీయములు నిర్వర్తిం
చి వహ్నితాంగం బైనహోమము గావించి కుటుంబసంపన్నులును శ్రోత్రియులు నైన
బ్రాహ్మణజనములకు గోభూహిరణ్యాదిదానములును వస్త్రకలశద్వయసమేతము
లైన ప్రతిమాయుగ్మములును దానము లొనరించి బ్రాహ్మణసమారాధనములు గావించి
తదాశీర్వాదములు గైకొని తానును విఘసాన్నపాశినయై యనుదినమును భవాని
శంకరయుగం దనమనమున నారాధింపుచు పితృగేహంబున సుఖమ్మున నుండె నని
చెప్పి క్రమ్మఱ నాతం డి ట్లనియె. 142

క. అంతట నాశారదయును, సంతసములు జెంది స్వప్నసమయములందున్
దంతనమునఁ బ్రతిదినమును, గాంతునితోఁ గలయుచుండె గౌరీమహిమన్. 143

ఆ. అధరామరుండు నటు ప్రతినిశియందు, సమ్మదమున స్వప్నసమయమందు
నావధూటిసురత మనుభవింపుచు నుండె, దైవమాయఁ జేసి తథ్యముగను. 144

వ. ఇట్లు గౌరీప్రసాదమున వరము వడసి ప్రతిరాత్రియందు నాత్మేశ్వరుం డైనభూ
దేవునిసమాగమంబుఁ జెందియుండ నంతట కతిపయదినములకు నవ్వధూటి యంత
ర్వత్నియై యున్నఁ దల్లక్షణములు పరీక్షించి పురమునం గలుగువృద్ధబాంధవజన
ములందఱు నయ్యింతిం గాంచి యిది పుంశ్చలి యని మనంబున సంశయించి యం
దఱు నొక్కయెడకుం జనుదెంచి యచ్చాలిక నచ్చోటికి రావించి తిరస్కారపూ
ర్వకంబుగా నందఱు నైకమత్యంబున ని ట్లనిరి. 145

ఆ. భామ నీవిభుండు పరలోకగతుఁ డయ్యె, నిపుడు నీకు గర్భ మెట్లు కలిగెఁ
దథ్యముగ వచింపు తబ్బిబ్బులాడిన, శిక్ష కర్హురాల వీక్షణమున. 146

క. అని భర్జింపుచు నడిగిన, జనముల వాక్యముల కులికి సంతాపమున
న్వనితయు సిగ్గు జనింపఁగ, ననువడ వారలకు మారు పలుకక యుండెన్. 147

వ. ఆసమయంబున. 148

ఉ. ఆదరమింతలేక యపు డార్యజనంబులు మంతనంబునన్
వేదపురాణశాస్త్రపదవిం బరికింపుచు జారకాగుణో
న్మాదిని దీని వీక్షణమున న్వపనంబును గర్ణనాసికా
చ్ఛేదము గోత్రదూరతయుఁ జేయుద మంచును నిశ్చితాత్ములై. 149

ఆ. శారదయును దనకు శరణ మెవ్వరు లేక, మానభంగభీతి మదిని దోఁప
ధీర యగుచుఁ బార్వతీపరమేశులఁ, జిత్త మలరఁగా భజింపుచుండె. 150

వ. ఆసమయంబున. 151

సీ. కామినికిని బహిష్కారంబు గావింపఁ దలఁచిన సభికులతలఁ పెఱింగి
సందేహములు మాని యందఱు వినుచుండ నశరీరవాణి యి ట్లనుచుఁ బలికె

ఈసాధ్వి సౌజన్యభాసమానసుశీల సరసవివేకభాస్వచ్చరిత్ర
యీమానవతి దేవతామహత్త్వంబున గర్భంబుఁ దాల్చె నిష్కలుషవృత్తి
తే. ఈవధూటిని బురుషు లెవ్వరేని, జారకాంత యటన్న నాక్షణమునందు
వారిజిహ్వలు తునియలు వ్రయ్యలగుచు, జగతిపైఁ బడు మదికి విస్మయము దోఁప.

క. అని భయ మొదవఁగఁ బలికిన, విని యందఱు పరమహర్షవిస్ఫారితలో
చనులై తమమనముల నా, వనిత పతివ్రత యటంచు వర్ణించి రొగిన్. 153

వ. ఆసమయంబున నివ్వెఱగంది యున్న సభ్యులం గనుంగొని తత్త్వవిదుం డైనయొక్క వృద్ధవిప్రుం డిట్లనియె ఈప్రపంచంబంతయు నీశ్వరమాయామయం బీసంసారచక్రంబునందు భావ్యాభావ్యంబులు లేవు నీయర్థంబు భగవంతుం డైనపరమేశ్వరుం డెఱుంగుఁగాని యితరులకుం దెలియ నలవిగాదు తొల్లి యువకేతుం డనురాజర్షి వీర్యంబు జలంబులంబడినఁ దజ్జలపానం బొనరించి యొక్కకన్యక గర్భంబు ధరియించె విభాండకమహామునీంద్రు శుక్లంబు పానంబుసేసి యొక్కహరిణి గర్భంబు దాల్చి ఋశ్యశృంగుం డనుమహామునిం గాంచె సురాష్ట్రుం డనురాజు దేహంబు స్పృశియించి యొక్కకురంగి గర్భిణియై తామసుం డనుమనువుం బడసె నిత్తెఱంగున నుపరిచరుం డగువసురాజవీర్యంబు యమునాజలంబులం బడిన నందొక్కమత్స్యంబు గ్రాహుటం జేసి తద్గర్భంబున సత్యవతి సంభవించె మహిషీగర్భంబున మహిషాసురుండు జనియించె సత్యపురంబునం గల్గునారీజనంబు లొక్కకారణంబున గర్భము దాల్చిరి వసుదేవసమాగమంబు లేక రోహిణీదేవి గర్భంబు దాల్చి బలభద్రునిం గాంచె జాంబవతీనందనుం డైనసాంబునిజఠరంబున మహర్షిశాపంబునం జేసి యొక్కముసలం బుద్భవించె యువనాశ్వుం డనురాజు మునీంద్రాభిమంత్రితంబు లైనజలంబులు త్రావ తద్గర్భంబున మాంధాత యనురా జుద్భవించెఁ గావున నివ్వనితయు వారలయట్ల మహావ్రతప్రభావంబువలనను మహర్షిపాదసేవనంబువలనను ననిందితం బైనగర్భంబుఁ దాల్పెఁబోలు దీనికి సంశయింప వలవ దేతద్గర్భలక్షణంబు నారీజనంబులు రహస్యంబుగా నడిగిన నీయర్థంబు విస్పష్టం బగు నని పలికిన నావృద్ధబ్రాహ్మణువచనంబులకు సమ్మతించి యోషిజ్జనంబు లేకాంతంబుగా నాశారదావధూటి సాంత్వనవచనంబుల నాశ్వాసించి యిట్లనిరి. 154

ఆ. పురుషసంగమమునఁ బోలఁతులు గర్భంబుఁ, దాల్చుచుందు రవుడు ధాత్రియందుఁ
బురుషహీన వగుచుఁ బొందుగా గర్భిణి, వగుట కేమి హేతు వంబుజాక్షి. 155

క. లోకంబులోన నిట్టి వ్యనేకంబులు గలవు దలఁప నిది యబ్బురమే
యేకాంతభావ మొప్పఁగ, నోకోమలి మాకు దెలుపు మన్నం బలరన్. 156

సీ. అనిన శారద యిట్టులనిన వారలతోడ విసుఁ డొకదినమున విప్రవరుఁడు
జాత్యంధుఁ డైనట్టిసంయమి చనుదెంచి యస్మత్కృతార్చన కాత్మ నలరి
మాంగల్యవతి వగు మని పల్కి యటమీఁద నాదువృత్తాంతమంతయును దెలిసి
తనవచనంబు దథ్యంబు సేయఁ దలంచి రంజిల్లు గౌరీశ్వరవ్రతంబు

తే. సేయ నియమించె నట్లనే జేయుచుండ, నంత గౌరి ప్రసన్నయై యానతిచ్చె
పత్ని త్వత్పూర్వభవపతి స్వప్నసంగమంబున జనించు నీకుఁ గుమారుఁ డనుచు.

తే. ఇదియ మామకవృత్తాంత మింతకన్న, నన్య మొక్కటి యెఱుఁగ నోయతివలార
సకలమునకును భగవంతుఁ డొకఁడె సాక్షి, యితరజనులకు నీయర్థ మెఱుఁగ నగునె.

క. అని శారద వచియించిన, విని యందఱు నిది దలంప విధికృత మనుచుం
ఘనసంశయవిరహితులై, చనిరి నిజస్థానములకు సమ్మదలీలన్. 159

వ. అంత. 160

క. పదియగునెల నాశారద, సదమలగుణహారు వేదశాస్త్రవిచారున్
మదమాత్సర్యవిదూరు, న్మదననిభాకారు నొకకుమారునిఁ గాంచెన్. 161

వ. అంత నవ్వనితయుఁ బితృసోదరమాతృబంధుమిత్రసమేతంబుగా నాత్మనందను
నుపలాలనం బొనర్చుచు సుఖంబున నుండునెడఁ గొన్నిదినంబులకు నొక్కపర్వ
కాలంబున గోకర్ణక్షేత్రమునకుఁ బ్రాగ్దక్షిణపశ్చిమోత్తరదేశంబులం గల్గు సమస్త
జనంబులుం జనుదెంచుచున్నయెడ నాశారదయుఁ గుమారపిత్రాదిసహితంబుగా
నాస్థలంబునకుం జని యందు స్నానదానాదికంబుల రుద్రాభిషేకపూజామహోత్స
వంబుల భూసురసమారాధనంబులం గొంత ప్రొద్దు గడపి యొక్కమంటపప్రదేశం
బున గూర్చుండి సకలప్రజాసందర్శనంబు గావించుచుండునెడ నచ్చటికి దైవవశం
బున మున్ను ప్రతిరాత్రియందు స్వప్నసమయంబునం గానంబడుచున్న పాండ్య
దేశసమాగతబ్రాహ్మణునిం గాంచి భవాంతరనిజవల్లభుండు గావలయు నని సంశ
యావిష్టచిత్తయై తదేకధ్యానమున నిరీక్షించుచుండ నాసమయమున నాభూసురశ్రే
ష్ఠుం డమ్మానినిం గనుంగొని తనకు సార్వకాలమును స్వప్నసమాగమం బొనరించు
నింతి యిదియ కావలయు నని మనమున సందేహింపుచు నాకామిని ముఖలక్షణం
బులు నిరీక్షింపుచు దత్సమీపంబునకు వచ్చి యక్కోమలితో నిట్లనియె. 162

క. మదిరాక్షి నీస్థలం బెయ్యది నీతలిదండ్రు లెవ్వ రభిధానం బె [య్యన్.
య్యది యీబాలకుఁ డెవ్వఁడు, హృదయేశ్వరుఁ డెవఁడు నడువు మింతయు దెలి

మ. అనిన న్శారద యాద్విజేంద్రునకు నాద్యంతంబుగాఁ బాష్పలో
చన యై నాత్మకథానులాపములు లజ్జానమ్రవక్త్రంబుతో

వినుపింప న్విని యెంతకష్ట మనుచు న్విప్రుండు కారుణ్యమున్
జనియింపం దలయూఁచి సస్మితముగాఁ జంద్రాస్యతో ని ట్లనున్. 164

ఆ. వనిత వివాహదినము దప్పకయుండ, విభుండు దీర్ఘనిద్రఁ జెంద
నీకుమారతిలక మెట్లు నీకు జనించెఁ, దెలియఁ బలుకవలయు దీనివిధము. 165

క. అని పరిహాసముగాఁ బల్కిన విప్రునివాక్య మాలకింపుచు లజ్జా
వనతాస్య యగుచు నప్పుడు, వనితామణి యూరకుండె వచనరహిత యై. 166

సీ. ఇవ్విధంబున నుండి యెలనాఁగ యొక్కింతతడవు విచారించి ధైర్యమూఁది
యాభూమిసురున కి ట్లని పల్కె నప్పు డో యనఘ నీ విట్లు న న్నడుగ నేల
నను నీ వెఱుంగుదు నిను నే నెఱుంగుదు మనల కిర్వురకును మనసు సాక్షి
సంతతం బగుస్వప్నసమయంబునందుల నన్యోన్యసౌహార్ద మలరుచుండ

తే. నుదయమందెను శారదేయుం డనంగ, ధీరుఁ డితఁ డని సర్వంబుఁ దెలియఁబల్కె
తద్వ్రతఫలంబులోన నర్ధం బొసంగి, నిజతనూభవు నిచ్చె సాద్వీజన కపుడు. 167

ఉ. భూసురశేఖరుండు నిజపుత్త్రికఁ గౌఁగిట గారవించి సం
త్రాసములేక దానితలిదండ్రులచేత ననుజ్ఞ గాంచి సో
త్సాహము మీర ధాత్రిలిఖితంబు యథాస్థితిఁ దప్పకుండఁగా
నాసతిఁ జెట్టఁబట్టుకొని యాత్మపురంబున కేఁగె లీలతోన్. 168

మత్తకోకిల. ఇత్తెఱంగున నద్ధరామరుఁ డింటికిం జనుదెంచి య
మ్మత్తకాశిని నాత్మగేహినిమాడ్కి నెమ్మది నెంచుచున్
నృత్తగీతకళాదివిద్యల నెమ్మిఁ గాలముఁ బుచ్చుచున్
చిత్తసంభవకేళి దెల్పె విచిత్రబంధము లొప్పఁగన్. 169

వ. ఇవ్విధమున నాదంపతు లత్యంతరతికాము లై రతికామలచందమునం బ్రవర్తింపుచు ననేకసంవత్సరములు భూతలమున యథేష్టభోగము లనుభవింపుచుండిరి యంత గొంతకాలమున కావిప్రుండు విగతజీవుం డైన నతనితోడ నాశారదయు ననుగమనంబు గావించెఁ దదనంతరం బయ్యిరువురు దివ్యదేహములు ధరియించి విమానారూఢు లై శివలోకమునకుం జని సుఖమున నుండి రని చెప్పి సూతుం డమ్మునీంద్రుల కి ట్లనియె. 170

చ. యతివరులార భక్తివినయంబులు మీఱ సుమామహేశ్వర
వ్రతకథ యెవ్వరేనియును వ్రాసిన విన్నఁ బఠించినంత సం
తతబహుపుత్త్రపౌత్త్రధనధాన్యచిరాయురుపేతు లై విని
ర్గతభయశోక మైనగరకాంతనివాసముఁ గాంతు రెప్పుడున్. 171

## రుద్రాక్షమహత్త్వము.

ఉ. అక్షయభోగదాయక మఘాపహరంబు శుభప్రదంబు ఫా
లాక్షమనఃప్రియంబు సకలద్విజబృందనిషేవణార్హ ముక్తా
మోక్షఫలప్రదంబును సముజ్జ్వలగాత్రపవిత్ర మైనరు
ద్రాక్షమహత్త్వ మెన్నదను దాపసులార వినుండు వేడ్కతోన్. 172

క. రుద్రాక్షవిభూషితు లగు, భద్రాక్షులు నిష్కళంకభాగ్యాన్వితు లై
యద్రిసుతావిభుకృప నిరుపద్రవులై యుందు రెపుడు ప్రజలు నుతింపన్. 173

ఆ. భక్తిరహితుఁ డైన భక్తియుక్తుం డైన, నిర్మలాత్ముఁ డైన నీచుఁ డైన
భద్రఫలద మైన రుద్రాక్షము ధరించి, పాపచయమువలన బాయు నరుఁడు. 174

సీ. వేయురుద్రాక్షము ల్కాయంబున ధరింపఁ బ్రణమిల్లుచుండు దేవప్రజంబు
పదియాఱు పదియాఱు బాహుయుగ్మములందు శిఖయందు రుద్రాక్ష మొకటిఁ జేర్చి
కరమున నలువది కరములఁ బండ్రెండు నొక్కటొక్కటి కర్ణయుగమునందు
నతులితాష్టోత్తరశతము వక్షమునందు ధరియించునేని శంకరునిపోల్కిఁ

తే. బూజితుం డగుచును జెండు దేజ మలరఁ, గనకముక్తాప్రవాళార్కకలిత మైన
విమలరుద్రాక్షసరము కంఠమునఁ దాల్చి, నరుఁడు ప్రత్యక్షశివుఁ డన ధరణి వెలయు.

సీ. మంత్రంబు రుద్రాక్షమాలిక గణియింప జప మొక్కటి యనంతసౌఖ్య మొసఁగు
దలను రుద్రాక్షంబు దాల్చి మజ్జనమాడ సమకూఱు జాహ్నవీస్నానఫలము
రుద్రాక్షధారిమర్త్యుని జెంద నఘములు కమలబాంధవుని చీఁకట్లకరణి
రుద్రాక్షధరుఁడు దరిద్రుఁ డైనను మహాసామ్రాజ్యభోగనిశ్చలతఁ జెందు

ఆ. రుద్రరూప మైన రుద్రాక్షమును విమ్మలాంబువిందు సేచనంబుఁ దక్క
బుష్పగంధములను బూజించిరేనియు, శివసమర్చనంబు సేసినట్లు. 176

క. ఏకత్రిపంచసప్తన, వైకాదశబహుముఖముల నొసఁగుచు నుండున్
శ్రీకర రుద్రాక్షంబులు, శ్రీకంఠమయంబు లగుట సిద్ధం బరయన్. 177

క. ఇందుల కొకయితిహాసం, బిందుకళాధరుహితం బభీష్టప్రద మా
నందకరం బగునది మీ, సందేహము వాయ వినుఁడు సన్మునులారా. 178

సీ. శ్రీసింధుమేఖలాసీమంతరత్నమై దీపించు కాశ్మీరదేశమునను
భద్రసేనుం డనుపార్థివోత్తముఁ డుండు సకలప్రజానురంజనకరుండు
అమ్మహీవిభునకు నాత్మజుం డుదయించె ధరణి తేజుండు సుధర్ముఁ డనఁగ
మఱియు నారాజునుమంత్రికి నందనుం డొకఁడు గలఁడు తారకుం డనంగ

తే. వార లిరువురు బాల్యభావమునఁ జేసి, శయనపానాన్నభోజనసముచయములను
శాస్త్రపఠనాదివిద్యాప్రసంగములను, బొందువాయకయుందురు వేడుకలర. 179

మ. రణదుద్యన్మణిదీప్యమానకనకగ్రైవేయకోటీరకం
కణహారాంగదనూపురాదుల నలంకారంబు గావించినన్
క్షణమాత్రంబునఁ జాయఁ దోఁచి కడు వేడ్కన్ శ్రీలు రుద్రాక్షభూ
షణము ల్దాల్తురు వార లిర్వురు మహోత్సాహంబు దీపింపఁగన్. 180

క. అక్షీణకృపాకలితక,టాక్షములఁ దదీయజనకు లనురాగమునన్
శిక్షించిన విడువక రుద్రాక్షలకు ల్దాల్తు రెపుడు దక్షాణవముల్. 181

## పరాశరుండు భద్రసేనునసభకు వచ్చుట.

తే. అంతఁ గొన్నిదినంబుల కరుగ నెంచె, మదము దోఁప బరాశరమునివరుండు
భద్రమతి భద్రసేనభూపాలుసభకు, వాసవుని కేర గురుఁడు విచ్చేసినట్లు. 182

క. ఎదురేఁగి మ్రొక్కి భూపతి,ముదమున నర్ఘ్యాదివిధుల మునిసుత్రామున్
సదమలమతిఁ బూజించెను, మృదుతరగంభీరమధురమితవచనుం డై. 183

తే. ఇట్లు పూజించి యమ్మౌనవేశ్వరుండు, విమలమణిమయకనకపీఠమున నునిచి
కుశలసంప్రశ్న మొనరించి కొన్నివార్త, లడిగి ప్రస్తావమున మౌని కనియెఁ బ్రీతి.

వ. మునీంద్రా మదీయనందనుం డైనసుధర్ముండు నస్మత్ప్రధానికుమారుం డయినతార
కుండును వీర లిరువురు బాలకులు మణిమయాభరణంబులు విసర్జించి రుద్రాక్షభూష
ణాలంకృతశరీరు లై యుండుదురు వీర లిట్లుండుట కెద్ది హేతువు సర్వజ్ఞులు త్రికా
లజ్ఞులు నైనమీర లీయర్థంబు సవిస్తరముగా మాకుం దెలుపవలయు నని యడిగిన
భద్రసేనభూపాలునకుఁ బరాశరమహామునీంద్రుం డి ట్లనియె. 185

## పరాశరుండు సుధర్మతారకులవృత్తాంతంబు దెలిపెడు కథ.

క. జననాథ విను భవన్నందనవరయుష్మత్ప్రధానతనయులగుణముల్
ఘనచరితంబులు దెలియఁగ, వినుపించెద వీరిపూర్వవృత్తాంతంబుల్. 186

క. నందిగ్రామం బనుపుర, మందముగా నుండుకోసలావని సతతం
బందుండు నొక్కతె మనో,నందిని యనువారవనిత నవయౌవన యై. 187

సీ. చతురంతయానము ల్చామరఛత్రము ల్బహురతరములౌ పాదుకలును
లాలితామాల్యదుకూలాంబరంబులు దపనీయపర్యంకతల్పములును
చిత్రమాల్యములు దాసీదాసజనములు గోమహిష్యాదికస్తోమములును
కర్పూరమృగమదగంధలేపనములు మణికాంచనవిరాజమానగృహము

తే. భూషణంబులు మృష్టాన్నభోజనంబు, వస్త్రమేయధనంబు ధాన్యాదికములు
గలిగి పరిపూర్ణభోగభాగ్యముల నెలయు, శంబరాంతకఘోటి వేశ్యావధూటి. 188

మ. శివనామ స్తవమున్ శివార్చనములున్ శ్రీకంఠసంసేవయు
న్శివభక్తాంఘ్రిసరోజవందనములు న్శీలంబు ధర్మంబు స
త్యవచోరక్తియు విప్రభక్తియును సౌహార్దం బోగిం గల్గి య
య్యువతీరత్నము కామచారిణియు నై యుండు న్బ్రమోదంబునన్. 189

క. తలపోడవు ధన మొసంగిన, పలుగాకులతోడ మద్యపాయులతోఁ
గులహీనులతోడను రతి, సలుపదు తద్వారకాంత స్వప్నమునందున్. 190

## కుక్కుటకథనము.

క. అక్కామిని క్రీడార్థము, మక్కువతోఁ బెంచె నొక్క మర్కటవరమున్
గుక్కుటమును దద్ద్వితయం, బక్కజముగ నింటి మ్రోల నాడుచు నుండున్. 191

తే. వానరమునకు రుద్రాక్షవలయహార
కంఠకాంగదముద్రికా కర్ణకుండ
లాద్యలంకారము లొసంగి యబల యొకటి
చూళికను గట్టె నలతామ్రచూడమునకు. 192

చ. అనిశము తద్విలాసవతి యాప్తులు గొల్వఁగ నాట్యమంటపం
బున కరుదెంచి వాద్యరవము ల్చెలఁగ న్నటియింపుచుండఁగాఁ
గనుఁగొని యభ్యసించి కుతుకం బలరంగ మదీయగీతన
ర్తనములు సల్పుచుండుదురు దారును వారును తామ్రచూడముల్. 193

వ. ఇవ్విధమున నవ్వారాంగనారత్నం బనేకవిధములం గ్రీడింపుచు నభీష్టభోగంబు
లనుభవింపుచుండు నంతట గొన్నిదినములకు భూతిత్రిపుండ్రరుద్రాక్షమాలికాధార
ణుండును జటిలుండును ప్రకోష్ఠభాగప్రదీపితమణికంకణుండును మహాధనికుండు
ను శివవ్రతుండును నగు నొక్క వైశ్యుండు రంభాసమాగమంబునకుం జనుదెంచు
నలకూబరువిధమున దద్గృహమునకు వచ్చినం గని యతని నర్ఘ్యపాద్యాదిసత్కార
ముల సంతుష్టుం గావించి సాదరముగా బీఠమునఁ గూర్చుండ నియమించి సరసాను
లాపములం గొంత ప్రొద్దుపుచ్చి వెండియుఁ బరిహాసమ్ము దోఁప నవ్వారకామిని
యి ట్లనియె. 194

## వేశ్యావైశ్యసంవాదము.

క. శంకరునిభుఁడవు భూషా, లంకృతదేహుఁడవు భద్రలక్షణుఁడవు నా
మాంతంబుగ ముంజేతను, గంకణము ధరింప నేమి కారణ మధిపా. 195

క. ఏ కేటికి వైశ్యోత్తమ, యీకంకణరాజ మిమ్ము హితమతి తెలియన్
నా కభిమతమై యున్నది, వీకన్ ధరియింతు లోకవిఖ్యాతముగన్. 196

చ. అన విని వైశ్యుఁ డిట్లనియె నంబుజలోచన నాదుకంకణం
బనుపమరత్నసంయుత మనర్ఘ్యము గావున దీనిమూల్య మెం
తని వచియింపఁగాఁ దగు మహాధనకోటిశతంబు లిచ్చి నీ
మన మలరన్ ధరింపు మిఁక మచ్చికతోడుత నీ కొసంగెదన్. 197

మ. అనిన న్వారవధూటి యిట్లనియె వైశ్యాధీశ మీబోంట్లకుం
జనునే వేశ్యల కిచ్చి మూల్య మడుగన్ సంభోగవాంఛారతిన్
ధనరత్నాభరణాదు లిచ్చు టరుదే ధన్యుండ వీ వట్లు గా
వున నీకంకణ మిచ్చి చిత్త మలరన్ భోగింపు మత్యాదృతిన్. 198

వ. అనిన విని వైశ్యుఁ డిట్లనియె. 199

చ. విను హరిణాక్షి యిద్ధరను వేడుకకు న్వెలలేదు గావున
న్గొను మిది రత్నకంకణముఁ గూరిమి నిచ్చెద నైన దీనికిన్
దినముల సంఖ్య చెప్పుము మదీయమనోరథసిద్ధికై యన
న్విని కలకంఠి పల్కె పృథివీప్రభుఁ జూచి గభీరభావమున్. 200

తే. యామినీత్రయపర్యంత మాత్మనాథ, నాదుదేహంబు భవదధీనం బొనర్తు
సత్య మిపల్కు దీనికి సాక్షు లర్కచంద్రు లని చాటిచెప్పె నాచంద్రవదన.

క. విహితక్రియ వర్తింతును, సహధర్మిణి నగుదు నంచు సమ్మతముగ న
మ్మహిళారత్నము వైశ్యుని, మహితోరస్థలము మట్టె మమతదలిర్పన్. 202

సీ. అప్పుడు పల్లవుం డైనవైశ్యాగ్రణి కాంతకు రత్నకంకణ మొసంగి
మఱియును దా నొక్కమణిమయలింగంబు నతిగోప్యముగ దాఁచు మనుచు నిచ్చె
నెప్పుడు భిన్నమౌ నిమ్మహాలింగం బప్పుడు విడుతుఁ బ్రాణానలముల
నని వచించిన నట్ల యగు నంచు నాట్యమంటపమున నొక్కచోఁ డాచివచ్చి

తే. యాలయంబున కేఁగి మృష్టాన్నపానములను బరితుష్టిఁ బొంది నిర్మలసువర్ణ
తల్పముల వైశ్యవిటుఁడును దానుఁగూడి, పంచశరకేళి నటు పవ్వళించియుండె.

క. ఒకరీతిని శయనింపఁగ, నారేయి నహేతుకముగ నగ్నిజ్వాలా
ఘోరం బై యల నాట్యాగారము సందగ్ధ మయ్యె గర్జానుగతిన్. 204

ఆ. అంత వారకాంత యచ్చటి కేతెంచి, చిత్తసాధ్వసంబుఁ జెందియున్న
కేకికుక్కుటముల పాశంబు లూడ్చిన, బంధముక్తి దనరెఁ బరచె నవియు. 205

సీ. స్తంభంబుతోడ నిర్దగ్ధమై శకలీకృతం బైనరత్నలింగంబుఁ గాంచి
వైశ్యుండు వేశ్యయు వ్యథఁజెంది రప్పు డయ్యతివకు నాతఁ డిట్లనుచుఁ బలికె
నంగన వినుము శివలింగంబు నిర్భిన్న మైయుండ జీవించు టర్హ మగునె
కావున నిదుకింకరుల నియోగించి చితినేయఁ బంపుము సిద్ధముగను

తే. నిప్పు డఖిలామరులును బ్రహ్మేంద్రవిష్ణు, లాదిగా వచ్చి వలవదటన్న వినక
నభవు మది నిల్పి దహనంబునందుఁ జొచ్చి, యిపుడ ప్రాణపరిత్యాగ మాచరింతు.

వ. ఇట్లు దృఢనిశ్చయుం డై యున్న యతని యభిప్రాయం బెఱింగి యవ్వేశ్యయు బురబాహ్యప్రదేశంబునఁ జితిగావించిన నవ్వైశ్యుండు సూర్యోదయానంతరంబునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి యచ్చటికిం జనుదెంచి శంకరపదధ్యానం బొనరింపుచుఁ బ్రజ్వలితాగ్నికి బ్రదక్షిణత్రయం బొనరించి సకలజనంబులు కనుంగొనుచుండ నందుఁ బ్రవేశించె నంత నవ్వనితయుఁ దన్మరణంబునకు బాష్పపూరితలోచన యై నిర్వేదించి నిర్మలం బయినధర్మంబు మనంబున విచారించి తాను నవ్వైశ్యునితోడ ననుగమనంబుఁ జేయుదు నని నిశ్చయించి నిజబంధుజనంబుల నవలోకించి యి ట్లనియె. 207

తే. ఇతనిచే రత్నకంకణ మే గ్రహించు, సమయమున సూర్యచంద్రాగ్నిసాక్షికముగ
బాస యిచ్చితి నే నీకు భార్య నగుదు, మూఁడహోరాత్రము లటంచు మదితలార.

క. కావున దైవవశంబున, నీవైశ్యుఁడు మృతినిఁ బొందె నిపు డట్టుల నీ
పావకముఖమున నేనును, నావల్లభుతోడఁ గూడ నరిగెద ననినన్. 209

వ. అపుడు వార లి ట్లనిరి. 210

మ. తగునే వారవధూటికిన్ విటులతోఁ దా వహ్ని సొత్తేరఁగా
నగరే తోడికులాంగనామణులు విన్నం బూర్వ మెన్నైన ని
జ్జగతిన్ బెద్దలు చెప్పఁగా వినము నీచారిత్ర మత్యద్భుతం
బగు నోహో యిఁకఁ జాలు నెక్కుడివి వేశ్యాస్త్రీలకున్ సత్యముల్. 211

మ. విటులన్ మచ్చికచేసి మైత్రి మెఱయ న్విత్తంబు లార్జించుటో
ఘుటికాసిద్ధియు మంత్రసిద్ధి యనురక్తిన్ మేలు సాధించుటో
స్ఫుటవీణాదికవాద్యవాద్యముల నేప్రొద్దు న్విచారించుటో
చటులజ్వాలకృశానునందుఁ జొర వేశ్యాస్త్రీలకున్ ధర్మమే. 212

క. అని పలికిన బాంధవులం, గనుఁగొని యక్కాంత యనియెఁ గలలో నైనం
జను నే బొంకులు పలుకఁగఁ, దనువులు నర్థములు సిరియుఁ దగు నిత్యములే. 213

తే. సత్యభాషణ మిహపరసాధకంబు, సత్యవాక్యంబు ధర్మంబు జయకరంబు
సత్యమున సర్వశుభములు సంఘటిల్లుఁ, గాన సత్యంబు జనులకుఁ గలుగవలయు.

క. రవి పడమట నుదయించినఁ, గువలయబంధుఁడు మహోష్ణగుణుఁడై యున్నన్
భువిపైఁ దారలు డుల్లినఁ, బ్రవిమలసత్యోక్తి విడువ భామినులారా. 215

వ. అని యిట్లు దృఢనిశ్చయంబుగాఁ బలికి బాంధవజనముల నొడంబఱిచి యవ్వారకామిని యాక్షణమున మంగళస్నానము గావించి జాంబూనదాంబరయుగ్మధారిణి

రై హరిద్రాంజనసిందూరకాదులు ధరియించి పురంబునం గల బ్రాహ్మణోత్తముల రావించి తనగృహమునం గల ధనకనకవాహనంబులును నమూల్యకాంచనమణిమ యాభరణములు ననేకగోమహిషశిబికాసనశయ్యాప్రముఖసర్వవస్తువులును వారలకు సమర్పించి పరమేశ్వరధ్యానంబు గావింపుచు హుతాశనునకు ద్రివారముగాఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి భూసురోత్తములకుం బ్రణమిల్లి పౌరజానప దవర్గంబు లాబాలవృద్ధంబుగా నిరీక్షింపుచుండ ముకుళీకృతకరకమలరై దహనంబు నం బ్రవేశించుసమయంబున. 216

మనోరంజనికి సాంబమూర్తి ప్రత్యక్షం బగుట.

మ. ధవళాంగుండు శశాంకశేఖరుఁడు భక్తత్రాణపారీణుఁ డిం
ద్రవిరించ్యాదులు చుట్టుఁ గొల్వ వృషభోద్యద్వాహనారూఢుఁ డై
భువియు న్నింగియు వెల్గుచుండ గిరిరాట్పుత్రీసమేతంబుగా
శివుఁ డేతెంచి కరంబుఁ బట్టి తిగిచెన్ శీఘ్రంబు వారాంగనన్. 217

వ. అంత. 218

శా. ఆవేశ్యాంగన ఫాలలోచను శశాంకాదిత్యకోటిప్రభున్
దేవర్షిస్తుతపాదకమలున్ దేదీప్యమానాంగునిన్
భావాతీతచరిత్రుఁ గాంచి విలసద్భక్తిన్ బ్రణామంబులన్
సేవ ల్సేయుచు నుండె భీతయగుచున్ జిత్తంబు రంజిల్లఁగన్. 219

సీ. అంత నాపరమేశుఁ డయ్యింతి గనుఁగొని పలికె గారుణ్యార్ద్రభావమునను
నీదుధర్మమును నిర్మలజ్ఞానంబు సత్యంబు దృఢభక్తిసౌష్ఠవంబు
శీలంబుఁ దగఁ బరీక్షించుటకై రేను వైశ్యరూపముఁ బూని వచ్చి తబల
మంటపదాహంబు మణిలింగభిన్నంబు నింతయు నామాయ నొంచిచూడ

తే. నిన్ను మెచ్చితిఁ గోరుము నీకు వలయు, నట్టివరము లొసంగెద నాదరమున
నాయురారోగ్యభాగ్యసౌఖ్యాదికములు, ననిన హరుఁజూచి పలికె నయ్యంబుజాక్షి.

తే. దేవ తావకపదయుగసేవ దక్క, నన్యవర మొల్ల మఱి త్రిలోకాధిపత్య
మైన నటుగాన బంధుమిత్రాదులకును, దనకుఁ గైవల్య మొసఁగు నిస్తంద్ర తేజ.

చ. అన విని యమ్మహాత్ముఁడు దయారస ముప్పతిలంగఁ బల్కె నో
వనజదళాక్షి బంధుపరివారయుతంబుగ దివ్యపుష్పకం
బున వసియింపు మన్న విరిబోణియు నట్ల యొనర్చి వేడుకన్
జని పరమేశలోకమున సంతసమందుచు నుండె నంతటన్. 222

క. జననాథ దగ్ధమంటపమున నుండక వెడలి దూరముగ నరిగిన యా
వ్యసచరము నీతనూజుఁడు, దనరఁగ గుక్కుటము మంత్రితనయుం డయ్యెన్. 223

క. అరయఁగ పిశాచకులకు, మఱవుగ దమపూర్వజన్మమున రుద్రాక్షా
భరణములు దాల్చుకతమున, హరుకృప నుత్తమకులోదయము గల్గె నృపా. 224

వ. అని యివ్విధమునఁ దెలియఁబలికిన నమృతోపమానము లగుపరాశరమహామునీంద్రు వచనము లాకర్ణించి సంతుష్టహృదయుండై భద్రసేనమహీనాథుం డమ్మహాత్మునితో వెండియు నిట్లనియె. 225

క. మునినాథ భవద్దర్శనమున నజ్ఞానంబు వాసె ముక్తి లభించె
న్మనమలరఁగ సత్సంగతి, జనవితతికి గామధేనుసదృశము గాదే. 226

క. అటుగావున నేనిఁక నొక్కటి యడిగెద నిక్కుమారకథ తెలియుటకీ
విటమీఁద నితనియాయుః, పటుతరకీర్తిప్రతాపబలములు చెపుమా. 227

వ. అని యడిగిన నారాజునకు వసిష్ఠపౌత్రుం డిట్లనియె. 228

ఆ. వాచ్య మయినపలుకు వచియింపఁగాఁ దగుఁ, బలుకఁ దగనిపలుకు పలుకఁగూడ
దెంత ధీరులైన సంతాప మందుదు, రట్లు గాన నిక్క మాడ జనదు. 229

క. అయినను నిక్కపటం బగు, మానసమున నడిగ దీవు మనుజేంద్ర భవ
త్తనూజునివార్త యథాస్థితి, యేను వచించెద మదీయహితుఁడవు గానన్. 230

క. వరవర నీనందనునకుఁ, బరమాయుర్వత్సరములు పండ్రెం డగు మున్
దఱిఁగా నష్టమదినమున, మరణము ప్రాపించు నీకుమారున కనఘా. 231

క. అని నిశ్చయముగఁ బలికిన, మునివచనము కర్ణశూలముగఁ దోఁపఁగ నా
జనపతి భీతాత్ముఁడై, విని శోకాక్రాంతుఁ డగుచు వివశుం డయ్యెన్. 232

ఆ. అంత నామునీంద్రుఁ డత్యంతకృపతోడ, నానరేంద్రచంద్రు నాదరించి
వత్స భయముఁ జెంద వలవదు విను మింక, హితమృదూక్తు లిప్పు డేవదింతు. 233

క. వెరపేటికి శ్రీరుద్రాధ్యాయజపస్నానముల యథావిధి సలుపన్
చాయక నీసుతునకు దీర్ఘాయుర్దాయంబు గల్గు నవనీనాథా. 234

వ. అని చెప్పిన యమ్మహామునీంద్రునకు నరనాథుం డిట్లనియె. 235

క. శ్రీరుద్రాధ్యాయజపం, బేరీతి నొనర్పవలయు నెవ్వరు దైవం
బారయ దత్ఫల మెయ్యది, యారూఢిగఁ దెలియఁ బల్కు మాదర మొదవన్.

వ. అని యడిగిన రాజునకు మునీంద్రుం డిట్లనియె. 237

పరాశరుండుభద్రసేనమహారాజునకురుద్రాధ్యాయప్రభావంబెఱింగించుట.

సీ. ఆదికాలంబున నభవుఁ డొక్కఁడు దక్క నొగి జగంబులు లేక యుండు నంత
నజుఁ డవ్యయుఁడు సచ్చిదానందమయమూర్తి యాద్యుఁడు శంకరుం డైనశివుఁడు
తనరజోగుణమున ధాతను నిర్మించి సృష్టికార్యం బెల్ల జేయుటకును
వేదంబుల నొసంగి వేదార్థసారమై యొసఁగు రుద్రాధ్యాయ మిచ్చె నపుడు

తే. అమ్మహాధ్యాయమును బూర్వులైనమునులు,భృగు మరీచ్యత్రిముఖులు సంప్రీతిదోఁప
నభ్యసించిరి వారలయనుమతమున, సంగ్రహించిరి భువిలోనిసకలబుధులు. 238

మ. ధరణీనాథ తదీయశిష్యసుతసంతానోపదేశంబులన్
ధరణిం గల్గిన మానవోత్తములు రుద్రాధ్యాయపాఠంబునన్
దురితోచ్చాటనదక్షులై మఱియు నిర్దుష్టాత్ములై యుండఁగా
నరకావాసము శూన్యమైనఁ గని కీనాశుండు దైన్యంబునన్. 239

## యముండు బ్రహ్మసభకుఁ బోవుట.

క. ఆనలినజాసన్నిధికిని, భానుసుతుం డరిగి భక్తిఁ బ్రణమిల్లుచుఁ ద
న్మానసమునఁ గృప దోఁపఁగ, దీనోక్తులఁ బలికె నిట్లు దివిజులు వినఁగన్. 240

సీ. ఓపద్మగర్భ నే నొకవార్త వినుపింతు నది యథార్థంబు మహాద్భుతంబు
నరులు రుద్రాధ్యాయనిరతులై యనిశంబు విగతదోషులును బవిత్రచరితు
లగుచు దీర్ఘాయుష్కులై సుఖంబుననుండి కడపట శంకరుకరుణచేత
సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్యముక్తులు గాంతురు మదను వెలయ
ఆ. నస్మదీయలోక మంతయు శూన్యమై, కాంతిరహిత మగుచుఁ గానఁబడియె
నిప్పుడియోజనతను నే నెట్లు వసియింతు, దీని కొకయుపాయ మానతిమ్ము. 241

క. చిత్రుఁడును జిత్రగుప్తుఁడు, పత్రంబులు గట్టి మూలఁ బడవైచిరి వ్యా
చ్చిత్రంబుగ మద్భృత్యులు, సత్రపులై యుందు రాత్మసదనములందున్. 242

సీ. బ్రహ్మఘ్నులును సురాపాయులు కాంచనతస్కరు ల్వనగృహదాహకులును
ధర్మహీనులును గృతఘ్నులు భ్రష్టిణీగమనులు విశ్వాసఘాతకులును
కుటిలవంచక ఖలక్రూరపాతకులును వేదాన్నకన్యకావిక్రయులును
హరిహరద్వేషులు నాత్మకర్మత్యాగు లత్యహంకారాత్ము లాదియైన
తే. జనులు నిరతంబు మత్పురంబునకు వచ్చి, యుండుదురు కోటిసంఖ్యల నుత్కటముగ
నట్టిపురమున కిపు డొక్కఁడైనఁ జేరఁ, డేమనుచు విన్నవింతు నే నోమహాత్మ. 243

వ. అని విన్నవించిన సమవర్తికిఁ బరమేష్ఠి యిట్లనియె. 244

మ. అరుదై పొల్తు రవిద్యకుం దుహితలై యశ్రద్ధయు న్మందతా
కరదుర్మేధయు వీర లిర్వురు దగన్ క్ష్మాలోకముం జేరి యా
నరసంఘంబులచిత్తము ల్బలన మందంజేతు రట్టైన య
న్నరకస్థానము పూర్ణమై వెలయు సంతాపంబు నీ కేటికిన్. 245

క. అని పలికె కమలగర్భుం, డినసందను వీడుకొలిపి హితముదలిర్ప
న్మన మలరఁగ నయ్యిరువుర, కనుమతి గావించి పనిచె సమసుస్థలికిన్. 246

ఆ. అట్లుగాన నరుల కశ్రద్ధతోఁజేయు, నఖిలకార్యములును నిష్ఫలములు
శ్రద్ధతో నొనర్చు జపతపఃపూజాది, సకలధర్మచయము సత్ఫలంబు. 247

క. ఇదిముఖ్యం బగుమంత్రం, బిది పరమం బైనతపమి దిది సర్వసుఖా
స్పద మిదియె ముక్తిసాధన, మిది బహుపాతకహరంబు నెల్లజనులకున్. 248

వ. అట్లు గావున. 249

శా. రుద్రాధ్యాయపరాయణుండు ఫణిహారున్ సచ్చిదాకారునిన్
రుద్రున్ హృద్యదకాభిషిక్తునిగ నిర్దోషస్థితిం జేసి ని
ర్నిద్రశ్రద్ధఁ దదంబుమజ్జనముఁ దా నిత్యంబుఁ గావింపఁగా
భద్రారోగ్యచిరాయురున్నతులు సంభావించు నెల్లప్పుడున్. 250

వ. అని యానతిచ్చి వెండియు ని ట్లనియె. 251

చ. అనఘులు శాంతమానసులు నాగమవేదులు సంశితవ్రతుల్
ఘనతరశైవమార్గము లఖండితవృత్తి నెఱుంగునట్టిస
న్మునులు జపంబుచేసిన సమోఘతదీయతపోవిభూతిచే
జనవర నీతనూభవుఁ డజస్రశుభంబులు పొందియుండెడున్. 252

తే. ఇట్లు నియమించినట్టి మునీశ్వరునకు
నమ్మహీపతి వందన మాచరించి
యమ్మహాకార్య మంతయు హితము మెఱయ
నిచట మీరుండి తగ నిర్వహింపవలయు. 253

మ. అని ప్రార్థించిన సమ్మతించి కృపతో నాశక్తియుక్తుండు స
న్మునిసంఘంబులఁ బిల్వఁ బంచి తగ దాను న్వారలం గూడి పెం
పునఁ బుణ్యాద్రురసత్రయుక్తకటకంబు న్నిల్పి రుద్రాగమం
బున సంసిక్తునిఁజేసి రానృపసుతుం బూర్ణత్రభావస్థితిన్. 254

వ. ఇవ్విధమున నా రాజనందనుండు మహామును లభిషేచనము గావింపుచుండ నంత
సప్తమదినమ్మున నందఱుఁ గనుంగొనుచుండ మూర్ఛాగతుండై మహామాసింద్రరక్షి
తుండు గావున గ్రమ్మఱఁ గొంతప్రొద్దునకుం దెలిసి వారలం గనుంగొని యిట్లనియె
మహాత్ములారా వినుండు దీర్ఘదంష్ట్రుండును భయానకుండును దండహస్తుండును
నైన యొక్క మహాపురుషుండు వచ్చి పాశబద్ధుం జేసి నన్నుఁ గొనిపోవుచుండ
నంత నతండు మహాబలపరాక్రమవంతు లైనపురుషులచేత బద్ధుండై దూరంబుగాఁ
జనినవిధంబునం గానంబడియె నేనును భవత్కటాక్షప్రభావంబున లబ్ధజీవుండనైతి
నని విన్నవించిన మోదంబంది యమ్మహామును లన్నరేంద్రనందనుం గటాక్షించి
యనేకాశీర్వచనంబుల నభినందించిరి అభూపాలుండును నిర్భయుం డై యుండె
నంత. 255

శా. ఆరాజేంద్రుఁడు సంప్రహృష్టహృదయుండై భూసురేంద్రాళికిన్
భూరిప్రాభవ మొప్ప దక్షిణలు తాంబూలంబులున్ హేమవా
సోరత్నాదు లొసంగి బాంధవవయస్యోపేతుఁడై షడ్రసా
హారంబుల్ భుజియించియుండెఁ గొలువై యాస్థానమధ్యంబునన్. 256

## భద్రసేనుసభకు నారదమహాముని వచ్చుట.

ఉ. పారద శారదాభ్రహిమభానుసుధాఘనపాండురాజసా
కారుఁడు పాకశాసనముఖత్రిదశస్తుత సచ్చరిత్రుఁడు
న్వారిజగర్భనందనుఁ డవార్యమహామహిమానుభావుఁ డా
నారదమౌని వచ్చె నటనంబులు సల్పుచు వీణమీటుచున్. 257
తే. ఇట్లు విచ్చేయుమునిపతి కెదురువచ్చి, యర్ఘ్యపాద్యాదిసత్కృతు లాచరించి
విమలకాంచనపీఠోపవిష్టుఁ జేసి, పలికె నరపాలుఁ డంజలీబద్ధుఁ డగుచు. 258
ఉ. మీరు మహాతపోధనులు మిత్రసమానులు సర్వలోకసం
చారులు పుణ్యమూర్తులు నిజంబుగ నద్భుతమైనవార్తలే
మీరని చూచి వచ్చితిరొ యంతయు మా కెఱిగింపుమన్న నా
నారదమౌని పల్కె నరనాథుని జూచి విచిత్రవైఖరిన్. 259
సీ. మునిపుంగవులు నీవు వినుఁడు భూపాలక యొకవార్త వినుపింతు నుల్లమలర
భవదాత్మజుని గతప్రాణునిఁ గావింపఁ దలఁచి మృత్యువుతోడ దండధరుఁడు
చనుదెంచి యుండ నాసమయంబున శివుండు దెలిసి కోపాగ్నిప్రదీప్తుఁ డగుచుఁ
దనపుత్త్రి వీరభద్రుని బంప నాతండు ప్రమథయుక్తముగ శీఘ్రమున వచ్చి
తే. త్వత్సుతాలంబచిత్తు గృతాంతుఁ బట్టి, యాక్షణంబునఁ బెడకేల నంటఁగట్టి
ముష్టినిహతుల నొప్పించి యష్టమూర్తి, సభకు రమ్మని యీడ్చె నిశ్శంకుఁ డగుచు.

## వీరభద్రయమవివాదము.

మత్తకోకిల. అప్పు డర్కతనూజుఁ డెంతయు నబ్బురంబుగ సాధ్వసం
బుప్పతిల్లఁగ మేను గంపము నొందఁగాఁ బ్రణమిల్లి మా
యప్ప యేమిటి కింతకోప మహీనవిక్రమశీల నా
తప్పు సైఁచుము వీరభద్ర కృతాపరాధుఁడ నెంతయున్. 261
మత్తకోకిల. ఈనరేంద్రకుమారకుం డిపు డెన్నఁగా గతజీవితుం
డైనవాఁ డటుగాన మృత్యుసహాయుతం జనుదెంచితిం
గాని నేరము లేదు నన్నిటు గాసిసేయఁగ నేలయో
దీనరక్షక సోమనందన దేవదేవ జగత్పతీ. 262

క. అని వేఁడిన రవినందనుఁ, గనుఁగొని వారతనయుఁ డనిరోఁ గడువడి మాన్యుం
డనఘాత్ముఁడు శతశతహాయనజీవితుఁ డితనిఁ ద్రుంప నర్హంబగునే. 263

తే. ఏక సంశయమైన నోసిరజాత్మతనయ మీచిత్రగుప్తు రాఁ బనుపు మిటకు
నితఁడు నిజముగఁ బదివేలయేండ్లుఁ బ్రదుకు, రుద్రసూక్తాభిషేచనారాధకుఁడగుట.

క. అనిన విని చిత్రగుప్తుని, నినతనయుఁడు పిలువనంపి హితమతి నడుగన్
విని యతఁడు వచించెను హాయనములు పదిరెండు నితని కాయువటంచున్. 265

వ. అని విన్నవించిన చిత్రగుప్తునివచనంబు లాకర్ణించి యవ్వీరభద్రుండు కృతాంతు
నిం గనుంగొని యీరాజకుమారుండు వర్షాయుతప్రమాణజీవితుండు నీ విందులకు
సందేహింపవలదు యీయర్థంబు నీమనంబున దృఢంబుగా నిశ్చయించి శ్రేష్ఠు
దశసహస్రవర్షప్రమాణజీవితుంగా లిఖియింపు మని యానతిచ్చిన వల్లె యని
యమ్మహాదేవువాక్యంబులకు సమ్మతించి మహాభీరుండై యాశమనుం డన్నరేంద్ర
నందను మృత్యుబంధంబువలనఁ బాపి తదాజ్ఞాప్రకారంబున లిఖియింపంజేసి
తానును వీరభద్రుచేత బంధముక్తుం డయి మృత్యుకింకరసమేతంబుగా నిజలోకం
బునకుం జనియె వీరభద్రుండును బ్రమథగణపరివృతుండై తనలోకంబున కరిగె
నేను నీవృత్తాంతంబంతయుం దెలిసి మీసమీపంబునకు వచ్చితి నని పలికి వెండియు
నారదుం డిట్లనియె. 266

క. కదనమున వైరివీరుల, మద మణఁచి భవత్సుతుండు మహి నేలుచుఁ దాఁ
బదివేలేండ్లు వసించును, ముదమున నని చెప్పి చనియె మునివరుఁ డంతన్. 267

క. ఈరుద్రాక్షమహాత్మ్యము, ధీరమతిన్ విన్నజనులు దీర్ఘాయుష్మ
త్త్వారోగ్యభాగ్యయుతులయి, ధారుణివర్ధిల్లుదురు సదాశివుకరుణన్. 268

వ. ఇవ్విధంబున నారదమహామునీంద్రుం డరిగినఁ దదనంతరమునఁ బరాశరాదిమహా
ర్షులు తమతమయాశ్రమములకుఁ జనిరి కాశ్మీరనాథుం డగుభద్రసేనభూపా
లుండు శ్రీరుద్రాధ్యాయప్రభావంబున నిర్ధూతకల్మషుండై నిజపుత్త్రసమేతముగా
రాజ్యభోగము లనుభవించుచు సుఖమున నుండె నని చెప్పిన శౌనకాదిమహాము
నులు పరమహర్షరసావేశపులకీకృతశరీరులై సూతుం బ్రశంసించి యిట్లనిరి. 269

క. భూతేశభక్తిపరులకు, ఖ్యాతిగఁ గైవల్యమొసఁగు నజ్ఞానమహా
పాతకసింధునిమగ్నుల, కేతెఱఁగున ముక్తి గలుగు నెఱిఁగింపఁగదే. 270

## పురాణశ్రవణమాహాత్మ్యము.

వ. అని యడిగిన నమ్మహామునీంద్రులకు సూతుం డిట్లనియె. 271

ఆ. వేదబాహ్యులకును విప్రబంధులకును, బుద్ధిహీనులకునుఁ బుణ్యులకును
శిష్టసేవ్యమైన శివకథాశ్రవణంబు, ముక్తి నొసఁగు మౌనిముఖ్యులార. 272

క. నరు లెవ్వారేని నిద్ధరఁ, బురహరుచరితంబు భక్తిపూర్వకముగ నా
దరమొప్ప నాలకించిన, నరయఁగ శ్రీరుద్రతుల్యు లగుదురు వారల్. 273

క. అవిరతముగ శైవకథా, శ్రవణం బొనరింప శక్తిచాలకయున్నన్
భువి నొకముహూర్తమైనను, వివరముగఁ దదర్థమైన వినఁగా వలయున్. 274

ఆ. సకలతీర్థములను సకలయజ్ఞంబుల, సకలదానములను జపతపములఁ
గలుగుసుకృతమొదవు క్షణమాత్ర మభవుని, కథలు వినిన మనుజగణములకును.

క. కలియుగమున మానవులకుఁ, దలఁపఁగ నీశ్వరపురాణతత్త్వశ్రవణం
బులు దక్క నొండుధర్మము, గలదే కైవల్య మొసఁగ గలుపము అణఁపన్. 276

చ. అలసుధఁ ద్రావి మర్త్యుఁ డజరామరభావముఁ జెందు నొక్కఁడే
సలలిత శైవకీర్తనము శంభుకథాశ్రవణంబుల న్ని
శ్చలత నొనర్చుమానవుని సంతతికిం దనకుం దలంపఁగాఁ
గలుగుసు స్తసౌఖ్యము అఖండితవీతజరామరత్వమున్. 277

క. దీనుం డైనను బాలుఁ, డైన వయోవృద్ధుఁ డైన నభవుపురాణ
జ్ఞానంబు గలుగు వాఁడు, మానవులకు వంద్యుఁ డగు సుమంచితబుద్ధిన్. 278

తే. దేహధారులకుఁ గామధేనువైన, శివపురాణంబు పఠియించు శిష్టజనుల
నీచబుద్ధినిఁ బల్కఁగా జూచెనేని, వాఁడు దుర్గతిఁ జెందు నవశ్యముగను. 279

మ. వరభూతేశపురాణయుక్త మగుచున్ వ్యాఘ్రాసనాసీనుఁ డై
తరుణుం డైనమహీసురుండు బహువృద్ధబ్రాహ్మణు ల్వచ్చినం
బురసంహారకథాప్రసంగ మొగి సంపూర్ణంబు గాకుండినం
గురుభక్తిం బ్రణమిల్లఁగాఁ దగదు సాంగోపాంగ మానంతకున్. 280

క. దుర్జనకాద్రశ్వాపద,వర్జన మగునెడల విప్రవరసభల వృషో
పార్జన సుక్షేత్రంబుల, నర్జునవర్ణునికథాళి నారయవలయున్. 281

తే. శ్రద్ధ వెలయంగ శివకథాశ్రవణ మాచ,రించినఫలంబు గనుట సమంచితమ్ము
శ్రద్ధ లేకున్న నదియొ నిష్ఫలతఁ జెందు, సత్య మిది మానులార భూజనుల కెపుడు.

క. అంబరకేశునికథ హృ,ద్యంబుగ పఠియించునట్టి ధన్యులకును హే
మాంబరమణిభూషణధన,తాంబూలము లొసఁగవలయు ధార్మికమతు లై. 283

క. శివదేవ సత్పురాణ,శ్రవణావసరంబులందు జయ్యన జనినన్
నవభోగమధ్యవేళల, నవిరళసంపద్వినాశ మగువారలకున్. 284

సీ. ఉష్ణీషధారియై యొగిఁ బురాణము విన్న జనుఁడు భల్లూకమై సంభవించుఁ
దాంబూలచర్వణం బొనర్చుచు విన్నఁ దినుచుండు దుర్గతిశునకమలము
నున్నతాసనమున నుండి యాకర్ణింప వాయసంబై పుట్టు వసుధయందు
వీరాసనస్థుఁడై విన్న దుర్మానవుం డర్జునపాదపం బై జనించు

ఆ. పవ్వళించి వినిన పాపపురుషుఁ డందు, కొండచిలువ యగుచు నుండు ధరణి
వక్త్రసమత వెలయ వచియించి నఖిలుండు, గాంచు గురుకళత్రగమనఫలము. 285

క. పౌరాణికు నిందించిన, దూరాత్ముఁడు రౌరవాదిఘోరనరకములన్
ధారుణి బాధలఁ బొందుచు, ధారుణిపై శ్వానయోని దగ జనియించున్. 286

చ. ఘనపురణకథాశ్రవణకాలమునందు దురుక్తు లాడున
మ్మనుజుఁడు గర్దభం బగు క్రమంబునఁ దాఁ గృకలాసదేహియై
జననము నొందు గ్రమ్మరను శంకరసంహిత లాలకింప కీ
సునఁ జనిపట్టివాఁడు వనసూకరమై ప్రభవించు ధారుణిన్. 287

పంచచామరము. పురాణపుణ్యసత్కథానుభూతికార్య మంతయున్
విరోధవృత్తి సాగనీక విఘ్న మాచరించు న
న్నరాధము ల్యమాలయంబున న్వసించి క్రమ్మఱన్
గతాసులై జనించుచుంద్రు గ్రామసూకరాకృతిన్. 288

సీ. చిత్తంబు రంజిల్ల శివకథ ల్వినువారిఁ బ్రాపించు ధ్రువమైన బ్రహ్మపదము
శ్రవణం బొనర్చుక సంతోషమందిన నరులైనఁ గాంతురు పరమపదము
పౌరాణికునకుఁ గంబళవస్త్రశయ్య లర్పించిన ఘను లుంద్రు త్రిదివమునను
బురభేదనుపురాణమునకు సూత్రమొసంగు జనులకు గలుగు విజ్ఞానసిద్ధి

తే. బ్రహ్మహత్యాదిదుర్భరపాతకోపపాతకము లాచరించినపతితుఁడైన
సంతతపురాణసత్కథాశ్రవణములను, జెందు నిర్మలమోక్షలక్ష్మీసుఖంబు. 289

## విదురవంజుళోపాఖ్యానము.

వ. ఈయర్థంబునకు సకలపాపక్షయకరంబును సర్వజనమనోహరంబును నతివిచిత్రం
బును పురాతనంబు నైనయొక్కయితిహాసంబు గలదు దానిం జెప్పెద నాకర్ణిం
పుం డని సూతుండు చెప్పందొడంగెఁ దొల్లి దక్షిణదేశంబు సబాష్కళసంజ్ఞకం
బైనయొక్కగ్రామంబు గల దాస్థలంబున వసించుప్రాకృతజనులు మూఢులును ధర్మ
వర్జితులై యుండుదు రచ్చటిబ్రాహ్మణులు దురాచారులును వేదశాస్త్రపరాఙ్ముఖు
లును లాంగలధరులును గౌటిల్యమార్గసంచారులును ధర్మజ్ఞానవైరాగ్యశూన్యులును
నై యుండుదురు మఱియు నప్పురంబునఁ గలుగు కామినీజనంబులు పాపరతులును
స్వైరిణులును దుష్టబుద్ధులును నాచారవర్జితలునై యుండుదురు మఱియును. 290

క. అగ్రామమునందు దురా, త్మగ్రామణి యనృతవాది మాయావి మహో
దగ్రుఁడు కువిచారుఁడు జ్యారాగ్రణి విదురుఁ డన నొకధరామరుఁ డుండున్.

ఆ. ఆద్విజాధముఁడు నిజాంగనవర్జించి, నిరత మరిగి వేశ్యానిలయమునకు
మదనశరవిభిన్నహృదయుఁడై దానితో, సంతతంబుఁ గ్రీడసలుపుచుండు. 292

చ. అతనివధూటి పంజాలసమంచితరూపవిలాసవిభ్రమా
న్వితనవయౌవనాగమవివేకవివర్జిత యై స్మరాంబకా
హతి బెగడొంది కుందుచు నహర్నిశము న్సుకుమారజారసం
గతి విహరింపుచుండె బహుకాముకళాకలనైకచాతురిన్. 293

తే. ఇట్లు జారునితోడుత నింపుమీఱ, సంగమక్రీడ నుండు నాసమయమునను
వచ్చి తద్భర్త యొకనాఁ డవార్యవృత్తి, పల్లవాధరహృదయంబు జల్లుమనఁగ. 294

క. జారుఁడు కంపము నొందుచు, నాకేయి పలాయమానుఁడై యేఁగినచో
నారమణి నప్పుడు బలాత్కారంబునఁ గొప్పుఁబట్టి ధరఁ బడ నీడ్చెన్. 295

తే. ఇవ్విధంబునఁ బడఁద్రోచి యురముఁ బట్టి, జానుకూర్పరచరణహస్తప్రహార
ములను మర్దింపుచుండ నమ్ముదిత భీతి, యడరఁ దనభర్తఁ జూచి యిట్లనుచుఁ బలికె.

క. ధరణీసురవర నీతో, సురతసుఖం బెన్నఁడెఱుఁగ సుస్నిగ్ధమయః
పరిపూర్ణగాత్రి నగుటను, జరియింతు యథేష్టగతుల జారులతోడన్. 297

వ. అని పలుకుచున్న నిజపత్నివాక్యంబు లాకర్ణించి సంతప్తహృదయుండై యాబ్రాహ్మణుఁడు భీతచిత్తుండును గంపితశరీరుండు నయి పరస్త్రీగమనంబున మహాపాతకం బగునని పలుకఁబడినశాస్త్రంబు మనంబునం దలంచి యల్పసుఖంబున కయి దుర్గతిం బ్రవేశింపవలసె స్మరవిహ్వలంబును మహాపాపకారణంబు నయినమదీయ శరీరంబు వ్యర్థంబు ప్రాణావసానకాలంబున భయంకరు లయినకాలకింకరులం గాంచి యేవిధంబున ధైర్యం బవలంబించి యుండుదు నేరీతి సంతప్తతామ్రకర్దమాది ఘోరనరకంబులబాధ ననుభవింతు గ్రమ్మఱ ననేకకోటిజన్మంబులఁ గ్రిమికీట కాదియోనులం బుట్టి నిరంతరదుఃఖపీడితుండ నయి యెట్లుండనేర్తు నామనంబు వేశ్యాజనసంగమం బపేక్షించియుండుఁ గాని నిజభార్యాగమనం బభిలషింపకున్న యదియే నేమిసేయుదు భృగుపాతనశూలాధిరోహణాదిబాధలకన్నఁ గోటిగుణితం బైనసంతాపంబు సమకూరె హా దైవమా పంచశరసాయకాపాతంబుల నిశిథిని సమయంబు లెట్లు గడపుదు నని వగచుచున్న భర్తృవచనంబు లాకర్ణించి నిర్భయం బయినచిత్తంబున నిజవల్లభునకు నాబ్రాహ్మణి యిట్లనియె. 298

శా. వారస్త్రీరతి నీవు సేయుపవలు వర్తింపఁగాఁ జూచి నే
ధీరుం డైనమహీసురేంద్రు నపరత్తిం గూడి భోగించితిన్
తారుణ్యస్థితి నుండుకాంతలకు రత్యాసక్తి లేకుండునే
మేర ల్గా విటు లోపము ల్నెరప నామీఁదన్ ద్విజస్వాగ్రణీ. 299

క. అని పలికిన యాకామినిఁ, గనుఁగొని బ్రాహ్మణుఁడు పలికెఁ గారుణ్యమునన్
వనితా హిత మగువాక్యము, వినుపించెద వినుము నీదువీనులు దనియన్. 300

మ. తరుణీ నీ విఁకఁ దావకీనవిటలబ్ధం బైనవిత్తంబు వే
సరవోకుండఁగఁ దెచ్చి యిచ్చినను వేశ్యాస్త్రీల కే నిచ్చి త
త్సురతక్రీడల సంచరించెదను సంతోషంబుగాఁ గావుత
త్పరజారావళిఁ గూడియుండుము మహోత్సాహంబు సంధిల్లఁగన్. 301

తే. అనుచు నొడఁబాటు చెంది నెయ్యంబు మీఱ, నాదురాచారు లిద్దఱు హర్ష మొదవ
నొగి యథేచ్ఛావిహారులై యుండునంతఁ, గాలగతిఁ జెందెఁ బతి కొంతకాలమునకు.

క. ఆకామినియును గామో, ద్రేకంబునఁ గొన్నినాళ్లు దిరుగుచు నంతన్
గోకర్ణక్షేత్రమునకుఁ, బ్రకటమతిఁ జనియె నొక్కపర్వమునంగున్. 303

వ. అట్లు చని యాపంబులయు సప్తహాస్థలంబునఁ బుణ్యతీర్థంబులయందుఁ గృతస్నాత
యై విభూతిలిప్తఫాలభాగయు రుద్రాక్షమాలికాధారిణియు నయి యొక్కశివా
లయంబునకుం జని ప్రదక్షిణనమస్కారంబు లాచరించి యచ్చటఁ బౌరాణికుం
డయిన యొక్కవిప్రుండు పురాణపఠనం బొనరింపుచున్నం గాంచి తానును
దత్సభాసదులతోడఁ గలసి తత్కథాశ్రవణం బొనరింపుచున్నంతఁ బ్రసంగవశం
బునఁ బరపురుషసంగమంబు గావించిన పుంశ్చలీజనంబుల మదనమందిరంబులందు
నరకంబున యమకింకరులు సంతప్తలోహపరిఘంబులు ప్రవేశింపఁజేయుదు రని
వచియించిన బ్రాహ్మణునివాక్యంబు లాకర్ణించి యాయింతి మహాభీతచిత్తయై కొంత
దడవునకు నావిప్రునకుఁ బ్రణమిల్లి రహస్యంబుగా ని ట్లనియె. 304

మ. గతదోషం బగునశ్వమేధశతి గంగాస్నానకోటిన్ మహో
న్నతిఁ గావించిన నైననిష్కృతులు చెందన్ రానిపాపంబు లే
నతికామాతురవృత్తిఁ జేసితి మహాహంకారతం ద్రొవ్వి యే
గతి నెవ్వారల నాశ్రయింతు నిఁక దుష్కర్మంబుల న్వాప్పఁగన్. 305

క. గురుఁడవు తల్లివి దండ్రివి, వరయఁగ న న్నుద్ధరింప నర్హుండవు భూ
సురవర మన్నరకార్ణవ, తరణోపాయంబుఁ దెలుపు దయసంధిల్లన్. 306

క. అని మది నిర్వేదింపుచుఁ, దనపదముల వ్రాలియున్నతరుణిం గని యా
ఘనవిప్రుఁడు గారుణ్యం, బునఁ గరముల లేవనెత్తి పొందుగఁ బలికెన్. 307

మ. తరుణీ నీ విఁక భీతిఁ జెందకు మహోద్యద్దివ్యయోగంబునం
బరమజ్ఞానము దోఁచె నిప్పుడు భవత్పాపౌఘవారాశిసం
తరణోపాయ మెఱుంగఁ బల్కెదను జింతం బాసి వైరాగ్యత
త్పరవై ధర్మపురాణము ల్వినుము కైవల్యాప్తి నీ కయ్యెడిన్. 308

క. పాపచయంబులు పశ్చా, త్తాపంబున శుద్ధిఁ బొందుఁ దద్దయు నుచిత
వ్యాపార మార్యసేవ యు, మాపతిభజనంబు ముక్తిమార్గము లరయన్. 309

క. అవిరతముగఁ బుణ్యకథా, శ్రవణం బొనరింపు మార్యసాంగత్యమునన్
శివదేవుని భజియింపుము, ప్రవిమలశైవల్య మొదవుఁ బాపము లణఁగున్. 310

తే. శంకరధ్యాననామసంస్మరణములును, దత్కథాశర్ణనములు సంతత మొనర్ప
సుమతులు నఘములుదొల్లి యజామిళుండు, నామము వచించి కాదె ధన్యాత్ముఁడయ్యె. 311

మ. వనితా నీవు పురాణము ల్వినుము మనోవాక్కాయకర్మంబులం
దును గావించిన పాపము ల్సమయుఁ జెందు న్సత్క్రియాసిద్ధి పు
ణ్యనదీస్నానఫలంబు లబ్బు శివలోకావాప్తి చేకూరెడుం
ఘనవిజ్ఞానవిశిష్టమార్గ మొదవుం గల్గుం జతుర్వర్గమున్. 312

వ. అని హితోపదేశం బొనరించిన యబ్భూసురోత్తమునిపాదంబులకు సద్భక్తిపూర్వకంబుగా వందనంబులు గావించి తదీయాజ్ఞాప్రకారంబున నప్పుణ్యక్షేత్రంబునందు నిత్యంబును తీర్థంబులం గ్రుంకుచుఁ బరమేశ్వరధ్యానం బొనరింపుచు బురాణకథాశ్రవణంబు సేయుచు నిర్ధూతకల్మషయై యావిప్రభామిని కొన్నిదినంబులకు బంచత్వంబు నొంది దివ్యశరీరంబుఁ దాల్చి విమానారూఢయై సిద్ధగంధర్వులు సేవింపఁ బరమేశ్వరలోకంబునకుం జని యచ్చట భవానీశంకరులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి గౌరీసమ్ముఖంబున సుఖంబుండి యొక్కసమయంబున నయ్యంతి భవానికిం బ్రణమిల్లి యిట్లనియె. 313

తే. తల్లి మామకభర్త భూతలమునందు, సకలదుష్కర్మములుచేసి చనియె నట్టి
పాడలుం డిప్పు డెచట నున్నాఁడొ తెలియ, నాన తిమ్మని వేఁడిన నగజ పలికె. 314

మ. హరిణీలోచన వినుముం డితఁడు వింధ్యారణ్యభూమి న్భయం
కరపైశాచికరూపుఁడై పథికులం గారింపుచున్నాఁడు ము
న్నరకావాసముఁ జేరి కింకరవితానక్రూరశూలాహతిన్
బరితాపంబునఁ జెంది యుండె నని చెప్పన్ దుఃఖితస్వాంతయై. 315

సీ. కారుణ్య ముదయింపఁ గాంతాశిరోమణి గిరితనూజకు నమస్కృతి యొనర్చి
శాంకరీదేవి యస్మద్విభుం డట్టుండ నే నిట్టు లుండుట నీతి యగునె
యేయుపాయంబున నీదుస్స్వభావుండు పైశాచరూపంబుఁ బరిహరించు
నావిధం బెఱిఁగింపు మనవుడు గ్రమ్మఱ నగరాజతనయ యి ట్లనుచుఁ బలికె

ఆ. తెలుప నీమగండు శివకథాశ్రవణంబుఁ, జేసెనేని పిదపఁ జెందు ముక్తి
యనిన నవ్వధూటి యది యెట్లు సమకూరు, దేవి నీవ యానతీయవలయు. 316

మ. అనుచు న్వేఁడిన సత్కృపాకలితయై యాదేవియుం దుంబురుం
డనుగంధర్వుని జేరి నీవిపుడు వింధ్యారణ్యముం జేరి యా
వనముం దొక్కపిశాచరూపుఁ డగుచు న్వర్తించువిప్రుండు త
ద్ఘనపాపంబు లడంగ శంకరకథాగానంబు గావింపుమా. 317

ఆ. అటుల నాచరించి యతని ముక్తునిఁజేసి, యిటకుఁ దోడితెమ్ము హితము వెలయ
ననుచు నాజ్ఞ యొసఁగ నాతుంబురుండును, జనియె నప్డు వింధ్యశైలమునకు. 318

క. నారదసఖుఁ డగుతుంబురుఁ, డారణ్యస్థలిఁ జరించునట్టిదురాత్మున్
ఘోరపిశాచశరీరు న,వారితనాదంబు గలుగువానిం గాంచెన్. 319

ఆ. విపులరక్తనేత్రు వికటాట్టహాసునిఁ, బాశబద్ధుఁజేసి పట్టితెచ్చి
యొక్కచోట నునిచి ముక్కంటికథలు వీ,ణారవమున గాన మాచరించె. 320

శా. ఆపైశాచికదేహుఁ డీశుకథ లట్లాలించి నిర్ధూతదు
ష్పాపవ్యూహకుఁడై పిశాచతనువు న్వర్జించి దివ్యస్ఫుర
ద్రూపంబుం ధరియించి ముక్తుఁ డగుచున్ రుద్రాక్షమాలాధరుం
డై పంచాక్షరమంత్రపూతహృదయుం డై చెందెఁ గైవల్యమున్. 321

క. ఆపతితుఁడు మును పశ్చా,త్తాపంబు వహించెఁ గాన దత్స్వకృతమునం
దీపిత మగుశివలోకము, ప్రాపించె నిరస్తకర్మబంధుం డగుచున్. 322

క. పతియాజ్ఞ శిరమునం దిడి, హితముగ విటలబ్ధవిత్త మిచ్చినకతనన్
సతిగాంచెను సద్గతి దా, నతిశయదుష్కర్మరహిత యై మోదమునన్. 323

వ. ఇవ్విధంబునం దుంబురుండు జగజ్జననీశాసనంబున నాబ్రాహ్మణుని పైశాచత్వంబు నివారించి దివ్యవిమానారూఢునిం జేసి తోడ్కొనివచ్చి పరమేశ్వరసన్నిధానంబున నునిచిన నాబ్రాహ్మణుండును నిజభార్యాసమేతంబుగాఁ బ్రణమిల్లిన నుమామహేశ్వరులు సంతసించి బహుకాలంబు మద్భక్తులరై యథేచ్ఛావిహారులరై యుండు రని వరం బొసంగిన బ్రమోదంబున నుండి రనిచెప్పి సూతుం డిట్లనియె. 324

సీ. మునులార వినుఁడు మమతుఃఖజనార్హంబు భద్రప్రదంబు సభంగురంబు
నాయుష్కరంబు నిత్యారోగ్యకరమును ధన్యంబు సర్వపాతకహరంబు
కామ్యార్థధర్మమోక్షప్రదాయకమును సామ్రాజ్యఫలదంబు సౌఖ్యకరము
నింద్రాదిసేవితం బీశ్వరాభిమతంబు విజ్ఞానహేతువై వెలయునట్టి
ఆ. యీపురాణరాజ మెవ్వరు చదివిన, వినిన వ్రాసినను సవిస్తరముగ
భవ్యుఁ డొసఁగు పుత్రపౌత్రాభివృద్ధియు, సకలవాంఛితములు శాశ్వతముగ. 325

శా. దానక్షాత్రపరోపకారముగుణోద్యజ్జ్యోతిరామన్న మం
త్రీనారాయణమంత్రివర్యులు సదా శ్రీమంతు లంబాపుర
స్థానాధిష్ఠితపార్థివేశ్వరునకు న్సద్భక్తి నర్పించి ర
జ్ఞానక్షేపణ మీపురాణ మిల నాచంద్రార్కమై వర్ధిలన్. 326

శా. కైలాసాచలవాస భక్తజనరక్షాదీక్ష ఫాలాక్ష చం
ద్రాలంకార నిజోత్తమాంగ మునిహృద్రాజీవరోలంబకా
శేలీవాసవిభూషితాంగ విబుధాళిస్తుత్యపాదాంబుజా
శూలప్రోజ్జ్వలబాహుదండగజరక్షోవీరసంహారకా. 327

క. కరుణాకర [వరభీకర, పురసంహార భక్తవరద పోషితభువనా
సురకుత్కీలకరాసన, పరమేశ్వర మృత్యుహరణ పరమాత్మ శివా. 324

ఉత్సాహ.
శ్రీపురాణపూరుషాభ్రసింధుజాటభాసురా,టోపభేదనక్రియాపటుప్రభావకుక్షిసం
దీపితాబ్జజాండభాండ దేవదేవ భాసురాం,బాపురస్థలీనివాస పార్థివేశశంకరా.

పంచ. పినాకినీతటప్రచారభిల్లవేష భాసురా,పినాకహస్తకృత్తివాలభీమరూపశంకరా
ఘనాఘనాభనీలకంఠకామదర్పసంహరా,సనందనాదిమౌనిసేవ్యశైలజామనోహరా.

గద్యము. ఇది శ్రీరామభద్రకరుణాకటాక్షవీక్షణసమాలబ్ధ గీర్వాణాంధ్రభాషా
కవిత్వకళాధురంధర సూరిజనవిధేయ బడగలనాటి కన్నడవంశపయఃపారావార
రాకాసుధాకర ఆశ్వలాయనసూత్ర భారద్వాజసగోత్ర శ్రీధరమల్లె అయ్యనార్య
తనయ సూరిజనవిధేయ వేంకటరామనామధేయప్రణీతం బైన బ్రహ్మోత్తరఖండం
బను మహాపురాణంబునందు విభూతిమాహాత్మ్యంబును వాసుదేవబ్రహ్మరాక్షససంవా
దమును శ్రద్ధాలక్షణంబును శబరోపాఖ్యానంబును ఉమామహేశ్వరవ్రతమహా
త్మ్యంబును శారదాచరిత్రంబును రుద్రాక్షప్రభావంబును కీకటకుక్కుటకథనంబును
వేశ్యావైశ్యసంవాదంబును రుద్రాధ్యాయప్రకరణమును శివుండు బ్రహ్మసభకుం
జనుటయు భద్రసేనుసభకు నారదుం డరుదెంచుటయు వీరభద్రయమవివాదం
బును పురాణశ్రవణమాహాత్మ్యంబును విసురవంశీలోపాఖ్యానంబు ననుకథలం
గలసర్వంబును బంచమాశ్వాసము.

---

సీ. శకవర్షగణనంబు శైలరామమునీంద్రు పరిమితంబై ధాత్రిఁ బరఁగుచుండు
యువనామసంవత్సరోపేతకార్తికమాసరాజితపౌర్ణమాసియందు
ధన్యులు విష్ణువర్ధనసగోత్రులు జ్యోతిసుబ్బన్నపుత్రులు సుగుణమణులు
రామన్న లక్ష్మీనారాయణ చెంగల్వరాయఁడు నన మువ్వుర మలయశులు

తే. చిత్తములభక్తి వెలయ బ్రహ్మోత్తరాఖ్య ఖండ మాంధ్రప్రబంధంబుగా ఘటించి
రొటిమి నంపాపురము పార్థివేశ్వరునకు, భాసురముగ సమర్పణ చేసి రపుడు.

శా. శ్రీనారాయణుఁ డాప్తరక్షకుఁడు రాజీవాయతాక్షుండు వి
జ్ఞానానందమయస్వరూపుఁ డగుకృష్ణస్వామి రక్షించు న
క్షీణప్రజ్ఞుల సుబ్బనార్యసుతులన్ శ్రీజ్యోతిరామన్న ల
క్ష్మీనారాయణుల న్వదాన్యమణి యా చెంగల్వరాయాగ్రణిన్.

బ్రహ్మోత్తరఖండము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1912.

| ఆంధ్రగ్రంథములు. | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకాసక్రమణికాసహితము | ... | 0 | 12 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 1[illegible] |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | [illegible] | 8 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| సహస్రకంఠరామాయణము | ... | 0 | 14 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| డిటో (3060) ఆంధ్రతాత్పర్యములతో | ... | 3 | 8 |
| భాగవతసప్తమస్కంధము | ... | 0 | 0 |
| శ్రీనాథుని వీథినాటకము | ... | 0 | 2 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము | ... | [illegible] | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| చతురపద్యములు | ... | 0 | 2 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భోగినీదండకము, బమ్మెర పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| కుచేలోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 4 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 8 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ. శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారిది | ... | [illegible] | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరనమంత్రికృతము | ... | 1 | [illegible] |
| గణికాగుణప్రవర్తనశతకావళి | ... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.